# సమాలోచనం

(ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలపై సమీక్ష)



సంపాదకుడు

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

ఎం. ఏ., పి హెచ్. డి.,

రీడర్, తెలుగుశాఖ, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం

హైదరాబాదు




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు

హైదరాబాదు 4

# SAMAALOCHANAM

A Review on Modern Telugu Literary Forms
Edited by Dr. G.V. Subrahmanyam, Reader in Telugu,
Central University of Hyderabad

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

హైదరాబాద్-500 004

**ప్రచురణ :- 297**

ప్రథమ ముద్రణ : జనవరి 1980

ప్రతులు : 1000

వెల రూ॥ 9-00

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,

కళాభవన్, సైఫాబాదు, హైదరాబాద్-500 004

ముద్రణ :
నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్స్ బషీర్‌బాగ్, హైదరాబాదు-500 029.
ఫోన్ నం. 220238.

---

Paper used for the Printing of this book was made available by the Government of India at concessional rate.

# తొలి పలుకు

ఆధునిక సాహిత్యంలోని అనేక ప్రక్రియలను గూర్చి, ఆయా ప్రక్రియల్లో విశేషంగా కృషిచేసి పరిత్యలోకంలో సమాదరభావాన్ని సంపాదించుకొన్న రచయితల ఉపన్యాసమంజరీ కార్యక్రమాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఇరువదవ వార్షికోత్సవ సందర్భంగా జనవరి 1979లో ఏర్పాటు చేసింది. ఈ వ్యాసాలలో నేటి తెలుగు సాహిత్యం తీరు తెన్నులను గూర్చి రేఖా మాత్రంగా పరిశీలన సాగిందని చెప్పవచ్చు. ఆ ఉపన్యాసాలు అక్షరాకృతి దాల్చి ఈ 'సమాలోచనం'గా రూపొంది తెలుగు పఠితృలోకానికి ఇప్పుడు అందుతున్నవి. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారి సూచనను అనుసరించి అకాడమీ ఈ కార్యక్రమాన్ని చేపట్టింది. ఈ సంపుటికి వారే సంపాదకులై సమగ్రమైన పీఠికతో రూపురేకలు దిద్దినారు. కడచిన ఇరవై సంవత్సరాలలో అకాడమీ బహుమతి నందుకొన్న గ్రంథాలన్నిటిని ఈ గ్రంథంలోని ఒక వ్యాసంలో డా॥ సుబ్రహ్మణ్యం గారు సమీక్షించినారు. వారికి మా కృతజ్ఞతలు.

ఈ సంపుటికి తమ వ్యాసాల నందించిన శ్రీయుతులు ఆర్. ఎస్. సుదర్శనం, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, డా॥ బూదరాజు రాధాకృష్ణ, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఆరుద్ర, డా॥ నాయని కృష్ణకుమారి, డా॥ కె. కె. రంగనాథా చార్యులు, ఎల్లోరా, డా॥ ఇలపావులూరి పాండురంగరావు, డా॥ జి. లలిత, డా॥ అక్కిరాజు రమాపతి రావు, మధురాంతకం రాజారాం, డా॥ పి. వి. రమణ గారలకు అకాడమీ కృతజ్ఞతాభివందనాలను సమర్పిస్తున్నది.

హైదరాబాదు
తేది 27-1-1980

దేవులపల్లి కృష్ణమూర్తి
కార్యదర్శి

# సమాలోచనం

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ స్థాపింపబడి ఇరవైయేళ్ళు పూర్తి అయిన సందర్భాన్ని పురస్కరించుకొని ఏదైనా కార్యక్రమ మొకటి నిర్వహిస్తే బాగుంటుందని సర్వ సభ్య సమావేశంలో భావించటం జరిగింది. ఆధునికాంధ్ర సాహిత్యప్రక్రియలమీద ఒక సమీక్షాసదస్సు నిర్వహించి, అందులో సమర్పింపబడిన వ్యాసాలను ఒక గ్రంథంగా ప్రకటించాలనీ, ఆ సమీక్ష ప్రధానంగా ఈ ఇరవైయేళ్ల సాహిత్య చైతన్యంమీద కేంద్రీకృతం కావాలనీ నేను ప్రతిపాదించాను. ఆసూచనను అకాడమీ అంగీకరించి ఒక కార్యక్రమాన్ని రూపొందించుమని నన్ను ఆదేశించింది. ఆ ఆదేశాన్ని పురస్కరించుకొని తయారు చేయబడిన వివరాలను శ్రీ దేవులపల్లి రామానుజరావుగారితో చర్చించి సమీక్షా సదస్సును రూపొందించటమైంది. ఆసదస్సు 1979 జనవరి 29, 30తేదీలలో, మూడు సమావేశాల్లో, నిర్వహింపబడింది. మొత్తం 15 అంశాలమీద ప్రసంగ వ్యాసాలు వక్తలచేత సమర్పింపబడటం – వాటిని 'సమాలోచనం' అనేపేర ఈ గ్రంథంగా ప్రచురించబడటంతో ఆ కార్యక్రమం అక్షరరూపం తాల్చింది. సమకాలీన సాహిత్యప్రక్రియా సమీక్షకంటె అకాడమీవింశత్యబ్ద పూర్తిమహోత్సవం నిర్వహించటంలో సముచితమైన పద్ధతి మరొకటి ఉండబోదని భావించటంలో సహృదయులు మాతో ఏకీభవిస్తారని నమ్ముతున్నాను.

ప్రాచీన సాహిత్యయుగాల్లో ఒక శతాబ్దికాలంలో సాగిన సాహిత్య వికాస ప్రగతి ఆధునికయుగంలో ఒక దశాబ్దికాలంలోనే సాధింపబడుతోంది. వైజ్ఞానిక ప్రగతివల్ల ప్రపంచం మరింత సన్నిహితం కావటం, వ్యక్తి వ్యష్టిగా గాకుండా విశ్వజీవన స్పందనంలో భాగంగా రూపొందటం, పరిణామ సిద్ధాంతాన్ని అనుసరించి సామాజిక పరిణామంతోపాటు సాహిత్యపరిణామం తప్పదని భావించటం, సమసమాజ నిర్మాణోన్ముఖమైన చైతన్యం విశ్వవ్యాప్తంగా జనావళిలో ముమ్మరించటం, వ్యవస్థలకూ జీవితావస్థలకూ ఉన్న సంబంధాన్ని అన్వేషించి, వాటి మధ్య అనివార్యమైన సంఘర్షణలను గుర్తించి, వాటిని అభివ్యక్తీకరించటం ద్వారా

జీవనస్వభావాన్ని వ్యాఖ్యానించి, మానవాభ్యుదయ మార్గంలో మహాప్రస్థానాన్ని సాగించే యత్నం చేయటం, అభ్యుదయమార్గానికి అడ్డునిలిచే వ్యవస్థలను కూల ద్రోసి, నూత్న వ్యవస్థను సృష్టించే క్రియాశీలాన్ని వివిధప్రక్రియలద్వారా ప్రబో ధించటం, ఉపరంజనంకంటె ఉపయోగమే కళాధర్మంగా సంభావించటం, రచయిత వ్యక్తిగాకాక సమాజచైతన్యానికి ప్రతీకాత్మకశక్తిగా రచన సాగించటమే ఆధునికతా స్వభావమని విశ్వసించటమూ, మొదలైనవి నవూతాలీన సాహిత్య వికాస ప్రాతిపదికలుగా ప్రాచుర్యం వహించాయి.

ఇటువంటి చైతన్యం ప్రపంచ సాహిత్యరంగంలో ప్రవేశించి దాదా పౌక శతాబ్దం అయినా, తెలుగు సాహిత్యంలో అడుగుపెట్టటానికి దాదాపు మూడు దశాబ్దాలు పట్టింది. అడుగు పెట్టిన నాటినుంచీ ప్రయోగాలు శరపరంపరగా సాగటం మొదలుపెట్టాయి. పాశ్చాత్యదేశాల్లో ప్రయోగాల వెనుక పరిశోధన ప్రగతి. సిద్ధాంత రూపకల్పనం, ప్రయోగవిజ్ఞానం త్రివిక్రమాకారంగా విస్త రిల్లటం గమనింపవచ్చు. తెలుగులో ఈ క్రమవికాసంతో ప్రయోగం వెలువడ లేదు. ప్రయోక్తకు పాశ్చాత్య ప్రయోగం ప్రమాణమై, దాని అనురణనరూపంగా తెలుగుకు నూత్నప్రయోగాన్ని రుచిచూపించటం జరిగింది. అందువల్ల ప్రయో గానికి సంబంధించిన సిద్ధాంతం పాశ్చాత్యమై పోయింది. ప్రపంచంలో జరుగు తున్న ప్రగతిని సమీక్షించే ప్రజ్ఞాచక్షువుకు తెలుగులో వికసించే ఆధునికప్రక్రియ ఒకసృష్టికి మరో అనుసృష్టి. ఒకక్రొత్తప్రయోగం తెలుగులో వెలువడితే మనింట్లో ఒకక్రొత్త పండుగ వెలిసినట్లు మనం సంతోషపడినా విశ్వప్రాంగణంలో అది పరకే వెలిగించిన దివ్వెకు అనుబంధమైన మరోదివ్వెలాగానే భాసిస్తోంది. అందు వల్ల తెలుగు సాహిత్యంలోని ఆధునికత నడుస్తున్న చరిత్రను అవగాహన చేసి కొని లోకంతో నడవడానికి చేసే ప్రయత్నమే అవుతున్నది. ఆధునిక సాహిత్య ప్రక్రియనుగూర్చి సమాలోచించేటప్పుడు 'దానికి ప్రేరకమేది?' అని ప్రశ్నించు కోవటం, ఆ ప్రేరణ తెలుగులో ఎలా రూపొందిందో పర్యాలోచించుకోవటం పరిపాటి అయింది. తెలుగు రచయిత విశ్వసాహిత్య ప్రక్రియలలో దేనికైనా ప్రేరణం కలిగించేరచన చేశాడా? అలా చేయలేకపోవటానికి కారణ మేమిటి? అన్నప్రశ్నలు మన సాహిత్యసమాలోచనంలో గగన కుసుమాలుగా మిగిలి పోవటం విస్మరించరాని సత్యం. ప్రపంచంతో నడవటమే నేటి మన ఆధునికత; ప్రపంచాన్ని మనతో నడిపించటం ఆధునికత అనుకోవటానికి మరోతరంరావాలి!

జీవిత మథనంలోనుంచి పుట్టిన ఆత్మవేదనామృతమే కళ! అది ఏరూపంలోనైనా వెలువడవచ్చు. ఆకృతికి ఆత్మ వేదన. వేదనకు జన్మస్థానం మథనం. దానికి మూలం జీవితం. జీవితం సహజంగా విషమవలయం. దానిలోని విషమత్వమే సుఖదుఃఖాల సంపుటి; ఎత్తుపల్లాల ఎగుడుదిగుడు; వర్గ భేదాలవైపరీత్యం; జ్ఞానాజ్ఞానాల సాంకర్యం; సమత్వాసమత్వాల సందిగ్ధ; అస్తినాస్తి విచికిత్సల అయోమయం; న్యాయాన్యాయాల కల్లోలం; జీవనమరణ సమస్యల చీకాకు; నిత్యానిత్యమాయాజాలం. విషమత్వంనుంచి సమత్వాన్ని సాధించటానికి చేసే మానవయత్నమే మథనం. ఇందులో ఏ విషమత్వాన్ని పృథక్కరించి మథించాలి? జీవితం సంశ్లిష్ట విషమసముద్రం; నిర్భేద్యమైన పద్మవ్యూహం— అట్లని మథనం మానటం మానవనైజంకాదు. ఈ మథనం మూడు ప్రస్థానాలలో చిరంతనంగా సాగుతోంది. ఒకటి భౌతికం; మరొకటి మానసికం; మూడవది ఆధ్యాత్మికం. భౌతికంగా సమానత్వం సాధించటం మొదటి ప్రస్థానం. దీనికి మార్గసూత్రంగా ఈ శతాబ్దంలో గతిభౌతిక తార్కికవాదాన్ని ప్రపంచం అనుసరిస్తోంది. వర్గ విధ్వంసకవిధానం ద్వారా, సమసమాజ నిర్మాణాన్ని సాధించి, ఆర్థికమైన అసమానతలను తొలగించవచ్చు. అయితే వర్గ విధ్వంసం భౌతిక సమస్యయా, లేక మానసిక సమస్యయా అన్నదాంట్లో భేదాభిప్రాయాలున్నాయి. వర్గవిధ్వంసనాన్ని భౌతికంగా నిర్వహిస్తే తిరుగుబాటు-లేక-విప్లవం అంటున్నాం. విప్లవంవల్ల సమత్వాన్ని ఆర్థికంగా సాధించవచ్చునుగాని, హార్దికంగా సాధించటం దుర్లభమని ప్రపంచంలో జరిగిన ప్రయోగాలే నిరూపిస్తున్నాయి. దీన్ని భావవిప్లవంద్వారా సాధించేమార్గం కూడా ప్రపంచంలో మేధావుల మన్ననలనుపొంది ఉన్నది. భావవిప్లవం మానవ సంస్కారానికి సంబంధించింది. సంస్కార పరిపాకం లేనిదే సమసమాజభావం విశ్వంలో వేరూనదు. భిన్నప్రవృత్తులున్న లోకంలో సమత్వసాధనం అసాధ్యంకాదు కాని కష్టసాధ్యం, మానసిక విప్లవం ఫలిస్తే భౌతిక విప్లవంతో అవసంలేదు; భౌతికవిప్లవం లేనిదే మానసిక వానికి మార్గం ఏర్పడదు-అన్న సిద్ధాంతాలలో ఏది ముందు? ఏది వెనుక? అన్నదే నేటి మానవాళి జీవితమథన సమస్య. మానసిక విప్లవం ఎప్పుడూ సమగ్రంగా సాధించలేము కాబట్టి భౌతికవిప్లవంతోనైనా దాన్ని కొంతవరకు సాధిద్దామని ప్రయత్నించే ప్రస్థాన మొకటి. ప్రపంచంలోని రాజకీయ సాంఘిక విప్లవాల చరిత్ర ఈ సత్యాన్ని కొంతవరకు బలపరుస్తున్నది. ఈ ప్రస్థానంలోనిబలం ప్రపంచాని కొక రసుపిప్పు కలిగించింది. ఆర్థిక సమానత్వాన్ని సాధిస్తే భౌతిక

సమానత్వం కనుచూపు మేరలోనైనా కనపడుతుందన్న ఆశ మోసులెత్తింది. అయితే ఈ వర్గవిధ్వంసన వ్యాపారంలో వర్గభేదం సమూలంగా సమసిపోవటం సాధ్యంకాదని చరిత్ర గుణపాఠంచెప్పింది. దానికి మానసిక పరిపాకం అవసర మనీ, దాన్ని కలిగించటానికి కళామార్గ మొక శక్తిమంతమైనవాహిక అనీ గుర్తింపబడింది. జాతిని సంస్కారవంతం చేయటానికే కళ సాధనమైతే, కార్య శీలం దానివెంట నడచివస్తుందని మేధావుల అంచనా. కాని, ఇది నిత్యవిధిగాకంటె బహుళప్రక్రియగా వర్తించటమే లోకానుభవం చెప్పినపాఠం. అందువల్ల, భౌతిక విప్లవానికి కళామార్గం కంటె ప్రభుత్వశాసనమే బలమైనదన్న భావం వ్యాప్తి చెందింది. ప్రభుత్వం ప్రభుసమ్మితంగా సమాజంలో ఆర్థికసమానత్వాన్ని సాధించ టానికి పూనుకున్నప్పుడు సాహిత్యం-లేక-కళ నిర్వహించే పాత్ర ఏమిటి అన్నది తరువాతి ప్రశ్న. దానికి మొదటి సమాధానం కళ ప్రభుత్వశాసనాన్ని సమర్థిస్తూ తదనుగుణమైన ప్రవృత్తినే తానూ వహించాలి. ఒకటి ప్రభుసమ్మితమైన సిద్ధాంత మైతే, మరొకటి మిత్రసమ్మితమైన ప్రబోధం కావాలి. కాంతాసమ్మితమైతే, మరీ హర్షదాయకమే. అలా అయినప్పుడు సాహిత్య వ్యక్తిత్వ మేమిటి? రచయిత స్వాత్వ మేమిటి? అనే ప్రశ్న లుదయిస్తాయి. రాజకీయ సిద్ధాంత ప్రచార సాధనమే సాహిత్యమా? ప్రభుత్వాదర్శానుసరణమే రచయిత కర్తవ్యమా అన్నది సమస్య. 'ఉత్పత్తి సాధనాలను కైవసం చేసుకోవటం ద్వారా, పార్టీ నియంతృత్వం ద్వారా, ఆర్థిక వ్యవస్థలో మార్పుల్ని తీసుకు వచ్చే జాగ్రత రాజకీయవాదులమైన మేమే వహిస్తున్నాము కాబట్టి, సాహిత్య ఉత్పత్తికి సాధనాలైన రచయితలను కూడా కైవసం చేసుకొని వారిని నియంత్రించటం ద్వారా సాంస్కృతిక (నిర్మాణంలో) విప్లవం తీసుకు వస్తామంటే కుదరదు. స్టాలిన్ రష్యాలోనూ, మావో చైనాలోనూ ఈ ప్రయత్నం చేశారు, ఫలితం ఈ నాడు అందరికీ విదితమే" (పుట 7) అన్న శ్రీ ఆర్. యస్. సుదర్శనంగారి మాటలు ఈ సందర్భంలో గమనించాలి.

రచయిత జీవితవిషమవ్యవస్థనుండి ఏ విధంగా సమదర్శనాన్ని సాధించ టానికి వీలుందో అనవరతం అన్వేషించే వ్యక్తి. అతడు భౌతికమైన సమదర్శనా న్ని దార్శనిక స్థాయిలో అభివ్యక్తీకరిస్తాడు. ఆ అభివ్యక్తితో హృదయవాదిగా, ఆధ్యాత్మిక ద్రష్టగా నిలుస్తాడు. లరనికి జీవితం సమగ్రసాధనకు ఉపకరణం, రచన అనుభవాభివ్యక్తివాహిక. అందువల్ల రచయితనూ, అతని రచననూ భౌతిక పరిధికే పరిమితం చేసి నియమించ కూడదు; పరిశీలించ కూడదు. ఈ సంద

ర్భంలో మార్క్స్ దృక్పథాన్ని గమనించాలి.

"మార్క్స్ గొప్ప మానవతావాది. విప్లవకారుడుగా, కమ్యూనిస్ట్ ఉద్యమ విజయం కోసం సాహిత్యాన్ని సాధనంగా నిర్దేశించినప్పటికీ, కాలాతీతమూ, నిత్య నూతనమూ, విశ్వజనీనమూ అయిన సృజనాత్మక సాహిత్యానికి ఆయన ప్రత్యేక స్థానం ఇచ్చాడు. హోమర్, షేక్స్పియర్, డాంటే, గెటే ఆయనకు అభిమాన రచయితలు. వారి కావ్యాలలోని మాటలూ, సూక్తులూ మార్క్స్ రచనా వ్యాసంగంలో సమృద్ధిగా దర్శనమిస్తాయి. 'సామాజిక స్పృహ' కలిగిన సాహిత్యంగా డికెన్స్, థాకరే, బాల్జాక్ వంటి రచయితల నవలల్ని మెచ్చుకున్నాడు మార్క్స్; వాటిలో చారిత్రక సామాజిక సన్నివేశాన్ని బహుముఖాల అవగాహన చేసుకొనే అవకాశాన్ని దర్శించాడు. ఆ రచయితలు సోషలిస్టు రచయితలు కాకపోయినా సరే ఉత్తమ సాహితీస్రష్టలుగానే పరిగణించబడ్డారు ఆయన దృష్టిలో. విప్లవ భావాలను వెదజల్లే రచనలు, సృజనాత్మకం కాకపోయినా, ప్రచార సాహిత్యంగా వాటి విలువను గుర్తించాడు మార్క్స్. పై మూడు రకాల సాహిత్యాన్ని ఒకే ప్రమాణంతో తమ రాజకీయాలకు పనికివస్తుందా లేదా అనే దృష్టితో చూచి, మార్క్స్ మానవతా వాదానికి అపచారం చేశారు" అన్నారు శ్రీ ఆర్. యస్. సుదర్శనం గారు. (పుట 13)

మార్క్స్ దృక్పథంలో కూడా సాహిత్యానికి మూడు విధాలైన స్థాయిలున్నాయి. భౌతిక విప్లవం ద్వారా భావ విప్లవానికి ప్రాతిపదికలు వేసినా, భావ విప్లవం ఫలించినప్పుడే భౌతిక విప్లవానికి నైతికస్థాయి వచ్చేది. భావ విప్లవంలో వ్యక్తి స్వీయవ్యక్తిత్వాన్ని గుర్తిస్తూ సమాజ వ్యక్తిత్వాన్ని మన్నిస్తాడు. వ్యక్తి తనఅనుభవాన్నీ, దర్శనాన్నీ సమాజపరం చేసి దాని సమష్టివ్యక్తిత్వ వికాసానికి కృషి చేస్తాడు. అయితే దీనిలో వచ్చే చిక్కు ఒకటి ఉంది. సర్వమానవ సమానత్వాన్ని వ్యక్తి అంగీకరించినా సాధనకు సంబంధించిన అహంకారం అతణ్ణి వదలి పెట్టలేదు. మనుషులమధ్య సమభావాన్ని మన్నిస్తూనే అధికారభేదాన్ని విస్మరించలేడు. దీనివల్ల అంతరాల తారతమ్యం అంతరంగాన్ని వీడిపోలేక పోతుంది. పాలక పాలితులూ, మేధావులూ తాత్త్వికులూ, జ్ఞానులూ అజ్ఞానులూ, స్త్రీలూ పురుషులూ, బాలురూ ప్రౌఢులూ, ఇలా అనేకం, అంతరాల వ్యత్యాసాలు సర్వమానవ సమవాదానికి సూక్ష్మ విరోధాలౌతాయి దీనికితోడు. ఆనువంశికమూ, వ్యక్తిగతమూ అయిన జ్ఞానాహంకారం మోహరించవచ్చు దీన్ని అధిరోహించినప్పుడే సమన్వయం సాధ్యం. దాని కొరకే మార్గం శరణ్యం. అది ఆధ్యాత్మికం.

'ఆత్మవత్సర్వభూతాని' అన్న సాధనలో అందరిలో ఆత్మరూప దర్శనాన్ని సాధించినప్పుడే సమత్వసిద్ధి సంపూర్ణ మయ్యేది. దాన్ని సాహిత్యం దర్శన రూపంగా లోకానికందించాలి. ఆకలిగొన్న వానికి ఆత్మవిచారం అలపడుతుందా? అన్నది సామాన్యంగా ఆధ్యాత్మిక మార్గానికి ఎదురయ్యే ఆక్షేపం. 'కడుపు నిండంగానే నీ సమస్య తీరిందా' అన్నది దానికి ప్రత్యాఖ్యానం. కడుపూ నిండాలి, కాలూ ఆడాలి; మనసూ పండాలి, మమతా నిండాలి; జీవితస్వభావమైన వైషమ్యభావం తొలగాలి; తానే విశ్వమన్న తాదాత్మ్యం పడరాలి. ఈ ప్రగతి మూడుమెట్ల నిచ్చెన. గతి భౌతికతార్కిక వాద దర్శనం మనిషిని మొదటి మెట్టెక్కిస్తుంది; మానవతావాదదర్శనం రెండవమెట్టెక్కిస్తుంది; ఆధ్యాత్మికవాద దర్శనం మూడవమెట్టెక్కిస్తుంది. భౌతికవిప్లవంవల్ల మనిషి ఆర్థికంగా సమత్వాన్ని సాధిస్తే, భావవిప్లవంవల్ల హార్దికంగా సమత్వాన్నీ, ఆధ్యాత్మికంవల్ల తాత్త్వికంగా సమత్వాన్నీ సాధిస్తాడు. ఆధ్యాత్మికాన్ని తార్కిక హేతువాదా లంగీకరించవు భౌతికంగా; ఎందువల్లనంటే 'అది అందరికి ఆచరణ యోగ్యంకాదు కాబట్టి దాన్ని గురించి ఆలోచించటం అనవసర' మని, భావించటమే. అయితే, మానవతా దృక్పథాన్ని వాళ్లు అంగీకరిస్తారు. అది వారి ధ్యేయమని విశ్వసిస్తారు. మానవతా వాదమార్గంలో మనిషి సమాజంతో ద్వైతాన్ని సాధిస్తాడు; ఆధ్యాత్మికమార్గంలో మనిషి సమాజంతో అద్వైతాన్ని భజిస్తాడు. మానవతావాదాన్ని అంగీకరిస్తే పరోక్షంగా ఆధ్యాత్మికవాదాన్ని అంగీకరించినట్లే. సోషలిస్టు దృక్పథంతో సమసమాజ నిర్మాణాన్ని కోరటం, మానవతా దృక్పథంతో ప్రపంచశాంతిని ఆకాంక్షించటం, ఆధ్యాత్మికదృక్పథంతో సర్వమానవ సమానత్వాన్ని సాధించటం ఆధునిక దృక్పథమని చెప్పాలి. ఈ ప్రస్థానత్రయం త్రివేణీసంగమంలా భాసింప గలిగే క్షేత్రం భారతభూమి అనటంలో అనుమానం లేదు. అందువల్లనే విప్లవాన్ని కాంక్షించినా భారతీయులు శాంతిమార్గాన్ని అనుసరిస్తారు. ఆర్థిక ప్రగతిని సాధిస్తూనే నైతికపు విలువలను ఆదరించాలని ఆకాంక్షిస్తారు. మనిషిలో మాధవుణ్ణి దర్శించే మర్యాద ఆధ్యాత్మికసాధనగా ఆరాధిస్తారు. ఈ ముప్పేట గల సంస్కృతిలో ఏపేటను కోసి మిగిలిన పేటలను పేనినా ఆసూత్రం కలకాలం నిలువదు. ముప్పేటలో ఒంటిపేట సూత్రాన్ని పేనుతున్నారు విప్లవవాదులు; రెండుపేటలు పేనుతున్నారు అభ్యుదయవాదులు; ముప్పేటను పేనితే సంప్రదాయ మని ఇద్దరూ నిరాదరిస్తున్నారు. మొదటిది అత్యంత ఆధునికత, రెండవది ఆధుని

కత అని భావిస్తున్నారు.

ఈ ఆధ్యాత్మికవాద నిరాదరణకు కారణం లేక పోలేదు. నిత్యజీవితంలో పాటించవలసిన ఆధ్యాత్మిక ప్రవృత్తిని పవిత్రగ్రంథ పారాయణకే పరిమితం చేసి, జాతిప్రవర్తనంలో ద్వైధీభూతవ్యక్తిత్వాన్ని సృష్టించి స్వార్థపరాయణత్వానికి సామ్రాజ్యం కట్టబెట్టారు తరతరాలుగా భారతీయులు. ఈ ద్వైధీభూతమైన ప్రవృత్తి చివరకు ఆధ్యాత్మికతను గురించి బాహాటంగా చెప్పుకోలేని బలహీనతను జాతికి కల్పించింది. ఇది ఒకవిధమైన అసమర్థత, ఆత్మవంచన. దాన్ని అధిగమించలేకపోతే ఈ గడ్డమీద ఏ విప్లవమూ సఫలం కాలేదు. అందువల్లనే పచ్చివిప్లవవాదుల్లోకూడా 'చెప్పేమాటలు వీరు చేసే చేష్టలు వేరు' అన్నది పరిపాటి అయిపోయింది. ఏ ప్రభుత్వం (చివరకు కమ్యూనిస్టు ప్రభుత్వాలు) చేసిన శాసనాలైనా నైతికమైన బలాన్నీ, నిజాయితీతోకూడిన పాలననూ సమాజంలో నుంచి పుంజుకోలేక పోతున్నాయి. మన దేశంలో విప్లవం గండిపడ్డ చెరువులా కావటానికి జాతిలో చాలవరకు లోపించిన చిత్తశుద్ధితో కూడిన శీలమే కారణమని వేరే చెప్ప నవసరం లేదు. ఆధ్యాత్మిక ప్రవృత్తిని ఆచరణలో పెట్టలేనంతవరకూ మనకు సద్గతి లేదు. ఈ అంశాన్ని అధునికమని గుర్తించని మన విప్లవదృక్పథం ఒంటికన్ను చూపు!

# 2

అధునిక సాహిత్యానికి 'సామాజికస్పృహ' అవశ్యలక్షణమని అందరూ అంగీకరించే విషయం. అయితే ఈ సామాజికస్పృహ అంటే ఏమిటి అని నిశ్చయించటంలో రాజకీయవాదికీ, సాహితీవేత్తకూ దృష్టిభేదమున్నదని శ్రీ ఆర్. యస్. సుదర్శనం విశ్లేషించి చూపించిన అంశం గమనార్హం. "కాలంలో కరుడు కట్టిపోయే చారిత్రకబంధాలనుంచీ మనిషిని విముక్తి కలిగించే చైతన్యస్ఫురణ, ప్రేరణ, స్పృహ, సృజనాత్మకరచనలో వ్యంగ్యంగా అభివ్యక్తం అయితే, దాన్ని 'సాహిత్యంలో సామాజికస్పృహ'గా గుర్తించడ మౌతుంది. ఇది రాజకీయవాది ఊహకన్న, అభిప్రాయంకన్న విస్తృతమైనదీ; సున్నితమైనదీ! బహురూప సమన్వితమైనదీ! బంధవిముక్తీ, సామాజికపురోగతీ రాజకీయచర్య ద్వారానే జరుగుతవని అనేవాడు రాజకీయవాది, అతనికి రచయితతత్త్వమూ సాహిత్యతత్త్వమూ అవగాహనకు రావు. కేవలం రాజకీయమైన విప్లవాలు మానవాళికి ఏమాత్రం విముక్తినీ, పురోగతినీ సాధిస్తున్నాయో ఈ శతాబ్ది ప్రపంచ

చరిత్రను పరిశీలనచేస్తే బోధపడుతుంది." (పుట 5)

కడచిన ఇరవై యేళ్లల్లో తెలుగు కవిత్వ రంగంలో తిరుగుబాటు ధోరణులు బలంగా కనపడుతున్నాయి. అవే ఆధునికకవితా లక్షణాలుగా సంభావింప బడుతున్నాయి. తిరుగుబాటును మూడువాదాలవారు ప్రధానంగా బలపరుస్తూన్నారు. 1. అభ్యుదయవాదులు 2 దిగంబర కవులు మొదలైన తీవ్రవాదులూ 3. విప్లవవాదులు. ఈమూడు వాదాలకూ మూలమైన కుదురు మార్క్సిస్టు దృక్పథం. ప్రపంచ మార్క్సిస్ట్ ఉద్యమంలో వచ్చిన మార్పులన్నీ ఆ యాకాలాల్లో మనదేశంలో ఉన్న మార్క్సిస్ట్ల మీద కూడా ప్రభావం వేశాయి. విప్లవాన్ని ఏ విధంగా సాధించాలన్న పద్ధతుల్లో వీరిలోకూడా భేదాభిప్రాయాలున్నాయి. ఆ వివరాలన్నీ సాహిత్యాని కంత అవసరం లేకపోయినా, వీరిలోకూడా కొన్నివర్గాలు న్నాయన్న విషయం తెలుసుకోవటానికి తోడ్పడతాయి. ఈ రెండు దశాబ్దాల చరిత్రలో కనపడే తెలుగు మార్క్సిస్టు రచయితల దృక్పథాలను బట్టి వారిని శాంతి విప్లవ వాదులనీ, సాయుధ విప్లవ వాదులనీ ప్రధానంగా రెండు తెగలుగా విభజించవచ్చు. సాయుధవిప్లవమే నిజమైన విప్లవమని నమ్మేవారు శాంతివిప్లవవాదుల్ని అభ్యుదయ రచయితలనీ తాము విప్లవరచయితలమనీ పిలుచుకుంటున్నారు. అయితే అభ్యుదయవాదులు ఆర్థిక—లేక—భౌతిక విప్లవాన్ని సాధించాలని ప్రబోధిస్తూ మానవతా వాదాన్ని మన్నిస్తారు. విప్లవరచయితలు సాయుధవిప్లవంతో వర్గరాహిత్యాన్ని సాధించాలంటారు.

ఈ రెండుశాఖల నడుమ కొంతకాలం—అంటే 1964—1970 మధ్య ఆరేళ్లు దిగంబరకవులు తమ ఉద్యమాన్ని సాగించారు. డా॥ కె. కె. రంగనాథాచార్యులు చెప్పినట్లు—"ప్రస్తుతవ్యవస్థలో ఉండే కుళ్లును తీవ్రంగా నిరసిస్తూనే క్రొత్తవ్యవస్థకోసం—దాని స్వరూపాన్ని స్పష్టంగా నిర్వచించలేకపోయినా—చేతులు చాచే ఆశావాదులు దిగంబరకవులు." (పుట 152). "దిగంబరకవులు సాధించిన తిరుగుబాటు ప్రధానంగా నాలుగు రకాలుగా కనిపిస్తుంది—

1. సామాజికంగా దుర్భరమైన జీవన పరిస్థితులపైన తీవ్రమైన అసహ్యం, జనం చూపుతున్న సహనశక్తిపైన విపరీతమైన ఏహ్యాభావం, సంప్రదాయంమీద ధ్వజం – క్షీణిస్తున్న విలువలపైన, సమకాలీన సామాజిక వ్యవస్థపైన తిరుగుబాటును ప్రేరేపించటం.

2. సాహిత్యపరంగా అనిర్దిష్టంగా, అస్పష్టంగా, అయోమయంగా అంత వరకూ వచన కవితలో కనిపిస్తున్న అభివ్యక్తీకరణపద్ధతులపైన, మార్మికత పైన తిరుగుబాటుగా చెప్పదలచిన దాన్ని సూటిగా గుండెల్లో గుచ్చుకొనే శైలిలో చెప్పటం.

3. భాషా విషయకంగా అంతవరకూ సాహిత్యంలో నిషిద్ధం అనుకున్న పదజాలాన్నీ, బూతుపదాల్నీ, భావతీవ్రతకు హేయంగా, జుగుప్సావహంగా ఉన్న సామాజిక పరిస్థితుల్ని చిత్రీకరించటానికి సాధనంగా సమర్థవంతంగా వాడటం, అంతకుముందు ప్రయోగవాదులు చేసిన కేవలభాషా చమత్కారాలపైన, ఆంగ్లపదాలను మితిమీరి వాడటంపైనా తిరుగుబాటు.

4. అంతవరకు మధ్యతరగతి విద్యావంతులకు మాత్రమే పరిమితమైన వచనకవితను ఆవేశపూరితంగా చదివే పద్ధతిలోని తీవ్రతద్వారా జన సామాన్యం దగ్గరకు తీసుకొని వెళ్ళటం. వందలు వేలు జనం కవితను వినటానికి, ఉపన్యాసాలు వినటానికి రావటం దిగంబరకవులు సాధించిన విజయాలు. "(పుటలు 156,157)

దిగంబర కవులకు సమాంతరంగా - తిరుగుబాటు కవులూ, పైగంబర కవులూ మొదలైనవారు వచ్చారు. "దిగంబరకవుల్లో ఉన్న నిశితమైనశైలి, భాషాతీవ్రత, కవితాగుణం వారి కవిత్వానికి లేక పోయినా, దిగంబర కవుల లాగా వారు వచనకవిత్వాన్ని ప్రజలదగ్గరకు తీసుకొని వెళ్ళలేక పోయినా, దిగంబర కవులకు లేని లక్ష్యశుద్ధి వీళ్ళలో (తిరుగుబాటు కవులలో) కనిపిస్తుంది. తిరుగుబాటు కవులలో ప్రస్తుత వ్యవస్థతో రాజీలేని పోరాటానికి పిలుపూ, సమకాలీన సమాజంపై విమర్శలు, ప్రజలకు మందలింపులు, రాజకీయసిద్ధాంత ప్రచారం స్పష్టంగా కనిపిస్తాయి. 'సహనం గాడిదలక్షణం' అని జనంలో కనిపించే 'సహనం' విషయంలో అసహనాన్ని ప్రకటించారు వీళ్ళు. ఈ సమాజంలో కుళ్ళును కడగటానికి 'శస్త్రచికిత్స' తప్ప వేరే మార్గం లేదని వీళ్ళ భావిస్తారు." (పుట 159) పైగంబర కవులు "సమస్యల పరిష్కారానికి మానవత, సమరసభావం ఎంత అవసరమో కొన్ని వేళలో పరవశమైనా

వ్యవహరించటం కూడా అంతే అవసరం" అని నమ్మిన వాళ్ళు.

వీరంతా విప్లవరచయితల సంఘంతో లీనమయ్యారు. "శుద్ధ మానవతా వాదం సామాన్యుడి సమస్యల్ని మార్చలేదని, ఉన్న వ్యవస్థనుంచి మరొక వ్యవస్థ పునర్నిర్మించబడాలంటే హింస మంత్రసాని కావాలనీ, సమాజానికి పుట్టిన రాచపుండుకు 'ఆపరేషన్' తప్పదని తిరుగుబాటు కొనసాగింపు విప్లవ మార్గమే నని నమ్మి సమకాలంలో జరుగుతున్న సాయుధ పోరాట ప్రభావంతో కవితలు వ్రాస్తున్నవారు విప్లవకవులు." (పుట 161).

తిరుగుబాటు మొదట తెచ్చిన వాళ్ళు అభ్యుదయవాదులు. నేటి విప్లవవాదు లంటున్నట్లుగా వారే మొదట సమాజవ్యవస్థ మీదా, సాహిత్యవ్యవస్థమీదా, భాషా సంప్రదాయాలమీదా తిరుగుబాటును ప్రకటించి ప్రయోగాలు కూడా చేసి చూపించారు. చాలమంది సంప్రదాయ వాదుల మార్గాలలో పరివర్తనాన్ని తెచ్చి పెట్టారు. అయితే ఆ తరువాత సంప్రదాయాన్ని పూర్తిగా ధ్వంసంచేసి క్రొత్త సంప్రదాయాన్ని సృష్టించాలనా, క్రొత్తప్రాతల మేలుకలయికగా విప్లవం వర్ధిల్లాలనా అనే వాదాలు అందులో తలయెత్తాయి. తీవ్రవాదులు మొదటి మార్గాన్ని, మితవాదులు రెండో మార్గాన్ని ఆశ్రయించారు. అయినా రెండు తెగల వారూ అభ్యుదయ వాదులుగా చెలామణి అయ్యారు. మితవాదులు విప్లవాన్నీ మానవతావాదాన్నీ కలిపి కొత్త రసాయనం తయారుచేశారు. ఆవేశంతో మొదలైన అభ్యుదయమార్గం ఆలోచనలో పడింది. అభ్యుదయవాద మార్గంలో మానవతావాదులూ, మార్మికవాదులూ, కమిట్‌మెంట్ లేని కవులూ నడవటం మొదలు పెట్టారు. దానితో అభ్యుదయవాదానికి మూలబీజమైన భౌతిక-ఆర్థిక విప్లవం మందగించసాగింది. రాజకీయాల్లో కూడా పార్టీలన్నీ అభ్యుదయం కావాలని గొంతెత్తి పిలిచి తమ తమ పద్ధతుల్ని అందుట్లో చేర్చి మార్క్సిస్టు మార్గాన్ని మిశ్రమం చేయటం మొదలు పెట్టాయి. ఈ పద్ధతి నచ్చని మొదటి రకం అభ్యుదయవాదులు సాయుధ విప్లవ ధోరణులను సమర్థిస్తూ ఉగ్రమార్గాన్ని అనుసరించారు. దిగంబరకవులు మొదలైనవారు అభ్యుదయ మార్గంలో కలిగిన స్తబ్ధతను ఈసడించారు, అధిక్షేపించారు. సాయుధ విప్లవానికి కావలసిన ఇంధనాలను సేకరించి అగ్నిజ్వాల వెలిగించారు. దాని ధ్యేయం సాయుధ విప్లవమే. అందువల్ల తమ జ్వాలను అగ్నికే అర్పణం చేశారు.

తిరుగుబాటుకు మూలాధారం రాజకీయం. మార్క్సిస్టు విధానాన్ని ఆయా రాజకీయవాదులు అన్వయించిన విధంగా సాహిత్యం బలపర్చటం విప్లవవాదుల అభిమతం. వ్యవస్థలుగా దేశంలో ఉన్న అన్ని సంప్రదాయాల మీదా వారు తిరుగుబాటు ప్రకటించారు. సమాజవ్యవస్థ, రాజకీయవ్యవస్థ, ఆర్థికవ్యవస్థ. సాహిత్య వ్యవస్థ, సాంస్కృతికవ్యవస్థ అన్నవి తిరుగుబాటు ధోరణి రావలసిన వ్యవస్థలు, వ్యవస్థకు ఆదర్శాలుంటాయి, ఆచరణ లుంటాయి. ఆ ఆదర్శాలూ ఆచరణలూ నైతికంగా పతనావస్థకు వచ్చినప్పుడు వాటిమీద తిరుగుబాటు సహజంగా ప్రజల్లో రావాలి. దోపిడీవిధానం, అవినీతి, లంచగొండితనం, పరపీడన పరాయణత్వం, కులమత కల్లోలాలూ, వర్గవ్యత్యాసం, బానిస మనస్తత్వం, అనుకరణభావం ఇవన్నీ మన జాతిజీవనాన్ని పీడిస్తున్న చీడపురుగులు. వీటినుండి విముక్తిని సాధించుకోవటానికి తగినంత చైతన్యం ప్రజలలో సహజంగా ఆయత్తమైఉంది. దానికి మార్క్సిజమే తగిన ప్రస్థానమని విప్లవశంఖం పూరిస్తున్నారు సాయుధ విప్లవవాదులు. రాజకీయచైతన్యాన్ని పార్టీ కార్యక్రమాలద్వారా సాగిస్తున్నారు. సామాన్యప్రజల్లో ఈ విప్లవభావం రేకెత్తించటానికి పథకాలువేసి ప్రయోగిస్తున్నారు. ఆపథకంలో మధ్యతరగతి మేధావులనూ, సామాన్యజనాన్ని ప్రబోధించటానికి పార్టీకి సాహిత్యాన్ని ఒకసాధనంగా ఉపయోగిస్తున్నారు. గేయరచన కవితాప్రక్రియలనూ, జానపద కళాప్రక్రియలనూ సాహిత్యాంగానికి వాహికలుగా ఎన్నుకోవటం సహజం. కాని, ఆశించినంత విప్లవస్ఫూర్తి అనుకున్నంత వేగంగా దేశప్రజలో పొంగులువారలేదు. దానికి ప్రజల్లో ప్రజాస్వామ్య వ్యవస్థమీద ఉన్న గాఢమైన విశ్వాసం ఒకకారణం కావచ్చు; అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆర్థికాభ్యుదయ పరిణామంలో తలయెత్తే నైతికమైన బలహీనతలు కారణం కావచ్చు, లేదా జాతిలో ఉన్న సంప్రదాయవ్యవస్థ ఎంతో బలమైనది కావచ్చు. ఏమైనా ప్రజల్లో ఉన్న ఈ సహనం విప్లవవాదులకు రాజకీయ సమస్యయేకాక, జీవన్మరణ సమస్య అయిపోయింది.

రాజకీయ సిద్ధాంత ప్రేరితమైన సాహిత్యానికి విశ్వజనీనమైన విలువ లుండ వని చరిత్ర చెప్తున్న గుణపాఠం. ఆ సిద్ధాంతాన్ని చెప్పే సాహిత్యానికి సాహిత్యపు విలువలు కావు ప్రధానం. చెప్పే విషయానికి వినేవాడి అభిరుచి కనుగుణంగా రూపాన్ని కల్పించి చెప్పటమే ప్రధానం. మధ్యతరగతి మేధావి

తార్కికమైన అవగాహన కావాలి; సామాన్య ప్రజలకు ఉత్తేజాన్ని కలిగించే ఉపదేశం కావాలి. వచనకవిత్వ ప్రయోగాలు విప్లవకవుల చేతుల్లో మొదట అవగాహనకు ప్రయత్నించాయి, ఆ తరువాత అవేశాన్ని కల్పించటానికి పూను కొన్నాయి. అవేశానికి అన్యాయం మీద రెచ్చగొట్టే పిలుపు కావాలి. లక్ష్యం తెలియకపోయినా వ్యవస్థమీద వెగటు, ద్వేషం ప్రజలకు కలగాలి. ఉన్నదాన్ని కాలదన్నితే కాలుబెట్టే దేది అని తరువాత ఆలోచించుకోవచ్చు. దిగంబర కవుల దగ్గరినుంచీ నేటి విప్లవకవుల దాకా ప్రయోగా లీలక్ష్యంతోనే సాగాయి. ఇనుమును వేడిచేస్తున్నారు, సమ్మెటతో కొడుతున్నారు; పనిముట్టు ఎలా తయారు కావాలో తెలుసు. కాని, లోహం వంచినట్లుగా అన్నిచోట్లా వంగటం లేదు. దానికి కారణం ఈ జాతి మూలతత్త్వమైన శాంతికాముకత్వానికి భిన్నమైన హింస ఆ సిద్ధాంతా నికి ఆయువుపట్టు కావటం. ఈగడ్డమీద సత్యాగ్రహం సఫలమైనట్లుగా హత్యా గ్రహం విజయవంత మౌతుందా అన్నది మౌలికంగా విచారించవలసిన అంశం. ఇది జాతి సుప్తచేతనంలో జీర్ణించుకున్న సంస్కారానికి సంబంధించింది. దాన్ని రాజకీయ దృక్పథం మార్చలేకపోవచ్చు; మానవతాదృక్పథం జాతి నైతికసత్త్వాన్ని మలచవచ్చు; అధ్యాత్మిక దృక్పథం చాలవరకు ఫలవంతం కావచ్చు. అందుకనే నేడు విప్లవం వెల్లువలా పొంగటం లేదు; జంపాతంలా దూకటం లేదు; ప్రళయాగ్నిలా ప్రజ్వలించటం లేదు.

ఈ పరిస్థితులను చూచి సాహిత్యానికి రాజకీయ సంబంధాన్ని తొలగించి, కళాత్మక ప్రవృత్తిని కలిగించి, దానికి స్వయంవ్యక్తిత్వం కల్పించి, ప్రజల్లోని చైతన్యాన్ని ప్రతిబింబింపచేసుకొని శ్రేయోధర్మాన్ని శిల్పనుంపరంగా ప్రబోధించే టట్లు చేయాలన్న యత్నం క్రొత్తగా మొదలైంది. కవిసేన ప్రారంభించిన ఉద్యమం ఈ కోవకు చెందింది. కవిసేన మేనిఫెస్టో వ్రాసిన శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ —ఇలా అంటున్నారు. "కవిత్వానికి ఒక ప్రమాణం నిర్ణయిం చాలి, ఈ ప్రమాణం, ప్రపంచంలో కవిత్వతత్త్వవేత్తలు ప్రతిపాదించిన సిద్ధాం తాలు పరిశీలించి, ఏదోఒక సార్వత్రికమైన సూత్రాన్ని స్వీకరించటం,దానితోటి అన్నిదేశాల్లో అన్ని కాలాల్లో అగ్రగణ్యులైన కవులకృతులను జోడించి ప్రస్తు మాన కవితను కొలిచితీరాలి-- కవిత కానిదాన్ని నిర్దాక్షిణ్యంగా బహిష్కరించాలి. కవితకు కొలతబద్ద లేదనే unscientific దృక్పథాన్ని ఖండించాలి. అర్థిక

సామాజిక సమస్యల వరకు ఈ శతాబ్దం అంగీకరించిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కవిసేన పరిపూర్ణంగా స్వీకరించాలి. సమగ్ర మానవజీవితంలో రాజకీయం ఒక భాగం మాత్రమే రాజకీయ, సామాజిక, ఆర్థిక సమస్యల్ని పరిష్కరించటానికి ఒకసాధనం మాత్రమే. కాని, కవి సంపూర్ణమానవజీవితంతో సంబంధం ఉన్నవాడు. కనుక కవి బాధ్యత రాజకీయబాగానికే పరిమితం కాదు. ప్రస్తుత సామాజిక సందర్భాన్ని అనుసరించి కవిదృష్టిలో రాజకీయం హెచ్చుభాగం తీసుకోవచ్చు కానీ, కవి సంపూర్ణ మానవజీవితం మీద తనకున్న బాధ్యతల్ని విస్మరించి ఒక పరిమిత ప్రయోజనానికి మాత్రమే బద్ధుడై పోకూడదు. కవి సరాసరి మానవజాతికి బాధ్యుడు. ఒక రాజకీయపార్టీకి కాదు. పై కారణాలచేత, అంటే మొత్తం మానవజాతి మానవ జీవితంపట్ల కవికి బాధ్యత వుండటంచేత కవి బాధ్యత రాజకీయపరమైన బాధ్యతకంటే గురుతరమైనది. కనుకనే మానవ సమాజక్షేమంకోసం కవినాయకత్వం అన్నిటికంటే అగ్రగణ్యం కావాలి. ఈ వైజ్ఞానిక నాయకత్వాన్ని నెలకొల్పటానికి కవిసేన ముఖ్యంగా పనిచేస్తుంది." (కవిసేన మేనిఫెస్టో పుట 11-12)

కవిసేన మేనిఫెస్టో- కవితను రాజకీయబంధాలనుండి తొలగించాలని అంటున్నా యుగధర్మమైన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ప్రాథమిక ప్రమాణంగా గ్రహిస్తోంది. విషయం రాజకీయమే కాకుండా సర్వమానవ సమాజసంక్షేమానికి సంబంధించిన అంశాలన్నింటినీ కవిత ప్రతిపాదించాలంటున్నది. కవితకు ప్రబోధం ప్రయోజనమైనా కళాప్రమాణాన్ని కాలదన్నగూడదంటున్నది. ఇది విప్లవకవుల కవితాదృక్పథంమీద "కవిసేన" చేస్తున్న తిరుగుబాటు. "ఈనాడు తెలుగుదేశానికి కావలసింది సామాజిక చైతన్యం కాదు సాహిత్యచైతన్యం" అన్నది కవిసేన నినాదం!

ఈ ఇరవై యేళ్ళలో కవితారంగంలో కోలాహలం ఇలా ఉండగా మనం గమనింపవలసిన అంశం మరొకటి ఉంది. పారిశ్రామికంగా ఆర్థికంగా అభివృద్ధి చెందుతున్న మనదేశంలో కవితకు గణనీయమైన స్థానం లేకుండా పోయింది. ఈరోజు నిత్యజీవితసమస్యల్లో సతమతమౌతూ ఆర్థికసమస్యలను ఎదుర్కొంటూన్న సామాన్య మానవుడికి గానీ, మధ్యతరగతి మేధావికి గానీ, కవిత్వం జీవితానికి పనికివచ్చే వాస్తవ వస్తువుగా కనబడటం లేదు సాంకేతిక విజ్ఞానాని

కున్న విలువ నేడు సాహిత్యానికి లేదు. పత్రికల కున్న ప్రయోజకత్వం కవితా సంకలనాలకు లేదు. ప్రతివాడికీ జీవించటానికి ఒక ఉపాధి కావాలి. ఉపాధికి కావలిసిన పరిజ్ఞానం ఉంటే చాలు. బ్రతుకు తెరువును చూపించే విద్యకోసం విద్యార్థు లెగబడుతున్నారు. విద్యాప్రణాళికలకు ప్రమాణం అదే కావాలని ప్రయత్నిస్తున్నారు. అందువల్ల ఉన్నతవిద్యాలక్ష్యాలు మారిపోతున్నాయి. విశ్వవిద్యాలయాల విద్యాప్రణాళికలు కాలానుగుణంగా రూపొందుతున్నాయి. సమకాలీన సమాజ జీవితానికి సాహిత్యం ఒరగబెట్టే దేమీ లేదన్న భావం ప్రబలుతోంది. అందువల్ల సాహిత్యాన్నీ, కళనూ ఉపరంజనంకోసం ఉపయోగపడే విలాస ద్రవ్యాలుగా ప్రజలు భావిస్తున్నారు. ఉదాత్త సాహిత్యమర్యాదలు ఊపిరిపీల్చుకోలేని పరిస్థితులేర్పడ్డాయి. ఈ పతనావస్థలో జాతిలో సాహిత్యం మీద గౌరవాన్ని కలిగించే సాంస్కృతిక ఉద్యమం రావాలి. ఆధునికకవితా ప్రక్రియలు ప్రజానీకంపై ఎటువంటి ప్రభావమూ వెయ్యలేకపోవటానికి మౌలికమైన కారణాల్లో ఇదికూడా ఒకటి అని మనం విస్మరించరాదు. కవితాభిరుచిని బ్రదికించే సామాజికస్పృహ నేటి ముఖ్యమైన సాహిత్య సమస్య!

## 3

ఈ ఇరవై యేళ్ళలో ప్రజల్లో సాహిత్యాభిరుచిని పెంపొందించటానికి తోడ్పడిన ప్రక్రియల్లో మొదట పేర్కొనదగింది నవల, ఆ తరువాత కథ-కథానిక. అక్షరజ్ఞానమున్న ప్రతిపఠితనూ ఈ ప్రక్రియలు ఆకట్టుకుంటున్నాయి. అధిక పరిమాణంలో రచింపబడుతున్నవికూడా ఈ ప్రక్రియలే. ఒకనాడు ఆశుకవిత్వం చేసినసేవ, మరొకనాడు గేయవచన కవిత్వాలు చేసిన సేవలాంటి దిది. ఈనాడు నవలకూ కథానికకూ ఉన్న ప్రాచుర్యం కవితకు లేదన్నది నగ్నసత్యం. సరళమైన వచన రచనలు కథనాశ్రయించి సాగేంచేవి కాబట్టిన్నీ, మానవజీవితాన్ని వాస్తవంగా వాస్తవ దృష్టితో సమీక్షించేవిన్నీ కావటం చేత వాటి కా ప్రాచుర్యం వచ్చింది. నవల ఏ ఉద్యమంకోసం విశేషంగా అంకితమైనట్లు కానరాదు; రాజకీయ సిద్ధాంతాల ప్రాతిపదికలతోనే ముడిపడి ఉండలేదు, జీవితాన్నంతా అవరించుకొనిపోతున్నది, ఆబాలగోపాలనికీ అందుబాటులోకి వచ్చింది. నవలారచనల్లో వివిధప్రక్రియల్లో విశేషప్రయోగాలు సాగాయి. అయితే, వాటిని ప్రజాసామాన్యం ప్రయోగ పరిజ్ఞానంతో చదివిందానికంటె, ఆసక్తిప్రధానంగానే చదువుతోంది. జీవితసమస్యలను కళాత్మకంగా చిత్రించే ఉత్తమరచనలూ అందులో

ఉన్నాయి. వాటి ప్రభావం అనక్తిప్రధానంగా చదివే ప్రజల్లో అవగాహనకు తోడ్పడింది. స్త్రీవ్యక్తిత్వం, హరిజనసమస్య, ఆర్థిక అసమానతల వాస్తవ స్వరూపం, నాగరిక సమాజంలోనూ, అభివృద్ధిచెందుతున్న గ్రామీణవాతావరణం లోనూ వివిధ వర్గాలకు సంబంధించిన వ్యక్తు లెదుర్కొనే సమస్యలూ, రాజ కీయాలు సమాజవాతావరణాన్ని కలుషితంచేస్తున్న వైఖరి, జాతి, కులమత వర్ణ సమస్యలలో సమాజంలో జరుగుతున్న అభ్యుదయ సంస్కరణల ప్రభావం, వృత్తుల్లో ఏర్పడే వైయక్తిక, సామూహిక సమస్యలు-ఇటువంటి వెన్నింటినో ఈ ప్రక్రియలు సమర్థవంతంగా చిత్రిస్తూ లోకానికి వివిధ దృక్కోణాలతో పరిచయంచేస్తున్నవి. ఉపరంజనం వృత్తిగా, సమీక్ష ప్రవృత్తిగా, ఉపదేశం గౌణంగా ఈప్రక్రియలు సాగుతున్నవి. అందువల్ల నవల, కథానిక జాతి సాహిత్య చైతన్యంలో ఒకభాగంగా నేడు మారిపోయాయి.

నవలా ప్రక్రియ ప్రపంచస్థాయిలో సాధించిన ఉన్నత ప్రమాణాలను తెలుగులో సాధించిందా? ప్రపంచ సాహిత్యాలకు కానుకగా ఇవ్వదగిన కథలు గాని నవలలుగాని మనభాషలో వచ్చాయా? అన్న ప్రశ్నలు ప్రమాణజ్ఞులు వేస్తున్నారు పట్టుమని పదినవలలన్నా మంచివి ఉన్నాయా? అని అడుగు తున్నారు. కొందరు పది ఉన్నాయన్నా, నూరేళ్ళ నవలా చరిత్రలో నూరైనా లేవే అని విచారపడుతున్నారు. దీనికి కారణం ఆడవాళ్ళు ఈ రంగంలో అడుగు బెట్టటమేనని ఆడిపోసుకుంటున్నారు. ప్రమాణాల ప్రశ్నవస్తే ఏ రంగంలో లేవీ ప్రశ్నలు? కవిత్వం పొడిచేసిం దేమీలేదు; నవల అంతకంటె నలిగిపోయిందీ ఏమీలేదు. వందలాది కవులు కవితలు వ్రాస్తున్నారు. వందలాది రచయితలూ రచయిత్రులూ కథలూ నవలలూ వ్రాస్తున్నారు. ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క ప్రక్రియ సమాజాన్ని ఆవరించి సాహిత్యాభిరుచిని సంరక్షిస్తూ ఉంటుంది. ఈ యుగంలో కథ, నవల ఆ పనిచేస్తున్నాయి. ఈ తరుణంలో నిలిచేవి ఎన్ని వ్రాస్తున్నారనికాదు ప్రశ్న, సాహిత్యాభిరుచిని పోషించటానికి ప్రజలదగ్గరికి వెళ్ళే ప్రక్రియలో ఎన్నైనాయినా వ్రాయాలన్నదే గమనించవగిన అంశం. ప్రమాణాలు పల్చబడటం ఈ ప్రవాహంలో తప్పదు. వాస్తవచిత్రణం ప్రాణంగా ఉన్న ఈ ప్రక్రియలో స్వాప్నిక జగత్తులు సృష్టింపబడటం తప్పదు. తగినంత పరిజ్ఞానం లేనివారు రచనలు చేయటం తప్పదు. నీరైపారితేనే ఏరుగాసాగేది. తరువాత ఆనకట్టలు కట్టటం ఫలసాయం పండటం. అందువల్ల నవలను, కథను అవి నిర్వహిస్తున్న సామాజిక సాహిత్యాభిరుచిపోషణ

మ్మకే ప్రయోజనందృష్ట్యా అభినందించటం సహృదయుల కర్తవ్యం. అయితే ప్రవాహం దృష్టితో పరిశీలించటం తప్పని నా అభిప్రాయం కాదు. "వాస్తవిక జీవితానికి ఏమీ సంబంధించని ఊహాగానాలు, తారుణ్యభావోద్రేకాలు, కాలక్షేపంకోసం కొందరు రచయితలు- ముఖ్యంగా కొందరు రచయిత్రులు రచనలు చేయటం కనపడుతున్నది. నేటి సమాజంలో జీవనప్రమాణాలుగాని, సంఘర్షణలుగాని, రాజకీయార్థిక ప్రభావాలుగాని అవగాహన చేసుకొని వాస్తవమైన దృష్టితో సమాజానికి సాహిత్యం చేరువగా వుండాలనే ఆశయం నేడు చాలామంది రచనలలో కనబడటంలేదు." డా॥ అక్కిరాజు రమాపతిరావు (పుట 237). "గత ఇరవై ఏండ్లుగ రచనలు కొనసాగిస్తున్న రచయిత్రులు తమను అందని విచిత్రకల్పనల జోలికిపోకుండా తమకు నిత్యపరిచితమైన సామాన్య గృహవాతావరణాన్ని గ్రహించి మధ్యతరగతి మనస్తత్వాన్ని సమస్యల్ని ప్రధానంగా చిత్రిస్తున్నారు" (డా॥ జి. లలిత పుట 208).

"తెలుగు జాతి జీవితానికి సంబంధించిన సమస్త రంగాలలోని మంచి చెడ్డలు, మేలుకీళ్లు, రాగద్వేషాలు, వాళ్ళ ఉద్యమాలు, వాటి కేర్పడిన ప్రతిఘటనలు, జయాపజయాలు అన్నీకూడా కథా సాహిత్యంలో ప్రతిఫలిస్తూ వచ్చాయి. తెలుగునాట గల పల్లె సీమలను, పాటక జనుల జీవితాన్ని, నగరాల్ని అక్కడి జీవన సంరంభాన్ని కళ్లకు కట్టినట్లుగా చిత్రించి తెలుగు కథానిక చెరిగిపోని దేశీయతాముద్ర వేసింది" (శ్రీ మధురాంతకం రాజారాం పుట 241, 242) వంటి విమర్శకాభిప్రాయాలు సాహిత్య వివేచనానికి ఎంతైనా తోడ్పడతాయి.

ఒక ప్రక్రియకు ప్రజాదరం లభిస్తున్నప్పుడు అది వరదలా వ్యాపిస్తుంది. అందులో జీవనదులూ, వాగులూ వంకలూ, చెరువులూ కుంటలూ, మిట్ట పల్లాలూ అన్నీ ఏకంగా కనపడతాయి. అందులో నీరు పరిశుభ్రంగా ఉంటుందని అన్ని చోట్లా లోతుగా ఉంటుందనీ అనుకోవటానికి వీల్లేదు. వరదలో కాలక్రమేణా పైనీరు పోతుంది. నిలచిన నీరు తేరుకుంటుంది. కుంటల నుండి, నదుల దాకా దానికి ఉనికి ఉంటుంది. చివరకు ప్రవాహ రూపమైన నదీజలమే తరతరాలకు ఉపయోగపడుతుంది. మంచి నవలలు వ్రాయడానికి సమర్థులైన రచయితలకు ఈ పోలిక అడ్డంరాదు. శక్తిమంతమైన రచనలు ఏ యుగంలోనైనా కొద్దిగానే ఉంటాయి. మంచి రచనలు విరివిగా వచ్చిన యుగాన్ని ఆ ప్రక్రియకు స్వర్ణ

యుగ మంటాం! స్వర్ణయుగం తరువాత క్షీణయుగం వస్తుంది. సవల కా దశపట్ట కుండా చూడవలసిన బాధ్యత అందరి మీదా ఉంది.

# 4

పద్యం ప్రజలమధ్యనుండి ఎగిరి భావాంబరవీథుల్లో ప్రౌఢ విహారం చేస్తోంది. తెలుగు పద్యంలో జిలుగు శిల్పాలను చెక్కి కావ్యమందిరాలను అలంక రించే మహాకవు లీ యుగంలోనూ ఉన్నారు. వారిని పండితపరిషత్తులు గుర్తించి వారి రచనా గౌరవాలను కీర్తిస్తున్నాయి. పద్యాన్ని విప్లవంకోసం వాడిన ప్రయో గాలు మరుగుపడిపోయాయి; ఆత్మాశ్రయరీతులకు అలవరించిన ప్రయత్నాలు పాతపడ్డాయి; ప్రబోధసంస్కరణ ప్రయోజనాలకు వాడుకొనే పద్ధతి వార్ధక్యాన్ని వరించింది. ప్రశంసా పద్ధతిలో పరువు పోకొట్టుకొన్నది. అయితే మహా కావ్య మార్గంలో సామాన్యుని కందుబాటులో లేని విలువైన వజ్రంగా ప్రకాశిస్తోంది. డా॥ నాయని కృష్ణకుమారిగారన్నట్లు ఆధునికకవితాయుగంలోనూ భావ కవితా ఛాయలు గల పద్యకవిత్వం గేయకవిత్వం వచ్చింది. ప్రజల మధ్యకు దూ కే యుగధర్మం పద్యానికి ప్రాధాన్య మివ్వటం లేదు. పైపెచ్చు అభ్యుదయ వాదులు నిరసించిన సంప్రదాయానికి పద్యం వారసత్వంగా నిలిచింది. అందు వల్ల ప్రజాస్వామ్యంలో జమీనులను పోగొట్టు కొన్న జమీందారులాగా పద్యం పూర్వ వైభవాన్ని స్మరించుకుంటూ పర్వదినాలను నెమరువేసుకొంటూ తనకు ప్రతిపత్తి ఉన్న ప్రదేశాల్లో అజ్ఞాతవాసం చేస్తోంది. దాని భవితవ్య మేమిటన్నదే, నేటి ప్రశ్న! దానికి సూటిగా సమాధానం చెప్పటం శ్రీ మధునాపంతుల వారికే కష్టమైన సమస్య అయింది. 'కాల మనంత' మని కాచుకొని కూర్చోవటం తప్ప మరో మార్గం కనపడటం లేదు. లేదా— "భవితవ్య మన్న విశేష్యమునకు మేలు, భాగ్యము అనునర్థమే మనభాషలో నున్నది. భవితవ్యత— అనగా రాబో వునది. రాబోవునది యెప్పుడును మేలు; రసవత్ కవితా ధర్మము నాల్గు పాద ములు నడచినంతవఱకు నేటి పద్యరచన భవితవ్యము సురక్షిత" (పుట 98) మని శాంతి పాఠం పాడవచ్చు. కావంటారా "గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్" అన్న సూక్తిని నెమరు వేసుకోవచ్చు.

గేయం పద్యం కంటె ఈ శతాబ్ది ద్వితీయ చతుర్థంలో ప్రాచుర్యానికి వచ్చింది. దానికి అపూర్వపయ రచయితల అండదొరికింది. భావకవుల తరువాత ఆవేశానికీ, ఆర్ద్రతకూ గేయం బాగా ఉపయోగపడింది. వచన కవిత్వం తెచ్చిన

ఆలోచనతో, వాచ్యతతో, వక్రతతో గేయానికి గాయం తగిలింది. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలను వచన కవిత అలవరచుకొన్నంత సులువుగా గేయం అలవాటు చేసుకోలేకపోయింది. గేయానికి లయతో పాటు, భావరామణీయకత్వం, అభివ్యక్తి మాధుర్యం కావలసి వచ్చింది. సూటిదనం, వాడిదనం, వేడిదనం వచన కవితలో వ్యక్తమైనంత శక్తిమంతంగా గేయకవితలో సాగటం సాధ్యంకాక పోయింది. అందువల్ల అది జానపదబాణీల్లోనూ, చలనచిత్ర రంగంలోనూ, చెదురు మదురుగా మధురవస్తు కావ్యాల్లోనూ ఆశ్రయం తీసుకొంటున్నది. ఔజ్జ్వల్యం తగ్గి ఉపరంజకత్వం గేయంలో చోటుచేసుకొంటున్నది. అయితే విప్లవవాదులు వచన కవిత కంటె ప్రజల దగ్గరికి పోవటానికి శక్తిమంతమైన సాధనంగా గేయాన్ని గుర్తించి ఆప్రక్రియ ద్వారా రాజకీయ సాంఘిక ఆర్థిక సిద్ధాంతాలను ప్రచారం చేసి ప్రయోగాలను చేస్తున్నారు. అవగాహనకంటె ఆవేశాన్ని, ఆలోచన కంటె ఆనందాన్ని అందించటానికి గేయం నేడూ సాధనంగానే ఉంది. భక్తికీ, రక్తికీ దీన్ని ఉపయోగించినంతగా శక్తిమంతమైన పరో ప్రయోజనానికి దీన్ని చాలమంది ఉపయోగించ లేకపోతున్నారు. ఈ తరుణంలోనే జానపద గేయాలకు ప్రాముఖ్యం కలుగుతోంది. జాతి జీవన సంస్కృతిని సహజ సుందరంగా సంతరించుకొన్న ఈ సాహిత్య ప్రక్రియ గేయసాహిత్యాన్ని ఈనాడు పాలిస్తోంది. పాట ప్రజాకవితగా పలుకుబడిని పొందుతోంది. అయితే ఆ పాట ఏది? అనే ప్రశ్నకు జానపద సాహిత్యాభిమాని జానపదగేయ మంటున్నాడు; సినీకవి చలనచిత్ర గేయ మంటున్నాడు; జాతీయవాది ప్రబోధగేయ మంటున్నాడు; విప్లవవాది ప్రచారగేయ మంటున్నాడు. ప్రజలు మాత్రం పాటను ప్రణయ మంత్రంగా పాటిస్తున్నారు. పాటకు సాంఘికప్రయోజనం ప్రాణం కావాలనీ, అటువంటి గేయాలే ప్రజాకవితలనీ ప్రామాణికులు ప్రవచిస్తున్నారు! (చూడు: శ్రీ ఎల్లోరా వ్యాసం పుట 184).

వచన కవిత అభ్యుదయ మార్గంలో అడుగుపెట్ట సాగింది. ప్రయోజనం దాని ముఖ్యలక్ష్యం. అయినా రచయితల ప్రావీణ్యాన్ని బట్టి ప్రయోగంలో బహు విధ విన్యాసాలను చేసింది. ప్రక్రియకు అభ్యుదయ కవిత్వంలో ఆకృతి వైవిధ్యంతో పాటు అలంకరణ వ్యామోహం పెరిగింది; సూటిదనం తగ్గి సూక్తి వైచిత్రి హెచ్చింది. వాచ్యత స్థానంలో వక్రత వలపు నింపుకొన్నది; చివరకు పారడీలనూ, గారడీలనూ చేయటం మొదలు పెట్టింది. దాని వికృతిని

వెకిలిచేసి విప్లవ మార్గం వైపు మళ్లించే యత్నం కూడా వచనకవితలోనే జరిగింది. అధిక్షేపంలో అశ్లీలాలు నింపి వచనకవిత ఆగ్రహాన్ని వ్యక్తం చేసింది. తిడితే జనం తిరగపడటం చూచి తిట్లుమాని విమర్శనకు పూనుకొన్నది. వేడిగా విమర్శించే గాడి మీద రైలులా ముందుకు సాగిపోతున్నది. శ్రీ ఆరుద్రగారన్నట్లు, పేజీలకు పేజీలు వచనకవిత్వం వ్రాసే రోజులు పోయాయి 'చేవగల వెదురు ముక్క బాణమై భాసిస్తుం' దన్నట్లు మూడు నాలుగు పంక్తుల్లో వచన పద్యం చెప్పే రోజులు వచ్చాయి. (పుట 117) వచన కవితలో 'చెప్పే విషయం ముఖ్యమా? చెప్పే పద్ధతి ముఖ్యమా" అన్న మీమాంస బయలు దేరింది. అభ్యుదయవాదులకూ , విప్లవవాదులకూ విధానం కంటె విషయం ముఖ్యం. మిగతావర్గాలకు విధానం ముఖ్యం. విషయం ఒకటే అయినప్పుడు ఆవిష్కరణ విధానంలోని వైవిధ్యమే ఆసక్తిదాయకమౌతుంది. ఆ వైవిధ్యాన్ని కొందరు సమర్థులే సాధింపగలిగారు. మిగతావారు వారి బాణీలను అనుకరిస్తున్నారు. అనుకరణ అధికంగా కావటంవల్ల వచనకవిత పలచబడిన మజ్జిగలాగా తయారయింది. యుగధర్మంగా మారిన వచనకవిత ఊహించినంతగా ప్రజల మధ్యకు పరుగెత్త లేక పోయింది. పది మందీ వ్రాయడానికి పనికి వచ్చిందే కాని పదివేలమంది ప్రజలను కదిలించలేక పోయింది. అందువల్లనే నేటి కవి వచనకవిత కంటె పాటే బలమైన దేమోనని ఊగిసలాడు తున్నాడు. అదీ ప్రజల మాటల్లో ప్రజల బ్రతుకును పాడినప్పుడే ప్రచారం పొందుతుందని భావిస్తున్నాడు. నేటి కవిత ప్రజల వెంట నడుస్తున్నది కాని ప్రజలను తన వెంట నడిపించలేకపోతున్నది. ప్రజల కౌగిలి కోసం నగ్ననృత్యానికైనా సిద్ధమంటున్నది నేటి వచన కవిత. నవ్వించే తనకన్నుల్లోని కన్నీరును చూడమంటున్నది!

ఆధునికాంధ్రనాటకరంగం పాశ్చాత్యప్రభావంతో ప్రక్రియాబాహుళ్యాన్ని సాధించినా ప్రజాదరాన్ని పొందవలసినంత పొందటం లేదని విమర్శకులు భావిస్తున్నారు. సామాన్య ప్రజానీకానికి పౌరాణికాలు రుచించినంతగా సాంఘికాలు రక్తి నివ్వటం లేదనీ, చదువుకున్న వారిని ఆధునికనాటక ప్రయోగాలు ఆకర్షిస్తున్నాయనీ, చలనచిత్రరంగం, రేడియో టెలివిజన్ సాధనాలూ నాటక వికాసానికి కొంత అవరోధాన్ని కల్పించాయనీ, థియేటర్ ఉద్యమం ముమ్మరంగా దేశంలో సాగితే నూతన నాటక ప్రయోగాలు ప్రజాదరం

పొందవచ్చునని అభిజ్ఞులు తలపోస్తున్నారు. "తెలుగు నాటి నాటకరచన అభివృద్ధి చెందినంతగా రంగస్థలం అభివృద్ధి చెందనందువల్ల ఒక వ్యవస్థీకృత పద్ధతిలో నవీన తెలుగునాటకం నడువలేదు. ఐతే సాహిత్యంలోని ఇతర ప్రక్రియల ప్రభావం, మొత్తంగా సాహిత్య ప్రభావం, సమాజ ప్రభావం నాటక రచయితలమీద పడటం అనివార్యం కనుక నూతన విషయాలను వస్తువులుగా స్వీకరించి, తెలుగు నాటక రచనను సాంఘిక అవసరాలకు అనుగుణంగా తీర్చి దిద్దడంలో ఆధునిక రచయితలు పెక్కు మంది కృషిచేశారు" అని వివేచిస్తున్న డా॥ పి. వి. రమణ సమీక్ష అహాజసకంగా ఉంది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, కౌటుంబిక విషయాలను తీర్చిదిద్దే సాంఘిక నాటకాలతో పాటు, జాతిజీవితాన్ని చిత్రించే చారిత్రకనాటకాలనూ, ధార్మిక చైతన్యాన్ని ప్రబోధించే పౌరాణికాలనూ వెరసి నాటకరంగాన్ని ప్రజలు సమాదరించటంలో సమాజం జీవిత సమగ్ర దర్శనాన్ని కోరుతున్న దన్న సత్యం పరోక్షంగా మనకు ద్యోతమానమౌతున్నది.

వ్యావహారిక భాష నేడు సర్వ సాహిత్య ప్రక్రియల్లోనూ సార్థకంగా ప్రయోగింపబడుతున్నది. అయితే కొందరికి సాహిత్య భాష వేరు, వ్యావహారిక భాష వేరు అనే అభిప్రాయం ఉంది. ఆరెంటికీ కొద్దిపాటి భేదం తప్పకుండా ఉంటుందని భాషా శాస్త్రజ్ఞు లంగీకరిస్తారు. కాని, ఆరెండూ రెండు వ్యవస్థలు కావని పేర్కొంటారు. డా॥ బూదిరాజు రాధాకృష్ణగారి వివేచనం చూడండి.

"1. 'సాహిత్యభాష' అనే శబ్దానికి సరైన పర్యాయపదం 'కావ్యభాష'. 'వ్యవహారభాష' అనగానే మాట్లాడినట్టే వ్రాసిందనీ రాసినట్లే మాట్లాడేదనీ చాలమంది భ్రమిస్తున్నారు. అది నిజంకాదు. చదువుకొన్న వాళ్ల సభాస్థలంలో మాట్లాడుతూ మహారచనలను వ్యాఖ్యానిస్తూ వాడే భాష వ్యవహారభాష.

2. సాహిత్యభాషకూ వ్యవహారభాషకూ కొద్దిపాటిభేదం సహజంగా ఉంటుంది. నిత్యవ్యవహారాలలో వాడే ఆధునిక భాషలో శబ్దసంపద తక్కువగా ఉంటుంది. సాహిత్యగౌరవం పొందిన ఆధునికవ్యవహారంలో శబ్దవైవిధ్యం, వైచిత్రి ఎక్కువ. విషయవస్తు వైవిధ్యమే ఇందుకు ప్రధానకారణం. అలాగే సాహితీవ్యవహారంలో ప్రాచీనరూపాలు ఎక్కువగా దొర్లటానికి సంప్రదాయబలం కారణం. దైనందిన వ్యవహారాలలో కన్నా సాహితీవ్యవహారంలో దీర్ఘ సమాసాలూ,సుదీర్ఘ

వాక్యాలూ డొంకతిరుగుడు మాటలూ నిక్కుతున్న. సాహిత్యకారుల మనస్సు భాషా పారిశుద్ధ్యతాభావం వ్యవహారంలో ఉండదు- సాధ్యమూ కాదు.

3. గ్రామ్యంగా, (శిష్ట) వ్యావహారికంగా ఒకప్పుడు వ్యవహృతమైన ఆధునిక భాషే ఇప్పుడు వ్యవహారభాషగా, ఆధునిక సాహిత్యభాషగా చెలామణి అవుతున్నది."

ఆధునిక సాహిత్య లక్షణం వ్యావహారిక భాషా ప్రయోగం. భావ భావాభివ్యక్తినీ, రసానుభూతినీ కలిగించినంతవరకూ భాషాభిషక్తుల భాషా భేషజంతో సహృదయలోకానికి పనిఉండదు. అనుభూతి నందించని భాష ఆదరపాత్రంకాదు. సాహిత్యానికి భాష ముడి సరుకు; ఉక్తి శక్తి!

ప్రపంచ భాషా సాహిత్యాలతో సన్నిహిత సంబంధం కలిగి ఉండటం ఆధునిక యుగలక్షణం. కాగా, భారతీయ భాషల సంగతి వేరేచెప్పవని లేదు. తెలుగులో భారతీయ భాషల్లో నుంచీ, పాశ్చాత్య భాషల్లో నుంచీ అనువాదాలు రావటం ఎంత హర్షింపదగిన అంశమో, తెలుగులో నుంచి ఆయా భాషల్లోకి అనువాదాలు పోవటం కూడా అంత అభిలషింపదగిన అంశం. మొదటి రకం కంటె తెలుగులో రెండవరకం వెనకబడి ఉండటం శోచనీయం. డా॥ ఇలపావులూరి పాండురంగారావు గారీ అంశంమీద సమగ్రమైన వ్యాసాన్ని సమర్పించటంతో పాటు పురోభివృద్ధికి మంచి సూచనలు కూడా చేశారు. అవి అన్నీ ఒకయెత్తు వారు ఉపన్యాసంలో పేర్కొన్న మరో అంశం ఒక్కటీ మరోయెత్తు. తెలుగులో నుండి హిందీ మొదలైన భాషల్లోకీ, హిందీలో నుంచి తెలుగులోకీ అనువాదాలు చేస్తున్నది తెలుగు విద్వాంసులే. ఇది హర్షింపదగిన అంశమైనా ఈ ఆదానప్రదానాల కార్యక్రమం-ఆంధ్రేతరులైన రచయితలే ముందుకు వచ్చి నిర్వహించిననాడు ఎంతో విజయవంత మౌతుందని వారు సూచించారు. ఇది చాల నిర్మాణాత్మకమైన సూచన. తెలుగు ఆయా భాషల పండితుల అభిరుచి కెక్కాలి. వారే కార్యక్రమం చేపట్టాలి. అంటే దాని వెనుక ఎంతో కృషి బహుముఖంగా సాగాలి. దేశభాషల్లో కల్లా తియ్యనైన మన భాష విదేశీయులను మురిపించినంతగా దేశీయులను ఆకర్షించ లేక పోతున్నదా? ప్రపంచ మహాసభలను చేసుకొంటున్న మనం పరిశీలింపవలసిన అంశాల్లో ఇది లేదా?

# 5

గతాన్నీ వర్తమానాన్నీ విశ్లేషించి, సమన్వయించి పరమార్థాన్ని పట్టియిచ్చేది పరిశోధన; భవిష్యద్దర్శనాన్ని ప్రసాదించేది విమర్శ. పరిశోధనలోని సత్యాన్వేషణం వాస్తవజ్ఞానానికి ఉన్మేషణం; పరిశోధన చెప్పే పరమార్థం విమర్శ కొరక ఉద్దీపనం. పరిశోధన ప్రవృత్తి అన్వేషణం; విమర్శన ప్రవృత్తి అనుశీలనం. పరిశోధన స్వభావం శాస్త్రీయం; విమర్శ స్వభావ మెంత శాస్త్రీయమో అంత కళామయం. శాస్త్రంగా విమర్శ అనుశాసిస్తుంది; కళగా అనుశీలిస్తుంది. ఏ సాహిత్యంలోనైనా పరిశోధన విమర్శకు పూర్వార్ధం. పూర్వార్ధం ఉత్తరార్ధంలో ఉన్మీలించినప్పుడు సమగ్రమైన సాహిత్య విమర్శ అవుతుంది ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారన్నట్లు "పరిశోధనయొక్క పరమార్థం-నిశిత పరిశీలన ద్వారా క్రొత్త విషయాన్ని చెప్పడంగాని, ఉన్న విషయాన్ని నవ్యదృక్పథంతో పరిశీలించి విషయ వివరణచేయడం గాని-అని చెప్పాలి ఈ ఘట్టంలోనే పరిశోధనకు విమర్శకు సన్నిహితత్వం ఏర్పడుతుంది. ఈ రెండూ పరస్పర పోషకాలుగా నిలుస్తాయి. స్వతంత్రంగా కూడా మనుగడ సాగిస్తాయి. సాహిత్య విమర్శలో, పరిశోధనలోకంటె ఆత్మాశ్రయ లక్షణం కొంత అధికంగా ఉంటుంది. ఇందు వల్లనే విమర్శ కళగాకూడా చెలామణీ కాగలదు. పరిశోధనలో శాస్త్రలక్షణమైన తాటస్థ్యం అధికంగా ఉంటుంది. దీనిలో పరిశోధకుడి బుద్ధికున్నంత ప్రవేశం హృదయానికుండదు. ఈ రెండింటినీ జోడించి వ్రాసినవాళ్ళు లేకపోలేదు. అన్ని మంచి వస్తువులలాగే వీళ్ళ సంఖ్య తక్కువ". (పుట 57)

కడచిన ఇరవైయేళ్ళలో సాహిత్య విమర్శలో పరిశోధనకు ప్రాచుర్యం వచ్చింది దానికి విశ్వవిద్యాలయాలు పరిశోధన పట్టాలకొరకు అవకాశాలు కల్పించడమే కారణం. ఈ పరిశోధన విధానాలను తత్ఫలితాలనూ సమీక్షిస్తూ "మన పరిశోధనలు ఇంచుమించుగా, సర్వేక్షణలుగా ఉంటున్నాయి. ఇందువల్ల నిశితంగా విషయాన్ని పరిశీలించటానికి అవకాశం లేక, పుస్తకాన్ని ఐతిహాసిక దృష్టితో కాలానుసారం వ్రాసుకొని పోతున్నారు. ఇది ఉత్తమ పరిశోధన అనిపించుకోదు'' (పుట 56) అని ఆచార్య వీరభద్రరావుగారు భావిస్తున్నారు. అలాగే విమర్శక్షేత్రంలో కూడా "తెలుగున నిర్మాణాత్మకమైన విమర్శవికాసము పొంపవలసిన అక్కఱ యెంతైన గలదు" (పుట 46)అని ఆచార్య అవధానిగారంటున్నారు.

ఈ అంశంలో మరికొన్ని విశేషాలు గమనింపవలసి ఉంది. తెలుగులో ప్రాచీనసాహిత్య విమర్శ ఎలాఉన్నా వీరేశలింగంపంతులుగారి యుగంనుండీదాని పరిణామాన్ని పరిశీలిస్తే కొన్ని సత్యాలు తెలుస్తాయి. సాహిత్య విమర్శకు ముందు సాహిత్య చరిత్ర నిర్మాణం, కవుల చరిత్రలూ, గ్రంథపరిష్కారం, ఉచిత పాఠ నిర్ణయం. విలువైన గ్రంథపీఠికలూ కావలసి వచ్చాయి. అముద్రిత గ్రంథాలను సేకరించటం పరిష్కరించటం, వ్యాఖ్యానాలు వ్రాయటం, ప్రచురించటం, తదను బంధంగా నిఘంటువులను నిర్మించటం, మొదలైన అవసరాలు తలయెత్తాయి. అందువల్ల ఆధునికసాహిత్య విమర్శలో గ్రంథ పరిష్కరణానికీ, చరిత్ర నిర్మాణానికీ ప్రాధాన్యం వచ్చింది. వీటిలో గ్రంథపరిష్కరణ విమర్శను పరిశోధనగా గణించారు; దానికి అనుబంధంగా క్రొత్తగ్రంథాన్ని లోకానికి పరిచయం చేయటం కూడా పరిశోధనాంశంగా పరిగణించారు. నేటికీ తెలుగులో ఈ అంశం పరిశోధనయే. సంశోధితగ్రంథనిర్మాణం పరిశోధన మని అప్పుడూ ఇప్పుడూకూడా ఏకగ్రీవంగా ఎన్నిక చేస్తున్నారు.

ఆంధ్ర సాహిత్య చరిత్ర నిర్మాణోద్యమంలో కవుల చరిత్రలను సేకరించటం, కాలనిర్ణయం గ్రంథపూర్వాపర నిర్ణయం చేయటం, సుశబ్దాపశబ్దాల చర్చ చేయటం, సాహిత్య శాస్త్రమర్యాదలను అన్వయించి కావ్యగౌరవాలను నిర్దేశించటం మొదలైనవి పరిశోధనగా కాక విమర్శాంగాలుగా పరిగణించటం జరిగింది. ఈ విమర్శ విధానాల్లో శాస్త్రీయ విమర్శకూ, చారిత్రక దృక్పథంతో చేసే సమీక్షకూ, తులనాత్మక వివేచనకూ ప్రాముఖ్యం కలిగింది. అందులోనూ చారిత్రాత్మక సమీక్షకు విమర్శలో విస్తృత ప్రచారం లభించింది. నేటికీ ఆ పద్ధతి ఈ ప్రక్రియను స్వాయత్తం చేసుకొని ఉన్నది.

ఈ రెండు ప్రక్రియలూ విశ్లేషణ ప్రధానాలుగా జీవించటంచేత పరిశోధనలోకాని, విమర్శలో కానీ సృజనాత్మకత చైతన్యం స్తంభించి పోయింది. పరిశోధనలో పరిశీలన ప్రమాణాలూ, పద్ధతులూ నియతాలు కావటం, విమర్శలో అవి సాపేక్షాలు కావటం సహజం. ఈ రెండింటికి సృజనాత్మకత తోడైనప్పుడే శక్తిమంతంగా పరిణతిని సాధిస్తాయి. పరిశోధనలో గిడుగు రామమూర్తి పంతులుగారూ, కొమర్రాజు లక్ష్మణ రావుగారూ, సాహిత్య విమర్శలో కట్టమంచి రామలింగారెడ్డి గారూ సృజనాత్మక చైతన్యాన్ని మొదటిసారి తెలుగులో ప్రవేశ

పెట్టారు. ఆయా ప్రక్రియలకు సత్యదృక్పథాన్నీ, నూత్నదృక్పథాన్నీ కలిగించి భవిష్యద్దర్శనం ప్రసాదించారు. దానితో పరిశోధన క్రొత్తపుంతలు త్రొక్కింది; సాహిత్య విమర్శ సాహసంతో సహస్రబాహువులను చాచింది. పరిశోధనలో విశ్లిష్టాంశ సమన్వయంతోపాటు నూత్న సిద్ధాంత ప్రతిపాదన మపసరపన్న స్పృహ ఏర్పడింది; సాహిత్య విమర్శలో వివేచనతోపాటు తత్త్వపరిశీలనం ముఖ్యమన్న దృక్పథ మేర్పడింది. మొదటిసారిగా సాపేక్షప్రమాణాలను సాహిత్యానికి ఎలా అన్వయించాలో చూపినవారు కట్టమంచివారు. ప్రాచ్యపాశ్చాత్యసాహిత్య ప్రమాణాలను విమర్శలో వినియోగించుకొనే వివేకం కూడా వారే నేర్పారు. ప్రయోగంలో వారుకూడా కొన్నిలోపాలు చేసినమాట సత్యమైనా భవిష్యత్తుకు ఒకమార్గం చూపినవారు వారే ! అందువల్లనే ఆధునిక సాహిత్య విమర్శకు ఆచార్యులన్న గౌరవం వారికి వచ్చింది.

కట్టమంచివారి తరువాత వెలసిన సాహిత్య విమర్శలో తీర్పుచెప్పే తీరు రింటె; కావ్యంలోని నేర్పును చెప్పి కవితా తత్త్వాన్ని ప్రపంచించే విధానం ప్రాచుర్యానికి వచ్చింది. ఇది నిజానికి సాహిత్యవిమర్శ స్వభావమైనా విశ్వవిద్యాలయాలు దీన్ని పరిశోధనగా కూడా గుర్తించటం గమనింపవగిన అంశం. అందువల్ల తెలుగులో పరిశోధనలేవి? విమర్శలేవి? అన్న సందేహం తలయెత్తింది. ఈ మిశ్రప్రయోగాన్ని అనుసరిస్తున్నప్పుడు వింగడింపు కష్టసాధ్యమే. అయినా, ఆకరాలను సేకరించటం, చారిత్రకంగా అమర్చటం, పరిణామాలను గుర్తించటం, ప్రత్యేకతలను ఏకరువు పెట్టటం పరిశోధనాంశాలుగా, సాపేక్ష ప్రమాణాలతోకావ్య చర్చను సాగించటం విమర్శగా చెలామణి అవుతున్నవి. అయితే నూత్న సిద్ధాంత ప్రతిపాదనం సాధించిన సిద్ధాంత వ్యాసాలు ఈ వరుసలో ఉత్తమాలుగా పరిగణింపబడుతున్నవి. పరిశోధకులందరూ ఈస్థాయి నందుకోలేకపోవటం చేత విశ్లిష్టాంశ వివేచనమో, లేక సమన్వయమో చేసినా పరిశోధన గ్రంథాలుగా లెక్కింపటం జరుగుతోంది నేడు. అందువల్ల చారిత్రక పరిణామగతిని పరిశీలించటం, కొన్ని వాస్తవాల, అభిప్రాయాల క్రోడీకరణం, నేటి సిద్ధాంతవ్యాసాల సామాన్య లక్షణాలై పోయాయి. దీనికి కారణం ఆర్థిక, సామాజిక, మనోవైజ్ఞానిక, తాత్త్విక, అధ్యాత్మికాది శాఖలలో వెలువడిన వెలువడుతున్న ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంతాల అవగాహనంతో సాహిత్యాన్ని పరిశీలించటం పరిశోధకులలో, విమర్శకులలో లోపించటమని భావించటానికి వీలున్నది. విమర్శకుల్లో చాలామందికి

ఇటువంటి సమగ్రవ్యక్తిత్వం లేకపోవటంచేత ఆధునిక సాహిత్య విమర్శ చారిత్రక సమీక్షగా రూపొందుతున్నది.

అట్లని పరిశోధనమంతా పలచబారిందనీ ఉత్తమపరిశోధన జరగలేదనీ కాదు. ప్రమాణాల గుర్తింపు క్రమంగా తగ్గిపోతున్నదని విచారించటం మాత్రమే. తెలుగులో భాషారంగంలో పరిశోధనా, సాహిత్యరంగంలో విమర్శా ముందు నడుస్తున్నవి.

విమర్శ సాహిత్యంవెంట నడవాలనా? దానికి మార్గదర్శకం కావాలనా? అన్నది ఆధునిక సమస్య. తెలుగు సాహిత్య రంగంలో అనేక ప్రక్రియలలో చారిత్రకంగా సాగిన వికాసం, వాటి సిద్ధాంతాల అవగాహనం ఇంకా సమగ్రంగా సాధింపబడక పోవటం చేత విమర్శ ఈనాడు సాహిత్యం వెంటనే నడుస్తోంది. అయితే, ఇదే పరమార్థమని కూర్చుంటే తెలుగు సాహిత్యంలో స్వతంత్రప్రతిపత్తి గలిగిన ప్రక్రియల ఆవిర్భావం కలగటం కష్టం. మనం అన్నిటికీ పడమరకో, ఉత్తరానికో, దక్షిణానికో పరుగెత్త వలసి వస్తుంది. అందువల్ల తెలుగు సాహిత్యవిమర్శ గతాన్నీ, వర్తమానాన్నీ సమీక్షించటమే కాకుండా భవిష్యద్దర్శనాన్ని చేసి భావితరాలను నిర్మింపవలసిన అవసరముంది. దీన్ని సాహితీ వేత్తలు గుర్తించాలి. సృజనాత్మకతకు విమర్శ మూలంకావటం ఉత్తమలక్షణం! విమర్శ సాహిత్యాన్ని అనుశీలించటం, మధ్యమలక్షణం! ఉన్నసాహిత్యాన్ని ఓపినంత సమీక్షించటం సామాన్య లక్షణం! సమీక్షయే నేటి సాహిత్య విమర్శ సాధారణ లక్షణమంటే సత్యదూరం కాదేమో!

## 6

ఈ పరిస్థితుల్లో ఇరవై యేళ్లుగా తెలుగుకు సాహిత్య అకాడమీ చేస్తున్న కృషిని సమీక్షించటం చివరకు మిగిలిన అంశం! దీన్ని ప్రత్యక్ష కృషి, పరోక్ష కృషి అని రెండు విధాలుగా విభజించవచ్చు.

**ప్రత్యక్ష సాహిత్య కృషి :**

1. సమగ్రాంధ్ర నిఘంటు నిర్మాణోద్దేశ్యంతో పద ప్రయోగ సూచికలను మాండలిక వృత్తి పదకోశాలను, శాసన పదకోశాలను, ఆధునిక తెలుగు నిఘంటువులనూ, ధాతు నిఘంటువులనూ, సూక్తిసుధాకరాలనూ, ప్రాస నిఘం

టువులనూ, సూర్యరాయాంధ్ర నిఘంటువునూ, ద్విభాషా-త్రిభాషా నిఘంటువులనూ, తెలుగు జాతీయకోశాలనూ, ప్రచురించటం,

2. ప్రసిద్ధ కావ్యాలను విలువైన పీఠికలతో ప్రచురించి సరసమైన ధరలకు అందజేయటం,

3. జీవిత చరిత్రలూ, జానపద విజ్ఞానగ్రంథాలూ, సంస్మరణ సంచికలూ, భాషా శాస్త్ర గ్రంథాలూ, పదబంధ పారిజాతాలూ, పరిష్కృతాంధ్ర మహాభాగవతము, ఛందోఽలంకార, వ్యాకరణ గ్రంథాలూ, సాహిత్య వ్యాసోపన్యాస సంపుటులూ, కథాసంపుటులూ మొదలైనవి ప్రచురించటం.

4. సంస్కృతం, హిందీ, ఉరుదూ, ఇంగ్లీషు భాషల్లో గ్రంథాలను ప్రచురించి, ఆదాన ప్రదాన కార్యక్రమానికి తోడుపడటం.

5. ప్రతి సంవత్సరం రెండంశాల మీద పోటీ గ్రంథ రచనల నాహ్వానించి బహుమతు లందజేయటం.

## పరోక్ష సాహిత్య కృషి :-

1. ఆధునిక సాహిత్య ప్రక్రియలైన కవిత్వం, నవల, కథానిక, నాటకాలు నాటికలు, సాహిత్యవిమర్శ మొదలైనవాటిలో ప్రతి సంవత్సరం ఉత్తమ గ్రంథాలను వేయినూటపదహార్లు బహుమతులుగా ఇవ్వటం.
2. మహిళా విభాగంద్వారా స్త్రీలలో సాహిత్యచైతన్యాన్ని వికసింప చేయటానికి వివిధ కార్యక్రమాలను నిర్వహించి, ఉత్తమ రచయిత్రులకు బహుమతు లివ్వటం.
3. ప్రసిద్ధ సాహితీవ్యక్తులను గూర్చి ఉపన్యాసాలు ఏర్పాటుచేయటం.
4. రచయితల గ్రంథప్రచురణకు ఆర్థిక సహాయం చేయటం.
5. సాహిత్యసంస్థలకు ప్రచురణలకొరకు ఆర్థిక సహాయం చేయటం.
6. బాలసాహిత్య గ్రంథాలకు ప్రతి సంవత్సరం బహుమతు లివ్వటం
7. వివిధ శాస్త్రాలలో పండితులైన సంస్కృత విద్వాంసులను సన్మానించటం.
8. విశిష్ట సభ్యులను గౌరవించటం.
9. సాహిత్య సభలూ, సదస్సులూ నిర్వహించటం

10. స్మారకనిధుల నేర్పాటుచేసి ఏటేటా విద్వాంసులను గౌరవించటం.

సాహిత్య అకాడమీ గ్రంథప్రచురణ కార్యక్రమంలో పద ప్రయోగ కోశాలను, నిఘంటువులను, శాస్త్ర గ్రంథాలనూ, ప్రాచీన కావ్యాలనూ ప్రచురించటం ద్వారా పరిశోధన రంగానికీ, విమర్శ గ్రంథాలను ప్రచురించటం, వాటికి బహుమతు లివ్వటంద్వారా సాహిత్య విమర్శనకూ, వార్షిక బహుమతులద్వారా, సంకలనాల సంపుటలను ప్రచురించడంద్వారా ఆధునిక సాహిత్య ప్రక్రియల వికాసానికీ తోడ్పడు తున్నదని స్పష్టమౌతున్నది. అన్యభాషల్లోని తెలుగు గ్రంథాల ననువదించటంద్వారా ఆదాన ప్రదాన కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నది. పరిశోధన సంఘాన్ని, ఆధునిక సాహిత్య సంఘాన్నీ, ఏర్పాటుచేసి విజ్ఞుల సలహాలను తీసికొంటున్నది. ఆర్థికస్థితిగతు లున్నంతవరకూ చేయగలిగిన సాహిత్యసేవ చేస్తున్నది. భారతదేశంలో ప్రాంతీయ భాషల కేర్పడిన అకాడమీ లన్నిట్లోనూ గణనీయమైన సేవచేసిందని ప్రశస్తి వహించింది. వీటి విలువకు అంచనాకట్టే బాధ్యత ఆంధ్రులకే వదలుతున్నాను.

ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలమీద సాహిత్య సదస్సును నిర్వహించటానికి అంగీకరించిన అకాడమీ కార్యవర్గ సంఘానికీ, సదస్సుకు అధ్యక్షత వహించిన మాన్యులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికీ, సదస్సు రూపకల్పనంలో అండదండగా నిలిచిన పూజ్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికీ, సదస్సులో పాల్గొని విలువైన వ్యాసాలను సమర్పించిన విద్వన్మణులందరికీ, నిర్వహణంలో తోడ్పడిన మిత్రులకు, నాకీ గ్రంథసంపాదకత్వ గౌరవాన్ని కల్పించిన అకాడమీవారికీ, పేరు సూచించిన మిత్రులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికీ, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఇటువంటి గ్రంథాల కిది మొదలూకాదు! చివరాకాదు! ఇటువంటివి ప్రతి సంవత్సరం వెలువడి సమకాలీన సాహిత్య ప్రగతిని సమీక్షించుకోవలసిన అవసరం ఉన్నదని ఈ గ్రంథం తెలియచెప్పితే ఈ 'సమాలోచనం' సార్థకం!

హైదరాబాదు
7–12–1979

జి. వి. సుబ్రహ్మణ్యం

# వి ష య సూ చి క

—o—

# నేటి సాహిత్యం : సామాజిక స్పృహ

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

సమాజానికీ సాహిత్యానికీ గల ఆధార – ఆధేయ సంబంధం ఎప్పుడూ ఉన్నదే. కాని సాహిత్యంలో 'సామాజికస్పృహ' కోసం అన్వేషణ యిప్పుడే విమర్శలో ప్రాధాన్యం వహిస్తున్నది, 'సామాజిక స్పృహ' అంటే ఏమిటి ? సాహిత్యంలో దాన్ని గుర్తించేపద్ధతి ఏమిటి? రచయిత రచనకు ఉద్యమించేటప్పుడు అతణ్ణి ఈ 'సామాజిక స్పృహ' ఎంతవరకు, ఎలా ప్రభావితుణ్ణి చేస్తుంది ? ఈ ప్రశ్నలకు సమాధానం అన్వేషించే బాధ్యత సాహిత్యంలో అభినివేశం చూపుతున్న వాళ్ళందరిమీదా ఉన్నది. దాన్ని కేవలం రాజకీయ వాదులకు వదిలి పెట్టడానికి వీల్లేదు. ఈ నాడు ఒక నినాదంగా ప్రచారంలో ఉన్న 'సామాజిక స్పృహ' నిజస్వరూపమేమిటి ? జిజ్ఞాస, విచారణ ప్రధానం యిక్కడ. ఈ శతాబ్దిలో మార్క్సిజమ్ ప్రపంచ చారిత్రక పరిణామంలో కీలకమైన పాత్ర వహించడం, అన్నిరంగాలలోనూ మార్క్సు దర్శన ప్రభావం కనిపిస్తూఉండడం అందరెరిగినదే. 'సామాజిక స్పృహ' మార్క్సు దర్శనం ఆధారంగా వామ పక్ష రాజకీయ వాదులు 'అభ్యుదయ' సాహిత్యోద్యమ సందర్భంగా సాహిత్య రంగంలో ప్రవేశపెట్టిన ప్రత్యయం (concept). దాన్ని చాలామంది రచయితలు యథాతథంగా స్వీకరించి, విచక్షణారహితంగా ఉపయోగిస్తున్నారు. 'సామాజిక స్పృహ' ను గూర్చి ఒక రాజకీయ వాదికీ (అందులోనూ భిన్నపక్షాల వారు ఉంటారు) ఒక సాహిత్యవేత్తకూ వేర్వేరు అభిప్రాయాలు ఉండక తప్పదు! "రాజకీయాలే సమాజం ఊపిరి, కాబట్టి రాజకీయ వేత్తల అర్థాన్నే అవగాహననే మిగిలిన వాళ్ళందరూ స్వీకరించి శిరసా వహించాలి" అంటూ ఒక రాజకీయ పక్షం, అధికారరీత్యా శాసించే పరిస్థితులు ఏర్పడితే, అప్పుడీ జిజ్ఞాసా, చర్చా అవసరం అవుతవి. అంటే, రచయితలు స్వతంత్ర ప్రతిపత్తి గల మేధావి వర్గంగా గుర్తింపబడక, రాజకీయవాదులకు అనుయాయులుగానే పరిగణింపబడే వ్యవస్థలో 'సామాజిక స్పృహ'కూ సాహిత్యంలో దాని అభివ్యక్తికీ, నిర్ణేతలూ

అధికారులూ, రాజకీయ వాదులే అవుతారు; అప్పుడు సాహిత్యం రాజకీయాల్లో అంతర్భాగం అవుతుంది.

'సామాజిక స్పృహ' ను గురించి మార్క్సిస్ట్ రాజకీయవాది దృక్పథం ఎలా ఉంటుందో గ్రహించడానికి యిక్కడ రష్యాలో 1966 లో 'కొందరు రచయితల' పేర వెలువరించిన వ్యాస సంపుటి: 'మనిషీ—సమాజమూ' నుంచి ఉద్ధరింపబడిన ముఖ్యాంశాలను వివరిస్తాను. రష్యాలో 1966 లో వ్యక్తమైన ఈ ఆధికారిక దృక్పథానికీ నేడిక్కడ ప్రచారంలో ఉన్న 'సామాజిక స్పృహ' ను గూర్చిన అవగాహనకూ పెద్ద భేదం లేదు. ఆ ముఖ్యాంశాలివి: "(i) అధికారంలో ఉన్నపార్టీ సోషలిస్టు వ్యవస్థలో, మార్క్స్—లెనిన్ దర్శనాన్ననుసరించి, మేధావుల కృషిని పెంపొందింపజేస్తుంది. సామాజిక స్పృహతాలూకు సూత్రాలతో రూపొందించిన ఒక నిర్దిష్టమైన పథకం ప్రకారం పార్టీ నిర్ణయాలూ కలాపాలూ ఉంటవి. సైన్సూ, కళలూ సంస్కృతీ వీటి పరిణామాన్ని పార్టీ నియంత్రిస్తుంది. (ii) సైన్సూ, కళారంగాల్లో మేధావులకు కమ్యూనిస్టుపార్టీ స్వాతంత్ర్యంలేకుండా చేస్తున్నదనేవిమర్శ బూర్జువా లేక రివిజనిస్ట్ విమర్శ. స్వేచ్ఛతోకూడిన సృజనాత్మకతకూ, పార్టీకి కమ్యూనిజానికీ విధేయంగా ఉండటానికీ మధ్య ఎలాంటి వైరుధ్యమూ లేదు. (iii) సోషలిస్టు వ్యవస్థలో నిజమైన సైంటిస్టూ, కళాకారుడూ బుద్ధిపూర్వకంగా తన కృషిని కమ్యూనిస్ట్ ఉద్యమానికి ఉపయుక్తంగా ఉండేటట్లు చూస్తాడు. కమ్యూనిజం అంటే దానికై కృషిచేయ్యడమంటే, అది వ్యక్తిస్వేచ్ఛకు పరాకాష్ఠ. అదే స్వేచ్ఛాయుత జీవిత పరమార్థం. కమ్యూనిజమే స్వేచ్ఛయొక్క ఉత్కృష్ట స్వరూపం. (iv) వర్గవిభేదాలు పోవడంతో వ్యక్తుల్లోని వైవిధ్యం స్వేచ్ఛాయుతంగా మానవునిలో సామాజిక సత్తాను సంపన్నంచేస్తుంది. (v) చరిత్రలో యింతదాకా విశిష్ట వ్యక్తులు కొందరే. కమ్యూనిజం ద్వారా ప్రతివ్యక్తీ విశిష్ట వ్యక్తిగా రాణిస్తాడు." [1]

ఇది రాజకీయవాది దృక్పథం. ఇందులో ప్రకృతాన్నీ భవిష్యద్దశనాన్నీ కలగాపులగం చెయ్యడం కనిపిస్తుంది. రచయిత స్వేచ్ఛకూ పార్టీ ఆదేశాలకూ ఎప్పుడూ వైరుధ్యంలేదని సిద్ధాంతం. కమ్యూనిస్ట్ వ్యవస్థ పరిపూర్ణ స్వరూపాన్ని పొందినప్పుడు ఉండకపోవచ్చునని అంగీకరించినా, యిప్పుడు లేకపోలేదుగదా!

'పార్టీకి - కమ్యూనిజానికి' విధేయత అంటూ రెండింటినీ ఏకంచేసి వ్యవహరించ డంలోనే ప్రకృతాన్నీ - భవిష్యత్తునీ, వాస్తవాన్నీ - స్వప్నాన్నీ ఏకంచేసి మభ్యపెట్టడం కనిపిస్తుంది తర్వాత చివరి (iv), (v) అంశాల్లో రాబోయే వ్యక్తి స్వేచ్ఛా స్వర్గాన్ని కరతలామలకంగా చూపించడమే ఉన్నదిగాని, ఈ నాటి వాస్తవాన్ని గురించి విశ్లేషించి, రచయిత స్వతంత్రప్రతిపత్తిని గూర్చి మార్క్సుదర్శనరీత్యా వివరించే ప్రయత్నం లేదు. అంటే మార్క్సు దర్శనాన్ని సాధికారంగా వ్యాఖ్యానిస్తూ, 'సామాజిక స్పృహ' స్వరూపాన్ని నిర్ణయించడానికీ సాహిత్యాన్ని ఆ దృష్టితో విమర్శించడానికీ ఒక్క రాజకీయ వాదికి తప్ప మరో మేధావికి అవకాశమే లేదనేది స్పష్టం. ! సాహిత్యంలో 'సామాజిక స్పృహ' ను గూర్చిన నిర్ధారణ, పార్టీ కార్యక్రమంతో ముడివడిన తాత్కాలిక నిర్ధారణే తప్ప రచయిత సామాజికుడుగా (Social being) తన అనుభూతినుంచీ ఆలోచన నుంచీ చేసే నిర్ధారణ కాదన్నమాట!

రచయిత తనబుర్ర నిలా తాకట్టు పెట్టడానికి అంగీకరించినా, సాహిత్య సృష్టిలో, సాహిత్యతత్త్వాన్నిబట్టి ఎదురయ్యే చిక్కులు ఉన్నాయి. రచయిత అనుభూతి (సాహిత్యంలో రూపం ధరించే సారవంతమైన అనుభూతి) అతని హృదయంనుంచీ, నరాలనుంచీ, సంస్కారంనుంచీ వస్తుందిగానీ, చిలుక పలుకుల్లా నేర్చుకుని ముక్కున పెట్టుకున్న అభిప్రాయాలనుంచి రాదు. "గ్రంథకర్త నిజంగా ఏమి చెబుతున్నాడో దానికీ, ఏమిచెబుతున్నానని అనుకుంటున్నాడో దానికీ తేడా వుంటుంది. ఈ తేడాని రచయిత గుర్తించాలి" అంటాడు మార్క్సు.[2] రాజకీయ గురువు అందించిన 'సామాజిక స్పృహ' తో వ్రాసినదే అయినా ఒకకృతి (నవల, నాటకం, వగైరా) రచయిత కలంనుంచి వెలువడిన తర్వాత అది సంతరించుకునే అర్థం, సాధించే ప్రయోజనం, రాజకీయవాది ఆశించినదిగా ఉండక పోవచ్చు. (మిల్టన్ బుద్ధిపూర్వకంగా సేటన్‌ని దైవవిరోధిగా విలన్‌గా చిత్రించ బూనుకొని, ఫలితార్థంలో ఆపాత్రని విప్లవకారునిగా, స్వేచ్ఛాప్రియునిగా, కథానాయకునిగా తయారుచేసినట్లు జరుగవచ్చు). వాచ్యార్థంకంటె వ్యంగ్యార్థందే పైచేయి సృజనాత్మక సాహిత్యంలో. సాహిత్యతత్త్వం యిలా ఉన్నప్పుడు, 'సామాజికస్పృహ' అంటూ రాజకీయవాది నిర్ధారించిన లక్ష్యానికి తగినట్లుగానే వ్యంగ్యార్థాన్ని నియమించడం రచయిత పరిధిలోనూ, సామర్థ్యంలోనూ లేనివిషయం.

ఈ అవగాహన లేని రాజకీయవాది ''అసలు వ్యంగ్యార్థాంతో అస్పష్టమైనరచనలు ఎవడు ఏడవమన్నాడు? చెప్పేది స్పష్టంగా మరోఅర్థం లేకుండా చెప్పు. నీకు చేత కాకపోతే నేను అందిస్తాను, అందులో ఉండవలసిన కీలకమైన మాటాలూ, భావాలూ'' అంటాడు. అదే నినాదాం కవిత్వానికీ, మూసలో పోసిన కథలకీ, నాటకాలకీ దారితీస్తుంది. ఈనాడు ప్రజలభాషలో. అసందిగ్ధంగా, అందరికీ అర్థ మయ్యేలా 'సామాజికస్పృహ' తో వ్రాయాలి అని ఘోషించడంలోని అంత రార్థం యిదే! దానిఫలితం సృజనాత్మకతనూ, వ్యంగ్యాన్నీ నిలువునా ఖూనీ చెయ్యడం; సజీవమైనరచనని సహించలేకపోవడం; తెలుగుసాహిత్యం యిటీవలి కాలంలో అనుభవించిన దుర్దశ యిదే!

అయితే, రచయిత స్వేచ్ఛగా, సామాజికుడుగా తనసృజనాత్మక రచనా వ్యాసంగాన్ని సాగిస్తే అభివ్యక్తమయ్యే 'సామాజికస్పృహ' లక్షణం, దాని విన్యా సం ఎలా ఉంటుంది? రచయిత సామాజికుడుగా ఉండటాన్నుంచి తప్పించు కోవడం ఎప్పుడూ సాధ్యంకాదు; మార్క్స్ దర్శనంరీత్యా యిది సిద్ధాంతమే. సామా జికుడుకాని వ్యక్తికి అస్తిత్వమే లేదు. దీన్ని అంగీకరిస్తూనే ఒకరచయిత,'వ్యక్తి వాదాన్ని' అభివ్యక్తం చేస్తున్నాడనీ ఒక కవి 'ఆత్మాశ్రయ' కవిత్వం వ్రాస్తు న్నాడనీ, 'సామాజికస్పృహ' లేదనీ అభియోగాలు వెయ్యడానికి కారణం, ఆ సాహిత్యంలో కనిపించే 'సామాజికస్పృహ' రాజకీయవాది ఊహించే 'సామాజిక స్పృహ' కాకపోవడమూ, అది వెంటనే పార్టీప్రయోజనాలకు అంది రాక పోవ డమూ. రచన చెయ్యడంద్వారా రచయిత సామాజికుడుగానే ఒకపాత్ర నిర్వ హిస్తున్నాడు. సమాజంనుంచి పొందిన జీవితానుభూతిని రచనలో పునస్సృష్టిస్తు న్నాడు. సాహిత్యం అనుకరణకాదు, సృష్టి. అనుభూతి రచయితలో మథింప బడుతున్నంతవరకు ఆత్మాశ్రయమే. భాషలో విశిష్టమైన రూపాన్ని పొందగానే అది ప్రత్యేకమైన వస్తువుగా, సజీవశిల్పంగా అస్తిత్వం పొందుతుంది. సృజ నాత్మక రచన వస్త్వాశ్రయం కాదు, ఒక ప్రత్యేకమైనవస్తువు. సామాజికులకు అందుబాటులో ఉండేవస్తువు. ఎంతమంది కని ప్రశ్న కాదు. సమాజమే దాన్ని గూర్చి తీర్పు యిస్తుంది. రాజకీయవాదికి ఒక్కనికే ఆ అధికారం దత్తంకాలేదు. మార్క్స్ ఆలా దత్తంచెయ్యలేదు. సామాజికులమీద ఒక రచన ప్రభావం ఎంత మేర. ఎలా ఉంటుందో వెంటనే నిర్ణయించడమూ, నియంత్రించడమూ కష్టమే;

ఒక రచనశైలికు 'సామాజికస్పృహ' పఠితయొక్క సామాజిక అవగాహనను బట్టి ఉంటుంది. పఠితల్లో వ్యక్తిగతంగా వారివారి సామాజికవైయక్తిక విశిష్ట పరిస్థితినిగూర్చి స్పృహను మేల్కొల్పుతుంది సజీవమైన రచన. ఇది రాజకీయాలకు పనికివచ్చే 'స్పృహ' కావచ్చు. కాకపోవచ్చు. దీన్నిగూర్చి సార్త్రే యిలా వర్ణిస్తాడు: "ఒక్కొక్కరచయిత ఒక ప్రత్యేకమైన బాధనీ, పరతంత్రతనూ, లేమినీ, కష్టాన్నీ, వైరస్యాన్నీ ఆధారం చేసుకుని, విముక్తినీ, స్వేచ్ఛనీ, మార్గాన్నీ, సామరస్యాన్నీ ప్రతిపాదిస్తున్నాడు...ఇది తనకూ పఠితకూ యిద్దరకూ చెందిన సమాజంనుంచీ, అనుభూతిద్వారా తనస్పృహలోకి వచ్చినదే. ఏ సృజనాత్మకమైన స్పృహద్వారా తనవైరస్యాన్ని అధిగమించాడో ఆ స్పృహనే పఠితకు పంచియిచ్చి, రచయిత పురోగతికి, స్వేచ్ఛకు, విముక్తికి మార్గంచూపిస్తున్నాడు."[3] ఈ దృష్టితో రచయితయొక్క సాహిత్యవ్యాసంగాన్ని పరిశీలించినప్పుడు, కాలంలో కరుడుకట్టిపోయే చారిత్రక బంధాలనుంచీ మనిషికి విముక్తి కలిగించే చైతన్యస్ఫురణ, ప్రేరణ, స్పృహ, సృజనాత్మకరచనలో వ్యంగ్యంగా అభివ్యక్తం అయితే, దాన్ని 'సాహిత్యంలో సామాజికస్పృహ'గా గుర్తించడమౌతుంది. ఇది రాజకీయవాది ఊహకన్న, అభిప్రాయం కన్న విస్తృతమైనదీ! సున్నితమైనదీ! బహురూపసమన్వితమైనదీ! బంధవిముక్తీ, సామాజిక పురోగతీ రాజకీయచర్యద్వారానే జరుగుతవి అనేవాడు రాజకీయవాది. అతనికి రచయిత తత్త్వమూ సాహిత్యతత్త్వమూ అవగాహనకు రావు. కేవలం రాజకీయమైన విప్లవాలు మానవాళికి ఏమాత్రం విముక్తినీ, పురోగతినీ సాధిస్తున్నాయో ఈ శతాబ్ది ప్రపంచచరిత్ర పరిశీలన చేస్తే బోధపడుతుంది.

'సామాజికస్పృహ'ను నిర్ధారించే విషయంలో రాజకీయవాదికీ సాహిత్తీవేత్తకు గల దృష్టిభేదాన్ని వివరించాను. ఇప్పుడు మార్క్స రచనలనుంచీ, మార్క్స దర్శనంయొక్క తాత్త్విక భూమికల (Metaphysical bases) నుంచీ దీనికి ఉపపత్తిచూపించే ప్రయత్నం చేస్తాను. మార్క్సదర్శనానికి రాజకీయవాది ఒక్కడే వారసుడు కాడు. అది అందరికీ చెందినది! మార్క్సని కేవలం మార్క్సిస్టులకే వదలిపెట్టడానికి వీల్లేదు. సాహిత్యాన్ని గూర్చి కళలనుగూర్చి మార్క్స దర్శనం ఏమి చెబుతున్నదో, మార్క్స తనరచనల్లో వాటికి ఏస్థానం యిచ్చాడో అందరూ తెలుసుకోవలసిన అవసరం ఉన్నది. నేటి పరిస్థితుల్లో సాహిత్యవేత్తలకూ రచయితలకూ యిది ముఖ్యకర్తవ్యమని నా భావన.

II

"సమాజంలో ఉత్పత్తిద్వారా ఏర్పడే మానవ సంబంధాలకూ, భౌతికమైన ఉత్పత్తి శక్తులకూ పరిణామ దశరీత్యా సంఘటితమైనవ్యవస్థ ఆర్థికవ్యవస్థ. ఇది పునాది. దీనిమీద న్యాయశాస్త్ర, రాజ్యాంగ నిర్మాణమూ, దాని తాలూకు సామాజిక చైతన్య నిర్దిష్ట స్వరూపాలూ ఏర్పడి ఉంటవి. భౌతిక జీవనోత్పాదకమైన విధానమే సామాజిక, రాజకీయ, విజ్ఞాన జీవిత క్రమాన్ని మొత్తంమీద నియమిస్తుంది మనుష్యుల చైతన్యం కాదు వారి సత్తాను నిర్ణయించేది: వారి సామాజిక సత్తాయే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. భౌతికమైన ఉత్పత్తి శక్తులు ఒక పరిణామదశలో అప్పటికి ఏర్పడి ఉన్న ఉత్పత్తి సంబంధాలతో ( అంటే ఆస్తి పాస్తుల తాలూకు సంబంధాలతో ) ఘర్షణ పడటం ప్రారంభమౌతుంది. ఉత్పత్తి శక్తుల పరిణామానికి దోహదంచేసే బదులు ఈ సంబంధాలు వాటికి సంకెళ్లుగా మారుతవి. అప్పుడు సామాజిక విప్లవం ప్రారంభమౌవుతుంది. ఆర్థిక వ్యవస్థ అనే పునాది మారడంతో దాని మీది బృహన్నిర్మాణము యావత్తూ యించుమించు త్వరితంగా మారిపోతుంది. ఈ మార్పులను అవగాహన చేసుకోవడంలో ఒక ముఖ్యమైన తేడాను గమనించాలి. ఉత్పత్తియొక్క ఆర్థిక పరిస్థితుల్లో జరిగే భౌతికమైన మార్పుని ప్రకృతిశాస్త్రంలాగే స్పష్టంగా నిర్ధారణ చెయ్యవచ్చు. కాని, న్యాయశాస్త్ర, రాజ్యాంగ, మత, దర్శనశాస్త్ర, కళాసంబంధమైన – అంటే భావసంబంధమైన – మార్పుల విషయం అలా కాదు. వాటి ద్వారా మనుష్యుల్లో ఘర్షణను గూర్చిన చైతన్యం అభివ్యక్తమై, వాళ్లు పోరాటాన్ని సాగిస్తారు.''[4]
ఇక్కడ ఆర్థికవ్యవస్థ 'పునాది'; సాంస్కృతిక స్వరూపము 'నిర్మాణము'గా అభివర్ణింపబడింది. పునాదిగా – అభివర్ణింపబడటంతో, ఆర్థికవ్యవస్థ ఒక్కటే విప్లవాన్ని నిర్ణయిస్తుందనే వ్యాఖ్యానాన్ని అపోహగా ఎంగెల్స్ తిరస్కరించాడు. ఒక లేఖలో 1890లో ఎంగెల్స్ యిలా వివరించాడు. "చరిత్రను భౌతిక వాదం దృష్ట్యా వీక్షించడంలో, చరిత్రలో చివరకు పరిణామాన్ని నిర్ణయించేది ఉత్పత్తీ దాని తాలూకు జీవిత వాస్తవికత అనడమే తప్ప, అంతకంటె మార్క్సు గాని నేను గాని చెప్పలేదు. ఆర్థిక వ్యవస్థను ఒక్కదాన్నే నిర్ణయ శక్తిగా ఎవరికైనా వక్రభాష్యం చెబితే అది సిద్ధాంతాన్ని అర్థరహితం చెయ్యడమే అవుతుంది. ఆర్థిక పరిస్థితి భూమిక అవడం సరే, కాని 'నిర్మాణం' తాలూకు అంశాలు— వర్గ సంఘర్షణల రాజకీయాలు, విజేతయైన వర్గం ఏర్పరిచే రాజ్యాంగం, న్యాయ

విచారణా మార్గాలూ, వీటి తాలూకు ఘర్షణలు ఆయా మనుష్యుల బుర్రల్లో కలిగించే సంచలనాలూ, రాజకీయ, దార్శనిక సిద్ధాంతాలూ, మతాభిప్రాయాలూ- అన్నీ కూడా చారిత్రక సమరం యొక్క గతిని ప్రభావితం చెయ్యడమేకాదు, చాలాసార్లు దాని స్వరూపాన్ని నిర్ణయించడంలో ప్రధానంగా, పైచేయిగా ఉంటాయి ఈ అన్నింటి యొక్క సంకులసమరం ఫలితంగానే ( ఈ శక్తుల, సంఘటనల పరస్పర సంబంధం అంచనా వెయ్యడం అసాధ్యం) చివరకు ఆర్థికమైన ఉద్యమం తన విజయాన్ని సాధిస్తుంది. అది అలా ఉండక పోతే, సిద్ధాంతాన్ని చరిత్ర సన్నివేశానికి అన్వయించడం గణితంలో సామాన్య సమీకరణం లెక్కచేసినంత సులువుగా ఉండేది."[5]

చరిత్రగతిలో ఆధారభూతమైన శక్తులు ఆర్థిక శక్తులే అయినా, రాజకీయాలకూ, సాంస్కృతిక సాహిత్యోద్యమాలకూ ప్రధాన పాత్రే ఉన్నది. ఇందులో ఆర్థిక శక్తుల పరిణామ స్వరూపం గోచరించినంత నిర్ధారణగా, శాస్త్రీయంగా, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్యోద్యమాల స్వరూపం, వాటి దారితెన్నులూ గోచరించవు గమనించవలసిం దేమిటంటే ఇక్కడ రాజకీయవాదీ, సాహిత్యకారుడూ మేధావులుగా సమానమే తప్ప, రాజకీయవాదికి, సాహిత్యకారునికి లేని దివ్యదృష్టి ప్రత్యేకంగా మార్క్స్‌దర్శనం ప్రసాదించడం లేదు ; సామాజిక చైతన్యంలో విప్లవ సృజనశక్తి అభివ్యక్తమయ్యే రంగ భూమి రాజకీయవాది బుర్రే కానక్కరలేదు. రచయితా అందుకు అర్హుడే !

ఉత్పత్తి సాధనాలను కైవసం చేసుకోవడం ద్వారా, పార్టీ నియంతృత్వం ద్వారా, ఆర్థిక వ్యవస్థలో మార్పుల్ని తీసుకువచ్చే బాధ్యత రాజకీయ వాదులైన మేమే వహిస్తున్నాము కాబట్టి, సాహిత్య ఉత్పత్తికి సాధనాలైన రచయితలను కూడా కైవసం చేసుకుని వారిని నియంత్రించడం ద్వారా సాంస్కృతిక ( 'నిర్మాణం'లో ) విప్లవం తీసుకు వస్తామంటే కుదరదు. స్టాలిన్ రష్యాలోనూ, మావో చైనాలోనూ ఈ ప్రయత్నం చేశారు ఫలితం ఈనాడు అందరికీ విదితమే!

సాహిత్యమూ, మార్క్సిస్ట్ దర్శన సూత్రాల కవిలెకట్టా (ideology) రెండూ ఒకటే, రెండింటికీ అభేదమే అంటే అది మార్క్స్ దర్శనానికి విరుద్ధమే అవుతుంది ; ఆ అభిప్రాయంతో రచనలు చేసి మెప్పు సంపాదించటానికి

ప్రయత్నించిన తొత్తు రచయితల్ని గూర్చి ఎంగెల్స్ ఏమన్నాడో చూడండి : "చిల్లర రచయితలకు యిదో పెద్ద అలవాటై పోయింది. ప్రజ్ఞ లేక పోవడాన్ని దాచిపెట్టుకుంటూ, రాజకీయాలను గూర్చి ఉల్లేఖిస్తూండడం, యిది కేవలం ఆకర్షించే ప్రయత్నం. కవిత్వము, నవలలు, సమీక్షలు, నాటకాలూ, సాహిత్యమంతా యిలా 'గాలివాటు' ( tendency ) రచనగా తయారై పోయింది. ... ''.... ...'' ప్రతిభలేని వెధవ ఒకడు, తన విశ్వాసాల్ని ప్రకటిస్తూ సొంత, డబ్బా వాయించడంలో మరీ శ్రుతి మీరి పోయాడంటే అది నలుగుర్ని ఆకర్షించడానికే"[6]. ఇలాంటి రచయితలు తెలుగులో మనకూ ఉన్నారంటే మనం ఆశ్చర్యపడనక్కరలేదు ! చరిత్ర పునరావృతమౌతూ ఉంటుంది దేశకాలాల్ని బట్టి.

సోషలిస్ట్ విశ్వాసాల్ని వర్ణించడమే సాహిత్యం కాదంటూ మార్క్స్. 'సామాజిక స్పృహ' ఉన్న రచయితలుగా ఫ్రెంచి రచయిత బాల్జాక్‌నీ, ఆంగ్ల నవలా రచయితలు డికెన్స్, థాకరే, బ్రోంటె వంటివారినీ ఉగ్గడించాడు. "నేటి ఇంగ్లీషు నవలా రచయితల పుటల్లో, ధారాశుద్ధిగల శైలిలో కన్నులకు రూపుకట్టే విధంగా ఎన్నో రాజకీయ, సామాజిక సత్యాలు ప్రపంచానికి ఆవిష్కరింపబడ్డయి. రాజకీయవాదులూ, ప్రచారకులూ, నీతిబోధకులూ అందరూ కలిసి కట్టుగా సాధించలేని కార్యం వీరు సాధించారు" అన్నాడు మార్క్స్.[7]

'ఫ్రాంజ్ వాన్ సికింగెన్' అనే నాటకాన్ని మార్క్స్ ఎంగెల్స్‌లు సుదీర్ఘంగా సునిసితంగా చర్చించడం చూస్తే ఒకనాటి చారిత్రక – సామాజిక సంక్షోభాన్ని అవగాహన చేసుకునేందుకు సాహిత్యం ఎలా ఉపయోగిస్తుందో బోధపడుతుంది. అటువంటి విలువా, సామాజికస్ఫూర్తీ సోషలిస్టు సిద్ధాంతాల్ని వల్లిస్తూ ప్రచార సాధనంగా సృష్టించే సాహిత్యానికి రాదు.

ఇక్కడే రచయిత యొక్క 'నిబద్ధత' (commitment) ను గూర్చి సరియైన అవగాహన అవసరం. సార్త్రే అంటాడు : ''సాహిత్యము (రచయితకు) సర్వస్వమూ కాకపోతే అది ఎందుకూ కొరగాదు. కమిట్‌మెంట్‌కి నేనిచ్చే అర్థం యిదే." [8] ''దాన్ని అమాయకత్వానికీ, పాటలకూ దిగజారిస్తే నశిస్తుంది. వ్రాసిన వాక్యం, మనిషీ — సమాజమూ అన్ని స్థాయిలలోనూ ప్రతిశబ్దించకపోతే దానికి అర్థం శూన్యం : ఒక యుగం సాహిత్యమంటే ఏమిటి ?

యుగాన్ని తన సొంతం చేసుకున్న సాహిత్యమన్నమాట...రచయితలు అర్థాల్ని సృష్టిస్తూ (సామాజిక సత్యాన్ని) ఆవిష్కరిస్తారు, నిరూపిస్తారు, నివేదిస్తారు; తర్వాత జనం ఒకరి మొహం ఒకరు చూసుకొని కార్యోన్ముఖులు కావచ్చును.''[9]

మార్క్స్ అభిప్రాయాలు సాహిత్యాన్ని గూర్చి ఇలా ఉన్నా, ఆచరణలో రష్యాలోనూ చైనాలోనూ భిన్నంగానే జరిగింది. ''రచయిత తన భావాలమేరకు సృష్టించవచ్చు ఏ నిబంధనా లేకుండా'' అని లెనిన్ మొదట అన్నప్పటికీ, రష్యన్ విప్లవ సమయంలో అదే లెనిన్, సంస్కృతి పరంగా రచయిత, ''అయోమయంగా ఏ వైపుకంటె ఆ వైపుకి లాగడానికి వీల్లేద''ని అన్నాడు.[10] అక్కడినుంచీ ప్రారంభమైంది రచయిత దాస్యం. క్రమంగా రచయితయొక్క 'కమిట్ మెంట్', 'మానవత' అనే ఆదర్శంనుంచి 'జనత' అనీ, 'జనత'నుంచి 'విప్లవం' అనీ, 'విప్లవం నుంచి 'పార్టీ' అనీ, అక్కడినుంచి 'మార్పుజెందే పార్టీ నిర్దేశాలు' అనీ ఆలా సంకుచితమై పతనమైపోతూ వచ్చింది. స్టాలిన్ పరిపాలనలో ఈ విషమ పరిస్థితి సాహిత్యాన్నీ కళారంగాన్నీ రాహువులా కప్పి వేసింది. దీన్నిగూర్చి 1966 లో సోవియట్ రచయితలు ఏమన్నారో చూడండి: ''వ్యక్తి పూజవల్ల కలిగిన దుష్ఫలితాల్లో ఒకటి—కళల్లో వైయక్తిక ప్రమాణాల్నీ సామాజిక ప్రమాణాల్నీ యాంత్రికంగా (విచక్షణారహితంగా) ఒకటి చేసెయ్యడం దానికి సమర్థన యిలా ఉండేది: ఆదర్శాల్లో, రాజకీయాల్లో భావ సమైక్యమూ, దృక్పథంలో ఏకత్వమూ సాధించాము కాబట్టి మనకు కళా ప్రమాణాల్లోనూ ఒకటే వ్యవస్థ ఉండాలి. కళాభినివేశం సర్వమూ ఏకముఖం గానే రూపొందాలి. కళాభిరుచులు సమాజంలోని సౌందర్య భావనల యొక్క అభివ్యక్తి కావడం నిజమే అయినా, వాస్తవంలో వైయక్తికమైన అభిరుచు లన్నింటినీ ఒక సామాజిక కళా సూత్రంగా సంక్షిప్తం చెయ్యడం సాధ్యం కాని పని ఏమంటే కళల్లో వ్యవస్థ ఒక్కటే అయినా అభిరుచుల వైవిధ్యం పుష్కలంగా ఉండటానికి వీలున్నది. ఈ వైవిధ్యం ఒక్కొక్క జాతినిబట్టీ, మనస్తత్వాన్నిబట్టీ, వయోభేదాన్ని బట్టీ, వైయక్తికంగానూ ఉత్పన్నమౌతుంది... అందుకే కళాభిరుచులూ, హృదయ ప్రేరణలూ ఒకే ప్రమాణానికి కట్టుబడి ఉండాలన్న నిర్దేశాన్ని మేము నిరాకరిస్తాము'' [11]

స్టాలిన్ తర్వాత రష్యాలో, కళలూ, సాహిత్యమూ వైవిధ్యంతో వైయక్తికాభిరుచులతో వికాసం చెందాలి అన్న గుర్తింపు ఏర్పడినా, రచయితకు మాత్రం సామాజికునిగా (as a social being) ఉండవలసిన స్వతంత్ర ప్రతిపత్తి లభించలేదనే తెలుస్తోంది. "మార్క్సిస్ట్ - లెనినిస్ట్ దృక్పథం కళాభిరుచిలో వైయక్తికమైన అంశను గుర్తిస్తుంది. కాని, దాన్ని కేవలం ఆత్మాశ్రమమైనదానిగా అంగీకరించదు. సమాజంలో అభిరుచుల వైవిధ్యానికి కూడా ఒక స్పష్టమైన కళావ్యవస్థ, ఆదర్శాలూ ( deology) ఆధారమనీ, తద్వారా అందులో ఒక ఏకత్వం కూడా ఉంటుందనీ నొక్కి చెబుతుం దీదృక్పథం. అభిరుచులలో వైవిధ్యం సరేగాని, ఏదంటే అది కుదరదు అనడమే ఈ నిర్దిష్ట దృక్పథం" [12] ఈ నిర్దిష్ట దృక్పథం పరిధిలోకి ఏ అభిరుచి వస్తుందో ఏది రాదో నిర్ణయి చే అధికారం ఎవరిది? అది రాజకీయవాదికి కాకుండా మొత్తం సమాజానికి ఉండాలనే యిక్కడ మనవిచెయ్యడం. అప్పుడే అది సరియైన మార్క్సు దృక్పథం అవుతుంది.

మార్క్సు దర్శనంలో వ్యక్తికీ రచయితకూ నిర్దిష్టమైన ప్రతిపత్తి ఉన్నా దాన్నిగూర్చి మార్క్సిస్ట్ రాజకీయ వాదులు వక్రభాష్యం పలుకుతూ, భావవాద సంప్రదాయంలో వ్యక్తికీ – సమాజానికీ గల వైరుధ్యాన్నే పునశ్చరణచేస్తూ వచ్చారు. సమాజవాదం (communism) అంటే వ్యక్తిని కొన్ని సూత్రాల మేరకు సమాజానికి తొత్తుగా లొంగదీసుకోవడమేననే అపోహ కలిగిస్తూ రావడం మార్క్సుదర్శన మంటే మేధావుల్లో రచయితల్లో భయమూ, వైముఖ్యమూ ఏర్పడటానికి కారణమైంది. మార్క్సు దర్శనంలో 'వ్యక్తి'ని గూర్చిన తాత్త్విక వివరణ (metaphysical description) ను అర్థం చేసుకుంటే ఈ అపోహలు అదృశ్యమౌతవి. ఆ వివరణవైపు యిప్పుడు దృష్టి మళ్ళిద్దాం.

## III

మార్క్సు దర్శనం గతి తార్కిక భౌతికవాదం ( Dialectical materialism). దీనికి అంతకు పూర్వం ప్రచారం పొందిన భౌతికవాదానికి మౌలికంగా చాలా భేదమున్నది. భౌతిక ద్రవ్యము (Physical matter) పరమ సత్యమే అయినా అది నిత్యం పరిణామశీల మనీ, దాన్ని పరిణామం

ద్వారానే చైతన్యవంతంగానే అవగాహన చేసుకోవాలనీ చెబుతుంది గతితార్కిక భౌతిక వాదం. "ఇంతవరకూ వచ్చిన భౌతికవాదాలలో ప్రధానమైనలోపం ఏమిటంటే— విషయము, సత్యము, అంటే మనం యింద్రియాల ద్వారా గ్రహించేది, అది కేవలం దృశ్యవిషయంగా యథారూపంలోనే అర్థంచేసుకుంటున్నాము. దాన్ని సేంద్రియమానవ చైతన్యంగా, వ్యవహారంగా తీసుకొనడం లేదు; అంటే 'విషయి' పరంగా తీసుకోవడంలేదు. అందువల్లనే భౌతికవాదానికి ప్రతిద్వంద్విగా, చైతన్యవంతమైన భాగాన్ని ఒక అమూర్తవస్తువు చేసి భావవాదం పెంపొందించడం జరిగింది - దానికి సేంద్రియ చైతన్యంయొక్క యథాస్వరూపం తెలియదు."[13] ఇలా 'విషయి - విషయము' అనే ద్వంద్వాన్ని అధిగమించే తాత్త్విక భూమికమీద ఏర్పడింది మార్క్స్ ప్రపచించిన భౌతికవాదం. సమాజానికి- వ్యక్తికీ భావవాదంలో ఉన్న ద్వంద్వం ఇందులో లేదు. అలా అని అద్వైతమూ లేదు. సమాజానికీ – వ్యక్తికీ గల సంబంధం పరిణామశీలమైనది. భాషను గూర్చి మార్క్స్‌దర్శనం ఏమి చెబుతున్నదో పరిశీలిస్తే మనం సులువుగా అర్థం చేసుకోవచ్చు దీన్ని.

"భాష, చైతన్యం అంత ప్రాచీనమైనది. భాష వ్యావహారిక చైతన్యం. అంటే అది ఇతరులకు గ్రాహ్యమౌతున్నది కాబట్టి వ్యక్తిగతంగా నాకూ గ్రాహ్యమవుతున్నది. భాష, చైతన్యంలాగే, మనుష్యులు ఒకరితో నొకరు సాంగత్యం సంబంధం నెరపవలసిన అవసరంనుంచీ, ఆవశ్యకతనుంచీ, పుట్టుతున్నది."[14] భాషకూ సామాజిక చైతన్యానికీ గల అభేదస్థితి అవగాహన చేసుకోవలసిన కీలకమైన విషయం మార్క్స్ దర్శనంలో. ( భావవాద సంప్రదాయచ్ఛాయలు ఈ అవగాహనకు అవరోధం. వాటిని తొలగించుకుని చూడాలి ) భాషలో శబ్దాలు సామాజిక వ్యవహారంలో ఉద్భవించినవి అయినా వాటి అర్థవిన్యాసంలో వాటికి రెండుముఖాలు ఉంటవి. ఒకటి పూర్వప్రయోగంవల్ల సిద్ధించిన రూఢమైన అర్థం (నిఘంటువులోనిది). రెండోది, వ్యవహారంలో శబ్దాన్ని విలక్షణంగా, సృజనాత్మకంగా వ్యక్తి ప్రయోగించడంవల్ల భవిష్యత్తులో సిద్ధించే కొత్త అర్థం. మొదటిదాన్ని అనుసరించే ఉన్నా, వ్యవహారంలో సహజంగా సిద్ధించేదే అయినా ఈ రెండో అర్థాన్ని అది పుట్టకముందే ఊహించి నిఘంటువులో వ్రాయడం సాధ్యంకాదుగదా ! కొత్త అర్థాన్ని సంతరించుకోవడానికి వీల్లేదంటూ శబ్దాన్ని

నియమించడమే జరిగితే భాష స్తంభించి మృతప్రాయమౌతుంది. భాష సామాజిక చైతన్య స్ఫూర్తిని కోల్పోతుంది.[15]

ఈ కీలకాన్ని అర్థంచేసుకుంటే వ్యక్తి చైతన్యానికీ సామాజిక చైతన్యానికీగల సంబంధం అర్థం అవుతుంది. వ్యక్తి చైతన్యం సామాజిక చైతన్యం యొక్క అభివ్యక్తికీ, పరిణామానికీ రంగభూమి. తద్వారా వ్యక్తిజీవితసాఫల్యమూ అందులోనే యిమిడి ఉంటుంది జీవద్భాషలో శబ్దానికెటువంటి ప్రాధాన్యం ఉన్నదో, తాత్త్వికంగా సామాజిక చైతన్య పరివర్తనలో వ్యక్తి చైతన్యానికి అటువంటి ప్రాధాన్యమే ఉన్నది.[16]

వ్యక్తి – సమాజము ఒకే చైతన్యం యొక్క రెండుముఖాలు. ''సమాజం ఒక అమూర్త వస్తువుగా (as an abstraction) వ్యక్తిని ఎదుర్కొంటున్నట్లు ప్రతిపాదించడం మనం మానుకోవాలి వ్యక్తి సామాజికుడు అతని జీవితం యొక్క అభివ్యక్తి – సామాజికమైన అభివ్యక్తిగా, యితరులతోడి వ్యవహారంగా రూపొందకపోయినప్పటికీ – తప్పకుండా అది సామాజిక జీవితం తాలూకు అభివ్యక్తికే అవుతున్నది. మనిషి విశిష్టత కలిగిన వ్యక్తి అయినప్పటికీ అతనిలోని ప్రత్యేకతేకదా అతణ్ణి వ్యక్తిని చేస్తున్నదీ, వ్యక్తిగా విశిష్ట సామాజికుణ్ణి చేస్తున్నదీ— అతను సంపూర్ణుడే (శకలంకాదు) ఎందుకనగా సమాజం తాలూకు 'విషయి'గా, దాని ఆలోచనకూ అనుభూతికీ నెలవుగా అతను భావపూర్ణుడు (ideal whole) అవుతున్నాడు.''[17]

మానవుడు సామాజికుడు (social being) అనడంలో ప్రతి వ్యక్తికీ సమాజంలో 'విషయి'గా కేంద్రస్థానాన్నీ, భావస్వాతంత్ర్యాన్నీ ప్రతిపాదిస్తున్నది మార్క్సు దర్శనం. అందువల్లనే మార్క్సిజమ్ గొప్ప మానవతా దర్శనం అవుతున్నది. ఈ నిర్వచనానికి మార్క్సిస్ట్ రాజకీయవాదులూ, వారి పరివారమైన రచయితలూ వక్రభాష్యంచేస్తూనే ఉన్నారు. మానవుడు సమాజం అనే అమూర్తవస్తువులో లీనం కావలసినవాడుగానూ, మందిలో ఒక శాల్తీగానూ వ్యక్తిని మార్చి, హతమార్చి, వ్యవహరిస్తూవచ్చారు. 'సామాజికుడు' అంటే కొన్ని నిశ్చిత ప్రమాణాలనూ భావాలనూ (రాజకీయవాది ఏర్పరిచినవి) సామాజిక చైతన్య వ్యవస్థగా తీసుకుని ఆపరిధిలో వ్యక్తిత్వాన్ని యిముడ్చుకునేవాడు (collective man)గా భాష్యంచేశారు.

వ్యక్తి చైతన్యం సామాజిక చైతన్యంలో వివయి కావడంవల్ల ఒక విశిష్ట వ్యక్తి (రచయిత) యొక్క సృజనాత్మక కృషి సామాజిక చైతన్యం తాలూకు సృజనాభివ్యక్తే అవుతున్నది. (భాషా సామాజిక చైతన్యమూ ఒక్కటే అయినందువల్ల భాష లేకుండా భావాలు లేవు; వ్యక్తి అంతరంగంలోని తలంపులు కూడా సామాజిక చైతన్యంలో భాగమే.) అయితే 'సృజన' ఏమిటి? కొత్త భావాలు ఎలా వస్తున్నవి? వ్యక్తికీ వ్యక్తికీ మధ్య భిన్నాభిప్రాయాలూ, అభిరుచుల వైవిధ్యం వీటి తత్త్వమేమిటి? సామాజిక చైతన్యం తాలూకు 'విషయి'గా వ్యక్తి స్థితిని బట్టి దృశ్యం భిన్న స్వరూపాలతో పరిమాణాలతో కనిపించడం వల్ల భిన్నభావాలూ, సామాజిక చైతన్య పరిణామం వల్ల కొత్త భావాలూ ఉదయిస్తున్నవని సమాధానం. అన్ని కొత్త భావాలకూ విప్లవగతిలో సార్థక్యం ఉంటుందా? అంటే ఉండదు; కాని ఆ విషయం సమాజమే, సామాజిక చైతన్య పరిణామమే నిర్ణయించి తేల్చి వేస్తుంది చరిత్రగతిలో. రాజకీయవాదికి ప్రత్యేకమైన అధికారం లేదు ఈ విషయంలో.

IV

మార్క్స్ గొప్ప మానవతావాది. విప్లవకారుడుగా, కమ్యూనిస్ట్ ఉద్యమ విజయం కోసం సాహిత్యాన్ని సాధనంగా నిర్దేశించినప్పటికీ, కాలాతీతమూ నిత్యనూతనమూ, విశ్వజనీనమూ అయిన సృజనాత్మక సాహిత్యానికి ఆయన ప్రత్యేక స్థానం యిచ్చాడు. హోమర్, షేక్స్పియర్, డాంటే, గెటే ఆయనకు అభిమాన రచయితలు. వారి కావ్యాలలోని మాటలూ, నుడులూ మార్క్స్ రచనా వ్యాసంగంలో సర్వత్రా దర్శనమిస్తాయి. 'సామాజిక స్పృహ' కలిగిన సాహిత్యంగా డికెన్స్, థాకరే, బాల్జాక్ వంటి రచయితల నవలన్ని మెచ్చుకున్నాడు మార్క్స్. వాటిలో చారిత్రక సామాజిక సన్నివేశాన్ని బహుముఖాల అవగాహన చేసుకునే అవకాశాన్ని దర్శించాడు. ఆ రచయితలు సోషలిస్టు రచయితలు కాక పోయినా సరే ఉత్తమ సాహితీస్రష్టలుగానే పరిగణింప బడ్డారు, ఆయన దృష్టిలో. విప్లవ భావాలను వెదజల్లే రచనలు, సృజనాత్మకం కాకపోయినా, ప్రచార సాహిత్యంగా వాటి విలువను గుర్తించాడు మార్క్స్. పై మూడు రకాల సాహిత్యాన్ని విస్పష్టంగా వేరు వేరుగా దర్శించాడు మార్క్స్. మార్క్సిస్ట్లు ఈ మూడు రకాల సాహిత్యాన్నీ ఒకే ప్రమాణంతో, తమ రాజకీయాలకు పనికివస్తుందా లేదా అనే దృష్టితో చూచి, మార్క్స్ మానవతావాదానికి అపచారం చేశారు.

కమ్యూనిస్ట్ మేనిఫెస్టోలో యిలా ఉన్నది: "మానవుని భావాలూ, అభిప్రాయాలూ, ఊహలు— అంటే మానవ చైతన్యం అనేది భౌతిక పరిస్థితులతో బాటు, మానవ సామాజిక సంబంధాలలో మార్పుతో బాటు మారుతూ ఉంటుందనే అవగాహనకు లోతైన గ్రహణశక్తి ఏమీ అవసరంలేదు. భావాలుమారుతూ వచ్చిన చరిత్ర గతి చూస్తే, భౌతికమైన ఉత్పాదనతో సరితూగుతూ బౌద్ధిక ఉత్పాదన లక్షణం కూడా మారుతున్న వైనమే నిరూపణ అవుతున్నది. ఒక్కొక్క యుగంలో ప్రాభవాన్నీ ప్రాధాన్యాన్నీ గడించిన భావాలు ఆ నాటి అధికారవర్గంయొక్క భావాలే కావడం ఎప్పుడూ ఉన్న విషయమే "[18] ఆ చివరివాక్యం ఆధారంగానే రాజకీయవాది రచయితనూ, సాహిత్యవేత్తనూ తనకు లొంగి ప్రవర్తించమంటున్నాడు.

కాని, కమ్యూనిస్ట్ మేనిఫెస్టోతో మార్క్స్ ప్రధానంగా బూర్జువారచయితల్నిగూర్చి ప్రస్తావిస్తున్నాడనటంలో సందేహంలేదు. "బూర్జువా వ్యవస్థ ప్రతి వృత్తినీ భ్రష్టంచేసి, దాని సహజమర్యాదనూ, గౌరవాన్నీ మంటగలిపింది. వైద్యుణ్ణీ, న్యాయవాదిని, మతాచార్యుణ్ణీ, కవినీ, శాస్త్రవేత్తనూ కూలివానిగా మార్చివేసింది... తత్ఫలితంగానే జర్మనీలో సోషలిస్ట్ కమ్యూనిస్ట్ పేరుపెట్టుకున్న ప్రచురణలు, ఏవోకొన్నితప్ప మిగిలినవన్నీ, కుళ్లిన నిర్జీవమైన సాహిత్యం క్రిందే వస్తాయి."[19] ఇక్కడ ఒక రచన సోషలిస్ట్ భావాలతో నిండి ఉన్నదా లేదా అని చూడటంలేదు మార్క్స్. అది బూర్జువా 'ఉత్పత్తి' క్రింద వస్తుందా, రాదా, అనే చూస్తున్నాడు.

ఒకరచన బూర్జువా 'ఉత్పత్తి' క్రింద ఎలా పరిగణింపబడుతుంది ? దాన్ని మార్క్స్ యిలా వివరిస్తాడు: "ఒకరచనే 'ఉత్పత్తి' గానూ తద్భిన్నంగానూ కూడా ఉండవచ్చు. మిల్టన్ 'పారడైజ్‌లాస్ట్' అయిదు పౌన్లకి వ్రాయడం అది ఆయన్ని ఉత్పత్తిశ్రామికుణ్ణి చెయ్యదు. పుస్తకవిక్రేతకోసం కూలివాడుగా వ్రాసే రచయితే ఉత్పత్తి శ్రామికుడు. మిల్టన్ 'పారడైజ్‌లాస్ట్' వ్రాశాడంటే అది పట్టుపురుగు పట్టుని ఉత్పత్తి చెయ్యడం వంటిది. అది అతని సహజధర్మం. ఫలితాన్ని అయిదుపౌన్లకు అమ్మితే అమ్మిఉండవచ్చు ... తనపాటని తనుగా అమ్ముకునే గాయని చేస్తున్నదీ ఉత్పత్తి శ్రామికత్వం కాదు. ఒకవ్యాపారి ఆమెను నియమించి ఆమె పాటద్వారా డబ్బు సంపాయించడం ప్రారంభించగానే, ఆమె

ఉత్పత్తి శ్రామికుల్లో చేరుతుంది. అప్పు డామె పెట్టుబడిని ఉత్పత్తిచేస్తున్నది[20] "మార్క్స్ మానవతాదృక్పథాన్ని సరిగా అవగాహన చేసుకోవలసిన సందర్భం యిది. దీన్ని అవగాహన చేసుకోని రాజకీయవాది తను కమ్యూనిస్టునని చెప్పు కుంటూనే, రచయితని ఉత్పత్తి శ్రామికునిగా దిగజారుస్తూ, అతనికిని రాజకీయా లకు పెట్టుబడిగా మార్చే ప్రయత్నం చేస్తున్నాడన్నమాట!

కాలప్రభావానికి లొంగని విశ్వజనీన సాహిత్యాన్నిగూర్చి, కళలనుగూర్చి మార్క్స్ యిలా చర్చించారు: "కళలవిషయం చూస్తే కొన్నియుగాల్లో అవి చెందిన వికాసం, మానవసమాజంయొక్క ఆనాటి అభివృద్ధిస్థాయి దృష్ట్యా చాల విపరీ తంగానూ, అసంబద్ధంగానూ కనిపిస్తుంది. అంటే సమాజంయొక్క భౌతికప్రాతి పదికతో ఆనాటి సామాజిక సంవిధానం అనే అస్థిపంజరంతో పొసగనిపరి మాణంలో ఆ కళల ఔన్నత్యం ఉంటున్నది. ఉదాహరణకు ఆధునిక రచయిత లతో గ్రీకుల్ని, షేక్స్పియర్‌ని పోల్చండి. అంతే కాదు, కొన్నిప్రక్రియలు, 'ఇతి హాసం' (epic) వంటివి ఆ స్థాయిలో ప్రపంచచరిత్రలో గణనీయమయ్యే స్థాయిలో, స్పృహణీయమైన అస్వరూపంలో మళ్లీ ఉత్పత్తిచెయ్యడం అసాధ్యం అనికూడా గుర్తించకతప్పదు: అందువల్ల కళారంగంలో కొన్ని విశిష్టరచనలు బహుశా సమాజ పరిణామంయొక్క తొలిపరిస్థితుల్లోనే సాధ్యమేమో అని పిస్తుంది. కళారంగంలోనే యిలాంటి వైవిధ్యాలూ వాటి ఆంతర సంబంధాలూ నిర్ణయించడం కష్టమైతే కళారంగంమొత్తాన్ని తీసుకుని దానికీ సమాజపురోగతికీ గల సంబంధాన్ని నిర్ణయించడం అసాధ్యంకావడంలో ఆశ్చర్యంలేదు. ఈ వైరు ధ్యాలను సూత్రీకరించడమే కష్టం. వాటినిగుర్తిస్తే మనకు వివరణ లభించినట్లే[21]

తన దర్శన సిద్ధాంతం ప్రకారం విశ్వజనీనమైన కళాసృష్టిని సూత్రీ కరించడం కష్టమని అంగీకరించినా, మార్క్స్ బూర్జువా వ్యవస్థ దృష్ట్యా మానవుని సృజన శక్తిని గూర్చి ఆలోచించినప్పుడు మరొక వివరణను అందించారు: "తొలియుగాల్లో మానవత్వం జాతి, మత, రాజకీయ సంకుచిత పరిధుల్లో బందీయై ఉపలక్షింపబడినప్పటికీ, ఆనాటి 'ఉత్పత్తి' కి ధ్యేయం మానవుడే అయినట్లు కనిపిస్తున్నది. ఆ స్థితి ఆధునిక ప్రపంచంతో పోలిస్తే ఉన్నతంగానే తోస్తుంది. ఇక్కడ మనిషి ధ్యేయం ఎంతసేపూ ఉత్పత్తి, ఉత్పత్తి ధ్యేయం సంపద (wealth). బూర్జువా ముసుగు తొలగిస్తే

సంపద' అంటే ఏమిటి ? వ్యక్తుల తాలూకు అవసరాలూ, సామర్థ్యాలూ, విలాసాలూ, ఉత్పత్తి శక్తులూ వగైరా, ప్రకృతి వనరుల మీదా మనుష్య ప్రకృతి మీదా పెత్తనం సాగించడంలో అభివృద్ధి సాధించడమేనా ? దీని అర్థం మానవ సృజన శక్తుల్ని ఎటువంటి ముందు చూపూ, ఆలోచనా లేకుండ .(గత చరిత్ర స్ఫురణ తప్ప) సాగదీసుకొంటూ పోవడమే, ఎటువంటి ప్రమాణము లేకుండా, దాని కదే లక్ష్యం అనే ధోరణిలో తప్ప మరేమున్నది? ఒక నిర్దిష్ట స్వరూపం ధ్యేయంగా పెట్టుకొని మానవుడు పునస్సృష్టి కావడం బదులు, తన సర్వస్వాన్నీ ఉత్పత్తిగా మార్చడమే జరుగుతున్నది. ఈ బూర్జువా ఆర్థిక వ్యవస్థలో, దీని తాలూకు ఉత్పత్తి యుగంలో, మానవ అంతరిక శక్తి యుక్తుల పూర్ణ విజృంభణ ఫలితం పూర్తిగా వట్టి పోవడమూ, ఖాళీ అయిపోవడమూ, మనిషి తాను వస్తువుగా మారి ఆత్మ ప్రత్యాఖ్యానం పొందడమూ, లక్ష్యశుద్ధి కోల్పోయి తన స్వాతంత్ర్యాన్ని తనకుగాని లక్ష్యానికి బలి పెట్టడమూ. అందుచేత పాత ప్రపంచపు పసితనమే మన కంటె ఉన్నతంగా భాసిస్తోంది. మరో విధంగా చూస్తే ఆనాటి సృజన ఒక నిర్ణీత పరిధిలో, పరిణతి పొందిన ఆకృతిగా, స్వరూపముగా అన్నింటిలోనూ వ్యక్తం అవుతూ ఉండడం వల్ల, అది నిజంగానే మనకంటే ఉన్నతస్థితి అవుతున్నది. ఆ ప్రాత లోకం ఒక సంకుచిత దృక్పథంనుంచి మనిషికి పరితృప్తి నిచ్చింది. ఈ ఆధునిక లోకం అటువంటి దేమీ యివ్వలేదు; ఎక్కడైనా తనతో తను తృప్తిపడినా ఆ అనుభవం అల్పమైనదిగానూ, అతిసాధారణమైనదిగాను ఉంటున్నది.''22

మానవుని పరిశ్రమ, సృజన అతనికి తృప్తినీ ఆనందాన్నీ యివ్వాలి. అది లోపించడమే బూర్జువా వ్యవస్థలో 'ఉత్పత్తి' లక్షణం అయి, మానవుడు తన శ్రమ తాలూకు ఫలితం నుంచీ అన్ని విధాల వంచితు డవుతున్నాడు. మార్క్స్ ఏ వ్యవస్థలో కాని 'సృజన' ను 'ఉత్పత్తి' గా పరిగణించడు. దాన్ని మానవ సహజ ధర్మంగానూ, స్వేచ్ఛకు లక్షణంగానూ వర్ణిస్తాడు. ఆయన ఊహలో కమ్యూనిస్ట్ వ్యవస్థలో 'స్వేచ్ఛా' దాని ఫలితమైన 'సృజన' పరాకాష్ఠ పొందుతవి. భౌతిక 'ఆవశ్యకత'ను అధిగమించే మానవ స్వేచ్ఛ ప్రతి యుగంలోనూ ఎంతో కొంత సాధ్యమే అయినా బూర్జువా వ్యవస్థలో దానికి అవకాశం అతి స్వల్పమనీ, కమ్యూనిస్ట్ వ్యవస్థలో అత్యధికమనీ మార్క్స్ భావనగా తోస్తుంది. 'కేపిటల్-III భాగం'లో మార్క్స్ యిలా వ్రాశాడు.

"ఆవశ్యకత నిర్దేశించే పరిశ్రమా, యితర ప్రాపంచిక నిర్బంధాలూ ముగిశాకే స్వేచ్ఛా లోకం ప్రారంభమౌతుంది. అందువల్ల అది సహజంగానే భౌతికమైన ఉత్పత్తి పరిధికి చెందదు. అనాగరిక మానవుడు నైమిత్తికాల కోసం ప్రకృతితో పెనుగులాడిన రీతిగానే, ఆధునిక మానవుడు సామాజిక వ్యూహంలో అన్ని రకాల ఉత్పత్తి విధానాల మధ్య పెనుగులాడక తప్పదు. నాగరికతతో బాటు వాంఛలూ, వాటితో బాటు భౌతిక ఆవశ్యకతా యితోధికంగా పెరుగుతూ ఉంటాయి. వాంఛల్ని తీర్చేందుకు ఉత్పత్తి శక్తులూ పెరుగుతవి. అటువంటి పరిస్థితుల్లో స్వేచ్ఛాస్వరూపం ఏమిటి? సామాజికులైన మానవులు ఒకరి మీద ఒకరు ఆధారపడిన ఉత్పత్తిదారులుగా ఉంటూ, ప్రకృతితో తమ లావాదేవీలను హేతుబద్ధంగా నియమించుకుని, ప్రకృతి శక్తులకు గ్రుడ్డిగా లోబడిపోకుండా, పకృతిని ఉమ్మడిగా అదుపులోకి తెచ్చుకుని, మానవశక్తి వ్యయం చాల తక్కువగా ఉండేలా చూస్తూ, మానవ ధర్మానికి అనుగుణమైన పరిస్థితుల్ని సృష్టించుకోవడం. అయినప్పటికీ ఆవశ్యకతాబంధం ఆధారంగానే ఆ స్వేచ్ఛా లోకం రేకు విప్పగలదు. రోజులో పని చెయ్యవలసిన కాలం తగ్గడం దాని మొదటి మెట్టు.."[23]

ఆవశ్యకతను దాటి వికసించే మానవశక్తియుక్తుల సృజనాత్మకత ప్రతి యుగంలో సైన్సులో, కళల్లో, సాహిత్యంలో వైవిధ్యంతో సంస్కృతి పరంగా అభివ్యక్తి పొందుతుందనే మార్క్స్ అవగాహన. భౌతిక ఆవశ్యకత నుంచే 'సృజన'ను సూత్రీకరించడం సాధ్యంకాదనే ఆయన భావం.

బూర్జువా వ్యవస్థలో మార్కెట్, పెట్టుబడి, లాభం ప్రాముఖ్యం వహించడం వల్ల కళాకారునికీ రచయితకూ న్యాయం జరుగదు. "పెట్టుబడిదారీ ఉత్పత్తి కొన్ని రకాల మేధాగతమైన ఉత్పత్తికి విరోధి. ఉదా॥ "కళలకూ, కవిత్వానికీ" అన్నాడు మార్క్స్.[24] జరుగుతున్న విడ్డూరం ఏమిటంటే ఈ బూర్జువా వ్యవస్థలో మార్క్సిస్ట్ ముసుగు వేసుకున్న వాళ్ళు ఒక రకం సాహిత్యాన్ని పెట్టుబడి చేసుకుని రాజకీయంగా లేక ధనరూపేణా లాభం పొందాలని ఆశిస్తూ ఉండటం. తెలుగు దేశంలో నేడు సాహిత్యం అటు పుస్తక విక్రేతల చేతుల్లోనూ, యిటు మార్క్సిజమ్ విక్రేతల చేతుల్లోనూ పెట్టుబడిదారీ

'ఉత్పత్తి'గా మారడం వల్ల సాహిత్యంలో సృజన క్షీణించి, 'సామాజికస్పృహ' నేతిబీరకాయలో నేయిగానే మిగిలిపోతున్నది. ఆశ్చర్యమేమీ లేదు. ఇది మార్క్స్ ప్రవచనమే మనం బూర్జువా వ్యవస్థ సరిహద్దుల్లోపలే ఉన్నామింకా!

---

## ( NOTES )

1. (I) "With Marxist–Leninist ideology as its pivot, Socialist society consciously develops its intellectual life. The party directs the development of science, art and culture. The party's decisions and practical acts conform to a definite plan and are based on the laws governing the development of social consciousness under socialism.

(II) "Its bourgeois, reformist and revisionist opponents insist that the Communist party's leadership rules out freedom of scientific and artistic creativity. But there is no clash between conscious and free creativity and its subordination to the interests of the party and of communism.

(III) "In socialist society, every innovator in production and every real scientist and artist is free, and consciously makes his work serve the cause of communism. To work for communism is a supreme manifestation of individual freedom ; it is the whole meaning of a life in freedom, because communism itself is the highest form of freedom ...

(IV) "The growing social homogeneity of socialist society achieved through the obliteration of social distinctions helps to bring out men's individual traits, diverse attitudes, tastes and requirements. This flourishing of individual freedom and variety of individual distinctions is an enrichment of man's social essence.

(V) "There have been many outstanding men in history, and the construction of communism and communist ideology are designed to make every one an outstanding personality. That will be done and has already been done in many respects."

(Pages 109–113, *Man and Soeiety*, a group of authors, Progress publishers, Moscow, 1966)

2. "A writer must distinguish between what an author in fact says and what he thinks he is saying. This is true even of philosophical systems"

(Works, Marx and Engels ; from *Karl Marx and World Literature* by S. S. Prawer, Oxford University Press, 1976.)

3. "Each book proposes a concrete liberation on the basis of particular alienation. In each one there is an implicit recourse to institutions, customs, certain forms of oppression and conflict ... to a whole world which the author and reader have in common. It is this familiar world which the writer animates and penetrates with his freedom. It is on this basis of this world that the reader must bring about this concrete liberation."

(*What is Literature ?* by J. P. Sartre, page 51)

4. "In the social production in which men engage they enter into definite relations... These relations of production correspond to a definite state of development of their material powers of production. The totality of these relations of production constitutes the economic structure of society — real basis, on which legal and political superstructures arise and to which definite forms of social consciousness correspond. The mode of production of material life conditions the social, political, and intellectual process of life as a whole. It is not the consciousness of men which determines their being, but, on the contrary, their social being which

determines their consciousness. At a certain stage of their development, the material forces of production in society come in conflict with the existing relations of production, or with the property relations within which they had been at work before. From forms of development of the forces of production these relations turn into their fetters. Then occurs a period of social revolution. With the change of the economic foundation the entire superstructure is more or less rapidly transformed. In considering such transformations, a distinction should always be made between the material transformation of the economic conditions of production which can be determined with the precision of natural science, and the legal, political, religious, artistic or philosophical — in short, ideological — forms in which men become conscious of this conflict and fight it out." (Works, Marx and Engels ; from *Karl Marx and World Literature*, by S. S. Prawer, O. U. P., 1976, Page 294)

5. "According to the materialist conception of history, the *ultimately* determining element in history is the production and reproduction of real life. More than this neither Marx nor I have ever asserted. Hence if somebody twists this into saying that the economic element is the *only* determining one, he transforms that proposition into a meaningless, abstract, senseless phrase. The economic situation is the basis, but the various elements of the superstructure political forms of the class struggle and its results, to wit : constitutions established by the victorious class after a successful battle, etc., juridical forms, and even the reflexes of all these actual struggles in the brains of the participants, political, juristic, philosophical theories, religious views, and their further development into systems of dogma — also exercise their influence upon the course of the historical struggles and in many cases preponderate

in determining their form. There is an interaction of all these elements in which, amid all the endless host of accidents (that is of things and events whose inner interconnection is so remote or so impossible of proof that we can regard it as non-existent, as neligible), the economic movements finally asserts itself as necessary. Otherwise the application of the theory to any period of history would be easier than the solution of a simple equation of the first degree." (Engel's Letter to Bloch in September, 1890' quoted in *Marxism and Literature,* Raymond Williams, O. U. P., 1977 pages 79-80)

6. "It became more and more the habit, particularly of the inferior sorts of *literati,* to make up for the want of cleverness in their productions by political allusions which were sure to attract attention. Poetry, novels, reviews, the drama, every literary production teemed with what was called 'tendency'." (Engels, October, 1851, quoted in *Marxism and Literature*, pages 200)

"... a worthless fellow who, due to lack of talent, has gone to extremes with tendentious junk to show his convictions, but it is really in order to gain an audience." (Engels, August, 1881, quoted in *Marxism and Literature,* page 200)

7. "He instanced Dickens,and Thackeray, Miss Bronote and Mrs. Gaskell, 'whose graphic and eloquent pages have issued to the world more political and social truths than have been uttered by all the professional politicians, publicists and moralists put together'." (Marx in 'The English Middle Class', quoted in *Marxism and Literature*, page 201)

8. & 9. "If literature is not everything, it is worth nothing. This is what I mean by 'commitment'. It wits if it is reduced to innocence or songs. If a written sentence does not reverberate at every level of man

and society, then it makes no sense. What is the literature of an epoch but the epoch appropriated by its literature ?" (The purposes of Writing, 1960, Sartre, quoted in *Marxism and Literatare*, page 201)

10. "Both Lenin and Trotsky saw writers, with other artists, as necessarily free to work in their own ways: 'to create freely according to his ideals, independent of anything' (Lenin, Collected Works, 1960) ... But each made reservations ; Lenin on the cultural policy of the Revolution, which could not 'let chaos develop in any direction it may...'
(*Marxism and Literature*, page 202)

11. "One of the negative effects of the personality cult was the machanical identification of individual and social aesthetic standards. The reasoning behind this went something like this : because of our ideological and political unity and common world-outlook, we have a single system of aesthetic standards, and there must be a single general taste to correspond to it. Of course, aesthetic tasts are an expression of society's aesthetic ideas and are based on the latter, but the fact is that individual taste cannot be entirely reduced to social aesthetic ideas, because one system of aesthetic views can and does produce a diversity of taste. The diversity is due to national, psychological age and other individual distinctions which lay their imprint on the specific aesthetic tastes of each... That is why we reject the dogmatic view that aesthestic tastes and emotions must conform to a single standard." (*Man and Society*, pages 161-162)

12. "Marxist-Leninist aesthestics, while recognizing the individual element in taste, do not reduce it to the purely subjective factor but emphasize that in a society diversity of taste develops on the basis of a defінte aesthetic system and ideology and represents

the common element in them. Diverse, but not any kind of, taste may be said to correspond to a definte world outlook."
(*Man and Society*, page 163)

13. "The chief defect of all materialism up to now is, that the object, reality, what we apprehend through our senses, is understood only in the form of the *object of contemplation* ; but not as *sensuous human activity*, as *practice* ; not subjectively. Hence in opposition to materialism the *active* side was developed abstractly by idealism— which of course does not know real sensuous activity as such." (Marx and Engels : German Ideology, quoted in *Marxism and Literature*, page 30)

14. "Language is as old as consciousness, language is practical consciousness, as it exists for other men, and for that reason is really beginning to exist for me personally as well ; for language like consciousness, only arise from the need, the necessity, of intercourse with other men." (Marx and Engels ; German Ideology, quoted in *Marxism and Literature*, page 29)

15. *Marxism and philosophy of Language*, V. N. Volosinov, New York, 1973 (see *Marxism and Literature*, pages 35–42)

16. "... following Volosinov, we can see that just as all social process is activity between real individuals, so individuality, by the fully social fact of language (whether as 'outer' or 'inner' speech), is the active constitution, within distinct physical beings, of the social capacitywhich is the means of realization of any individual life. Consciousness, in this precise sense, is social being." (*Marxism and Literature*, pages 41–42)

17. "It is above all necessary to avoid postulating society once more as an abstraction confronting the individual. The individual is a *social being*, The

manifestation of his life -- even when it does not appear directly in the form of a social manifestation, accomplished in association with other men -- is therefore a manifestation of *social life* .. Though man is a unique individual -- and it is just his particularity which makes him an individual, a really *individual* social being -- he is equally the *whole*, the ideal whole, the subjective existence of society as thought and experience." (Marx, Economic and philosophical Manuscripts of 1844, quoted in *Marxism and Literature*, page 194)

18. "Does it require deep intuition to comprehend that man's ideas, views, and conceptions, in one word, man's consciousness, changes with every change in the conditions of his material existence, in his social relations and in his social life ? What else does the history of ideas prove, than that intellectual production changes its character in proportion as material production is changed ? The ruling ideas of each age have ever been the ideas of its ruling class." (The Communist Manifesto, quoted in *Karl Marx and World Literature*, S. S. Prawer, O.U.P., 1976, page 143)

19. "The bourgeoisie has stripped of its halo every occupation hitherto honoured and looked up to with reverent awe. It has converted the physician, the lawyer, the priest, the *poet*, the man of science, into its paid wage labourers" (The Communist Manifesto, quoted in *Karl Marx and World Literature*, page 142)

20. The same sort of work can be 'productive' or 'unproductive'. Milton for instance, 'who did the *Paradise Lost* for £5', was an 'unproductive' worker. The writer, however, who turns out factory hack-work for his book-seller, is a 'productive' worker. Milton produced *Paradise Lost* for the same reason as that which makes the silk-worm produce silk. It was an activity wholly natural to

him. He later sold the product for £5.... A singer who sells her singing on her own initiative, is an 'unproductive' worker. But if the same singer is engaged by an entrepreneur who lets her sing to make money for him, then she is a 'productive worker' for then she produces capital." (Works, Marx and Engels, quoted in *Karl Marx and World Literature*, page 310)

21. "In the case of arts it is well-known that certain periods in which they flowered are out of all proportion to the general development of society, hence also to its material basis, the skeletal structure, as it were, of its organization. The Greeks, for instance, compared with the modern or also Shakespeare. It is even recognized that certain forms of art, the epic, for instance, cannot be produced in their world-epoch-making, classical form once the production of art as such begins ; that therefore certain significant formations within the domain of art itself are possible only at a low stage of development. If this is true of the relation of different kinds of art within the domain of art itself it is already less surprising that the same should be true of the relation in which the whole domain of art stands to the general development of society. The difficulty lies only in the general formulation of these contradictions. As soon as they have been specified they are already explained." (Marx, Foundations of Political Economy, quoted in Karl Marx and World Literature, pages 278-279)

22 "The ancient conception, in which man, though in various narrow national, religious, and political determinations, always appears as the aim of production, seems to be very superior to the modern world in which production appears as the aim of man and wealth as the aim of production. In fact, however, when the narrow bourgeois form is caste

aside, what is wealth but the universality of the needs, capacities, enjoyments, productive forces etc. of individuvals ? The complete development of human domination of natural forces, those of so-called 'nature' as well as those of the individual's own nature ? What is it but the absolute working-out of his own creative dispositions, without any preconception except that of previous historical development, which makes the totality of this development-- i. e. the development of all human powers as such, not measured by any yardstick that is already given -- an end in itself ? What is this but a situation in which man does not reproduce himself in some pre-determined form, but one in which he produce his totality ? In bourgeois economics, and the epoch of production that corresponds to it, this complete elaboration of man's inner potential appears as complete depletion, this universal objetctfication as complete estrangement, and the demolition of all determined, one-sided aims as the sacrifice of autonomy to a wholly external aim. Thus on the one hand the childish ancient world *appears* to be the higher. On the other hand it *is* the higher world in every thing that demands a finished shape, form, given limitation. The ancient world satisfied from a narrow point, while the modern world affords no satisfaction-- or, where it does appear satisfied with itself, it is common and mean." (Marx Foundations of political Economy, quoted in *Karl Marx and World Literature*, pages 287-288)

23. "The realm of freedom truly begins only where labour determined by necessity and mundane considerations ceases ; in the very nature of things, therefore, it lies beyond the sphere of actual material production. Just as the savage must wrestle with nature to satisfy his wants, to maintain and

reproduce life, so must civilized man, and he must do so in all social formations and under all possible modes of production. With his development this realm of physical necessity expands as a result of his wants ; but, at the same time, the forces of production which satisfy these wants also increases. Freedom in this domain can only mean that socialized men, the associated producers, regulate their interchange with nature rationally, bringing it under their common control, instead of being ruled by it as the blind forces of nature ; and achieving this with least expenditure of human energy and under conditions most favourable to, and most worthy of, their human nature. Nonetheless this still remains a realm of necessity. Beyond it begins that development of human power which is its own end, the true realm of freedom, which, however, can blossom forth only with this realm of necessity as its basis. The shortening of the workingday is its fundamental premiss." (Marx Capital, Part III, quoted in Karl Marx and World Literature, pages 312-313)

24. "Capitalist production is inimical to certain kinds of intellectual production — to art and poetry for instance." (Marx ; Theories of Surplus Value, quoted in Karl Marx and World Literature, page 311)

(BIBLIOGRAPHY)

1) *Man and Society*, by a Group of Authors, Progress Publishers, Moscow, 1966

2) *Marxism and Literature*, by Raymond Williams O. U. P., London, 1976.

3) *Karl Marx and World Literature*, by S. S. Prawer O. U. P., London, 1976.

4) *What is Literature ?*, by Jean Paul Sartre, Methuen & Co. Ltd., London, 1950 and 1967.

# నేటి సాహిత్యవిమర్శ : ప్రమాణాలస్థాయి

డా॥ దివాకర్ల వేంకటావధాని

సాహిత్య సారస్వత వాఙ్మయ శబ్దము లుత్తరోత్తర విస్తృతము లైన ట్టివి. వాగ్వికార మైనదంతయు వాఙ్మయమే యగును సరస్వతికి సంబంధించి నది సారస్వతము. ఆమె పుస్తక రూపిణి. ఆంధ్ర నామసంగ్రహ మామెను పొత్తము పుత్తో అని పేర్కొన్నది. దీనిని బట్టి గ్రంథరూపమైన దాని నంత టిని సారస్వత మవి చెప్పవచ్చును. సాహిత్య మీ రెండింటికంటె నుత్కృష్ట తరమైనది. హిత మనగా రసము. రస సహితమైనది సహితము. సహిత భావము సాహిత్యము. రసము దానికి ప్రాణము. "రసముచేతనే సర్వ కావ్యములు జీవించును. రసము లేని కావ్య ముండదు రసధ్వనియే కావ్యాత్మ. వస్త్వలంకార ధ్వనులు కూడ రసమునందె పర్యవసించు" నని అభినవ గుప్తుడు చెప్పి యుండెను. స్మృతి శాస్త్ర నిఘంట్వాదులు విజ్ఞానప్రదము లయ్యును రసహీనము లగుటచే కావ్య శబ్ద వాచ్యములు కాజాలవు కావ్యముల సముదాయమే సాహి త్యము. ముద్రిత గ్రంథజాల మంతయు సాహిత్యముగా పరిగణింపబడదు. సాహిత్య విమర్శ యనునప్పు డీ విషయమును దృష్టియం దుంచుకొనవలయును.

విమర్శ లేక విమర్శనము అననది 'వి' అనునుపసర్గతో కూడిన మృశ్ ధాతువు నుండి యేర్పడినది. ఆ ధాతువునకు పరామర్శించుట. ఆలోచించుట, పరీక్షించుట, చర్చించుట మొదలగు నర్థములున్నవి. వీని నన్నిటిని కలిపి చూచినచో విమర్శన మనగా నేదైన కావ్యమునుగాని కళారూపమును గాని లెస్సగా పరిశీలించి, దానిని మననము చేసి చర్చాపూర్వకముగా నందలి బాగోగులను గ్రహించుట యని నిర్ణయింప వచ్చును. ఇంతేకాక ఏదైనా కావ్య మును గూర్చి విశ్లేషణ పూర్వకముగా కాని వివరణాత్మకముగా కాని వ్రాయు

వ్రాత అంతయు విమర్శగానే పరిగణింపబడుచున్నది సాహిత్యము ప్రత్యక్షముగనో పరోక్షముగనో మానవ జీవితమును వర్ణించుచు దానిపై వ్యాఖ్యానమొనర్చు చుండును. విమర్శన మాసాహిత్యము మీదనే కాక అది చేయు జీవిత వ్యాఖ్యానము మీద కూడ వ్యాఖ్యాన మొనరించుచుండును. విమర్శనమున శాస్త్ర కళాధర్మములు రెండును కలవనియు, శాస్త్రముగా నది గ్రంథపరిశీలనము గావించి అందలి మంచిచెడ్డలను గ్రహించి సాధ్యమైనంత వఱకు సాధారణ సిద్ధాంతముల నేర్పఱుచుననియు, కళగా నది కావ్యోత్పాదనమును ప్రోత్సహించుననియు జోసెఫ్‌షిప్లీ చెప్పియుండెను.

విమర్శ యనగా ఖండనము లేక దోషైక ప్రదర్శనము అను నభిప్రాయము లోకమున వ్యాపించియున్నది. అందుకు పెక్కు విమర్శలు విమర్శనీయ వస్తువు నందలి దోషములను మాత్రము ప్రదర్శించి గుణముల విషయమున తూష్ణీంభావము వహించుటయే కారణము కాని అది సరికాదు. విమర్శ దోషములను ప్రకటించుటలో దోషములేదు. అది కావ్యమును సమగ్రముగా పరిశీలించి అందలి గుణములను కూడ ప్రకటింప వలయును. అప్పుడుకాని అది సమగ్రవిమర్శనము కాజాలదు. కొన్ని విమర్శలు గుణములనుమాత్ర ముటంకించి దోషముల నొప్పరికించుటయో మఱుగుపుచ్చుటయో చేయుచుండును. అవియు సమగ్ర విమర్శలు కావు. కొన్ని విమర్శలు వైయక్తికద్వేషాభిమానముల కారణమున గుణములను దోషములుగను దోషములను గుణములుగను నిరూపించు చుండును. ఇవి ఉత్తమ విమర్శలు కాకపోవుటయే కాక కువిమర్శలు కూడ నగును. నిజమైనవిమర్శ వస్తుస్వరూపము నవగాహనము చేసికొని యందలి గుణదోషములను యథాస్థితముగా వెల్లడింప వలయును. విమర్శకు సమానార్థకమైన Criticism అను ఆంగ్లపదము గుణదోషవిచార మొనర్చుట యను నర్థము కల Kritein అను గ్రీకు పదమునుండి యేర్పడినదట. అందుచే విమర్శను న్యాయమూర్తి గుణ దోష విచార మొనర్చి నిష్పాక్షికముగా నొసఁగు తీర్పు వంటిదని భావింపవచ్చును.

విమర్శకుడు కావ్యము నందలి గుణ దోషములను నిర్ణయించి చెప్పుట కేదో యొక ప్రమాణ ముండవలయును. ఈ నిర్ణయమున నాతనికి స్వీయాభిరుచులు కొంతవఱకు సహాయములగుట సత్యమే కాని యతడు కేవలము వానిని బట్టియే నిర్ణయము కావించుచో నతని విమర్శ ప్రామాణికము కాజాలదు. అందుచే సునిశ్చితములైన కొన్ని సూత్రముల ననుసరించి యతడు విమర్శ సాగింపవలయును. ఈ సూత్రములు రెండు విధములు: పూర్వ లాక్షణికు లేర్పరచినవి, కావ్య కర్త స్వయముగా నేర్పరుచుకొన్నవి. పూర్వ లాక్షణికులు తమకు ముందున్న మహా కావ్యములను పరిశీలించి కావ్య లక్షణములను నిర్ణయించి యుండిరి. విమర్శకుడు వాని నాధారముగా చేసికొని తాను విమర్శించు కావ్యము నందలి గుణదోషములను వెల్లడింప వచ్చును. లేదా అత డా కావ్యమును బఠించి కావ్యకర్త యే సూత్రములపై దానిని రచింప సంకల్పించెనో యెఱింగి యత డెంతవఱకు కృతకృత్యుడయ్యెనో దానినిబట్టి కావ్యగుణ దోషములను నిర్ణయింప వచ్చును. ఈ రెండు విధానములును ఇంచుక లోప భూయిష్ఠములుగనే కనిపించును. మొదటిది కవి స్వాతంత్ర్యమును సహింపని దగుటయు రెండవది లాక్షణికుల ప్రామాణికత్వమునకు భంగము పాదించునదగుటయు నిందుకు కారణములు. అందుచే విమర్శకుడు లాక్షణిక ప్రోక్తములైన సూత్రములను లెస్సగా తెలిసికొని, దేశకాలములను బట్టి వానియందెట్టి మార్పు చేర్పులు చేయవలెనో నిశ్చయించి, కవి కావించుకొన్న సూత్రములను కూడ మనస్సునం దుంచుకొని కావ్య పరిశీలనము కావింపవలయును. పూర్వ లాక్షణికులు చెప్పిన లక్షణములను పూర్తిగా విస్మరించుట యుక్తము కాదు. ఈ లాక్షణికులు ప్రాచ్యులు కావచ్చును, పాశ్చాత్యులు కావచ్చును. పూర్వులు చెప్పిన సూత్రములలో కొన్ని సర్వజనీనములును సర్వకాలికములు నై యుండును. అవి రామాయణము, భారతము, ఇలియడ్ మున్నగు మహా కావ్యములందును ప్రతిష్ఠితములై తరువాతి కవులకు శిరోధార్యము లైనట్టివి. వానిని గూర్చి యెవ్వరికి నెట్టి యాక్షేపము నుండదు. విమర్శకు డట్టివాని నాదర్శముగా గ్రహించుటలో దోషము లేదు. అవి కావ్యమునకు ప్రాణభూతమైనట్టివి. అవి

లేనిచో కావ్యము కావ్యతకే లోప మావహిల్లును వానితో ప్రతిభావంతులైన యనంతర కవీంద్రుల రచనలలో కానవచ్చు నుత్తమ గుణములను గూడ జతచేసి యా రెండింటిని ప్రమాణముగా గ్రహించి విమర్శకుడు తన కర్తవ్యమును కొనసాగింప వచ్చును. అప్పు డాతని విమర్శ యా ప్రత్యేక కావ్యము యొక్క గుణదోషములను చక్కగా ప్రదర్శించునదే కాక తరువాతి కవులకు మార్గ దర్శకముగా కూడ నుండగలుగును.

విమర్శకుడు విమర్శనీయ గ్రంథమును క్షుణ్ణముగా పఠించి దాని తత్త్వ మును సమగ్రముగా నవగాహనము చేసికొన వలయును. కొందఱు కాలాభావము చేతనో సౌలభ్యకాంక్ష చేతనో యితరు లొక గ్రంథమును గూర్చి వ్రాసిన సారాంశమునో సంగ్రహ రూపమునో మాత్రము పఠించి తద్విమర్శకు పూను దురు. కొందఱా గ్రంథమును గూర్చి యితరులు కావించిన విమర్శనే యాధా రముగా చేసికొని విమర్శన కార్యమునకు గడంగుదురు. ఈ రెండు పద్ధతులును పరిహరింపదగినవే. మొదటిదానివలన విమర్శకుడు మూలగ్రంథతత్త్వమును పూర్తిగా నవగాహనము చేసికొనుట కవకాశ ముండదు. రెండవ దాని వలన విమర్శకుడు పరప్రత్యయనేయబుద్ధి యగుట సంభవించును.

విమర్శలను మెలకువతో పఠించినచో పెక్కు లాభములు కలుగును. ఉత్తమ విమర్శ పఠితలకు విజ్ఞాన వికాసములను చేకూర్చుటయే కాక వారి యందు నూత్న చైతన్యమును రేకెత్తించును. అది పఠితలలో నస్పష్టములు సంశయాస్పదములునైన భావములందలి అస్పష్టతను సంశయములను తొలగించి వారికి కావ్యావగాహనమున కెక్కో విధముల తోడ్పడును. వా రొకవేళ పెడత్రోవ పట్టుచో నది సన్మార్గము చూపి మూలగ్రంథమును నూత్నదృక్పథముతో పఠించి యానందించు నవకాశ మొసంగును. విమర్శకుల యభిప్రాయములతో పఠిత లేకీభ వించి తీరవలెనను నిర్బంధములేదు. వారు విమర్శనలను విచక్షణతతో చదివి యోగ్యభావములను గ్రహించి, అయోగ్య భావములను పరిహరింప వచ్చును. విమర్శల విషయమున నంధానుకరణము హానికరము కాని యాలోచనాసహిత మైన పఠన మెప్పుడును అనర్థకరము కాదు.

## 2

తెలుగు నందలి నేటి సాహిత్య విమర్శను ప్రధానముగా నాలుగు తెఱగులుగా విభజింపవచ్చును. ప్రాచ్యలక్షణానుసారి, పాశ్చాత్యలక్షణానసారి, ఉభయలక్షణానసారి, ఆధునికము. విమర్శకులు సాహిత్యమును విమర్శించునప్పు డనుసరించు నాదర్శముల ననుసరించి యీ విభజన మొనర్పబడినది. ప్రాచ్య లాక్షణికులు నిశిత పరిశీలనము కావించి యేర్పఱిచిన లక్షణములు కొన్ని యున్నవి, సాహిత్య శాస్త్రమునుగూర్చి వారు చేసిన పరిశీలనమెంత విస్తృతమో అంత ప్రామాణికము, భారతదేశమున ఆంగ్ల విద్య వ్యాపించుటకు ముందు తెలుగు పండితులేకాక భారతీయ పండితులందఱును దానినే ప్రమాణముగా గ్రహించిరి. వారు తాము పఠించిన గ్రంథముల నా లక్షణముల దృష్టితో పరిశీలించి తల్లక్షణానుసరణమును బట్టి వాని విలువను నిర్ణయించుచుండిరి. వారు రస పాత్ర పోషణమునకును, అలంకార ప్రయోగమునకును, సలక్షణమైన భాషకును, ఛందస్సౌష్ఠవమునకును అధికమైన ప్రాముఖ్యము నొసంగిరి. అందులో నేది లోపించినను గ్రంథము వారి ప్రశంసకు పాత్రమయ్యేడిది కాదు. కావ్యమునం దల్పములైన దోషములుకూడ నుండరాదనుదండి సిద్ధాంతమును వారు ప్రమాణముగా గ్రహించిరి. వా రౌచిత్య విషయమున నధిక శ్రద్ధ వహించి కథా వస్తు విన్యాసము విషయమునను సమకాలిక మత సాంఘిక రాజకీయాదుల విషయమునను కొంత ఉపేక్ష ప్రదర్శించిరి. వారు పూర్వ లాక్షణికుల సిద్ధాంతముల కనుగుణముగా రచింపబడిన కావ్యములను ప్రశంసించి, తద్విరుద్ధములైన వానిని నిరసించిరి. ఈ విధానము చారిత్రక దృక్పథమును ఉజ్జగించి లక్షణాను గుణ్యమున కత్యంత సాముఖ్యము నొసంగును. కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రి, కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి, వజ్ఝల చిన సీతారామశాస్త్రి. మున్నగు వారి విమర్శ లీ పద్ధతికి చెందినవి. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శృంగార శ్రీనాధమున శ్రీనాధుని కాలమును, అతని రచనల పౌర్వాపర్యమును వివరముగా చర్చించి యుండిరి. వారు ప్రాచీనుల లక్షణముల ననుసరించుచునే చారిత్రక దృక్పథమును కూడ ప్రద

ర్శించిరి. సింహావలోకనము, మీగడ తఱకలు, తెలుగు మెఱుగులు అను విమర్శ వ్యాసములతో కూడిన వారి గ్రంథములు మిక్కిలి ప్రశస్తములైనవి. కీ శే బండారు తమ్మయ్యగారు పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు, వేమన మున్నగు వారిని గుఱించి వెలయించిన విమర్శలు కూడ పండితుల మన్నన లందినవి. కీ.శే. చిలుకూరి వీరభద్రరావు గారి శ్రీనాథుడు, తిక్కన సోమయాజి మున్నగు గ్రంథములు చరిత్ర దృష్టితో కూడిన సారస్వతవిమర్శకు నిదర్శనములు. కీ. శే. గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు పండిత భిషక్కుల భాషా భేషజమున ప్రకటించిన వ్యాసములు ముఖ్యముగా భాషకు సంబంధించినవి. వారు పెద్ద పెద్ద పండితులు కూడ తమ రచనలో నెట్లు వ్యావహారిక ప్రయోగము లొనర్చిరో సోదాహరణముగా ప్రదర్శించి శిష్ట వ్యవహార భాషయే సాహిత్య వ్యక్తీకరణమునకు తగినదని వాదించిరి.

శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి విమర్శలు నిశిత పరిశీలన మునకును ఎడనెడ హాస్యముతో కూడిన మృదు మధురమైన శైలికిని పేరు పొందినవి. వా రాంధ్ర విశ్వవిద్యాలయమున వేమనను గుఱించి యొసంగిన యుపన్యాసములు గ్రంథ రూపమున ప్రకటింప బడినవి. అది ఆదర్శ విమర్శ గ్రంథముగా పరిగణింప బడుచున్నది. వారు ధర్మవరము వారి యొక్కయు కోలాచలము వారి యొక్కయు నాటకములపై నొసంగిన ఉపన్యాసములు నాటకోపన్యాసములను పేర ముద్రింపబడినవి. వారి యితర వ్యాసములు కూడ కొన్ని గ్రంథ రూపమును పొందినవి. తిక్కన తీర్చి దిద్దిన సీత, నిగమశర్మ అక్క, నాచన సోమనాథుని నవీనగుణ సనాథత, రాయలనాటి రసికత మున్నగు నందలి వ్యాసము లుత్తమ విమర్శకు నిదర్శనములు. కీ. శే. విశ్వ నాథ సత్యనారాయణగారు నన్నయగారి ప్రసన్న కథా కవితార్థ యుక్తి అను గ్రంథమున నన్నయ కవితా శిల్పమును, లోకజ్ఞతను, కథా కథన కౌశలమును చక్కగా ప్రదర్శించి యుండిరి. వారి అల్లసాని వాని అల్లిక జిగిబిగి మను చరిత్రము నందలి యితర గుణములతో పాటు వస్త్వైక్యమును కూడ నిరూపించు

చున్నది. 'ఒకడు నాచన సోమన్న' అను శీర్షికతోడి వారి వ్యాసములు మొదట పత్రికలో ప్రచురింపబడి తరువాత గ్రంథరూపము నందినవి. వారి కభిమాన పాత్రులైన పూర్వాంధ్రమహాకవులలో నాచన సోమనాథు డొకడు. ఈవ్యాసములలో వారు సోమనాథుని కవితాశిల్పమును, సంవిధాన చక్రవర్తిత్వమును లెస్సగా నిరూపించియున్నారు. అట్లే వారు అభిజ్ఞాన శాకుంతలము నందలి అభిజ్ఞానత అను వ్యాసమున కాళిదాసుని నాటక శిల్పమును సమీక్షించి యుండిరి. శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు గారి మహాభారత విమర్శనమును, తెనాలి రామకృష్ణుడు, భట్టుమూర్తి మున్నగు ప్రబంధ కవుల గ్రంథములపై ప్రకటించిన విమర్శలును, ప్రబంధ నాయికలును విమర్శ వాఙ్మయమున కలంకారములని చెప్పదగినవి. శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారు కొన్ని సుప్రసిద్ధ ప్రబంధములందలి పాత్రల స్వరూప స్వభావములను చిత్రించుచు వ్రాసిన వ్యాసములు ప్రశంసా పాత్రములైనట్టివి. శ్రీ కాశూరి వ్యాసమూర్తిగారు ప్రధానముగా పౌరాణికులే యైనను మంచి విమర్శలను కూడ వెలయించిరి. వారి తిక్కన కళా సామ్రాజ్యమును, భారత రసాయనమును పేర్కొనదగినట్టివి. వారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వ తత్త్వ విచారముపై కావించిన ప్రతి విమర్శ వారి ప్రాచ్య లక్షణాభిమానమునే కాక విమర్శన పాటవమును కూడ ప్రకటించును.

హైదరాబాదు నందలి ఆంధ్ర సారస్వత పరిషత్తువా రప్పుడప్పు డుద్దండ పండితులచే వివిధ గ్రంథములను గూర్చి ఉపన్యాసము లిప్పించి వానిని గ్రంథములుగా ప్రకటించిరి. వానిలో మహాభారత భాగవతోపన్యాసములు పేర్కొనదగినవి. వారు శ్రీ విశ్వనాథవారు భవభూతిని గూర్చియు, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు వసుచరిత్రను గూర్చియు, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు పోతనను గూర్చియు, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారును నేనును శ్రీ సీతా రామాంజనేయ సంవాదమును గూర్చియు నొసంగిన ఉపన్యాసములను గ్రంథరూపమున ప్రకటించి యుండిరి. ఆచార్యతూమాటి దొణప్పగారు భాషాశాస్త్రమును గూర్చి వ్రాసిన వ్యాసముల సంపుటినికూడ వారు ప్రచురించియుండిరి.

శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారును చిలుకూరి పాపయ్యశాస్త్రిగారును శ్రీనాధుని కవిత్వమును గూర్చి ప్రచురించిన విమర్శలు ప్రశస్తములైనవి. ఇటీవల శ్రీ కర్రా చంద్రశేఖరశాస్త్రి గారు శ్రీనాధునిగూర్చి పలువురు పండితులు రచించిన వ్యాసములతో కూడిన రెండు సంపుటములు ప్రచురించి యుండిరి. అందు మొదటి దామహాకవి జీవితవిశేషములనుగూర్చియు రెండవది కవితా విశేషములనుగూర్చియు వివరించును. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు పోతననుగూర్చి వ్రాసినగ్రంథము పలువురు పండితుల ప్రశంసలకు పాత్రమైనది. శ్రీ డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు వీరరసమునుగూర్చియు, తిరుపతివేంకట కవుల రచనలను గూర్చియు, పిల్లలమర్రి పినవీరభద్రునిగూర్చియు రచించిన గ్రంథములు గుణముచేతను పరిమాణముచేతను గూడ నుత్కృష్టములైనవి. డా. యశోదారెడ్డిగారు పారిజాతాపహరణమును గూర్చియు, ఎఱ్ఱన సోమనలను గూర్చియు వ్రాసిన విమర్శలామె పాండితీ పరిశోధనములకు పట్టుగొమ్మలు. శ్రీ నరసింహదేవర ఉమామహేశ్వరశాస్త్రిగా రాధునిక పంచకావ్యము అనుపేర శివభారత తాంధ్రపురాణ సౌందరనందాదులనుగూర్చి కావించిన విమర్శ నిష్పక్ష పాతమై సహృదయ హృదయావర్జకముగా నున్నది.

హైదరాబాదు నందలి 'యువభారతి' వా రైదేండ్లక్రితమే డైదుగురు పండితులచే నైదేసి ఉపన్యాసము లిప్పించి వానిని కావ్యలహరి, వికాసలహరి, చైతన్యలహరి, ప్రతిభాలహరి, నవోదయలహరి అను నైదుగ్రంథములుగా ప్రచురించిరి. ఆఉపన్యాసములును, గ్రంథములును పలువురి నాకర్షింప జాలినవి. బహుశః తెలుగుదేశమున మరే సారస్వత విమర్శ గ్రంథములును అంత అల్ప కాలములో నంత అధిక సంఖ్యలో వ్యాప్తిచెంది యుండవు. అం దొక రిద్దరు తప్ప మిగిలినవారందఱును ప్రాచీన సంప్రదాయము ననుసరించి విమర్శ సాగించినవారే. ఆధునిక కవుల గ్రంథములు వస్తువులైనప్పుడు మాత్రమే కొందఱు పాశ్చాత్య విమర్శ విధానమునుకూడ నవలంబింప వలసి వచ్చినది.

తిరుపతివేంకట కవులలో నొకరైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు పలు పత్రికలలో ప్రకటించిన వ్యాసములు 'కథలు, గాథలు' అను పేర మూడు సంపుట

ములుగా ప్రకటింపబడినవి. ఆ వ్యాసములలో కొన్ని విద్వాంసులకును, కొన్ని కవులకును, కొన్ని కావ్యములకును, కొన్ని స్వీయచరిత్రకును సంబంధించినవి. విషయ విస్తరణమునను, శైలీ చమత్కారమునను, విమర్శన పాటవమునను వాని కవేసాటి. ఈ సందర్భమున పద్యరూపమున రచింపబడిన కొన్ని విమర్శ గ్రంథములనుగూర్చికూడ చెప్పవలసియున్నది. ఇట్టివానిలో కీ. శే. అనంత పంతుల రామలింగస్వామిగారి శుక్లపక్షమును ముందు పేర్కొనవలసియున్నది. అది భావకవిత్వమునందలి లోపములను హేళనపూర్వకముగా ప్రదర్శించును. చెళ్ళపిళ్ళ శతావధానిగారి జయంతి తమకును తమ గురువుగారికిని జరిగిన వివాదమును తీర్పుమని కీ.శే. జయంతి రామయ్య పంతులుగారిని సంబోధించుచు చేసిన విన్నపము. ఇటీవల శివభారతోదంత మనుపేర ప్రచురింపబడిన గ్రంథము కూడ నిట్టిదే. ఇందు శివభారత కర్తృత్వమునుగూర్చి విమర్శ యున్నది. అందలి వస్తువంతయు శ్రీ శాస్త్రిగారికి వారిమిత్రులైన సుందరరామయ్యగారు సమకూర్చి యుండిరనియు, శ్రీ శాస్త్రిగారు దానికి పద్యాకృతిమాత్ర మొసంగి రనియు తెల్పబడినది. కొంత వస్తువును వారు సమకూర్చి యుండవచ్చును కాని యందలి రచనా శిల్పమంతయు శ్రీ శాస్త్రిగారిదే. పై శివభారతోదంతము నందలి వాదమంతయు శివభారత సమీక్ష యను గ్రంథమున నిరసింపబడినది. శ్రీ శేషశాస్త్రిగారు ఉత్తరాయణమునుగూర్చి వ్రాసిన విమర్శ ఉత్తమశ్రేణికి చెంది నది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ నిర్యాణమునకు ముందు మిత్రుల ప్రేరణచే నారాముడనుపేర నొక పద్యగ్రంథమును రచించి అందు వాల్మీకి రామాయణమందును తమ కల్పవృక్షమునందును గల కవితావిశేషముల నుగ్గ డించి. ఆ పద్యములకు తామే వచనమున వ్యాఖ్యానము కూడ రచించియుండిరి. వా రందు ప్రదర్శించిన రామాయణ విశేషము లపూర్వములును అనన్య ప్రకటితములును.

## 3

దేశమున నాంగ్లవిద్య వ్యాపించిన పిమ్మట సాహిత్యవిమర్శన విధానమున నూత్నరీతులు బయలుదేఱెను. ఆంగ్ల భాషానిష్ణాతులైన విమర్శకులు పాశ్చాత్య

పద్ధతి నవలంబించిరి. వారు కథా సంవిధానమునకును, పాత్ర పోషణమునకును, సాంఘిక జీవిత చరిత్రణమునకును అధికమైన ప్రాధాన్యము నొసంగ నారంభించిరి. వారు సన్నివేశముల సహజత్వమును లేక ప్రాయోభావమును ప్రశంసించుచు ధీరోదాత్తులు కాక సామాన్య తరగతులకు చెందిన నాయికా నాయకులను కూడ నగ్గించుటయేకాక దీర్ఘములును అనవసరములునైన సామయిక వర్ణనలను దీర్ఘ సమాసములను, ప్రయత్నపూర్వకమైన అలంకార ప్రయోగమును గర్హించిరి. పాశ్చాత్య విమర్శన విధానమును మొదట నాంగ్లమున ప్రవేశపెట్టిన వారు శ్రీ సి ఆర్. రెడ్డిగారు. వా రాంగ్లాంధ్రముల రెండింట మంచి పండితులు. వారు కవిత్వ తత్త్వ విచారమున నాంధ్ర ప్రబంధములందలి లోపములను సూచించుచు తెలుగున మొట్టమొదట కల్పిత కథా వస్తువుతో రచింపబడిన కళాపూర్ణోదయమును ప్రశంసించిరి. అందు కథ విస్వకపోల కల్పితము. నాయిక యైన కలభాషిణి వేశ్య. ఆంధ్ర విమర్శ వాఙ్మయమున దాని కత్యంత ప్రాధాన్యము కలదు. తరువాతి విమర్శకు లెందఱో దానిచే ప్రభావితులైరి. శ్రీ రెడ్డి గారు రచించిన యైదు వ్యాసములను గ్రంథపీఠికలను కలిపి ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు పంచమియను పేర గ్రంథముగా ప్రకటించిరి. కీ.శే. దువ్వూరి రామిరెడ్డి గారికి కవులలోనేకాక విమర్శకులలో కూడ విశిష్టమైన స్థానమున్నది. వారి కవికోకిల గ్రంథావళిలో నొక సంపుటము విమర్శవ్యాసములతో కూడినదే. వారుకూడ చాలవఱకు పాశ్చాత్య విమర్శ విధానమునే అవలంబించిరి. అందలి వ్యాసములలో కవిత్వమును గూర్చియు మనుచరిత్రమును గూర్చియు వారు రచించినవి ప్రత్యేకముగా పేర్కొన దగినవి. సాక్షి ఉపన్యాసములలో కీ శే. పానుగంటివారు సాంఘిక రాజకీయ విషయములను కళాసారస్వత విషయములను కూడ పరామర్శించి యుండిరి, విషాదాంత నాటకములు, నాటకములలో పద్యరచన మున్నగునవి పేర్కొనదగినవి వా రాంగ్లమునందలి స్పెక్టేటర్ వ్యాసములచే ప్రభావితులై ఆ విధానము నవలంబించిరి. ఈ సందర్భమున సాక్షి ఉపన్యాసములంత ప్రసిద్ధములును విస్తృతములు కాకపోయినను స్పెక్టేటరు, టాట్లరు వ్యాసముల ననుసరించి అనంతపురమునందలి కొందఱు యువకులు

రచించి ప్రకటించిన పదరుబోతు వ్యాసములుకూడ పేర్కొనదగినవి. ఆంగ్ల భాషాచార్యులును ఆంధ్రమున కథానికా నవలా రచయితలలో నగ్రశ్రేణికి చెందినవారును అయిన కీ. శే. యన్. సుబ్బారావు (బుచ్చిబాబు) గారు తెలుగున షేక్స్పియరు నాటకములను గూర్చి సవిమర్శమైన గ్రంథమును రచించి ఆం.ప్ర. సాహిత్య అకాడమి పారితోషికము నందియుండిరి.

ఆంధ్రమునకు నవల, కథానిక, ఏకాంకిక అనుప్రక్రియలు ఆంగ్ల వాఙ్మయానుసరణముననే వర్ధిల్లినవి. అందుచే వానిని పరిశీలించుపట్ల సహజముగా నాంగ్ల విమర్శనా విధానమునే అనుసరింపవలసి వచ్చును. శ్రీ మొదలి నాగభూషణశర్మగారు ఆంగ్లభాషలో మంచి పండితులు. వారు తాము రచించిన ఆంధ్రనవలా వికాసమున ఆంధ్ర నవలోత్పత్తి పరిణామముల నాంగ్ల విధానము ననుసరించి వివరించి యుండిరి. అట్లే శ్రీ పుల్లాభట్ల వేంకటేశ్వర్లుగారు కూడ నాంధ్రము నందలి నవలలను గూర్చి విస్తృతమైన గ్రంథమును రచించి ఆం.ప్ర. సాహిత్య అకాడమివారి బహుమానము నొందియుండిరి. డా॥ బి.వి. కుటుంబరావుగారు కూడ నాంధ్ర నవలా వికాసమునుగూర్చి విస్తృతమైన సిద్ధాంత వ్యాసము వ్రాసి పి. హెచ్. డి. పట్టము వడసి యుండిరి.

## 4

ఆంధ్రమున ప్రాచ్యపాశ్చాత్య విమర్శ విధానములను రెండింటిని అనుసరించి విమర్శలు సాగించినవారు కొందరు కలరు. ప్రాచ్యలాక్షణికులు ప్రవచించిన లక్షణములు లేనంతమాత్రమున వారే కావ్యమును నిరసింపరు. విమర్శించుగ్రంథము కావ్యప్రధాన ప్రయోజనమైన ఆనందము నొసంగుచున్నదా లేదా యని పరిశీలించుటయే వారి ముఖ్యలక్ష్యము. ప్రాచ్యలాక్షణికులు నిర్దేశించినట్లు ప్రఖ్యాతమైన యితివృత్తము, అష్టాదశవర్ణనలు, ధీరోదాత్తనాయకుడు మున్నగు లక్షణముల అభావము వారికి కావ్యమునెడ వైముఖ్యము కలిగింపదు. వారొకవంక రసపాత్రపోషణమును వేఱొకవంక కథాకథన కౌశలమును కార్యైక్యమునుకూడ పరిశీలించుచుందురు. వారు కావ్యమునకు సంబంధించిన సాంఘిక

రాజకీయపూర్వరంగమునుకూడ పరీక్షించి రచయిత దానిని చిత్రించుటలో నెంత వఱకు కృతార్థుడయ్యెనో గమనింతురు. వారు రచనయొక్క బాహ్యస్వరూపము నకును ఆంతరప్రవృత్తికిని సమానప్రాధాన్యము నొసంగుదురు. అనఁగా భాషా చ్ఛందస్సుల విషయమునను రసభావముల విషయమునను సమానశ్రద్ధ వహింతురు. వారివిమర్శలలో కొంతవఱకు ప్రాచ్యపాశ్చాత్యవిధాన సమన్వయము కనిపించును. విశ్వవిద్యాలయములందును కళాశాలలందును పనిచేయు నుపా ధ్యాయు లీపద్ధతి ననుసరింతురు.

కీ.శే. కోరాడ రామకృష్ణయ్యగారు తిక్కన విరాటపర్వమును మూలముతో పోల్చి సామ్యవైషమ్యములను చర్చించుచు మహాభారతవిమర్శ యను గ్రంథ మును రచించిరి. శ్రీ బి లక్ష్మీనారాయణరావుగారు 'భారతము—తిక్కనరచన' యను గ్రంథమున తిక్కనకవితాశిల్పమును పరిశీలించిరి. ఆచార్య పింగళి లక్ష్మీ కాంతంగారి" పింగళి సూరనప్రభావతీ ప్రద్యుమ్నమున కాధారములు" అను పరిశోధనవ్యాసమును, గౌతమవ్యాసములను పేర ప్రకటించిన యితర వ్యాసము లును ప్రాచ్యపాశ్చాత్య విమర్శనవిధాన సమన్వయ దృష్టితో రచింపబడినవే. వారి సాహిత్యశిల్పసమీక్షయందునుకూడ నీదృష్టియే గోచరించును. శ్రీ గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్యగారు కవిత్రయమువారి సభాపర్వ, విరాటపర్వ, నృసింహ పురాణములను గూర్చి కవిత్రయకవితావిమర్శనమను పేర చక్కని విమర్శ ప్రకటించియుండిరి. వా రందు తిక్కన విరాటపర్వమున కీచకుని ఆదర్శవిప్రా దాంతనాయకుడుగా చిత్రించి యుండెనని నిరూపించిరి. శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావుగారు ప్రకటించిన సాహితీసమాలోచనము, మాధురీమహిమ అను గ్రంథము సమన్వయసిద్ధాంతమునకు మంచి నిదర్శనము. నేను ఆంధ్రనాటక పితామహుఁడను గ్రంథమున కీ శే. ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు తమనాటకములలో పాశ్చాత్యనాటక లక్షణముల నెట్లు చొప్పించి యుండిరో ప్రదర్శించియుంటిని. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు కొందఱు పూర్వాంధ్ర కవుల రచనలనుగూర్చి సారస్వతనవనీతమను విమర్శగ్రంథమును ప్రకటించిరి.

కీ. శే బూర్గుల రామకృష్ణారావుగారు ఉమర్‌ఖయ్యాము, ఎంకిపాటలు, పారశీక వాఙ్మయము మున్నగు విషయములపై వ్రాసిన విమర్శవ్యాసములను ఆంధ్రసారస్వతపరిషత్తువారు ప్రకటించిరి. శ్రీశిష్టా రామకృష్ణశాస్త్రిగారు నాటకవిమర్శ వ్యాసము లనుపేర నొకగ్రంథమును వెలయించి అందు ప్రాచ్యపాశ్చాత్య విధానములను పరిశీలించిరి. ప్రాచ్యపాశ్చాత్య విమర్శనవిధానముల సమన్వయముతో కూడిన వ్యాసములు, వ్యాససంపుటములు పెక్కు కలవు. వానిలో ఆణిముత్యాలు, తెలుగుతీరులు, యువభారతివారు ప్రకటించిన మహతి అను బృహద్వ్యాస సంపుటి, తిరుపతి సాహిత్యసమితి వారు ప్రకటించిన రెండు వ్యాససంపుటులు ముఖ్యములైనవి. ఇవిగాక రాష్ట్రమునందలి విశ్వవిద్యాలయములలో పలువురు పండితులు డాక్టరేట్‌పట్టమునకై రచించిన సిద్ధాంతవ్యాసము లనేకము లున్నవి. అవి వాఙ్మయమునందలి ఒహుప్రక్రియలకును కావ్యములకును సంబంధించినవి.

ఆంగ్లభాషా వ్యాప్తి వలన దేశమునందలి యితర ప్రాంతము లందు వలెనే ఆంధ్ర ప్రాంతమునను రచనా విషయమున పెక్కుమార్పులు కలిగినవి. ఆంగ్లవిద్యా నిష్ణాతులైన యువకు లాంగ్లమునందలి రొమాంటిక్ కవుల రచనలచే ప్రభావితులై భావకవిత్వ మను నూత్నప్రక్రియను వెలయించిరి. ప్రేమ, ఆత్మాశ్రయత్వము, ప్రకృతివర్ణనములు, మార్మికత్వము, దేశభక్తి, సాంఘిక రాజకీయ సంస్కరణము, మృదుమధురమైన శైలి మున్నగునవి ఈప్రక్రియయందలి ప్రధాన లక్షణములు. సంప్రదాయానుసారులైన విద్వాంసులు దానిని నిరసించినను అది సుమారు రెండు దశాబ్దుల కాలము దేశమున బహుళ ప్రచారము పొందెను. సుమారు 1935 నుండి కవిత్వము నందే కాక విమర్శనా విధానము నందును అభ్యుదయ లక్షణములు గోచరించును. దానిపై మార్క్సు తత్త్వము ప్రభావము కనిపించును. సామ్రాజ్య, భూస్వామ్య, ధనస్వామ్య వాదములను విమర్శించుచు వర్ణ వర్గ రహిత సమసమాజ స్థాపనము నాకాంక్షించుచు నభ్యుదయ కవులు రచనలు సాగించిరి. వారు సాహిత్యమును సామాన్య ప్రజలకు సన్నిహితముగా కొనిరావలెనని యత్నించిరి. సంప్రదాయబద్ధమైన ప్రాచీన సాహిత్యము సామాన్యజనుల కెట్టి అభ్యుదయమును కలిగింపనేరదని వారు

భావించిరి. సమాస భూయిష్ఠమైన ప్రౌఢ శైలియు, గణయతి ప్రాసాదిచ్ఛందో నియమములును స్వచ్ఛంద భావ వ్యక్తీకరణమునకును సులభావగాహనము నకును ఆటంకకరములుగా నుండునని వారి ఆశయము. శ్రీ శ్రీ, నారాయణ బాబు మున్నగువా రభ్యుదయ కవిత్వమును వ్రాయుటయేకాక దానిని హేతువాద పూర్వకముగా సమర్థించుటకై కొన్ని వ్యాసములు కూడ రచించిరి.

1959 లో శ్రీశ్రీ. గురజాడ రచనలందలి అభ్యుదయ లక్షణములను వెల్లడించుటకై నొక వ్యాసము వ్రాసెను. శ్రీ కె వి. రమణారెడ్డి గారు గురజాడ వెలుగు జాడ, మహోదయము అను విమర్శ గ్రంథము లందు గురజాడ రచనలందలి ఉత్తమ లక్షణములను వివరించిరి. వారే కవికోకిల అను గ్రంథమున దువ్వూరి రామిరెడ్డి గారి కవిత్వమును ప్రశంసించిరి. శ్రీ అద్దేపల్లి రామ మోహనరావు గారు శ్రీ శ్రీ కవితా ప్రస్థానమను గ్రంథమున మహాప్రస్థానము నందలి అభ్యుదయాంశములను ప్రకటించిరి. శ్రీ త్రిపురనేని మధుసూదనరావు గారు విప్లవ కవిత్వ లక్షణములను ప్రపంచించు నేడు వ్యాసములతో కూడిన "కవిత్వం-చైతన్యం" అను గ్రంథమును ప్రకటించి ఆ కవిత్వమునకు తత్త్వప్రాతిపదికను కల్పించిరి. 'ఫ్రీవర్స్-ఫ్రంటు' పక్షమున శ్రీ కుందుర్తి ఆంజనేయులు గారును, గోపాల చక్రవర్తి గారును, రమణారెడ్డి, సంపత్కుమార, గోపాల కృష్ణమూర్తి, సుప్రసన్న, మోహన్ ప్రసాద్, వరవర రావు, సోమసుందర్ మున్నగు వారి వ్యాసములతో కూడిన 'వచన కవిత' అను గ్రంథమును సంపాదించి వచన కవిత అభ్యుదయ భావ ప్రచారమున కత్యంత సమర్థమని నిరూపించిరి. వరంగల్లు నుండి ప్రచురింపబడిన జనధర్మ అనుపత్రికలో డా. సుప్రసన్న గారి సంపాదకత్వమున స్వాతంత్ర్యానంతరము వెలసిన తెలుగు కవిత్వమును సమీక్షించు వ్యాసములు ప్రకటించిరి. శ్రీ ఆర్. యస్ సుదర్శనం గారు 'సాహిత్యంలో దృక్పథాలు' అను గ్రంథమున పెద్దన, గురజాడ, విశ్వనాథ, గోపీచంద్, చలం మున్నగువారి రచనలను గూర్చి సవిమర్శములైన వ్యాసములు ప్రకటించిరి. సమాజము-సాహిత్యము అను వ్యాస సంపుటిలో పూర్వార్థమున వారు సాహిత్యమునందు సామాజిక చైతన్యము,

కాల్పనికవాదము, విప్లవము, మానవత్వము, అధునికత అను విషయములను గూర్చియు, ఉత్తరార్ధమున అల్పజీవి, చివరకు మిగిలేది, మాలపల్లి మున్నగు నవలలను గూర్చియు ఆలోచనాస్ఫోరకములైన వ్యాసములు రచించి యుండిరి. అందలి చివరి వ్యాసమున వారు సాహిత్య విమర్శ స్వరూపమును వివరించి యుండిరి. అభ్యుదయ దృక్పథము కలవారయ్యు ప్రాచీన సాహిత్యముపై గౌరవాభిమానములు కలిగియుండుట వారి యందలి విశిష్ట లక్షణము. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారు సాహిత్య ప్రయోజనమను గ్రంథమున మార్క్సు మానవతా దృక్పథములను ప్రదర్శించి యుంటిరి. డా సు పసన్న గారి సాహిత్య వివేచన ఉత్తమ విమర్శ గ్రంథముగా ఆం. ప్ర. సాహిత్య అకాడమి వారి బహుమానమునకు పాత్రమైనది. శ్రీ గొఱ్ఱెపాటి వెంకట సుబ్బయ్య గారి చలం, అక్షరాభిషేకము అను గ్రంథములును, శ్రీ డి. రాజా రావుగారు గోపిచంద్ జీవితమును, ఉగాది సంచికలందలి యన్. గురుప్రసాద రావు గారి వ్యాసములును అభ్యుదయ భావ సమన్వితములై యున్నవి. గురజాడ, శ్రీ శ్రీ లను గూర్చి శ్రీ సోమసుందర్ కావించిన విమర్శల కభ్యుదయ సాహితీమిత్రు లొసంగిన సమాధానమును విశాలాంధ్ర ప్రచురణాలయము ప్రకటించినది. శ్రీ పొట్లపల్లి సీతారామారావు గారు గురజాడను విమర్శించుచు భారతిలో కొన్ని వ్యాసములు ప్రకటించిరి. హైదరాబాదు నందలి Seven stars syndicate వారు వచన కవితను గూర్చి కొన్ని వ్యాసములు ప్రకటించిరి. వరంగల్ నుండి శ్రీ వరవర రావు గారి సంపాదకత్వమున వెలువడిన సృజన పత్రికలో వచన కవితనుగూర్చి పెక్కువిమర్శవ్యాసములు ప్రకటింపబడినవి. సోమసుందర్ సంపాదకత్వమున వెలువడిన కళాకేళి యందును, శ్రీ శివారెడ్డి గారి సంపాదకత్వమున వెలువడిన వేకువ యందును ఆధునిక కవిత్వమందలి విప్లవాత్మకచ్ఛాయలను గూర్చి పెక్కు వ్యాసములు రచింపబడినవి. శ్రీ పి. యస్. ఆర్. అంజనేయ శాస్త్రి గారు తరుణ పత్రికలో దిగంబర కవితను తీవ్రముగా విమర్శించి యుండిరి.

విప్లవాశయములు కల కొంద ఱిటీవల ప్రకటించిన విమర్శలలో కొంత అతివాదము గోచరించును వారికి సంప్రదాయ సాహిత్యముపై నెట్టి గౌరవమును

లేని కితమున వారు దానిని తీవ్రముగా విమర్శింతురు. ప్రస్తుత పరిస్థితి అభ్యుదయమున కాటంకమగుటచే దానిని సమూలముగా ధ్వంస మొనర్చినగాని అభ్యుదయ సూచనలు కనిపింపవని వారు భావింతురు. వారి అభిప్రాయ వ్యక్తీకరణమున విశృంఖలతయు, ఆధ్యాత్మికతా వైముఖ్యమును, భౌతికవాదాసక్తియు గోచరించును సంప్రదాయ కవుల రచనలలోని దోషములను, అవాంఛనీయ సన్నివేశములకు ఎత్తిచూపుటయందుకాని ఆధునిక కవుల రచనలందలి విశాల దృష్టిని సామాజిక దృక్పథమును ప్రశంసించుటయందుకాని దోషము లేదు. కాని విమర్శ నిర్మాణాత్మకముగా నుండదగును కాని విధ్వంసకముగను దోషదర్శనైకతత్పరముగను నుండరాదు.

ఆధునిక కవులలో నగ్రేసరులైన శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు మనోహరములైన పెక్కు లఘుకావ్యములను ఖండకావ్యములను రచించుటయే కాక రమ్యాలోకనమను పేర కవితా సిద్ధాంత ప్రతిపాదకమైన యొక లక్షణ గ్రంథమును కూడ రచించిరి. వా రందు ఆధునిక కవుల కవితా విధానమును, ప్రేమ శృంగార ప్రతిపాదన విధానమును వివరించి యుండిరి. ఇది పద్య రూపమున రచింపబడి యుండుటచే నెక్కువగా వ్యాప్తి పొందియుండలేదు. పద్యరూపమున నాధునిక కవితా స్వరూపమును వివరించు గ్రంథ మిది యొక్కటే.

ఆధునిక కవిపుంగవులైన డా. సి నారాయణరెడ్డిగారు "ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయము ప్రయోగములు" అను సిద్ధాంత గ్రంథమున ఆధునిక కవిత్వము నందలి సంప్రదాయానుసరణమును ప్రయోగవైశిష్ట్యమును నిరూపించుటే కాక భావకవిత్వము, అభ్యుదయ కవితారీతులు, అతినవ్యకవితాధోరణులు అను వానిని కూడ సమగ్ర దృష్టితో పరిశీలించియుండిరి. ఆధునిక కవితా స్వరూప స్వభావముల నెఱుంగగోరువారు తప్పక చదువవలసిన ఉత్తమ గ్రంథ మిది.

## 6

కొందరు విమర్శకులు పూర్వకవుల గ్రంథములందు గర్భితములైయుండిన సాంకేతిక తాత్త్విక విషయములను వెలువరించుటకు ప్రయత్నించి

యుండిరి. అట్టి వానిలో శ్రీ డా. జి. వి. కృష్ణారావుగా రాంగ్లమున రచించిన కళాపూర్ణోదయముమీది సిద్ధాంతవ్యాసము పేర్కొనదగినది. కళాపూర్ణ శబ్దము కేవలము నాకు మాత్రమే కాక తాత్త్వికార్థమును కూడ నిరూపించు చున్నదని వారందు విశదీకరించి యుండిరి. అట్లే కీ. శే. దేకుమళ్ళ అచ్యుత రావు గారు పింగళి సూరన అను నాంగ్ల గ్రంథమున ప్రశ్నోపని షత్ప్రతిపాదితములైన తాత్త్విక విషయములు కళాపూర్ణోదయమున నన్యాపదేశముగా నెట్లు ప్రతిఫలింప జేయ బడినవో ప్రదర్శించి యుండిరి. డా. జి వి. సుబ్రహ్మణ్యముగారు కలభాషిణీ కథా కల్పనకు బీజములు సరస్వతీ చతుర్ముఖుల ప్రణయకేళీ కథా ఘట్టములోని యా పాత్రల బింబ ప్రతిబింబాత్మక సంచలనములనందును, చేష్టాదికములందును గలవను నంశమును ప్రతిభావంతముగా ప్రతిపాదించి యుండిరి. వీరు ప్రబంధములకు ప్రతీకాత్మక ప్రవృత్తి ముఖ్యలక్షణమని నిర్దేశించిరి. పురాణకథలయందును, దేవీభాగవతము నందును, ఉత్తరహరివంశములోని హంసడిభకోపాఖ్యానమునందును, విజయ విలాసమునందును గల ప్రతీకాత్మక కథాప్రవృత్తిని, పాత్రల స్వరూప స్వభావములను వివేచనాత్మకముగా వివరించియుండిరి.

శ్రీ గుంటూరి శేషేంద్ర శర్మ గారు షోడశి రామాయణ విశేషములు అను గ్రంథమున సుందర కాండము నందలి త్రిజటా స్వప్న మెట్లు గాయత్రీ మంత్రార్థమును నిరూపించుచున్నదో చక్కగా విశదీకరించి యుండిరి. వారు స్వర్ణహంస అను గ్రంథమున శ్రీనాథుని నైషధమునందలి ఆధ్యాత్మిక దృష్టిని వివరించి యుండిరి. శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు శ్రీవిద్యానిష్ఠాతులు. వారు పెక్కు ఉత్తమములైన ఆధ్యాత్మిక గ్రంథములను, నవలలను రచించుటయే కాక బమ్మెర పోతనను గూర్చియు, నన్నెచోడుని కుమార సంభవమును గూర్చియు ప్రశస్తములైన విమర్శలను వెలయించి యుండిరి. నన్నెచోడుని గూర్చి వ్రాయుచు వారు వస్తుకవిత యనగా పరమార్థ వస్తు ప్రతిపాదకమైన కవిత్వమని నూతనమైన వ్యాఖ్యాన మొసంగి కుమారసంభవ మట్టి కవితకు నిధానమని నిరూపించి యుండిరి.

శ్రీ డా. సుప్రసన్న గారు తమ వసుచరిత్రను గూర్చిన సిద్ధాంత వ్యాసమున నందలి సాంకేతికార్థమును వివరించి యుండిరి. మహా భారతము నందలి వసురాజు వృత్తాంతమునకు మూలము ఋగ్వేద మందలి వృత్రాసురుని కథ యనియు, వృత్రాసురు డాకసమున మేఘము రూపముననో, చీకటి రూపముననో జలమునో, వెలుగునో బంధింపగా నింద్రుడో, సూర్యుడో వానిని భేదించి లోకమునకు జలమునో వెలుగునో ప్రసాదించిరనియు, నా వృత్తాంతమే వసుచరిత్రలో సాంకేతికముగా చిత్రింపబడినదనియు వారి భావము. వారి ననుసరించి వసు విందస్థానీయుడు; కోలాహలుడు వృత్ర స్థానీయుడు; శుక్తిమతీ గిరికలు జలాలోక స్థానీయులు. మఱియు వసు వనగా జలము వెలుగు అను నర్థములు కూడ నుండుటచే జలాలోకములకథ యనుస్ఫూర్తి కలుగునట్లు భట్టుమూర్తి తన ప్రబంధమునకు వసుచరిత్రయను పేరు పెట్టెనని వారియభిప్రాయము.

## 7

ఆంధ్ర రాష్ట్రము నందలి విశ్వ విద్యాలయములందును, ఢిల్లీ, మైసూరు, మదరాసు, బెంగుళూరు, ధార్వారు మున్నగు బైటి విశ్వ విద్యాలయములందును పి. హెచ్.డి. పట్టమునకై పలువురు పండితులు సమర్పించిన సిద్ధాంత వ్యాసము లనేకము లున్నవి. అవి ఆంధ్ర భాషా సారస్వతములకు సంబంధించి యనేక నూత్న విషయములను ప్రతిపాదించి యున్నవి. అట్టివి సుమారు వంద యుండును. అవన్నియు నిశిత పరిశీలానాత్మకములై బహుగ్రంథము లందలి రామణీయకమును వెల్లడించుచు ఆంధ్ర విమర్శ వాఙ్మయమునకు అలంకారము లని చెప్పదగి యున్నవి.

ఆంధ్రమున ప్రచురింపబడిన పూర్వాధునిక గ్రంథములలో కొంచె మించుమించుగా నన్నిటికిని ముందు ప్రముఖులైన విద్వాంసులో కవులో వ్రాసిన ఉపోద్ఘాతము లుండును. పరిమాణమున వీనిలో తారతమ్యమున్నను ఇవన్నియు విమర్శనాత్మకములే. ఆం.ప్ర. సాహిత్య అకాడమి వారు సుమారు

నలువది. పూర్వకావ్యముల నిట్టి ఉపోద్ఘాతములతో ప్రచురించి యుండిరి. ఇవన్నియు నాయాగ్రంథములందలి విషయములను కూలంకషముగా సమీక్షించు నట్టివే. ఇతరుల గ్రంథములకు ప్రశస్తములైన ఉపోద్ఘాతములను వ్రాసిన వారిలో కీ.శే విశ్వనాథ సత్యనారాయణ గారును, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారును పేర్కొనదగినవారు. ఆధునిక కవివిమర్శకులలో శ్రీశ్రీ గారును, శ్రీకృష్ణ శాస్త్రి గారును, డా సి. నారాయణ రెడ్డి గారును, డా॥ దాశరథి గారును, డా. జి వి. సుబ్రహ్మణ్యము గారును, కె. వి రమణారెడ్డి గారును, కుందుర్తి ఆంజనేయులు గారును రచించిన ఉపోద్ఘాతము లుత్తమశ్రేణికి చెందినవి. ఆధునికులలో వివిధ పత్రికలందు విమర్శ వ్యాసములు ప్రకటించినవారును గ్రంథ రూపమున విమర్శలు ప్రకటించినవారును పలువురున్నారు.

## 8

ఆధునిక కాలమున పలువురు వ్యాసరూపముననుు గ్రంథ రూపముననుు విమర్శలను విమర్శ సిద్ధాంతములను ప్రకటించుచుండుట, ముదావహమైన విషయమే. విమర్శ సిద్ధాంతములను కేవల ప్రాచ్య దృష్టితోడనో కేవల పాశ్చాత్య దృష్టితోడనో వెలువరించిన వారు కొంద రున్నారు కాని స్వతంత్ర దృష్టితో సాహిత్య మీమాంస కావించిన వా రరుదు. కీ.శే. విశ్వనాథ సత్య నారాయణగా రందుకు ప్రయత్నించిరి కాని వారి గ్రంథము మొదటిభాగము మాత్రమే ప్రచురితమైనది. ఛందో వ్యాకరణములపై ప్రశంసనీయములైన విమర్శలు వెలువడినవి. హాస్యవీరరసములను గూర్చివలెనే యితరరసములను గూర్చియువిమర్శ గ్రంథములు వెలువడవలసి యున్నది. తెలుగున నిర్మాణాత్మకమైన విమర్శ వికాసము పొందవలసిన అక్కఱ యెంతైన గలదు.

"ఈ దేశమున సాహిత్య విమర్శ నిరాధారములైన బహువిషయములతో నల్లుకొని పోవుచున్నది. అప్రమాణములైన బహుసిద్ధాంతములు విమర్శ రూపమున చెప్పబడు చున్నవి. అది భాషకు సాహిత్యవేత్తలు కాని సామాన్యులైన సాహిత్యాభిమానులకు అపకారము చేయుచున్నది." "ఇంత

కావ్యముల లోతుకు వెళ్ళలేక పైపైని మాత్రము స్పృశించి వదలి వేయుట కూడ పలువురు విమర్శకులయందు వాడుకగా నున్నది.'' "అలంకారములు, వర్ణనలు, పాత్రపోషణము, శైలి మున్నగు నంశములను వేసికి వానిని విభజించి చూపుదురు కాని కావ్యపరమార్థమున కవి యెట్లుపస్కారకము లగుచున్నవో విస్మరింతురు. కావ్య సామాన్యములైన యీ బహిర్లక్షణముల వెనుక వాని కతీతముగా అంతర్లీనమైయున్న అంతర్యమును వెల్లడించువా రరుదు. ప్రాచీనాధునిక సాహిత్యములందలి భిన్నప్రక్రియలను గుర్తింపకుండ ప్రతి రచయితను, ప్రతి రచనను ఒకే త్రాసులో తూచుట మంచిది కాదు.'' "అద్యతనాంధ్ర సాహిత్యమున తలెత్తుచున్న వివిధ వాదములు నేటి విమర్శనారంగమును కల్లోలిత మొనర్చు చున్నవి. వ్యక్తిపూజలు, వైయక్తికాభిప్రాయములు పెచ్చు పెరిగి సాహిత్య విమర్శ స్థానమును దిగజార్చు చున్నవి.'' ఆధునికాంధ్ర విమర్శ స్థాయిని పరిశీలించుపట్ల పెద్దలు పల్కిన పైవాక్యములు గమనింపదగినవి.

పూర్వ పండితుల విమర్శలలో కొన్నిచోట్ల గ్రంథ విమర్శతో పాటు గ్రంథకర్తృ విమర్శ కూడ సాగుచుండెడిది. విమర్శకునికి గ్రంథ గుణ దోషములతోనేకాని, గ్రంథకర్త గుణదోషములతో పనిలేదు. గ్రంథములను విడిచి గ్రంథకర్తలను దూయబట్టుట అనాగరికమును, 'ఛాందసయుక్తము' నైన పద్ధతి. ఆధునిక మహాకవులు నాగరిక శిరోమణులైనను ఈ పద్ధతి నవలంబించుట కొన్నిచోట్ల కానబడుచున్నది. ఇది కడు శోచనీయము. విమర్శకులు పరిశీలింపవలసినది గ్రంథముల అంతర్యము కాని గ్రంథకర్తల జీవిత విధానములందలి అంతర్యము కాదు. ఆ రెండిటికిని సన్నిహిత సంబంధ మున్నచో ఆ సంబంధమును సున్నితముగా సూచింప వచ్చును.

పాశ్చాత్యలాక్షణికులలో ప్రమాణభూతులైన మహామేధావు లనేకులు న్నారు. వారిగ్రంథములను పఠించి వాని ననుసరించి ఆధునికగ్రంథములను విమర్శించుట పలుచోట్ల కానవచ్చుచున్నది. పాశ్చాత్యసాహిత్య ప్రక్రియల

ననుసరించి రచింపబడిన రచనల నా ప్రమాణములతో పరిశీలింపవచ్చును. కాని, ప్రాచ్యదృష్టితో రచింపబడిన గ్రంథముల నా ప్రమాణములతో పరిశీలించి అవి ప్రగతిశీలములు కావని నిరసించుట యుక్తము కాదు. సాహిత్యవిమర్శ విషయమున ప్రాచ్యలాక్షణికులు కావించిన కృషి అనన్యసామాన్యమైనది. వారు రచించిన లక్షణగ్రంథములు బహుపరిశీలనా ఫలితములు. ఆధునికులు పాశ్చాత్య లక్షణగ్రంథములతోపాటు ప్రాచ్యలక్షణ గ్రంథములను కూడ పరిశీలింపవలసి యున్నది. అప్పుడు వారి విమర్శలు సమగ్రములును, నిష్పక్షపాతములును నిర్మాణాత్మకములునై ప్రశస్తములుగా నుండును. ఆధునిక రచయితలపై, నాంగ్ల సాహిత్య ప్రభావ మెంత యధికముగా నున్నను వారి జీవలక్షణము మాత్రము భారతీయమే. ఆ లక్షణము కూడ వారి రచనలలో నంతర్లీనమై యుండును. అందుచేతనే ప్రాచ్యలాక్షణికుల సిద్ధాంతములను కూడ నాధునిక విమర్శకులు పరిశీలింపవలసిన అక్కఱ కలదని నా బుద్ధికి తోచుచుండును. సద్విమర్శకుడు వ్యక్తిగతములైన రాగద్వేషములకు దూరుడై మమతా పరిత్యాగ పూర్వకములైన సమతా సానుభూతిభావములకు నిలయమై యుండవలయును. అజ్ఞానవశమున నే నిందు పలువురు విమర్శకులయు, విమర్శలయు నామములను పేర్కొనజాలకపోతిని. క్షంతవ్యుడను.



# పరిశోధన–పరమార్థ పరిశీలన

డా॥ కొత్తపల్లి వీరభద్రరావు

ఏదేనా ఒక విషయాన్ని గురించి సాధ్యమైనంత సమగ్రంగా తెలుసుకోవాలనే కుతూహలం పరిశోధనకు ప్రాణం. పరిశోధనకు పరమావధి జ్ఞానాభివృద్ధి. మానవుని జీవితంలోని అన్నిరంగాలలోను పరిశోధనకు అవకాశంఉంది. పరిశోధకుడు ఎన్నుకొన్న రంగాన్ని అనుసరించి ఉపకరణాలు మారుతూ ఉంటాయి. పార్థివ జగత్తుమీదా పరిశోధన ఉంది. ఆధ్యాత్మిక రంగంలోనూ పరిశోధనఉంది. వస్తుతత్త్వాన్ని తెలుసుకోవడానికి పరిశోధన కావాలి. ఆత్మతత్త్వాన్ని అవగాహన చేసుకోవడానికీ పరిశోధన కావాలి. రెండింటికి మధ్య ఊగిసలాడుతూ ఉండే మనస్సును అర్థంచేసుకోవడానికీ పరిశోధన కావాలి. ఈ కారణాలవల్ల మానవుడు జన్మించినప్పటినుంచీ పరిశోధన జరుగుతునేఉంది అనడంలో అతిశయోక్తిలేదు ఒక పరిశోధకుడి పరిశోధన ఫలితాలు ఆ రంగంలో తరవాత కృషిచేసేవాళ్లకు ముందంజ వేయడానికి పనికివస్తూఉంటాయి. వ్యావహారిక జగత్తునకు సంబంధించిన శాస్త్రాది విషయాలలో పరిశోధన విశ్వవ్యాప్తంగా జరుగుతూఉన్నట్లే ఆధ్యాత్మిక రంగంలోనూ పురోగతి సాధించడం కోసం కొందరయినా కృషిచేస్తున్నట్లు మనం వింటూ ఉంటాము. ఇప్పుడు మనకు వ్యావహారిక జగత్తునకు సంబంధించిన పరిశోధనలే ప్రస్తుతాంశాలు. వాటిలోనూ సృష్టికి ప్రతిసృష్టిగా మానవుడు కల్పించిన సాహిత్య జగత్తు మనకు పరిశోధన వస్తువు.

పరిశోధన విషయాన్ని గ్రహించడంలో పరిశోధకుడికి స్వేచ్ఛఉంది. ఆ పరిశోధనను తన దృక్పథంతో తీర్చిదిద్దడంలో కొంత స్వేచ్ఛఉంది. ఇవి వ్యక్తుల ననుసరించి భిన్నంగాఉన్నా పరిశోధకులందరూ అవలంబించవలసిన మూలసూత్రాలుమాత్రం కొన్నిఉన్నాయి. పరిశోధనకు శాస్త్రత్వాన్ని కల్పిం

చేవి ఇవే. పరిశోధన విషయం సాహిత్య సంబంధి అయినా పరిశోధన పద్ధ తులు శాస్త్రీయాలై పరిశోధన ఫలితాలకు విలువ తెస్తాయి. ఈ మూలసూత్రా లను అనుభవజ్ఞులనుండి గాని, గ్రంథావలోకనం వల్లగాని పరిశోధకుడు గ్రహించవచ్చు. ఈ మూలసూత్రాలను ఎంత నిష్కర్షగా నిశితంగా పాటిస్తే అంతగా పరిశోధన గ్రంథానికి గౌరవం వస్తుంది. పోనీ, గౌరవం మాట ఎలా ఉన్నా ఈ పాటింపువల్ల పరిశోధన ఫలితాలను చక్కగా తరువాతివాళ్లు గ్రహించ డానికి వీలు కలుగుతుంది.

ఈ సూత్రాలలో మొదటిసూత్రం యథార్థత. దీని ప్రాముఖ్యాన్ని గురించి విశేషంగా చెప్పవలసింది లేదుగదా! పరిశోధనకు ఇది ఆధారభూమి. తాను చెప్పే విషయం యథార్థమయిందా? కాదా? అని సూక్ష్మంగా పరిశీలించి తనకు తృప్తి కలిగిన తరువాతనే దానిని ప్రకటించాలి. అయితే ఒక పరిశోధ కుడు యథార్థ మనుకొన్నది తరువాతి పరిశోధనలవల్ల యథార్థం కాదని రుజు వయినా మొదటి పరిశోధకుడి చిత్తశుద్ధిని శంకించడం ఉండదు ఆ పరిస్థితులలో. తాను ప్రకటిస్తూ ఉన్న అంశంయొక్క యాథార్థ్యాన్ని రుజువుచేసే ప్రతిచిన్న విష యాన్ని పరిశోధకుడు ఉటంకించడం మంచిది. ఇది ఆ పరిశోధనకు విలువనూ తెస్తుంది; తరవాతి వాళ్లకు మార్గదర్శకంగానూ ఉంటుంది.

ఇంక రెండోసూత్రం క్రమబద్ధత. ప్రతి పరిశోధనలోనూ అనేక గ్రంథాల పరిశీలన, వివిధ విషయాల సేకరణ ఉండటం సహజం ఈ సామాగ్రిని నిర్ణీతమైన పద్ధతిలో ఏర్పర్చుకొని వ్రాసికొని సిద్ధం చేసుకోవడం అత్యంతా వశ్యకం. అవసరమనుకొంటే దీనిని అనుబంధంగా ఇచ్చి పరిశోధన ప్రాశస్త్యాన్ని ఇనుమడింపజేసుకోవచ్చును. తరవాతి పరిశోధకులకు నిర్దిష్టమయిన పరిశోధన విషయానికి సంబంధించి ఉన్న సామాగ్రి దీనివల్ల తెలుస్తుంది. పరిశోధన రంగం అభివృద్ధి పొందడానికి ఇది పనికివస్తుంది. వివిధ పరిశోధకుల పరిశోధన ఫలి తాలు సోపానక్రమంలో ఉన్ననాడే నిర్దిష్టమయిన విషయానికి సంబంధించి ఎంతపరిశోధన జరిగింది, ఇంకా ఎంత జరగవలసిఉంది అనే సంగతులు తెలుస్తాయి.

ఇంక మూడోసూత్రం తర్కబద్ధ వివరణ ఇది క్రమబద్ధతకు సన్నిహితంగా ఉన్నట్లు కనబడుతుంది. కాని రెండిటికి ముఖ్యమైన భేదం ఒకటి ఉంది. ఒకవిధంగా చెప్పాలంటే క్రమబద్ధత యాంత్రికంగా సాధించేది. దీనియందు బుద్ధి కంత ప్రమేయం లేదు. తర్కబద్ధవివరణ బుద్ధిగమ్యమయినది. పరిశోధన ఫలితాల ప్రదర్శనంలో వివరణలో ఇతర పరిశోధకుల ఫలితాల, అభిప్రాయాల, ఖండనలో బుద్ధికి విశిష్టస్థానం ఉంది. ఈ స్థానాన్ని గుర్తించకుండా పరిశోధన ఫలితాలను వివరిస్తే, పరిశోధకుడి సామాగ్రి ఎంత విస్తృతమయింది అయినా పాఠకుడిమీద ఆ పరిశోధన ప్రభావం నీడలా పడుతుందేకాని వెలుతురులా పడదు.

ఇంక నాలుగో సూత్రం చిత్తశుద్ధి. పరిశోధనలో దీనికున్న ప్రాముఖ్యాన్ని 'ఇంత' అని వివరించడం అసాధ్యం. ఒక్కొక్కప్పుడు పరిశోధకుడికి వ్యక్తిగతంగా నచ్చని ఫలితం, అతడు చేస్తున్న పరిశోధనవల్ల రావచ్చు. అంతకుపూర్వం తాను శ్రమపడి చేసిన పరిశోధన వల్ల వచ్చిన ఫలితాలకు విరుద్ధమయిన ఫలితాలు రావచ్చు. తన నమ్మకాలకు వ్యతిరేకంగా ఫలితం ఉండవచ్చును. కాని ఉత్తమ పరిశోధకుడు వీటిని లెక్కచేయకుండా వచ్చిన ఫలితాన్ని వచ్చినట్లు ప్రకటించాలి. ఈ చిత్తశుద్ధికి కావలసిన నైతికబలం అతనికి ఉండాలి. పరిశోధనలో ఇది లోపించిందని ఒక్కచోట రుజువయినా ఆ పరిశోధన విలువా ఆ పరిశోధకుడిస్థాయీ తగ్గిపోతాయి. ఇంకొక్క చిన్నవిషయాన్ని కూడా ఈ సందర్భంలో పరిశోధకుడు గుర్తుంచుకోవాలి. తనకు చిత్తశుద్ధి ఉందిగదా అని తన పరిశోధన ఫలితాన్ని ప్రకటించేటప్పుడు అనావశ్యకమయిన ఉద్రేకాన్ని ప్రకటించకూడదు. కొంత స్వస్వరూపజ్ఞానం ఉన్నప్పుడే పరిశోధకుడు ఈ ఉద్రేకాలకు లొంగకుండా పరిశోధన కొనసాగించగలడు. ఆత్మవిమర్శ చేసుకొనే శక్తిని పరిశోధకుడు సంపాదించుకొన్ననాడే అతనికి స్వస్వరూపజ్ఞానం కొంతైనా కలుగుతుంది. పరిశోధకుడికి ఇది చాలా అవసరం.

ఇప్పుడు చెప్పిన నాలుగు సూత్రాలూ ఒకవిధంగా విషయానికి సంబంధించినవి అనవచ్చు. ఇంక రచనకు సంబంధించిన సూత్రం ఒకటి ఉంది.

ఈ అయిదోసూత్రం స్పష్టత పరిశోధనరచనలో అస్పష్టతకు తావులేదు. భాష, విషయానికి ఉచితమయిందిగా ఉండాలి. పరిశోధన, విషయానికి ప్రాముఖ్యమున్న కృషి. భాషా కాఠిన్యం అనావశ్యకం. ఆలంకారికమయిన కవితాశయ్యకు తావులేదు. ప్రారంభంలోనే చెప్పినట్లు, పరిశోధనకు పరమావధి నిర్దిష్టవిషయంలో జ్ఞానాభివృద్ధి పరిశోధన గ్రంథాలను చదివేవాళ్లు వాటిని రసాస్వాదంకోసం చదవరు. విషయగ్రహణం కోసం చదువుతారు. అలాగని భాష పేలవంగా ఉండకూడదు. సరళంగా స్పష్టంగా ఉండాలి. పరిశోధన హృదయసంబంధి కాదు. బుద్ధిసంబంధి. ఈ విషయాన్ని గుర్తుంచుకొని పరిశోధకుడు శబ్దరమ్యతకోసం పాటుపడకుండా అర్థవివరణకు పనికివచ్చే సూటి మాటలతో రచన కొనసాగించాలి. ఇలాగని అవసరంవస్తే రమ్యశబ్ద ప్రయోగం కూడదని కాదు. జీవితంలోలాగే ఔచిత్యం ఇక్కడ కూడా పాటించాలి అన్న మాట!

ఈ అయిదో సూత్రంలో అంతర్భాగాలుగా గ్రహించవలసిన ఉపసూత్రాలు కొన్ని ఉన్నాయి. అనవసరమైన ఉదాహరణలు, ఉద్ధృతాలు, పులుముడు మాటలు లేకపోవడం వీటిలో ఒకటి. వాక్యరచన డొంక తిరుగుడుగా, దూరాన్వయంతో ఉండకూడదు. రచయిత 'భావాంబరవీధి' లో పయనించకుండా "భూమార్గం" తొక్కాలి. అనవసరమైన తత్సమ శబ్దాలను, సమాసాలను గుప్పించకూడదు. ప్రత్యేక ప్రయోజనం లేనప్పుడు మాండలిక శబ్దాలను ప్రయోగించకూడదు. పాతబడిన సామెతలు, ఉపమానాలు, పలుకుబళ్లు పనికిరావు. భాషకు సంబంధించిన ఉపసూత్రాలలో మిగిలినవి ఇవికొన్ని. ఒక్కమాటలో చెప్పాలి అంటే భాష ఆధునికంగా ఉండాలి అన్నమాట! అధ్యాయాల విభజనవిషయంలో కూడా ఔచిత్యాన్ని పాటిస్తూ రావాలి. ప్రధానఅంశం మారినప్పుడు కొత్త అధ్యాయం ప్రారంభించవచ్చునుగాని, ప్రతిచిన్న విషయానికి కొత్త అధ్యాయం ప్రారంభించి గ్రంథాన్ని "అధ్యాయాలపుట్ట" చేయకూడదు.

ఈ మూలసూత్రాలు, పరిశోధన చేసేవాళ్లందరూ సామాన్యంగా గ్రహించవలసినవే. ఈ సందర్భంలో, తెలుగు భాషాసాహిత్యాలలో పరిశోధన చేసినవాళ్ళ గ్రంథాలను ఈ దృష్టితో పరిశీలించవలసిఉంది. ఇప్పుడు మన మవలంబిస్తూఉన్న పరిశోధన పద్ధతులు కొంతవరకు పాశ్చాత్యుల పరిశోధనల పద్ధతుల అనుసరణ పెద్దఎత్తున విశ్వవిద్యాలయాలలో పరిశోధనలు జరుగుతూ ఉండడంవల్ల ఈ అనుసరణ అలవాటయింది. ఈ పాతికేళ్లలో ఆంధ్ర ప్రదేశ్‌లో ఉన్న విశ్వవిద్యాలయాలలోనే కాకుండా, భారతదేశంలో తెలుగు పఠన పాఠ నాదులున్న అన్ని విశ్వవిద్యాలయాలలోను కొన్ని పాశ్చాత్య విశ్వవిద్యాలయాల లోను, వివిధ విశ్వవిద్యాలయాలలోని భాషా శాస్త్ర విభాగాలలోను తెలుగు పరిశోధనలు జరుగుతున్నాయి సహజంగా ఆంధ్ర ప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాలలో ఈ కార్యక్రమం విస్తృతంగా జరుగుతోంది.

కడచిన పాతికేళ్లలో పరిశోధకుణ్ణిగా, పర్యవేక్షకుణ్ణిగా, పరీక్షకుణ్ణిగా 40, 45 సిద్ధాంత వ్యాసాలతో నాకు ప్రత్యక్ష సంబంధం ఉంది. పరిశోధనలు జరుగుతున్న ప్రతి విశ్వవిద్యాలయంతోను నాకు ఈ విధమైన సంబంధం ఉందని చెప్పవచ్చు. ఇదిగాక అచ్చయిన ప్రతిసిద్ధాంత వ్యాసాన్ని, లిఖిత రూపంలో ఉన్నకొన్ని సిద్ధాంత వ్యాసాల్ని చదివాను ఇతఃపూర్వం నేను చెప్పిన సూత్రాల్ని వీటికి అన్వయించి చూస్తే కొన్ని విశేషాలు కనిపించాయి. నాకు ప్రత్యక్షంగా సంబంధంఉన్న సిద్ధాంత వ్యాసాలమీద నేను వ్రాసుకొన్న నోట్సు, ఇతరగ్రంథాలు చదువుతూ ఉన్నప్పుడు వ్రాసుకొన్న వివరాలు, తెలుగు అకాడమి వారు ప్రచురించిన 'తెలుగు పరిశోధన సంహిత' (1975), ఈ విషయంలో నాకు సాయం చేసాయి. డిగ్రీకోసం కాకుండా చేసిన పరిశోధన గ్రంథాలకు సంబంధించిన నోట్సుఉన్నా, ఈ సందర్భంలో నేను నామాటల్ని విశ్వవిద్యాల యాల పరిశోధనలకు పరిమితం చేశాను ఈ సర్వేక్షణలో M Phil., M. Litt., Ph d , D Litt డిగ్రీల సిద్ధాంత వ్యాసాలు ఉన్నాయి. ఆంధ్రేతర భాషలలోని కొన్ని సిద్ధాంత వ్యాసాలను, సిద్ధాంత వ్యాసాల నిర్మాణాన్ని గురించి

చర్చించిన రచనలను కూడా చదివి నా నిర్ణయాలకు ప్రమాణాల్ని ఏర్పర్చుకొన్నాను. ఈ అనుభవంతో మన పరిశోధన గ్రంథాలను పరిశీలిస్తే నూటిలో మూడోవంతు గ్రంథాలలో నేను ముందు చెప్పిన దోషాలు అన్నీ కాకపోయినా కొన్నైనా కనబడ్డాయి. కొన్నింటిలో అన్నీ ఉన్నాయి. నేను పరిశీలించినవన్నీ "డిగ్రీ" వచ్చిన సిద్ధాంత వ్యాసాలే ఇంకో విశేషం ఏమిటంటే, ఈ మూడో వంతు సిద్ధాంత గ్రంథాలవల్ల తెలుగు పాఠకులకు విశేషంగా తెలిసేకొత్త విషయాలూ ఏమీలేవు. అంటే, ఇవి లేకపోతే మనకు వచ్చే నష్టం ఏమీ లేదు పెద్దగా! రచయితలకు డిగ్రీలు ఉండవు గనక నష్టం అనుకోండి! వారికి!

ఈ సిద్ధాంత గ్రంథాలలో సగానికి సగం పైగా రచన అలంకారిక శైలిలోనే ఉంది. మంచి, కొత్తవిషయాన్ని పరిశోధనలో వెలువరించిన గ్రంథాలకూ ఈ రచన తప్పలేదు. "నమస్సుమనస్సులు", "నిచ్చలు" "ఏటికోళ్లు" పుంఖానుపుంఖాలుగా ఈ గ్రంథాలలో కనబడతాయి. అవసరం లేకపోయినా, తులనాత్మక పరిశీలన కాకపోయినా పదులకొలది పద్యాలను, గేయాలను ఉదాహరణలుగా చూపడంవల్ల గ్రంథం పెరిగిన సిద్ధాంతవ్యాసాలు నూటికి నలభైదాకా ఉంటాయి. అచ్చులో 1/8 డెమిసైజులో నాలుగు వందలపుటలు లేని పి.హెచ్.డి. సిద్ధాంతగ్రంథం తెలుగులో లేదంటే అతిశయోక్తి కాదు. ఎక్కడేనా ఉంటే మన అదృష్టం.

స్థూలంగా తెలుగు సిద్ధాంతగ్రంథాల విషయాన్ని భాషకు సంబంధించినవి, సాహిత్యానికి సంబంధించినవి-అని విభజించవచ్చు సిద్ధాంతగ్రంథాలలో నూటికి మూడువంతులు సాహిత్యానికి సంబంధించిన విషయాల్ని గ్రహించి వ్రాసినవే. ఈ పద్ధతి కొంత సులభం అని దేశంలో ప్రచారంలోఉంది. ఇది సత్యదూరం కాదు. ఏదోకొంత తెలుగులో సాఫీగా వ్రాసిపారేస్తే డిగ్రీ రాక ఏమవుతుంది? అనేభావం కొన్నివర్గాలలో గట్టిగానే ఉంది. దీనితో ఏమయిందంటే భాషకు సంబంధించిన పరిశోధన కష్టమనీ సాహిత్యానికి సంబంధించిన పరిశోధన సులభమనీ ప్రచారానికి వచ్చి స్పర్ధలూ కలతలూ బయలుదేరాయి. నిజానికి ఉత్తమ పరిశోధన కష్టం. పదికాలాలపాటు నిలిచే పరిశోధన, నలుగురూ ఉప

యోగించుకొనే పరిశోధన కష్టమయింది. దీనికి విషయంతో నిమిత్తం లేదు. కొన్ని సిద్ధాంతగ్రంథాలు ఇంగ్లీషు భాషలో ఉన్నాయి. కొన్ని విదేశాలలో జరిగిన పరిశోధనలు, ఇవి భాషాశాస్త్రానికి సంబంధించినవి. పాశ్చాత్యులు వ్రాసిన సిద్ధాంత గ్రంథాలు తగు మాత్రంగా ఉన్నాయి—

సాహిత్య సంబంధమైన సిద్ధాంత గ్రంథాలలో నూటికి సగంపైగా ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన విషయాలమీద వ్రాసినవి. ఇంచుమించుగా ఒకే విషయంమీద బయటుదేరిన గ్రంథాలు ఉన్నాయి. ఉదాహరణకు "రామరాజ భూషణుడి" మీద మూడువరకు సిద్ధాంతగ్రంథాలు వచ్చాయి వీటిలో విషయ వైవిధ్యం లేకపోలేదు గాని, కొంత వరకు విషయంలో పునరుక్తిఉంది. ఇలాంటి పరిస్థితులలో ఇది తప్పదుగదా! ఇలాగే "ప్రబంధం" మీద రెండు మూడు గ్రంథాలు బయలుదేరాయి, వీటిలోనూ పునరుక్తి లేకపోలేదు. అలాగే "శ్రీనాథుడి" మీదకూడా రెండుమూడున్నాయి నన్నెచోడుని కుమారసంభవం మీద రెండున్నాయి ద్విపద వాఙ్మయంమీద రెండున్నాయి. జానపద సాహిత్యం మీదకూడా రెండుమూడున్నాయి అయితే విషయ విస్తృతి ఉన్న పరిస్థితులలో పునరుక్తి కనబడదుగాని, ఒకే కవిమీద ఇద్దరు పరిశోధన చేసినప్పుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకోకపోతే రెండూ ఇంచుమించుగా ఒకేవిధంగా కనబడతాయి. నాకిలాంటి అనుభవం పరీక్షకునిగా కలిగింది. నవ్యసాహిత్యంమీద జరిగిన పరిశోధనలలో ఈ పునరుక్తి అంతగా లేకపోయినా, ఉద్యమాలకు సంబంధించిన విషయం వస్తువయినప్పుడు ఇది కనబడుతోంది.

భాషాశాస్త్రానికి సంబంధించిన పరిశోధనలలో ఇది అంతగా లేదు గాని, వ్యాకరణాలకు సంబంధించిన సిద్ధాంతగ్రంథాలలో ఈపునరుక్తి కొంత కనబడుతోంది. ఒకరు "తెనుగు వ్యాకరణ వికాసము" వ్రాస్తే ఇంకొకరు "ఆంధ్ర వ్యాకరణవికాసము" వ్రాశారు. ఈ రెండూ రెండేసి సంపుటాలుగా వెలువడిన గ్రంథాలు. ఇవి రెండూ కొంత విభిన్న దృక్పథాలతో వ్రాసినవే అయినా విషయంలో పునరుక్తి ఉంది.

ఈ పునరుక్తిని గురించి చెప్పడం ఆయా కృషుల పాండిత్యాన్ని శంకించడం కోసం కాదు. వివిధ విశ్వవిద్యాలయాలలో ఏయే పరిశోధనలు

జరుగుతున్నాయో తెలియక పోవడం కారణం. ప్రతి సంవత్సరం ఆంధ్ర ప్రదేశ్ విశ్వవిద్యాలయాలలో ఉన్న ఆంధ్ర భాషా విభాగాధ్యక్షులు ఒకసారి అయినా కలిసి ఇవి చర్చించుకొని నిర్ణయించు కొంటే ఈ బాధ ఉండదు. ఇదిగాక పరిశోధనతత్త్వం విషయంలో కొంత కొత్త అవగాహన అవసరం. మన పరిశోధనలు, ఇంచుమించుగా, సర్వేక్షణలుగా ఉంటున్నాయి. ఇందువల్ల నిశితంగా విషయాన్ని పరిశీలించడానికి అవకాశం లేక, పుస్తకాన్ని ఐతిహాసిక దృష్టితో కాలానుసారం వ్రాసుకొని పోతున్నారు. ఇది ఉత్తమ పరిశోధన అనిపించుకోదు. ఇదిగాక ఏదో ఒక రిసెర్చి డిగ్రి లేక పోతే వృత్తిలో అభ్యుదయం లేకపోవడం వల్ల పరిశోధనకు తగిన వ్యుత్పత్తి ఉన్నా లేకపోయినా, ప్రవృత్తి భిన్నమైనా పరిశోధనకు ప్రతి విశ్వవిద్యాలయంలోను విద్యార్థులు ఎగబడుతున్నారు. నేటి విచిత్ర పరిస్థితుల ననుసరించి శ్రద్ధ - లేశ - స్పర్ధ మాత్రమే ఉన్నవారికి అవకాశాలు లభించడంవల్ల పరిశోధనస్థాయి కొంత తగ్గుతోంది. ఇది తెలుగు విషయంలో బాగా కనపడుతోంది. తాము ప్రకటించిన పరిశోధన గ్రంథాల మీద ప్రశ్నలు వేసినప్పుడు సమాధానాలు చెప్పలేని స్థితిలో కొందరు పరిశోధకులు ఉన్నారన్న సత్యం అందరికీ తెలిసినదే. ఈ పరిస్థితులకు తోడు విశ్వవిద్యాలయాలలో పరీక్షకులను నియమించడం విషయంలో భిన్న భిన్న విధానాలు అమలులో ఉండి గుణదోష విచారణ విషయంలో వివిధ ప్రమాణాలు అవలంబించడం జరుగుతోంది. పరిశోధనలు సక్రమమార్గంలో అభివృద్ధి పొందడం విషయంలో ఈభిన్నత్వం కొంత అడ్డుగా ఉంటోంది. విశ్వవిద్యాలయాచార్యులు, అధికారులు కలిసి ఈ విషయమై ఒక మంచి నిర్ణయానికి రావాలి.

ఇంక పరిశోధకులకు శిక్షణ ఇవ్వడాన్ని గురించి కొన్ని మాటలు చెప్పవలసి ఉంది. 'మెథడాలజీ' పేరుతో కొంత చెప్పడం జరుగుతూ ఉన్నా సిద్ధాంత వ్యాసం వ్రాయడం విషయంలో శిక్షణ కావాలె. పుట్‌నోట్స్ ఎలా ఉండాలి, అనుబంధాలు ఎలా ఉండాలి, ఏవిషయం సిద్ధాంత వ్యాసంలో ముఖ్యభాగంలో ఉండాలి, ఏది సూచించాలి, సూచనలు ఎలాగ చేయాలి మొదలయిన అనేక విషయాలమీద యువ పరిశోధకులకు శిక్షణ ఈయవలసి ఉంది. ఇది సరిగా లేక

పోవడంవల్ల ఫుట్‌నోట్స్ మొదలయినవి ఏమీ లేకుండా సిద్ధాంత వ్యాసాన్ని నవలలాగ వ్రాసుకొని పోయినవాళ్లు మనకి కనబడతారు. పరిశోధన యొక్క పరమార్థం- నిశితపరిశీలనద్వారా కొత్త విషయాన్ని చెప్పడంగాని, ఉన్నవిష యాన్ని నవ్యదృక్పథంలో పరిశీలించి విషయ వివరణ చేయడంగాని - అని చెప్పాలి.

ఈ ఘట్టంలోనే పరిశోధనకు విమర్శకు సన్నిహితత్వం ఏర్పడుతుంది. ఈ రెండూ పరస్పర పోషకాలుగా నిలుస్తాయి. స్వతంత్రంగా కూడా మనుగడ సాగి స్తాయి సాహిత్య విమర్శలో, పరిశోధనలో కంటె ఆత్మాశ్రయలక్షణం కొంత అధికంగా ఉంటుంది. ఇందువల్లనే విమర్శ కళగా కూడా చెలామణీ కాగలదు. పరిశోధనలో శాస్త్ర లక్షణమైన తాటస్థ్యం అధికంగా ఉంటుంది దీనిలో పరిశోధ కుడి బుద్ధికున్నంత ప్రవేశం, హృదయాని కుండదు. ఈ రెండింటినీ జోడించి వ్రాసిన వాళ్లు లేకపోలేదు. అన్ని మంచివస్తువులలాగే వీళ్ల సంఖ్య తక్కువ. విమర్శలో ప్రమాణ ప్రయోగాల పర్యాలోచన వ్యక్తిదృష్టి ననుసరించి సమాజ పరిస్థితుల ననుసరించి చేయడం ఉంటుంది సాహిత్యంలో ఒక ప్రక్రియనుగాని ఒక కవినిగాని ఒక రచయితనుగాని గ్రహించి సహృదయులకు వ్యాఖ్యానించి చెప్పడం విమర్శకుని పనులలో ముఖ్యమయింది. ఒక విమర్శకుడు బయలుదేరి ఒక కావ్యం విషయంలో గాని కవి విషయంలోగాని తన అభిప్రాయాన్ని చెప్పి సహృదయులు ఆ కావ్యాన్ని ఆ కవిని కొత్తగా చూసేటట్లు చేయగలడు. ఇంగ్లీ షులో షేక్స్పియర్ నాటకాలలో కొన్నింటిమీద బయలు దేరిన విమర్శలు ఆ నాటకాలను, వాటిలోని పాత్రలను, ప్రజలు అర్థం చేసుకోవడం విషయంలో గణ నీయమైన మార్పులు తెచ్చినట్లుగా వేత్తలు చెప్పడం ఉంది. మన తెలుగు విష యంలో ఈ శతాబ్ది తొలినాళ్లలో పింగళి సూరన్న మీద వ్యాసాన్ని వ్రాసి సహృ దయులలో సూరన్న విషయమై అభిమానం పుట్టించిన డా॥ కట్టమంచి రామ లింగారెడ్డిగారు తరవాత కవిత్వతత్త్వ విచారం వ్రాసి పింగళి సూరన్నను మహా కవిగా పునఃప్రతిష్ఠించారు అనే విషయం ఈ సందర్భంలో గుర్తు తెచ్చుకోవాలి. ఈ నాడు కూడా ఎందరు ఈ కోవకు చెందిన వాళ్లున్నారు ?

యువతరంలో నవ్య కవుల్ని గురించి, వాళ్ల ప్రయోగాల్ని గురించి ఉత్తమ పరిశోధనలు చేస్తున్నవాళ్లు చేసినవాళ్లు ఉంటూ ఉండడం చాలా ఆనంద హేతువు. ఇదివరలోకంటె సామగ్రి సంపాదన విషయంలో అవకాశాలు అధికంగా ఉన్న ఈ దినాలలో ఉత్తమ పరిశోధనలు వెలువడతాయి అనడంలో సంశయంలేదు. సాహిత్య పరిశోధనకు, భాషా పరిశోధనకు సాయంచేయటానికి తగిన పరికరాలతో భాషాశాస్త్రం, సమాజశాస్త్రం మొదలయిన శాస్త్రాలు సిద్ధంగా ఉన్నాయి. తులనాత్మక పరిశోధన సాగించడానికి తగిన ఉపకరణాలు కూడా అమరి ఉన్నాయి సాహిత్య అకాడమి, తెలుగు అకాడమి మొదలయిన ఉత్తమ సంస్థలు విశిష్ట పరిశోధనల్ని ఆదరిస్తూ విశ్వవిద్యాలయాలకు సాయపడుతున్నాయి. విశ్వవిద్యాలయాలలోని ఆయా శాఖలలోని పరిశోధకులు ఈ స్వచ్ఛంద సంస్థల పరిశోధన కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. ఈ విధంగా సాగుతూ ఉన్న ఈ స్నేహసంపత్తి తెలుగు భాషా సాహిత్యాలలో ఇతోధిక పరిశోధనలకు దోహదకారి కాగలదని విశ్వసించవచ్చు. ఈ మహాయజ్ఞంలో అందరూ కలిసి పని చేయాలి.



# సాహిత్య భాష - వ్యవహార భాష

డా॥ బూదరాజు రాధాకృష్ణ

10 'సాహిత్య భాష-వ్యవహార భాష' అనే శీర్షికలోనే ఈ రెండూ రెండు భాషలు కాకపోయినా ఒకేభాష కున్న రెండు రూపాలు కావచ్చునన్న భావ ముంది సాహిత్యం ఏకొందరో చదువుకొన్నవాళ్లు మరికొందరు చదువు కొన్న వాళ్ల నుద్దేశించి భాషాభావాలను లిపిబద్ధం చేసి రాసిన రచన అయితే వ్యవహారం ఎదుటి వ్యక్తికి తన ఉద్దేశాలను ధ్వనిరూపంలో చెప్పటం అనే అభిప్రాయం చాల మందికి ఉంది. సాహిత్యం ఉత్తమాభిరుచులనూ ఉదాత్త భావాలనూ ప్రతిబింబిస్తుంది కాబట్టి దైనందిన వ్యవహారంలో వాడే భాష సాహిత్యానికి ఉపకరించదని, నిత్యవ్యవహారభాష పండితులవాడుకలో ఉన్నా సాహిత్యభాషగా రాణించదనీ కొందరి విశ్వాసం. అంటే సాహిత్యభాష వ్యవహారానికి ఎంత దూరమయితే అంత గణనీయమని వారి నమ్మకం. ఈ నమ్మకాలు మోసులెత్తిన నాటి సమాజపరిస్థితి వేరు. ఇప్పటి స్థితి వేరు. సమాజంలో కోటి కొకవిద్యావంతుడున్న నాటి ఆశయాలు, విద్య కోటికొక్కడికి మాత్రమే పరిమితమైన నాటి భావాలు ఇప్పుడు చెల్లవు. సమాజంతో బాటు అది వాడే భాష, దాని అవసరాలు మారుతుంటాయి. పరిణామశీలమైన ప్రపంచంలో పాతదనానికి చోటు లేదు. నిజానికి 'సాహిత్య' శబ్దం వంటి పవిత్ర వస్తువుకు గూడా కాలం అర్థ భేదం కల్పించింది. తెలంగాణాలో అన్యజాతియాచకుల కిచ్చే సంభారాన్ని సాహిత్య మంటారు! ఈ మార్పు అటు సాహిత్య భాషలోనూ ఇటు సాహిత్యస్వభావంలోనూ వస్తుంది. వ్యవహార విషయం కూడా అంతే.

11 సాహిత్య మనేది కేవలం వాగ్రూపంలో కూడా ఉండ వచ్చు: చాటుపద్యాల్లాగా, జానపదగేయాల్లాగా, లిపిబద్ధం కాని అనేక భాషల్లో కూడా

సాహిత్యముంది. వేదాలు శ్రుతులని వాటిని లిపిబద్ధం చేయనంత మాత్రాన అవి సాహిత్యం కాక పోలేదు. మన సంప్రదాయ పండితులు జానపద రచనలు సాహిత్యం కాదనకొనే వాళ్ళు నిన్న మొన్నటి వరకు, ఆ మాటకొస్తే వేమనపద్యాలూ, పోతన భాగవతమూ సాహిత్యమని గుర్తించని వాళ్ళూ ఉన్నారు. లిఖితమైనదే సాహిత్యమని భావించటం భ్రమ. అదేవిధంగా 'వ్యవహార' మనేది వాగ్వ్యవహారమే కానక్కర లేదు; లిఖిత వ్యవహారం కూడా కావచ్చు. అయినా నోటి మాటలనే వ్యవహారంగా భావించటం ఎక్కువ. మొత్తం మీద ఏవోకొన్ని లిఖిత వ్యాకరణాది శాస్త్రనియమాలకు కట్టుబడి గ్రంథస్థ మయిన రచనాప్రక్రియలను 'సాహిత్య'మనీ, తదితరమైన లిఖితాలిఖితభాషారూపాలను 'వ్యవహార'మనీ ప్రస్తావించటం ఆచార మయి పోయింది. ఒకప్పుడు ప్రస్తుతశీర్షికలోని సాహిత్య శబ్దానికి పర్యాయపదంగా 'గ్రాంథిక భాష' అనే పదాన్ని, 'వ్యవహారభాష'కు పర్యాయపదంగా 'గ్రామ్య భాష' అనే పదాన్ని వాడుతుండేవాళ్లు లాక్షణికుల వాడుకలో గ్రామ్యశబ్దానికి 'పామరభాష, అశ్లీలం' వగైరా అర్థాలున్నాయి. ఇప్పుడు అందుచేతనేమో గ్రామ్యశబ్ద ప్రయోగం మానివేశారు ఆ పండితులు. వ్యవహారభాషను 'శిష్ట వ్యావహారిక' మని, 'ఆధునికప్రామాణిక'మని అనటం కూడా కద్దు. భాషా శబ్దాన్ని సాహిత్యవ్యవహారశబ్దాల చివర జోడించినా అవి వేరువేరుభాష లనే దృష్టితోకాక భాషారూపభేదాలనే అభిప్రాయంతోనే వాడుతున్నామని గుర్తించాలి. వీటి మధ్య నున్న భేదమేమిటో స్థూలంగా నిరూపించి తరవాత విశదీకరిద్దాం.

1.2 'సాహిత్యభాష' అనే శబ్దానికి సరైన పర్యాయపదం 'కావ్యభాష'. నన్నయనాటినుంచి ఈనాటివరకు సంప్రదాయ సిద్ధమైన కొన్ని నియమ నిబంధనల ప్రకారం చారిత్రక పరిణామం అంత విస్పష్టంగా కనిపించని భాషా రీతిలో రాస్తే అది సాహిత్యం, సాహిత్యభాష। కావ్యభాష చదువుకున్న వాళ్ళు సభల్లో, వ్యాఖ్యాన ప్రసంగాల్లో, పద్యేతర రచనల్లో రెండు మూడు వందల సంవత్సరాలుగా ఉపయోగిస్తున్న భాషాభేదం వ్యావహారిక భాష। ఆధునిక ప్రామాణికం. వ్యవహారభాషను గురించిన అపోహలు కొన్ని ఇప్పటికీ

పోనివి ఉన్నాయి. అది మాండలికభూయిష్ఠమని, అందులో ఏకరూపత (uniformity) లేదని, అది నియమరహిత మని గ్రాంథికవాదు లంటున్నారు. కావ్యభాషలో కూడ మాండలికపదాలు చోటుచేసుకున్నవని సోపపత్తికంగా నిరూపించినా వాళ్ళు గుర్తించలేదు. కొన్ని మాటలు వ్యవహార బలంవల్ల ప్రాచుర్యబలంవల్ల భిన్నరూపాలు సంతరించుకొనికూడ కావ్యభాషలో ప్రవేశించాయని, ప్రవేశిస్తున్నాయనీ వాళ్ళు గమనించలేదు- గమనించటం లేదు. జీవద్భాష ఏకరూపత పేరిట పరిణామశూన్యంగా ఉండదని, పరిణామం జీవలక్షణ మనీ వాళ్ళు భావించలేదు-భావించటంలేదు. పూర్వనియమాలు కాలక్రమాన తొలగిపోయి కొత్తవాటికి చోటిస్తాయని, 'మార్పు' నియమరాహిత్యానికి చిహ్నం కాదని, ప్రాచీన భాషాలక్షణాలను క్రోడీకరించి గ్రంథస్థంచేసి, 'వ్యాకరణం' పేరిట నిబంధించినట్లే, ఆధునిక లక్షణాలను 'గ్రంథస్థం' చేయకపోతే నియమ రాహిత్యం రాదని వారు గ్రహించటం లేదు. ఒక మొక్క- తీగో ఇంతు విశేషమో శాస్త్రజ్ఞుల దృష్టికి మొదటిసారిగా వచ్చినప్పుడు పారిభాషికనామ ధేయ మిస్తారు. ఇటువంటి పేరు ఇంతకు ముందు లేదు కాబట్టి వస్తువే లేదనుకోవటం భ్రాంతి. లిఖిత రాజ్యాంగం లేనందువల్ల బ్రిటిష్ వారికి రాజ్యాంగమే లేదనటం అసందర్భం, అర్థరహితం. ప్రతి భాషకు కొన్ని సహజ లక్షణాలుంటాయి. వాటిని గుర్తించటం గ్రంథస్థం చేయటం శాస్త్రవేత్తల పని; ఉపయోగించటం, సక్రమంగా సరైనచోట సరైనసందర్భంలో సరిగా ప్రయోగించటం కళాకారుల పని. భాషాస్వభావం గుర్తించక, సాహితీస్వభావం బోధపడక ఇటువంటి అపోహ లేర్పడ్డాయి.

1.3 సాహిత్యం అంటే కేవలం ప్రాచీనభాషను తెలిసో తెలియకో గ్రంథస్థం చేయటం కాదు. భాషేతరలక్షణాలు అందులో అనేక మున్నాయి. కవి భావనలు, కల్పనలు, ఇతివృత్తం చెప్పేతీరు మొదలైన వనేకం సాహిత్యంలో భాగాలు. కవి తాను చక్కగా చెప్పదలచిన విషయాన్ని పదిమందికి ఆకర్షణకరంగా చెబితేనే అది సాహిత్య మవుతుంది-కావ్యమవుతుంది.

అందుకు భాష ఉపకరణం మాత్రమే. సాధనంలోని లోపం సాధనకే ప్రమాదం తెస్తుంది. అంటే భావ ప్రసారానికి ఉపయోగించిన భాష లోప భూయిష్ఠ మయితే సాహితీ ప్రయోజనమే దెబ్బతింటుంది. 'సద్యః పర నిర్వృతి' (వెంటనే అర్థం కావటం) సాధ్యపడదు. ఒక కావ్యాని కున్న సాహితీప్రతిష్ఠ అందులోని భాషమీదనే ఆధారపడితే భాషాంతరీకృతా లయిన మహాకావ్యాలకు సాహిత్యంలో గౌరవస్థానం లేదన్నట్లే. పాఠకులకుగాని శ్రోతలకు గాని కవిభాష స్పష్టంగా అర్థం కాకపోతే రసానందానికి అవకాశమే ఉండదు. కనీసం ఈ దృష్టితో నయినా సాహిత్యభాష సాధ్యమయినంత వరకు వ్యవహారభాషకు సన్నిహితంగా ఉండాలని తాపత్రయపడటం కవి కనీస ధర్మం. ఒక రచనలోని భాష వ్యవహారభాష అయినంత మాత్రాన దాని సాహితీ ప్రతిష్ఠ సన్నగిల్లదు. గ్రాంథికంలో రాసిన సెలవుచీటీ సాహిత్యం కానట్లే మహాకవిరచన భాషకారణంగా సాధారణరచన కాదు. అయ్యేటట్లయితే లండన్ మాండలికంలో రాసిన షేక్‌స్పియర్, కలకత్తా మాండలికంలో రాసిన రవీంద్రనాధ్ ఠాకుర్ కవులే కారు. రచనాశక్తికి భాష అడ్డంరాదు. తన మనోభావాలు ఇతరులకు స్పష్టంగా తెలయనక్కరలేదను కొన్న ఏకవి అయినా ఎంతపాతభాషలోనైనా రాయవచ్చు. ప్రయోజన దృష్టిలేని రాతలు నీటి మీది గీతలు. అందువల్ల రచన వ్యావహారికంలో ఉన్నంత మాత్రాన దానికి ప్రామాణ్యం రాదని, లేదని వాదించటం అసంభావ్యం.

1.4 వ్యవహారభాష అనగానే మాట్లాడినట్లే రాసిందని, రాసినట్లే మాట్లా డేదని చాలా మంది భ్రమిస్తున్నారు. అది నిజం కాదు. చదువుకొన్నవాళ్లు సభా స్థలంలో మాట్లాడుతూ మహారచనలను వ్యాఖ్యానిస్తూ వాడేభాష వ్యవహారభాష. అన్ని సందర్భాల్లోనూ మనం ఉచ్చరించే ధ్వనులన్నిటినీ 'లిపి'లో 'లేఖనం'తో ప్రతిబింబించటం సాధ్యపడదు. స్పష్టతకోసం మాటలను విడివిడిగా రాసినా చదివేటప్పుడు సంధిచేసి, మన అలవాట్లకు అనుగుణంగా మార్చి చదవటం సర్వ సామాన్యం. సాహిత్యభాష కావ్యభాషలో రాసిన పెద్దలు కూడా రాసినట్లే చద వటం లేదు. చదవనూ లేరు. ఈ పరిస్థితికి ప్రథమకారణం లిపిలోపం; రెండోది

లేఖనసంప్రదాయం. ప్రత్యేకశాస్త్ర గ్రంథాల్లో ప్రత్యేకచిహ్నాలనూ సంకేతా లనూ పరికల్పించుకొని ఉచ్చారణ విధేయంగా రాస్తున్నా ఈ పద్ధతి అందరికీ అందుబాటులోనూ లేదు- నిత్యవ్యవహారంలో అవసరమూ లేదు. అటువంటి ప్రత్యేక లిపి క్లిష్టతమంగా ఉండి లేఖన ముద్రణాదులు కష్టసాధ్యం చేస్తుంది. దానికి శాస్త్ర ప్రయోజనమేగాని వ్యవహార ప్రయోజనం లేదు. నిజానికి వ్యవహార భాష అంటే మాట్లాడినట్లే రాసిందికాదు- రాసినట్లే మాట్లాడిందికాదు. మాటకూ రాతకూ సన్నిహితంగా ఉండి వక్తృభావాన్ని శ్రోత సులభంగా స్పష్టంగా గ్రహించటానికి వీలుపడే భాషావిశేషమే వ్యవహారభాష. దానిలో పాతమాటలకు చోటు లేదు. పాత పద్ధతులకు తావు లేదు. ఆధునిక పరిస్థితులకూ నేటి ఆలోచ నలకూ అవసరాలకూ అనుగుణమైన శబ్దజాలం, వాక్యరచనా పద్ధతి వ్యవహార భాషకు ప్రధానలక్షణాలు.

1.5 లిపిలేఖనలోపాలు ఇటీవల వచ్చినవి కావు. అవి ఏర్పడినప్పటి నుంచీ ఈ లోపాలున్నాయి. 'ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వ సృజః ప్రవృత్తిః' అనే కాళిదాససూక్తిని ఇక్కడ అనుసంధించుకోండి. ఈ లోపాలు మన పూర్వు లెదుర్కొన్నారు- వాటిని అధిగమించటానికి వాళ్లూ ప్రయ త్నించారు. మనమూ ప్రయత్నిస్తున్నాం. సోదాహరణంగా వాటిని వివరించే ముందు మరో విషయం ప్రస్తావించవలసివుంది. భాషా పరిణామానికి బాహ్య కారణాలూ ఉన్నాయి; అంతర్గతహేతువులూ ఉన్నాయి. అవి పరస్పరం ప్రభా వితం చేసుకుంటాయి. ఈ పరిస్థితిని చారిత్రకదృష్టితో పరిశీలించవలసివుంది. చరిత్రనుంచి గుణపాఠాలు నేర్చుకోవాలి. అంతేగాని ప్రాచీనసాహిత్య భాషను అధ్యయనం చేయకూడదని, వద్దనీ అనటం, అనుకోవటం సమర్థనీయం కాదు. అయితే కాలధర్మాన్ని గుర్తించక ఏది ప్రాచీనమో అదే మహనీయం అనుకో వటం, అనటంకూడా సమంజసంకాదు. 'పురాణ మిత్యేవ న సాధు సర్వం, నచాఽపి కావ్యం నవమిత్యవద్యం' అన్న కాళిదాససూక్తి మాననీయం. చరిత్రదృష్టితోగాని వ్యాకరణ దృష్టితోగాని తాము ప్రయోగించే ప్రతి శబ్దాన్నీ, వాక్యాన్నీ పండితులు కూడా అనుక్షణం పరిశీలిస్తూ ప్రసంగించలేరు. వ్యవహర్తల జ్ఞానంలోని భేదం

వల్ల ఈ మార్పులు కొన్ని వచ్చిపడతాయి నిత్యవ్యవహారంలో అనేకపదాలు కొత్త అర్థాలు సంపాదించుకుంటాయి; నూతన ప్రయోగాలు ఉత్పన్న మవుతుంటాయి. రచనకు ప్రయోజనం అర్థస్ఫూర్తే అయితే సమకాలిక ప్రయోగ వైచిత్రిని గమనించి ప్రయోగించటం రచయిత కర్తవ్యం. దేశకాలపాత్రలను మరిచి ప్రాచీనతాగౌరవంతో ఒకే మూసలో రాసేరాతలు కృతకమై అర్థశూన్యమై నిష్ప్రయోజన మవుతాయి. అందువల్లనే సాహిత్యభాషకూ వ్యవహారభాషకూ నిర్దిష్టకాలంలో సాన్నిహిత్యం ఎంత ఎక్కువైతే అంతమంచిది. భౌగోళికదూరాలతో నిమిత్తం లేకుండా దేశాలూ భాషలూ దగ్గరవుతున్న ఈ కాలంలో భిన్న భాషాపదాలు రకరకాల అర్థవిపరిణామాలతో అన్ని భాషల్లోనూ చేరుతుండగా, భాషాపరిశుద్ధత ( linguistic purity ) చెడిపోతుందనే భ్రాంతితో మార్పును అడ్డుకోవటం అసంగతమే కాదు- కాని పని కూడా. ఈ బాహ్యకారణాలు కూడా పైనపేర్కొన్న అంతర్గత కారణాలను ప్రభావితం చేశాయి-చేస్తున్నాయి- చేస్తాయి, కింది పేరాల్లో ఈ విషయం తెలుస్తుంది.

1.6 మొదట లిపిలోపాలు చర్చిదాం. కావ్యభాషలో కనిపించేవి ముందు, నేటి వ్యవహారభాషలోనివి తరవాత పరిశీలిద్దాం. ఇప్పటిలోపాలు కొన్ని పూర్వం నుంచే ఉండే వాటిని సమన్వయించటానికి ప్రయత్నిద్దాం,

1.6.1 కవిజనాశ్రయం సంజ్ఞాధికారంలో స్వరవళ్లను గురించిన ప్రస్తావనలో కింది పద్యం కనిపిస్తుంది.

"అ ఆ ఐ ఔ లకు మఱి; ఇ ఈ లు ఋకారసహిత మె ఏ లకు నౌ
ఉ ఊల్ దమలో నొనరిన; ఒ ఓ లకు వళ్ళగు న్నయోన్నతచరితా."

చూడగానే ఈ పద్యంలో 'ఆ...ఈ...ఊ...ఓ' లకు ప్రాస ఎలా కుదిరిందనే ప్రశ్న వస్తుంది. పూర్వవ్యాకరణ సూత్రాలప్రకారం హ్రస్వాచ్చు లయిన 'అ, ఇ, ఉ, ఒ' ల తరవాత సవర్ణదీర్ఘాచ్చులు వస్తే యడాగమం రావాలి. ఆ విధంగా పద్యాన్ని సవరించి రాసినా గణభంగం కాక తప్పదు. ఈనాడు బడి పిల్లలు 'అ ఆ ఇ ఈ...' అని చదివేటప్పుడు కూడా రెండు అచ్చుల మధ్య

మరో ధ్వని వినిపిస్తున్నది. శాస్త్రపరిభాషలో దాన్ని కంఠమూలస్పర్శం ( glottal stop or check ) అంటారు. అది హల్లు. అర్ధమాత్రాకం దాని చేరికవల్ల పాదాదిన వచ్చిన హ్రస్వాచ్చులు నాలుగూ గురువు లవుతాయి- అలా కాక పోతే గణభంగం తప్పదు ఇదే పరిస్థితి రెండోచరణం యతిస్థానం దగ్గరున్న 'ఎ ఏ'ల విషయంలో కూడా కనిపిస్తుంది. ఈ ధ్వనికి లిపిచిహ్నం లేదు. ఇటీవల భాషాశాస్త్రజ్ఞులు ప్రశ్నార్థకచిహ్నం కింది చుక్కను తీసివేసి ఈధ్వనికి చిహ్నంగా వాడుతున్నారు ( ʔ ). ఈ ధ్వనికి లిపిచిహ్నం లేని ప్రాచీన లాక్షణికులుగాని, ఈ చిహ్నం మామూలు వాడుకలో లేని మనంగాని చేయగలిగింది లేదు. చిహ్నం లేకున్నా ధ్వని వున్నట్లే భావించి, లిపిలేఖనాల్లో లేకపోయినా ఉన్నట్లు చదువుతున్నాం. పైపద్యంలో ప్రాసస్థానంలో ఈ ధ్వని ఉందనుకోకపోతే గణభంగానికి ప్రాసభంగం కూడా చేరుతుంది. నేటికీ ముఖ్యంగా కళింగాంధ్రుల వాడుకలో ( అః అఁ- వంటి చోట్ల ) నిత్యం వినిపిస్తుంది. 'దుఃఖం' అనే శబ్దాన్ని ఉచ్చరించటంలో కడపజిల్లాలో కొందరు విసర్గస్థానంలో ఈ ధ్వని వాడుతున్నారు ( దుఃఖమ్-అని ).

1.6.2 తెనాలి రామకృష్ణుడు ఒక మహాలేఖకుణ్ని ఏడిపించటానికి పద్యాలుచెప్తే అందులోని కొన్ని ధ్వనులను రాసేమార్గం తోచక చివరకు కింది విధంగా రాశాడని చెప్తారు. (కింద గీతలు గీసిన చోట్లు అస్పష్టమైన తావులు):

'తృవ్వఁట బాబా తలపైఁ, బువ్వఁట.......'
'వకర్లు చేరెడు నేగాని, చాక్కాలో పోసికొంటి చాచ్చాచ్చాచ్చో'

పై ధ్వనులు రాయటం ఈనాటి శాస్త్రవేత్తలక్కూడా అసాధ్యమే.

1.6.3 లాక్షణికులు హ్రస్వ,దీర్ఘ, ప్లుతాలని చెప్పే ధ్వనులను సూచించటానికి కొన్ని పాట్లు పడ్డారు. మన లిపిలో ప్లుతాచ్చులను రాసే మార్గం లేదు. పూర్వు లెట్లా రాశేవారో శాసనాల్లో రాగిరేకుల్లో కనిపించనందువల్ల తెలేదు. అచ్చు వచ్చిన తరవాత మూడంకె (3) వేసి ప్లుతం సూచిస్తున్నారు శాస్త్రగ్రంథాల్లో.

ఈనాటికీ తెలంగాణా వాడుకలో వినిపించే 'వచ్చినాలేపి?' అనే రూపాన్ని, కోస్తా వాడుకలో ఆక్షేపణలో వినిపించే 'వచ్చావేవ్?' అనే రూపాన్ని మూడంకె లేకుండానే మాండలిక సాహిత్యపరులుకూడా రాస్తున్నారు. సందర్భాన్నిబట్టి పాఠకులు ఆ లిపిసంకేతం ఉన్నట్లే భావించి గ్రహించి పఠిస్తారు.

1.6 4 పైదానివంటిదే- వేదోచ్చారణలో వినిపించే ఉదాత్తానుదాత్త స్వరితాలను అచ్చువచ్చేదాకా ప్రత్యేకసంజ్ఞలతో ఎవరూ సూచించకపోవటం. వేదభాగాలను ఉంట్టకించిన పాల్కురికి సోమనాథాదులు ఈ సంకేతాలు కాక పోయినా ఇటువంటి సంకేతాలేవీ లేకుండానే రాశారు. పాఠకులు తమ సంస్కా రాన్ని బట్టి చదువుకున్నారు.

1.6.5 నిన్న మొన్నటిదాక రేఫకు బదులు వలపలగిలక (ఁ) వాడటం ఆచారంగా ఉండేది. అచ్చు వచ్చిన తరవాత కూడా చాలా కాలం నిలిచిన ఈ ఆచారం ఇటీవల వ్యవహారదూరమయింది. '....సప్పంబు పడగ నీడను, కప్ప వసించిన విధంబు గదరా సుమతీ' అనే పద్యంలో 'సప్పఁాంబు' అని రాని పక్కనున్న వలపలగిలకను చూడక 'కప్ప'తో దానికి ప్రాస చెప్పారో, 'ర...ప్ప'లకు ప్రాసమైత్రి అంగీకరించేవారో, 'సప్పం' అనే 'వైకృతరూపం' వాడుకలో ఉండేదో నిష్కర్షగా చెప్పలేము అసలు వలపలగిలక రేఫస్థానిక మయితే దాని తరవాతి పరుషసరళాలను ఎందుకు ద్విత్వాలుగా రాసేవారో తెలి యదు. ఉచ్చారణలో 'ర్-ప్-అ' అనే క్రమంలో ఉండే ధ్వనులను రాతలో 'ప్-ప్-అ-ర్' అని వ్యత్క్రమంలో రాయటానికి కారణమేమో తెలియదు. శాసన భాషలో ఈ ద్విత్వరచన సంప్రదాయంగా ఉండేది. తాటే కు పుస్తకాల్లోనూ అంతే. రేఫ తరవాత - అమాట కొస్తే సంయుక్తాక్షరాల్లో - ద్విత్వోచ్చారణ అవసరమే లేదు- ఉన్నట్లూ లేదు.

1.6.6 బిందువు తరవాతి పరుషసరళాలను ద్విత్వంగా రాసే అలవాటు శాసన భాషలో కూడా వుంది. తెలుగులో ఇప్పటి ముద్రిత గ్రంథాల్లో కనిపించే

అరసున్న శిలాశాసనాల్లోగాని - తాళపత్ర గ్రంథాల్లోగాని, రాగిరేకులమీదగాని కనిపించదు. 'సగము జాబిల్లివలె వ్రాయ సగము సున్న' అని చెప్పిన అప్పకవి ఏసగమో చెప్పలేదు. ఆ విధంగా రాసినవారూ కనిపించరు- ఆయన పూర్వులు గాని, సమకాలికులుగాని. అచ్చు రాకముందు ఆ సంకేతం (ఁ) వాడుకలో లేదు. అయినా పుర్వాచ్చుకు అనునాసిక్యంగా ఉన్న ఉచ్చారణను సూచించడానికికూడా (అంటే 'అరసున్న'కు బదులుగా) నిండుసున్నే వాడేవారు పూర్వులు. ఆ సున్న అంతకు ముందుకాలంలో 'చుక్క'గా భిన్నస్థానాల్లో ఉండేది. కాలక్రమాన 'బిందువు' తరవాతి పరుషసరళాలు ద్విరుక్తాలయితే అది పూర్ణబిందువని, అద్వి రుక్తాలయితే అది ఖండబిందువని ఏదో ఒక సంప్రదాయం ఏర్పడింది. కానీ, ఆ నియమం నిత్యంగా పాటించేవారని చెప్పలేం. శాసనభాషలో ఈ పద్ధతి వైకల్పి కంగా ఉండేదని, 'ంబు' వర్ణకాన్ని 'ము'గా పఠించవలసిన సందర్భాలుండేవని పద్యశాసనాలు ఆధారంగా నిరూపించటం జరిగింది. అంటే నియతంగానో అని యతంగానో లిపిలోపం తొలగించటానికి ఒక లేఖన సంప్రదాయం ఏర్పడిందన్న మాట. ఆ సంప్రదాయంలో శైథిల్యం కాలక్రమాన వచ్చింది.

1.6.7 పరసవర్ణాదేశానికి బదులు బిందువు వాడటమనే ఆచారంకూడా వుంది. పూర్వకాలంలో కన్నా ఇప్పు డిది నియతంగా ఉంటున్నది. నిజానికి ఉచ్చారణ ప్రకారం 'పఙ్కజం, వఞ్చన, పణ్ట. కాన్త, కొమ్ప' అని రాయవలసి వుండగా సౌలభ్యంకోసం క్రమంగా 'పంకజం, వంచన, పంట, కాంత, కొంప, అని రాస్తున్నాం. ఈ పద్ధతిని పాటించీ పాటించకుండా రాసిన కొన్ని రాతలు శాసన భాషలో కనిపించినందువల్ల ఒకనాటి ఉచ్చారణలో ఉండి పరిణామక్రమం సూచించే కొన్ని మాధ్యమికరూపాలను ( link forms ) పునరుద్ధరించటం (reconstitution) సాధ్యమవుతున్నది. ఉదాహరణకు 'శక్రన్దిప, సకం ద్రిప' వంటి శాసనభాషారూపాలు నకారరేఫ సంయోజనలో దంతమూలీయ స్పర్శ ధ్వని ఒకటి (alveolar stop : *d) ఉచ్చారణలో ఉండేదని, 'వాన్రు' మొద లైన కొన్ని శబ్దాలు 'వాణ్డు / వాండ్రు' అనే రూపాలుగా పరిణమించేటప్పుడు మాధ్యమికరూపం ఉండేదనీ తెలుస్తున్నది. అంటే లిపిద్వారా ఉచ్చారణను,

ఉచ్చారణద్వారా లిపి లక్షణాలనూ కొన్ని సమయాల్లో పునరుద్ధరించవచ్చుననీ లోపం రెంటికీ సహజమేనని గుర్తించాలి.

1.6.8 చజలు దంత్యతాలవ్యభేదంతో రెండురకాలని వ్యాకర్తలు చెప్తున్నారు. ఒకప్పటిఉచ్చారణలో దంత్యలక్షణా లుండేవివేమోగాని ఇప్పు డవి దంతమూలీయాలే. ఆంధ్రశబ్దచింతామణి వర్ణనలో, అప్పకవీయంలో చెప్పిన సంకేతా లేవీ శిలాఫలకాలమీదగాని తామ్రపత్రాలమీదగాని, తాళపత్రాలమీదగాని అక్షరరూపంలో కనిపించవు. ముద్రణ సౌకర్యం వచ్చిన తరవాతనే దంత్య చజలమీద తెలుగు రెండంకె (౨) వేయటం వచ్చింది. అందుకు కర్త మామిడి వెంకయ్యో, రావిపాటి గురుమూర్తి శాస్త్రో, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌనో ప్రస్తుత సందర్భంలో చర్చనీయం కాదుగాని ప్రత్యేకచిహ్న మొకటి లిపిలోపం తొలగించటానికి ఇటీవల ఏర్పడిందనేది ముఖ్యం. అయితే ప్రాచీన శాసనాల్లోకూడా మరో పద్ధతి లేకపోలేదు. 'పచ్చలు' అని ఉచ్చరించవలసినచోట 'పత్సలు' అని రాసిన ప్రయోగాలున్నాయి. అంటే ఒక్కధ్వనిని సూచించటానికి రెండక్షరాలు అక్కడ వాడారన్నమాట. 'చుండూరు' అనే గ్రామనామాన్ని ఇంగ్లీష్‌లో 'Tsunduru' అని రాసిన ఆంగ్లేయుడు కూడా ఈధ్వని సూచించటానికి తకార సహకారయోగం వాడేడని చెప్పాలి. దంతమూలీయ చజలు తెలంగాణా రాయలసీమల వాడుకలో చాలా తక్కువ. ఏ ప్రత్యేక చిహ్నమూ వాడకపోయినా సందర్భాన్నిబట్టి కోస్తావారు ఉచ్చరిస్తూనే వున్నారు. రాతకూ పలకటానికీ ఉన్న విచిత్రసంబంధాల్లో ఇదొకటి

1.6.9 ఇప్పుడు అన్యదేశ్యాలద్వారా - ముఖ్యంగా ఇంగ్లిష్‌పదాలద్వారా- అనేకపదాల్లోనూ, సహజపరిణామంవల్ల దేశ్యశబ్దాల్లోనూ బాగా వాడుకలో వుండి ప్రత్యేకలిపిచిహ్నం లేనిధ్వని 'ae' అనేది. మధ్యయుగాలనాటి శాసనాల్లో 'గొటియ, గొఱె, గొఱ్ఱె, గొఱ్య' మొదలుగా లిఖితమైన శబ్దాల్లో ఈ ధ్వని ఉండేది. తరవాతి శాసనాల్లో 'చెప్యాడు వచ్యాడు' వంటిరూపాలు కనిపిస్తాయి. అక్కడా ఇదేధ్వని వుందని ఊహించవచ్చు, ఇటీవల వచనరచనల్లో 'చెప్పాను,

చెప్పేను' అని రెండువిధాలుగా ఒకేధ్వనిని సూచిస్తుండేవాళ్లు, కాని 'చెప్పేను' అనేమాటకు కోస్తాలో భవిష్యత్సూచన వుందికాబట్టి రానురాను 'చెప్పాను' అనే రూపమే రాతలో నిలదొక్కుకుంటున్నది. కొన్ని అన్యదేశ్యాలు 'బాంకు, బేంకు, బ్యాంకు, బైంకు' అనే భిన్నరూపాలతో భిన్న రచయితలరచనల్లో కనిపిస్తున్నాయి. నిర్దిష్టమైన ప్రత్యేకలిపిచిహ్నం లేనందువల్ల ఈ పరిస్థితి వచ్చింది, ఇప్పుడెవరూ 'చేశ్యాడు' వంటిరూపాలు రాస్తున్నట్లులేదు. భాషాశాస్త్రజ్ఞులు ఈధ్వనిని సూచించటానికి ఎత్వం రాసి దానికింద గీతగీస్తున్నారు (ఎ=ae),ఒకవిద్వాంసుడు 'ఆ-ఏ' ధ్వనులమధ్య ధ్వనికాబట్టి దీన్ని సూచించటానికి ఆరెంటినీ రాయమన్నాడు (ఉదా, <దే> తాదేకు=తాదేకు). లిపిసంకేతం వున్నా లేకపోయినా తమతమ అలవాటునుబట్టి పాఠకులు చదువుతారుగాని ఈధ్వని వాడుకలో లేని ప్రాంతాలవారు 'అ' అనేఅచ్చుగానే భావించి 'చెప్పాను' వగైరామాటలను రాసినట్లే చదువుతున్నారు. ఉచ్చారణమీద లిపిప్రభావానికి ఇది ఒక మచ్చుతునక.

1.6.10 దంత్యస్పర్శాలమీద తాలవ్యమైన యకారం వచ్చినప్పుడు మధ్యయుగాలనుంచీ కోస్తావారి వాడుకలో మొదటిధ్వనులు తాలవ్యాలుగా సమీకృతాలవుతాయి. ఉదాహరణకు 'మధ్య—మఝ్య, పద్యం—పజ్యం, పథ్యం—పఛ్యం, అగత్యం—అగచ్యం, వగైరాలు. ఈ ఉచ్చారణను యథాతథంగా కొన్నిశాసనాల్లోకూడా లిపిబద్ధంచేశారు కాని లిపిలో సూచించకపోవటమే పరిపాటి పాఠకుల అభ్యాసబలం ఉచ్చారణను నిర్దేశిస్తుంది.

1.6.11 కకారషకారాల సంయోగమే 'క్ష'కారమనివ్యాకర్తలు చెప్పినా 'పక్షి, రాక్షసుడు' మొదలుగా రాసే శబ్దాల్లోని 'క్ష'కారం ఉచ్చారణలో 'క్ష'తో సమానం కాదు 'రిక్షా, సెక్షన్, ఎలక్షన్' అని ప్రస్తుతంవాడుతూ రాస్తూఉన్న మాటల్లోని 'క్ష' కు 'క్ష' అనే ఉచ్చారణలేదు. అలాగే ఇంగ్లిష్ హిందీ ఉర్దూల ప్రభావంవల్లవచ్చిన 'f' అనేధ్వనికి తెలుగులో లిపిసంకేతం లేదు. కాని, దానికి బదులు 'ఫ'కారం రాయటం అనూచారంగా వస్తున్నది. ఉదాహరణకు 'ఫైలు' అని 'file'ను నిర్దేశిస్తున్నారు భాషాశాస్త్రజ్ఞులుమాత్రం హిందీలోలాగా ఫకారంకింద

చుక్కగాని, సున్నగుర్తుగాని వాడుతున్నారు (ఫ ఫ). అంత చదువుకోని వాళ్లు మహాప్రాణోచ్చారణ చేయటంలేదుకాబట్టి 'ఫైలు' అని రాసినా, రాసినా'ఫైలు' అనిరాసినా 'ఫైలు' అని రాసినా 'పైలు' అనే చదువుతున్నారు. ఇందుకు విరుద్ధంగా కొందరు 'ఫలం'అనే సంస్కృతశబ్దాన్ని 'falam' (ఫలం, ఫలం) అన్నట్లు పలుకుతున్నారు. ఇదేవిధంగా 'జ్ఞానం' అని రాసి పండితులు గూడా ఙకారణకారాలను సరిగా ఉచ్చరించటంలేదు,'కర్ణుడు,అర్ణవం, మొదలుగా రాసి' 'కర్నుడు, అర్నవం' అని ఉచ్చరిస్తున్నారు 'కథ,గ్రంథం'వగైరా రాసి 'కధ,గ్రంధం' అని చదువుతున్నారు. 'నీళ్లు,కాళ్లు'అని రాసికూడా రాయలసీమలో బాగాచదువుకున్నవాళ్లు సయితం'నీల్లు,కాల్లు' అని పలుకుతున్నారు. ఉచ్చారణలో చెప్పుకోదగినంత భేదంగాని, అర్థంలోమార్పుగాని లేకపోయినా కొందరు 'వాణ్ని: వాణ్ణి; నీళ్ళు:నీళ్లు' అని రెండువిధాల రాస్తున్నారు. 'రాస్తాను' అని ఉచ్చరించినా 'వ్రాస్తాను' అనే రాసేవాళ్లు చాలామంది ఉన్నారు. నన్నయకు శతాబ్దాలముందే జారిపోయిన రేఫను ఇంకా అలవాటుప్రకారం 'క్రొత్త,'ప్రాత'వంటి శబ్దాల్లో వాడుతున్నారు రాసేటప్పుడు మహాప్రాణధ్వనుల సంగతి చెప్పనక్కరలేదు. వాటిని ఉచ్చారణలో అసలే పాటించకపోయినా రాసేవాళ్లూ, పాటిస్తూ సరిగా రాయని వాళ్లూ, లేనిచోట్ల ఉంచి ఉన్నచోట్ల మానేవాళ్లూ చాలమంది బాగాచదువుకున్న వాళ్లే ఉన్నారు. మచ్చుకు భారతం, బీభత్సం, బాధ, భేదం' అని రాసికూడా బారతం,బీబత్సం,బేధం,' అనే ఉచ్చరిస్తుంటారు.

1.6.12 'అక్కటాదుల జడ్డగు లోపంబు విభాషనగు' అని సూత్రీకరించి చిన్నయసూరి అనేకపదాలు ఉదాహరించాడు. శాసనభాషలో అనేకపదాలను జడ్డ వుంచీ వుంచకా రాసేవారు. కరీంనగర్ మాండలికంలో ఈనాటికీ ఈ పరిస్థితి వుంది ఉచ్చారణలో. ఒకపదం విషయంలో నియతంగా ఇటువంటి ఉచ్చారణ వుందనిగాని, లేఖనసంప్రదాయం ఇలాగే వుందనిగాని నిశ్చయంగా చెప్పలేం. ఇందుకు కారణం ఏదైనా ఉచ్చారణలేఖనాలు అన్యోన్యాశ్రయాలని చెప్పక తప్పదు. ఇటువంటిదే సంప్రదాయవ్యాకరణాలు గుర్తించని అర్ధదీర్ఘత (half

length), త్వరగా మాట్లాట్టంలో 'కాని' అనేమాటను 'కని' అని పలుకుతున్నారు కొన్ని ప్రాంతాల్లో. నిజానికి కకారంమీది అచ్చు హ్రస్వమూ కాదు- దీర్ఘమూ కాదు, అర్ధదీర్ఘంమాత్రమే. ఈధ్వనికి లిపిసంకేతం లేనందువల్ల లేఖనంలో సూచించటం సాధ్యపడదు.

1.6.18 లిపిలేఖనానికీ ఉచ్చారణకూ భేదం కనిపించటానికి విడిమాటల్లోనేకాదు- పదసంఘటనల్లో కూడా ఉదాహరణలు దొరుకుతాయి. మొదట రాస్తున్న తీరునూ తరవాత చదువుతున్నపద్ధతినీ రాతలో సూచిస్తూ కొన్ని ఉదాహరణ లిస్తాం : భారతదేశం- భారతద్దేశం; రాతిచిప్ప—రాచ్చిప్ప; పనులులేవు – పనుల్లేవు; మాట్లాడటం— మాట్లాట్టం. ఇలా వందలకొద్దీ ఉదాహరణలు చూపవచ్చు. వీటివల్ల రాసినట్లే మాట్లాట్టం, మాట్లాడినట్టే రాయటం అన్ని సందర్భాల్లోనూ సాధ్యంకాదని నిరూపించటమేగాక, వ్యవహార ప్రయోజనం శాస్త్రరచనలోలాగా ఖచ్చితంగా ఉచ్చారణను లిపిద్వారా సూచించటం కాదని గుర్తించాలి.

1.7 పైన సూచించిన ద్వైవిధ్యం పరిణామక్రమంలో వచ్చిందేగాని హఠాత్తుగా వచ్చిపడ్డది కాదు. సాహిత్యభాష అనగానే ఏదో ఉదాత్తప్రయోజనవంతమని, వ్యవహారానికి ఎంతదూరంగా ఉంటే అంతగొప్పదని భావించటం వల్లనే ఈపరిస్థితి వచ్చింది. క్రీ శ. 633నుంచి వచ్చినపద్యశాసనాలభాషే ఈఅసాధారణ పరిస్థితికి పరమనిరూపకం. క్రీ శ. 575నుంచి వచ్చిన దానశాసనాల్లో వ్యవహార సన్నిహితమైనభాషే కనిపిస్తుంది. ప్రజాసాధారణానికి సాహిత్యం అవసరంలేదని, అర్థంకాదని, కాకూడదని భావించటంవల్లనే ఈ పరిస్థితి వచ్చింది. ఇందువల్ల ద్విపదాంశత (diglossia) అనే దుస్థితి సామాజికుల భాషావ్యవహారంలో వచ్చింది. కేవలం వచనరచనలు మధ్యయుగాల్లో మొదలయినాయి వ్యవహారబలం వల్ల సాహిత్యభాషలో కూడా చోటుచేసుకున్న మాండలిక పదాలూ, అన్యదేశ్యాలూ, క్రమక్రమంగా సాహితీభాష పవిత్రతనూ శుద్ధతనూ తగ్గించాయి. ప్రాచీనతమ కావ్యభాషకు వ్యాకరణాలు రాసినందువల్ల కాలప్రవాహంలో వచ్చిన రూపభేదాలను వ్యాకరణ విరుద్ధాలని గ్రామ్యాలని అపప్రయోగాలని పండితులు అవహేళనచేస్తూ

వచ్చారు. అయితే ఈ పేళన కొన్ని మార్పులు అంగీకరించి మరికొన్నింటిని ఆమోదించనందువల్ల శాస్త్రవిరుద్ధతను అతార్కికతను సంతరించుకొంది. ఉదాహరణకు 'వచ్చినవాడు, వచ్చినాడు, వచ్చిన్డు / వచ్చాడు' అనే పరిణమితరూపాల్లో మొదటి రెండురూపాలూ, 'సాధువు'లని అంగీకరించినవాళ్లు తరవాతి రూపాలను ఆమోదించడం లేదు. ఇందుకు ప్రధానకారణంగా చివరిరూపాలను వివరిస్తూ వ్యాకరణం 'సూత్రాలు' లేకపోవటమని వాదిస్తారా పండితులు. ఈ పరిస్థితి ఇలా సాగుతుండగానే 19వ శతాబ్దం చివరికాలంలో 'పాత్రోచితభాష' అనే పేరుతో 'అసాధు' రూపాలనుకూడా కొందరు మహాపండితులు- ముఖ్యంగా వేదం వేంకటరాయశాస్త్రి వంటి వారు- ప్రయోగించటం మొదలయింది. మరీ ఇంత బరితెగించటం బాగుండదనుకున్న పెద్దలు కొందరు- ముఖ్యంగా కందుకూరి వీరేశలింగం వంటివారు- 'సరళగ్రాంథికం' పేరిట అరసున్నలు, బండిరాలూ, కొన్ని సంధులూ విడిచిపెట్టి సాహితీభాషను కొంత సంస్కరించాలని సంకల్పించారు. పదప్రయోగంలో సమాసకల్పనలో, వాక్యనిర్మాణంలో ప్రాచీన కావ్యభాషకూ ఈ సరళగ్రాంథికానికీ ఉన్న భేదమల్లా పైన చెప్పిన అరసున్నలు వగైరా తొలగించటం మాత్రమే. కావ్యభాషను అర్థం చేసుకోగలవారికి ఈనాలుగు లక్షణాలు ఉన్నా లేకపోయినా ఇబ్బందిలేదు. నిజానికి ఈ విధంగా 20వ శతాబ్దినాటికి కృత్రిమ సాహిత్యభాషా రూపం ఒకటి అవతరించింది. కాని, ప్రపంచసాహిత్యంతో పరిచయ మేర్పడటం రాజకీయ సామాజిక పరిస్థితుల్లో వచ్చిన మార్పులవల్ల విద్య ప్రతి వ్యక్తికీ అందుబాటులోకి రావటం, వార్తాసాధనాలవల్ల రాకపోకలు సులభమై ఎక్కువయి నందువల్ల భిన్నప్రాంతాల ప్రజలమధ్య సన్నిహిత సంబంధాలు ఏర్పడటం మొదలైన కారణాలు వ్యవహారభాషకు చాలా దగ్గరగా వున్న భాషారూపాల్నే విభిన్న సాహిత్య ప్రక్రియల్లో వాడటానికి దారితీసింది. ప్రాచీనతాభిమానులు ఎన్ని నిర్బంధాలు పెట్టినా, ఎంత నిరుత్సాహపరిచినా కాలక్రమాన వ్యవహారభాషే ప్రామాణ్యం సంపాదించి ఆధునిక సాహిత్యభాషగా పరిణమించింది. సాహిత్యభాష అనే కావ్యభాషను ప్రయోగించే సందర్భాలూ సమయాలూ ప్రకియలూ క్రమంగా సన్నగిల్లాయి. ఇప్పటి పరిస్థితి ఇది,

| సాహిత్యభాష | వ్యవహారభాష |
|---|---|
| 1. పద్యరచనలు | 1. వచనరచనలు(అత్యధికభాగం) |
| 2. కొన్ని సాహిత్య విమర్శలు | 2. గేయరచనలు |
| 3 పదోతరగతివరకున్న పాఠ్య గ్రంథాలు | 3. పత్రికావ్యవహారం |
| 4. సిద్ధాంతవ్యాసాలు | 4. రేడియో, టి. వి. వాడుక |
| | 5. సినిమాలు |
| | 6 నిత్యవ్యవహారం. ప్రసంగాలు |
| | 7. విద్యాబోధన (చాలావరకు) |
| | 8. శాస్త్ర గ్రంథాలు (చాలావరకు) |
| | 9. ఇంటర్మీడియట్ దాని పైస్థాయి పాఠ్యగ్రంథాలు |
| | 10. కొన్ని సిద్ధాంత వ్యాసాలు |
| | 11. కొన్ని సాహిత్య విమర్శలు |

1.8 పై పట్టిక ప్రకారం పద్యరచనలో తప్ప ఇతర సాహిత్య సందర్భాల్లో కూడా వ్యవహారభాష క్రమంగా చోటు చేసుకుంటున్నదని గ్రహించవచ్చు. కావ్యభాష. దాని ప్రయోగం చాలవరకు చిన్నతరగతుల పాఠ్యగ్రంథాల్లో, విశ్వవిద్యాలయాల తెలుగుశాఖల్లో పరిమితప్రయోజనం సాధిస్తున్నాయి. పరిణామం క్రమంగా జరిగేదేకాని ఆకస్మికం కాదు. అందులోనూ జీవద్భాషాసమాజాల విషయంలో హఠాత్పరిమాణం సాధ్యమే కాదు. అందువల్ల అటు కావ్యభాష, ఇటు వ్యవహారభాష అర్ధకృత్రిమంగా కనిపించే ఘట్టాలు, రచనలు తప్పవు. హరికథకులు, పౌరాణికులు, కొందరు గేయ రచయితలు, కొన్ని ప్రసంగాలు కావ్యభాషనే ఆదర్శంగా పెట్టుకొని వ్యవహార భాషారూపాలను అనుకోకుండాగాని, తెలిసీతెలియకగాని ప్రయోగించటం జరుగుతున్నది. అలాగే రచయితల, వ్యవహర్తల సంస్కారంలో, పాండిత్యంలో, లోకజ్ఞానంలో, భాషాపాటవంలో ఉన్న భేదాలు కారణంగా వ్యవహారభాషలో

కూడా కొన్ని అర్థకృత్రిమతలు కనిపిస్తున్నాయి. వ్యావహారికంలోని ఈస్థితి ప్రధానంగా మూడు విధాలు. మొదటిది ఆయాపదాల, పదసంఘటనల మూల రూపాలు సరిగా తెలియనందునల్ల చేసే తప్పులు. ప్రాంతీయ రూపభేధాలు సరిగా తెలియక రాసే తప్పులు. పాతమాటల వాడుక మూడోరకంతప్పు.

1.3.1 మొదటి రకం తప్పులవల్ల భాషలో సరికొత్త పర్యాయరూపాలు ఏర్పడతాయి వాటిని అనేకులు వాడగా వాడగా కాలక్రమాన అవి కూడా ప్రామాణికరూపాలే అవుతాయి. ఉదాహరణకు "సమర్థవంతం, పటిష్టపంతం, శక్తివంతం, సౌహార్దం, ధృవీకరణ, జాతీయకరణ, సమస్థ"వంటి మాటలు తీసుకోండి. సమర్థ పటిష్ఠశబ్దాలు విశేషణాలు. వాటికి మతుప్ప్రత్యయం చేరదు సంస్కృతంలో. కాని, తెలుగువాళ్ళు అనేకులు నియతంగా వాడుతుంటే ఆ మాటలే చివరకు ప్రామాణికా లవుతాయి. ఇకారాంతాల చివరి 'వంతం' అనే మతుప్ప్రత్యయం 'మంతం'గా మారుతుంది సంస్కృతంలో. సామ్యం వల్ల (analogy) 'వంతం' వాడుకతో నిలిస్తే ప్రామాణిక మవుతుంది. చేసే దేమీ లేదు. 'సుహృత్ । సుహృద్' శబ్దం మీది తద్ధితరూపం 'సౌహార్ద' మవుతుంది. మరో రావత్తు చేరదు. అయినా పది మంది దాన్ని చేర్చివాడుతుంటే చేయ గలిగిందేమిటి ? వ్యాకరణ సూత్రం మార్చి రాసుకోవటం తప్ప ? అలాగే 'ధ్రువీకరణ, జాతీయీకరణ' అనాలి సంస్కృతవ్యాకరణాల ప్రకారం. 'సంస్థ' అనాలి కాని 'సమస్థ'కాదు. ఇలా వేలసంఖ్యలో పద రూపాలు మారి పోతున్నాయి. ఘనంగా చెప్పాలని, ఒత్తులుంటే అది సరైన రూపమని భ్రాంతిపడి కొన్ని అతిశోధితరూపాలను (hypercorrect forms) సృష్టిస్తున్నారు. ఉదాహరణకు 'శాకాహారం' బదులుగ 'శాఖాహారం', 'శంకు స్థాపన'కు గాను 'శంఖుస్థాపన' వగైరాలు. సంస్కృత శబ్దస్వరూపం తెలుగు వారికి సంస్కృత వ్యాకరణాల ద్వారా ఎందుకు తెలియాలో తెలియదు. మూల శబ్దార్థం తెలియనందువల్ల 'విచక్షణ'కు బదులు 'వివక్ష', 'విద్యుదాఘాతం', బదులు 'విద్యుద్ఘాతం' వంటి ప్రయోగాలు దొర్లుతున్నాయి వాటివల్ల రచనలకు అర్థకృత్రిమత్వం వస్తున్నది. ప్రాంతీయ వ్యవహారం సరిగా తెలియక

'అవలంబించితే, చెప్పితే' మొదలైన రూపాలు కొందరు వాడుతున్నారు- 'అవలంబిస్తే, చెబితే' అనటానికి బదులు. ఇందుకు కొంతకారణం గేయరచనల్లో ఛందోబంధాలవల్ల వచ్చిన అవసరాలే 'కైకొను, కఱపు, చేకొను, పలువురు' మొదలైన పాతమాటలను, 'పట్ల, యొక్క' వంటి పాతప్రత్యయాలను, బడు ధాతువువాడి కర్మణి ప్రయోగాలను (Passive constructions) కొందరు ఇంకా వాడుతూనే వున్నారు వ్యావహారికరచనల్లో కూడా. ఈ లోపం గ్రాంథిక భాషారచనల్లో కనిపించే వ్యావహారిక రూపాలకు సరిగ్గా విరుద్ధమైనలక్షణం. భాష లోని పరిణామక్రమం స్పష్టంగా తెలియక కొన్ని, భాష మారిందనీ ఇవి పూర్వ భాషాలక్షణాలనీ తెలియక కొన్నీ అర్ధకృత్రిమ రూపాలు సిద్ధమవుతున్నాయి. అయితే వీటి సంఖ్య చాల తక్కువ ; పౌనఃపున్యం (frequency) మరీ తక్కువ ఎక్కడో, ఎవరో 'తలకు నూనె వ్రాసుకుంటున్నది, పాలు పారబొయ్య నవి, ప్రజలు మరణించబడుతున్నారు' ఇత్యాదిగా రాసినా మొత్తం మీద ఇటువంటి లోపాల సంఖ్య చాల తక్కువ పాత నీరు పోయి కొత్త నీరు వచ్చేటప్పుడు అక్కడక్కడ కొంత మాలిన్యం తప్పనట్లే ఇదీని. అంతా వ్యవహారభాషలో రాసి బందిరా మాత్రం నిలిపినవారూ, మొత్తం కావ్యభాషలో రాసి అక్కడక్కడ వ్యావహారిక రూపాలు వాడిన వారూ సమానులే. భాష ఒకస్థితి నుంచి మరో స్థితికి పరిణమిస్తున్న సంధికాలంలో ఇటువంటివి తప్పవు. ఇది అవ్యవస్థ కాదు ; పరిణామ సంధి.

18.2 సాహిత్యభాషకూ వ్యవహారభాషకూ కొద్దిపాటి భేదం సహజంగా ఉంటుందని పై ప్రసంగంవల్ల గుర్తించవచ్చు. నిత్యవ్యవహారాలలో, వాడే అధునికభాషలో శబ్దసంపద తక్కువగా ఉంటుంది; సాహిత్య గౌరవం పొందిన అధునిక వ్యవహారంలో శబ్దవైవిధ్యం వైచిత్రి ఎక్కువ. విషయవస్తు వైవిధ్యమే ఇందుకు ప్రధానకారణం. అలాగే సాహితీవ్యవహారంలో ప్రాచీన రూపాలు ఎక్కువగా దొర్లటానికి సంప్రదాయబలం కారణం. దైనందిన వ్యవహారాలలో కన్నా సాహితీవ్యవహారంలో దీర్ఘసమాసాలూ సుదీర్ఘవాక్యాలూ డొంకతిరుగుడు మాటలూ ఎక్కువ సాహిత్యకారుల కున్న భాషాపరిశుద్ధతా భావం

వ్యవహారంలో ఉండదు-సాధ్యమూ కాదు. అప్పకవి చెప్పిన 'వ్యవహారహాని' భయమే అందుకు మూలకారణం. సాహితీకారుల్లాగా వ్యవహర్తలు పదాల పుట్టుకను గురించి ఆలోచించరు-చర్చించరు. అలా ఆలోచించి ప్రయోగించటం వ్యవహారత్వరవల్ల సాధ్యమూ కాదు. ప్రాచీన భాషకు లక్షణనిర్ణయం చేసి వ్యాకరణ 'గ్రంథాలు' రాసినంత సులభంగా అనుక్షణ పరిణామశీలమైన వ్యవహార భాషను విశ్లేషించటం సులభసాధ్యం కానేకాదు. అందువల్ల ఆధునిక భాషా వ్యాకరణాలు ఎప్పుడూ అసమగ్రంగానే ఉంటాయి. మృతభాషావిషయంలో తప్ప- అంటే వ్యవహారదూరమైన భాషవిషయంలో తప్ప - సమగ్ర వ్యాకరణ గ్రంథ నిర్మాణం అసాధ్యం. గ్రంథమో సూత్రమో రాయనంత మాత్రాన వ్యాకరణమే లేదనుకోవటం వెర్రి ఆ సంగతి ఇంతకుముందే ప్రస్తావించాం.

1.9 ఆధునిక సాహిత్యభాష వ్యవహారభాషకు అత్యంతసన్నిహితమని, అందుచేతనే నేటి సాహిత్యం జనరంజక మయిందని గుర్తించాలి. ప్రపంచ భాషాసాహిత్యాల ప్రభావం ఆధునిక ప్రామాణిక భాషమీద అంటే సాహిత్య భాషగా పరిణమించిన నేటి వ్యవహార భాషమీద - ఎంతో ఉంది. దాన్ని సవివరంగా వర్ణించటం ఈ వ్యాస పరిధిలో సాధ్యపడదు. మచ్చుకు కొన్ని ప్రధాన లక్షణాలుమాత్రం పరిశీలిద్దాం.

1.9.1 ఒకే భావాన్ని ప్రతిపాదిస్తూ వ్యవహర్తల సంస్కారంమీద ఆధారపడి కింది వాక్యాన్ని మూడురకాల మాటలతో రాయవచ్చు-

నేను <u>కొలువుకు</u> వెళ్తున్న / నేను <u>ఆఫీసుకు</u> పోతున్నా / నేను <u>దఫ్తరుకు</u> పోతుంద

రచయిత అభిరుచినిబట్టి పఠిత / శ్రోతనుబట్టి ఈ వాక్యాల్లో ఏదైనా వాడవచ్చు. అర్థబోధ రచయిత మీదనేగాక పఠిత / శ్రోతమీద కూడా ఆధారపడింది కాబట్టి. అన్యదేశ్యాల వాడుక సంస్కృతాంధ్ర పదప్రయోగాన్ని కూడా ప్రభావితం చేసింపనటానికి కింది వాక్యాలు నిదర్శనాలు :

1. ఆల్టర్నేట్ (alternate) చేస్తున్నారు.

2 రుబాబ్ చేస్తున్నారు.

3. పరిష్కరణ చేస్తున్నారు.

చేయు ధాతువును అన్యదేశ్య నామవాచకాన్ని క్రియాపదంగా మార్చ టానికి వాడుతున్నాం "ఆల్టర్నేటించు, రుబాబించు'' వంటి రూపాలు తెలుగులో సాధ్యం కాకపోయినా 'పరిష్కరించు' సాధ్యమే. అయినా ఇతరభాషా పదాల వాడుకలోని అభ్యాసబలంవల్ల 'పరిష్కరణచేయు' అనే క్రియారూపమే వాడుక లోకి వచ్చింది.

1.9.2. 'గారు / వారు' మొదలైన పూజ్యార్థకాల వాడుక రచనల్లో, తక్కువైన కర్తను ఏకవచనంలో క్రియను బహువచనంలో రాసి గౌరవం సూచించటం ఇప్పుడు పరిపాటయింది ఉదా. 'ఇందిర ఇలా అన్నారు....ముఖ్య మంత్రి హెచ్చరించారు' వగైరా.

1.9.3. సామాజిక పరిస్థితిలో వచ్చిన మార్పులవల్ల ఇటీవలి కాలంలో ఉపాధ్యాయవృత్తి స్త్రీలను ఎక్కువగా ఆకర్షిస్తున్నది. అందువల్ల 'టీచర్' గా పనిచేస్తున్న స్త్రీలసంఖ్య పెరిగినందుకు చిహ్నంగా వాడుకలో 'టీచర్ చెప్పింది' అనే అమహత్ క్రియారూపం ఎక్కువగా వినిపిస్తుంది. చివరికి 'టీచర్' స్త్రీలింగ శబ్దం, 'సార్' పుంలింగశబ్దం అయినాయి. కానీ 'టీచర్స్ అసోషి యేషన్' లో ఇంగ్లిష్ సంప్రదాయమే నిలిచి ఆశబ్దం ఉభయలింగ బోధకంగానే ఉంది.

1.9.4. కొన్ని ఇంగ్లిష్ పదాలను వాటి బహువచన రూపాలతో కూడా ఎరువు తెచ్చుకొన్నాం. చాలాపదాలకు మధ్యతరగతి మేధావుల వ్యవహారంలో తెలుగు బహువచన ప్రత్యయాన్ని గాని ఇంగ్లిష్ ప్రత్యయాన్నిగాని చేర్చటం కద్దు, కొన్ని సందర్భాల్లో ప్రత్యయం మార్పు అర్థభేదం కల్పిస్తుంది. ఉదా హరణకు ఇంగ్లిష్‌లో 'bodice' శబ్దంపు చివరి అక్షరం (syllable) బహు వచనప్రత్యయం అనుకొన్నందువల్ల ఏకవచన రూపంగా 'బాడీ', బహువచన

రూపంగా 'బాడీలు' సిద్ధించాయి, అలాగే 'summons (sg.)—summonses (pl.)'అని ఇంగ్లీష్‌లో ఉండగా తెలుగువారి వాడుకలో 'సమన్/సమను (ఏక.) సమన్లు (బహు.)' అనే రూపాలు నిలిచాయి. ఇంగ్లిష్‌లోని 'note, rule' వంటి నామవాచకాలకు తెలుగు, ఇంగ్లిష్ బహువచన ప్రత్యయాలు భిన్నార్థాల్లోనే చేరుతున్నాయి. ఉదా. 'అతడు నోట్సు రాస్తున్నాడు (నోట్లు అనం ఇక్కడ), అతని దగ్గర నోట్లు ఉన్నాయి (నోట్సు అనం); అతడు రూల్సు మాట్లాడు తున్నాడు (రూళ్లు అనం), అతడు రూళ్లు గీస్తున్నాడు (రూల్సు అనమిక్కడ); లోకవ్యవహారం ఎలావుందో గమనించి ప్రయోగించటం తప్ప రచయితకు మరో మార్గం లేదు, ఇటువంటి సందర్భాల్లో.

1.9.5 స్త్రీవాచకశబ్దాలు సంస్కృతంలో దీర్ఘాంతాలయినా పూర్వం తెలుగువాడుక రాగానే హ్రస్వాంతాలయ్యేవి. 'సీతా,రమా' వంటి సంస్కృత పదాలు తెలుగులో సమాసగతమైతేనే దీర్ఘాంతాలు; లేకపోతే 'సీత,రమ' అని మారేవి. బహుశాహిందీప్రభావంవల్ల నేమో ఇప్పుడు 'సీతాటీచర్' వంటి పద బంధాల్లోనేకాక విడిగా చెప్పేటప్పుడుకూడా 'సీతా ఇలా అంది, రమా ఈపని చేసింది' అంటున్నారు.

1.9.6. గ్రాంథికవాదులు బహుశా పాండిత్యప్రదర్శనకేమో తద్ధిత రూపాల (Secondary derivatives) వాడుక తెగపెంచి 'తద్ధిమితాలు' వాడుతున్నారనే అపప్రథ సంపాదించారు. ఆధునికప్రమాణభాషలో ఈరూపాల వాడుక చాలాతగ్గింది. ఉదాహరణకు 'రాసాయనికచర్య' 'రసాయనచర్య' గా, 'వ్యావసాయికదేశం' 'వ్యవసాయదేశం'గా మారిపోతున్నాయి.

1.9.7 'బడు' ధాతువు వాడి కర్మణిప్రయోగం చేయకపోతే శాస్త్రీయతకు లోపమన్నభావం ఉండేది. ఆ ప్రయోగం ఇష్టంకాక, శాస్త్రలక్షణలోపమూ అంగీకరించక ఇప్పుడు 'జరుగు' ధాతువురూపాలు వాడి మధ్యమార్గం తొక్కు తున్నారు రచయితలు. ఉదాహరణకు 'చేయబడటంలేదు' కు బదులు 'చేయటం

జరగలేదు' అలాగే 'చేశారు' కు బదులు 'చేయటంజరిగింది' అనటం అలవాటవుతున్నది.

1.10 పైవిధంగా ఎన్నోలక్షణాలు ఏకరువు పెట్టవచ్చుగాని గ్రంథవిస్తరభీతి అంతకన్నా బలీయం. కావ్యభాషగా, గ్రాంథికంగా వ్యవహృతమైన ప్రాచీన భాషనే సాహిత్యభాషఅని కొందరుమాత్రం భావిస్తున్నారు. గ్రామ్యంగా, (శిష్ట) వ్యావహారికంగా ఒకప్పుడు వ్యవహృతమైన ఆధునికభాషే ఇప్పుడు వ్యవహారభాషగా, ఆధునిక ప్రమాణభాషగా, ఆధునికసాహిత్యభాషగా చెలామణి అవుతున్నది. ఏదో కొంత మాండలికవైవిధ్యం, మరికొంత ప్రాచీనపదజాలం, కాస్త కృత్రిమత ఉన్నా ఆధునికవ్యవహారభాష అనేకరంగాల్లో సాహితీప్రక్రియల్లో ప్రయుక్త మవుతున్నది. ఒకప్పుడు గ్రాంథికభాషనే వాడిన అనేకరంగాల్లో ఇప్పుడు వ్యావహారికం నిలవదొక్కుకుంటున్నది. పరిణామక్రమంలో ఈమార్పు సహజంగా వచ్చింది అందువల్ల గ్రాంథికభాషకు భవిష్యత్తు లేదు. అంటే పూర్వకావ్యాలు ఎవ్వరూ చదవరనిగాని, చదవ గూడదనికానికాదుఅర్థం. పూర్వకావ్యభాషలో ఇప్పుడు రాయవద్దని రాయకూడదని మాత్రమే.

## ప్రధానాధారగ్రంథాలు, పరిశోధనపత్రికలు

### i తెలుగు

1. 1971 - వ్యావహారిక భాషావికాసం, విశాలాంధ్రప్రచురణ, విజయవాడ.

2. ,, - ప్రాచీనాంధ్రశాసనాలు, ఆం.ప్ర. సాహిత్య అకాదమి, హైదరాబాద్

3 ,, - తెలుగుమాండలికాలు: కరీంనగర్‌జిల్లా, తెలుగు అకాదమి, హైదరాబాద్.

4. 1972 - తెలుగుమాండలికాలు; కడపజిల్లా, తెలుగు అకాదమి, హైదరాబాద్.

5. 1974 - తెలుగుభాషాచరిత్ర, సంపా, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆం. ప్ర. సాహిత్య అకాదమి, హైదరాబాద్.

ii ఇంగ్లీష్


1. 1971 - Diglossia in Telugu, Proceedingss of the Ist conference of Indian Linguists, Poona

2. 1979 - Diglossia and Telugu situation, Proceedings of the seminar on Sociolinguistics and Dialectology, Annamalai University, Annamalai Nagar.




# నేటి పద్యరచన: దానిభవితవ్యము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

యా వర్ణ పద వాక్యార్థ గద్య పద్య స్వరూపిణీ
వాచి నర్తయతు క్షిప్రం మయి మేధాం సరస్వతీ,

జ్యోతిష్మంతములైన ఆంధ్రసారస్వత మహాపురుషుని లోచనములలో ఒకటి గద్యము; వేఱొకటి పద్యము.

గద్యము కాంతిలక్షణముకలది. పద్యము క్రాంతికక్షము. ఇది- మన వాఙ్మయాకాశమున యౌగపద్యమైన ఒక పుష్పవద్యోగము. శతాబ్దులుగా అహో రాత్రములు కలుపుకొని వచ్చుచున్న దీప్తిభోగము.

గద్య పద్య విన్యాసములతో సర్వాంధ్రవిషయమున పాఠకులకు భావుకులకు నయనోన్మేషము కలిగించినది వెయ్యేండ్లమాట! పద్యమును విద్యగా భావించి అధ్యయనించుట - మహాకవిత్వ దీక్షావిధిలో పద్యమునకు అభ్యర్హితత్వము పాటించుట- తెలుగువారి ఛందఃప్రస్థానమునకు ఈ రెండును మున్ముందుగా అందిన నాందీవాదములు.

రసామ్నాయమైన కవిత్రయమువారి సంహితారచనానుభావము తెలుగులో ఉత్తరోత్తర యుగములకు మెఱవడియగుచుండుట ఎంతకాదన్నను, అనుభవ పరిచితము.

గణములు—యతి ప్రాసములు—పాదములు—ఇట్లు ఛందోనియతమైన దానికి 'పద్యము' అన్న వ్యవహారము. పద్య చ్ఛందస్సులకు గల సంబంధము వ్యాప్య వ్యాపకము; కార్యకారణము. కార్యమునకు కారణ గుణ సంక్రమణము తప్పనిది.

శబ్దముయొక్క పుట్టుకనుబట్టి చూడగా, ఛందస్సు ఆచ్ఛాదము కలిగించునది: ఆహ్లాదము నొదవించునది. ఆచ్ఛాదము ప్రాణశక్తి ప్రదము. ఆహ్లాదము జీవశక్తి దాయకము. అట్టి ఛందోధర్మమును అమర్యాద పఱచని ఒకానొక వినయలక్షణము పద్యమున ఒదిగియున్నది.

మఱియొకటి: కవి ఒక భావమును బహిర్గతము చేయుటకు ఉద్దేశించెను. తదభివ్యక్తికి శబ్దము ఉండవలెను. ఉన్న శబ్దమే వైఖరీదశకు రావలెను. ఈ స్థితిలో ఇటు లనుకొందము. ఆ శబ్ద శైలూషి మనోజ్ఞమైన జిలుగు వలువతో జిహ్వాగ్రరంగమున అడుగుపెట్టినది. ఆ ప్రవేశవైఖరిలో శ్రుతిప్రియమైన సుధాప్రాయమైన లయరాగములు శ్రోతృ చేతస్సును వలవైచి లాగుచున్నవి. అపుడు—కవియొక్క ఉద్దిష్టభావము సహృదయునిలో చరితార్థమగుట జరుగుచున్నది. ఈ సందర్భమున శబ్దసుందరిచే రంగప్రవేశము చేయించిన సూత్రధార స్థానము ఛందస్సుది. పద్య స్వాతంత్ర్యమునకు ఛందస్సు బంధకము కాదు; పఱగా, తద్గతి గీతిసౌందర్య సంధాయకము.

పురా విమర్శక పరామృష్టము ఛందోరుచిరమునైన నాటి పద్యరచనను గూర్చి నానేర్చినది క్రొత్తకాదు.

పరిషత్తుచే అనుగృహీతమై నాపాలికి వచ్చిన భాగధేయాంశము నేటి పద్య రచన—దాని భవితవ్యము. ఈ ప్రసంగమునకు ముందు ఇందాక, చొఱవ చేసి వెలువఱిచిన నాల్గుమాటలు నాకు నేను వేసికొన్న పూర్వపీఠిక.

అభిజ్ఞుల సపర్యా పర్యవేక్షణములతో 'అకాడమీ' ఇరువదేండ్ల వయస్సునకు వచ్చిన అభిస్ఫురిత సమయము. ఈ రెండు దశలలో మన పద్యరచనలు పాఠకుని సహృదయుని చిత్తరంగమును ఎట్లు రసభావతరంగితము చేయగలిగినవి: యథాస్మృతికము చెప్పుకోవలసిన తరుణము.

రచన యనగా నిర్మాణము. పన్నుగడ. ఇది—ప్రతిభ, వ్యుత్పత్తి, సౌందర్యము, శిల్పము ఇత్యాది బహు మనోహరార్థ పరిస్ఫోరకమైన శబ్దము. రచనయే కావ్యము పద్యరచన పద్యకావ్యము.

సరిగా, ఇరువదియెన్మిదేండ్లనాడు ప్రథమాస్థానకవి పట్టోత్సవ సమయమున బెజవాడనుండి వినిపించిన మాటలు.

"యతియున్ ప్రాసయుఁగూర్పు మాత్ర కవియే! యం చేను వాకొంటి గీ
రతమన్ గావ్యమునందు, నా రచన లారాధ్యమ్ములే యైన నే
కతమో తెల్పఁడు సంతసింతు; గణసంఘాతంబు కావ్యంబె?..."

అని ప్రశ్నించి, "ఆతఁ డనేకయుద్ధముల నారియుఁదేఱిన వృద్ధమూర్తి" చెప్పిన పద్యములు.

క. బుధులకు 'సాధ్యోహి రసో
యథాతథ' మ్మనెడి వాక్య మర్థమ్మగు; వా
రధమ మని పరిహరింతురు
వృథాగఁ గష్టించినట్టి వేత్తల రచనల్.

గీ. కవితవలనఁ బున్నెముగూడఁ గలిగెనేని
గలుగసం డాఁప శక్యమ్ము గాదు; రామ
కోటివలె నుండు రచనలు కోవిదులకు
నచ్చ; వీరహాస్యమ్ము విన్నాణి యెఱుఁగు.

ఇది—ఈ శతాబ్ది నడిఒడ్డు నుండి (1950) వీచిన పద్మగంధిలమైన సాహిత్య వాచికము. యతిప్రాసములు - గణసంఘాతము - ఈ ఛాందసము రసమునకు ఉపస్కారమగునేకాని, ఉపాలంభకము కాదనుట యిక్కడి యుద్దేశ్యము. కవియొక్క నిర్మాణశక్తివలన కావ్యమునకు రసవత్తరత! ఆశక్తి ఎక్కువ తక్కువలు కావ్యములను ఐహూధాకరించుచున్నవి. యుగ యుగములందును ఈ తారతమ్యములు, ఈ రమ్యాతారమ్యతలు ఇట్లే ఉండక తప్పదు. కాలము గడచిన కొలఁది - సహృదయ సమీక్షలు జల్లెడలై తేలిన రచనలేవో అవి మనకు దక్కినవి. "ద్విత్రాః పంచషావా గణ్యంతే కవయః"

ఒక కాలములోని రచనలు తీసికొన్నచో, వానికి తత్పూర్వకాలిక కృతిచ్ఛాయలు దళముగనో పలుచగనో పడుట విధి. ఇది సృష్టియందలి ధారా రస

లక్షణము. దీనిని త్రెంప జూచుట నిష్ఫల ప్రయత్నము. ఒకప్పుడు — ఒకానొక బలమైన పారిప్లవవాయు విజృంభణముతో ఆధార తెగినజాడ తోచవచ్చును. "అయ్యో! సంప్రదాయము సంప్రదాయము" — అని ఇవతలివాడు కూయి పెట్టును.

"అవే పదములు. అవే అర్థములు. కూర్పు నేర్పును బట్టి కావ్యము నవ్యము" — అన్న అభిజ్ఞవాణి యొకటి మనము విన్నదే. ఇక్కడి తచ్ఛబ్దము సంప్రదాయార్థకము. పద పదార్థముల సంబంధము పార్వతీ పరమేశ్వరుల వలె సంపృక్తమైనది. ఈ సంబంధము ఎడము గాకుండగా చేయు ప్రయత్న కౌశలమునుండి రసోత్పత్తి యగుచున్నది. ఏతాదృశమైన గ్రథన చాతుర్యము లేని రచనలో ప్రత్యగతలేదు. స్వచ్ఛందమైన కూర్పునేర్పునకు ఛందస్సు-పద్యము- ఉద్దీపకము.

"సాధ్యో హి రసో యథాతథం కవిభిః" — శరత్సహస్రము నాటిమాట-మొన్నటి చెళ్లపిళ్ల శతావధాని నోట అనుగర్జితమైనది. నిన్నటి కవిసమ్రాట్టు "వ్యాఖ్యాన సింహాసనము" కూడ ఆ సిద్ధాంతమునకే అనుగీతము :

"కవిప్రతిభలోన నుండును గావ్య గత శ
తాంశములయందుఁ దొంబది యైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి."

మఱి- నేఁడు 1958-1978 నడిమి రెండు శతాబ్దులలోని పద్యరచనలకు ఆశాజ్యోతులు కొన్ని సముజ్జ్వలములు.

ఈ శతాబ్ది పూర్వార్ధములోనే బీజనిర్గతమైన రామాయణ కల్పవృక్షమునకు ఫలగ్రంథము యుద్ధకాండము 1962లో ఆంధ్ర సరస్వతికి నైవేద్యమగుట మనము చూచితిమి. తెలుగులో నేటి పద్యరచనా విజయమునకు శ్రీమత్ప్రతిష్ఠ జ్ఞానపీఠ బహూకరణము. సంప్రదాయ కవిత్వమునకు సలక్షణ

సరస్వతికి ఆధునిక యుగమున రామాయణ కల్పవృక్షముతో అక్షర లక్షలు లభించినవి. భావుకులు ఈ లాభమును వదలుకొనుట సిరిరా మోఁకాలొడ్డుట. పూర్వమహాకవుల సంప్రదాయముపై ఉపేక్ష-క్రొత్తపోకడలమీద వల్లమాలిన అపేక్ష- అట్టి సంధ్యాఖండములో అద్యతన కాలమున నే నుంటి నని సేతు బంధము చేసిచూపిన సర్గబంధము; రససింధువు కల్పవృక్షము. శ్రీరామచంద్ర దర్శనము చేసి నలుఁడు సముద్రతీరమున చెప్పినది:

చ. మనపని తీరినన్ జలధి మంధర గర్భ మహాపయోనిబం
ధనమున శ్రద్ధయున్ సడలినన్ యుగముల్ భవదీయసేతు బం
ధనకృత చిహ్నముల్ చెదవు నా రచనాపటుశిల్పపాటవం
బనితరమై త్రికాలనిబిడాచ్ఛయశోనవమూర్తి, మత్ప్రభూ!

కల్పవృక్షము శాంతరసాధ్యక్షముగా సంతరింపబడిన మహాకావ్యము. తెలుఁగులో పోతనగారి భాగవతము ఎట్లు భావభూమియో, అట్టి ప్రయత్నసిద్ధులు రామాయణ కల్పవృక్షమున భావించినవారికి తోచవచ్చును. విశ్వనాథవారి పద్యములో లఘురచనలును ప్రద్యుమ్నాభ్యుదయము, శివార్పణము, మధ్యాక్కఱలు వంటివి పెక్కులు వచ్చినవి. అవియెల్ల రామాయణము పై చిలుకులు. 'నాకవిత్వ మనుపేర నిప్పటికే శివభారతము చాలు' ననుకొన్న గడియారము వారి కలము 1978లో 'రఘునాదీయము' అను మఱియొక అద్వితీయ కావ్యమును వెలువడఁజేసినది "శాస్త్రిగారిది వుటలు నించి సంపుటములనుపేర్చి ప్రదర్శించు అక్షరచనా ధోరణికాక, చిక్కగా చిలికి పిండి పైకెత్తి అర్థభావముల నావిష్కరించు ప్రశాంత భావుకకవితాసుపంథ" అని చెప్పిన అనంతకృష్ణ శర్మగారి ప్రవచన మొకటి చరిత్రకారులకు జ్ఞప్తి "కవులు ప్రపంచించునది ఆధ్యాత్మిక సత్యమే కాని ఆదిభౌతిక సత్యము కాదనుట మహాకవులు నాడును-నేడును-రేపును గమనించి ఆచరించు ధర్మము. ఆదానిలో ఉదాత్త భావములను తేజోవంతముగా వెలుపరిచి ప్రజల అంతఃకరణములను సంస్కరించుటయే కావ్యకామనీ యకమునకు పరమఫలము."

గడియారమువారిది 'నూతనమున్ ప్రాగ్గుణసమ్మితమ్ము' నైన పద్య రచనా రీతి. శివభారతమునకు 'రఘునాధీయము' తోడునీడగా వచ్చినది. కావ్య కర్త ఆశంసనము ఇట్లున్నది:

చ. అమలిన సౌరభానిత్యములై విలసిల్లిన రెండువేల ప
ద్యములఁ దనర్చు నీకుసుమహారము శ్రీరఘునాధుకీర్తి హా
రముగ ఘటించి, యాంధ్రజన రమ్యరసజ్ఞత నెన్నుచున్ గృతా
ర్థముగఁ దలంతుఁ; బ్రాజ్ఞులు శుభమ్ముగ దీని గ్రహింతురుగావుతన్.

మన కవుల దృష్టి మహారాష్ట్రీయులవైపు ప్రసరించుట చాలఁగాలము క్రితమే చూచితిమి. ఈ నడుమ జాతిరత్నములను ఎన్నుకొనుటలోని వారి చూపులో గుప్తమైన మలుపు సహృదయులు గమనించుచునే యుందురు.

ఈ శతాబ్ది యుదయమునుండి ఉదయించిన తుమ్మల సీతారామమూర్తి గారి కృతహస్తము మన కిచ్చిన "మహాత్మకథ" జాతి ప్రశస్తమైన తెలుఁగు కబ్బము. గాంధి మహాత్ముని 'ఆత్మకథ' పద్యరూపమునఁ దీర్పబడినది 1951లో. దానికి తిలక రచన చేసిన కట్టమంచి రామలింగారెడ్డి "సీతారామమూర్తి మహాత్ముని ఆస్థానకవి. ఆ స్థానము శాశ్వతము" అనుట మనము విన్నమాట. నాటి ఆత్మకథ తరువాత, పదేండ్లనాఁడు వెలువడిన 'మహాత్మకథ' ఆయన కృతులలో స్వాధీనపతిక. సంప్రదాయసిద్ధ మయిన భాష, స్వస్థాన వేషభాషాభిరతి, రాష్ట్రగానముచే హృదయ రంజనము చేసిన కమ్మని తెలుఁగు గొంతు. ఆత్మ విశ్వాసము గల ధీరవాక్కు.

చేసిన పుణ్యమై తనకుఁ జిక్కిన కైత ఫలింప భక్తిమై
వ్రాసినవాఁడఁ దొల్లి యెరవాఁడ తపస్వి కృతంబు సూనృత
శ్రీసముపేత మాత్మకథ శిష్టజనస్తవనీయ భారతీ
భాసుర గద్య పద్య పరిపాటికి మూదలయై తలిర్పఁగన్.

'ఆత్మకథ' కంటె 'మహాత్మకథ' కవికి రచనాస్వాతంత్ర్యము నధికముగా నిచ్చిన గ్రంథము.

"గాంధియుగమునఁ బుట్టితి గాంధి నడుపు
నుద్యమంబుల నలఁగితి నోపినంత
గాంధి నీక్షించితిని గాంధి కవిత వ్రాయ
గంటి నీజన్మమునకు నీపంట చాలు."

ఎక్కడి కక్కడ - చాలు నన్న తృప్తి పడుచున్నను సరియైన కవి ఊరకుండజాలడు సీతారామమూర్తిగారు సర్వోదయగానము - పైరపంట - ఎక్కట్లు - మున్నగు చిట్టి కబ్బములు వెలువరించి వచ్చుచునే యున్నారు. 1978లో "నా కథలు" తెనుఁగులెంకకృతి వచ్చినది. ఇది ఒక విధముగా పద్యములలో స్వీయచరిత్ర వంటిది ఆయన శీలమున కిద్ది దర్పణము. ఆయన సత్యారాధనమునకు అద్దము దేశీయచ్ఛందములు సీతారామమూర్తిగారి చేతిలో సుందర చ్ఛాయలుగా చిత్రితములైనవి. కొందఱు గుదిబండయనుకొను ఛందస్సు ఆయనకు నల్లేరుపై బండినడక ఇక్కడ రామలింగారెడ్డిగారి మాటలే పునస్మరణము చేసి కొనుటలో పద్యరచనయెడల ఆయన యభిప్రాయముకూడ తెలిసి కొనుట యగును

"మన చౌదరిగారు యతిప్రాసములకై భంగపాటు చెంది తలగోఁకి కొనుచు బలాత్కార పదప్రయోగములు చేసి, యర్థము ననుసరించి పదములు వాడక, పదములఁ బట్టి యర్థమును వంపులువెట్టి వఁగఁజేయు నీరసుఁడు కాఁడు. భావ మనర్గళముగాఁ బ్రవహించు చందాన వ్రాయు మహానీయుఁడు. యతి పదాది యందే కాక మధ్యమునను గొనలు వ్రాలును. ప్రాసమునకు యతికినై పద్యము నడక నిలిచి దాఁటవలసిన యిబ్బంది లేదు. అర్థమును బట్టి పదములు, పదములలో లీనమైన రీతిని యతిప్రాసములు అనాయాసముగ నప్రయత్నముగ స్వచ్ఛందముగ వచ్చి చేరుచుండును. ఈ సిద్ధి యందు ప్రసిద్ధుఁడు తిక్కన. ఈ వర్గమున తిక్కనతో సజాతీయుఁడైన వాఁడు మన చౌదరి."

ఇందాఁక ఎందుకు ఉదాహరించితి ననగా, ఆంధ్ర కవిత్వ తత్త్వమును లోఁతుగా విచారణము చేసిన శ్రీ కట్టమంచి రెడ్డిగారి ఛందోగౌరవ మేతాదృశ మనుటకు,

తరువాత 1986లో 'పోతన చరిత్రము' అను మహాకావ్యము తెలంగాణా ప్రాంతము ప్రసాదించిన పెన్నిధి వానమామలై వరదాచార్యులవారు ఉభయ భాషలయందు సభాజన పాత్రమైన వైదుష్యముగల కవి. దేశకాల పాత్రములను గుర్తించుటలో ఆయన మేధ సునిశితమైనది. చిఱుతిండ్లకు ఉబలాట పడక, మృష్టాన్న భోజనముచేసి, అతిథులచే సైతము చేయింపగల జఠరపుష్టిగల శిష్టులలో ఆయన ఒకరు. చరిత్రసిద్ధులగు మహాపురుషులను నాయకులను కావ్యపాత్రములుగా చేయుచున్న ఈ కాలములో, కావ్యమయ వపుర్విఖ్యాత దివ్యసుందరమూర్తియైన 'పోతన' చరిత్రమును కయికొని వ్రాయుటతో ఈ గ్రంథము చెప్పక చెప్పు మహాకావ్యమైనది. ఈ ప్రబంధ నిర్మాణములో అచార్యులవారి కథా కల్పనము, వర్ణన ప్రావీణ్యము, భావనా వైభవము కీర్తనీయములు. ప్రాక్తన కవులు పోతన శ్రీనాథాదుల కైత పోలికలు, ఆధునికులు సమకాలికులు నగు కవుల పోకడలు ఈ కావ్యము నందు రాక్కారాక్కములుగాఁ గనిపించు చున్నను, శ్రీ వరదాచార్యుల వారిదైన యొక శైలీముద్ర సర్వత్ర భద్రమై యున్నది పోతన చరిత్రము ముందు పీఠికగా నున్న పద్యములు ఆచార్యుల వారి అనసూయము అవ్యాజము అమృతప్రాయమునైన హృదయమునకు అనుబింబములు. సంస్కృతాంధ్ర కవులస్తుతి - ఆధునికకవిస్తుతి – నవ్యకవిస్తుతి- తెలంగాణ పండిత కవిస్తుతి, సకలకవిస్తుతి – చేసిన పద్ధతి అపూర్వము.

మఱచినట్టి సత్కవులకు మది నొకింత
గుఱుతులేని సత్కవులకుఁ గొంచె మింక
చిఱుత లైన సత్కవులకుఁ ధరణిఁ బుట్టు
వొందఁబోవు సత్కవులకు వందనములు.

అకృతకమైన సంప్రదాయాభిరతి యిట్లుండును కాఁబోలు! వర్ణనా పూర్ణమైన యిట్టి మహాకావ్యము రచించుటకుఁ దగిన మేధా సమాధి యీనాఁడు క్వాచిత్కము దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అన్నారు "ఈయనది గాఢమైన శక్తి– మహా గట్టి దీక్ష. సంపన్నమైన కల్పన అవి లేకపోతే ఈ రోజులలో ఇట్టి కావ్యాన్ని రచించ గలగడం ఎలాగ? అసామాన్యమైన ఆవేశం ఈయనను ఆవహించి ఉండాలి;"

చారిత్రకమైన యితివృత్తము కయికొని బృహత్కావ్యరచన చేయుట యన్నది ఈ శతాబ్ది పూర్వార్ధములోనే మొగ్గదొడిగి నట్లు కనిపించి, ఉత్తరార్ధమున రేకులు విప్పినది. "పద్యముల రాశి కాదు, కావలసినది వాసి" యన్న వాద మొకటి యున్నది. 'వాసిగల రాశి'ని సృష్టించిన కవుల విషయమున ఈ వాదము పరాస్తము కాక తప్పదు ముప్పది నలువది యేండ్ల క్రిందట మన తెనుఁగులో మన కవులు పద్య రచనలో ఒయ్యారములు ఎన్నో సంపన్నములు చేసిరి. నైకవిధములు త్రోవలు తీసిరి. ఆత్మనాయకములైన మధుర కవితలు, దేశభక్తి పరములు; బౌద్ధ సంబంధులు జాతీయతాస్ఫోరకములు, చరిత్ర ప్రతీతములు కృషీవలాద్యుత్కర్షకములు.

ఈ రెండు దశాబ్దులలో ఇట్టి మార్గము లన్నింటి వెంట 'పద్యమును' కవులు నడపించుచునే యున్నారు. ఇది ఇట్లు తనదారిఁ బడి తాను సాగుచుండగా కొందఱు దీనిమీఁద ఱాలు విసరుచున్నారు. ఇప్పుడే కాదు, ముప్పదేండ్ల క్రితమే దానికి బొప్పి కట్టినట్లు 'జాషువా' కవిమత్తేభము సాక్ష్యము చెప్పును:

> "కవితావాహిని చీలి, పాయలయి యాగంబై యథేచ్ఛాగతిన్
> బ్రవహింపం దొడఁగెన్ బురాతనపుఁ ద్రోవల్ పుంతలున్ బాడువ
> డ్డవి, ఛందోనియమాదికూలములు భ్రష్టం బయ్యె నీమందువే
> సవియం దింకునొ! సంగమించునొ! రసస్వర్గీయ పాథోనిధిన్."

కవితా వాహినికి ఛందోనియములు కూలములఁట! ఎంత అనుకూల సరసమైన మాట! పద్యరచనాసరణిలో కూలంకష ప్రతిభుఁడైన ఆ కవి ఛందోనువర్తనము మఱవని వారు కొందఱుండకపోరు నేటి కవితా లోకమున సర్వాపధీనుడుగా ప్రసిద్ధి నందిన సాహిత్యవేత్త 'మాస్వామి' అన్న మాట సంప్రదాయపు బాటలో సాగుచున్న వారికి జ్ఞప్తి యుండును.

> నినఁ గ్రొంగ్రొత్తలు తేర్చు గుంఫనల వ
> ర్ణింపంగ నూహింతు నొ

నని యేదారిన బోయి పూర్వకవి పా
దాంకంబులే తోఁచి లో
నన లజ్జాపరిగూఢమానసుఁడనై
నాలోన నేనే వినూ
త్నసకంకాహ్వాదయుఁడ నౌదు మఱి
క్షంతవ్యుండ విశ్వేశ్వరా!

ఇది యిటు లుండె :

వెనుకటి తరములో వెలవడిన పురాణాంధ్రీకరణములకు సహపాఠుల వంటి గ్రంథములు నేఁడు వచ్చుచున్నవి భారత భాగవత రామాయణములు బ్రహ్మాండాది పురాణములు తెలుగు పద్యములలో వ్రాసి మన కిచ్చిన మొన్న మొన్నటి శ్రీపాదవారు, జనమంచివారు, వావికొలనువారు, విపుకులవారు, దాసువారు, ముదిగొండవారు, పిశుపాటివారు, మల్లాదివారు— అవ్వారిగా వేసిన ఒరవడి చెఱిగి పోవుటకు వీలు లేదు. పురాణ సంప్రదాయధారను మా ఛందోధోరణిలో మేము ముందుకు నడపింతుమని కొందఱు కృతప్రతిజ్ఞులు చేయుచున్న పద్య రచనలు ఈ నడుమ నడుమ వెలువడుచునేయున్నవి. శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారి మహాభారతము, భాగవతము. ఆధ్యాత్మరామాయణము, వాల్మీకి రామాయణాంధ్రీకరణము— ఇవన్నియు నిర్వచనములు సుబోధ సురుచిరములు వాజపేయయాజుల రామసుబ్బారాయ కవిగారు 'ప్రసన్నభారతము' వ్రాసిరి. తరువాత- మొలుగు చంద్రమౌళి శాస్త్రిగారి ఆంధ్రకూర్మ మహాపురాణమొకటి; అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భార్గవరామచరితము ముద్రితము. అనంతపంతుల రామలింగస్వామిగారి 'భార్గవరామాయణము' స్వతంత్రరచన. ఇవి- ఇంచుమించుగా, పాతిక - యిర్వది యేండ్లలోపున వచ్చినవి ఈ గ్రంథములకు తగిన పాఠకులు నేటికాలమున చాటున మాటున ప్రకాశించుచునే యున్నారు ఒక వంక పురాణాంధ్రీకృతులు; వేఱొకదెస నవీన స్వతంత్ర కృతులు పోటీపడి ముద్రితములగు చున్నవి.

"నవ్యతరమైన యొక్క గానస్రవంతి
కొకఁడు తలయూఁచు: మఱియొకఁ డోసరించు
పీణెదే దోషమో, లేక వినెడివారి
తప్పిదమొ! కాదు భావభేదములె సుమ్ము"

అన్న పుట్టపర్తి నారాయణాచార్యుల వారి గాఢప్రతిభనుండి పండరీభాగవతము ద్విపదకావ్యముగా అవతరించినది. పద్యకృతులలో ద్విపదలకు గల పలుకుబడి నేఁడును పొనఁగుపడలేమ. సోమనాథుడు - రంగనాథుడు - గౌరన ఇట్టి పూర్వకవులు పరిశుణ్ణము చేసిన దారిలో, జాతిచ్ఛందములో పుట్టపర్తివారు పండరిభాగవతము తలపెట్టి వ్రాయుట వారి సంప్రదాయ గౌరవమునకు తార్కాణము ఆయన భక్తి బంధురుడు; విదితాష్టభాషాకవిత్వమదబంధురుడు. 'పండరి భాగవతము' ను గూర్చి వారి పదము లివి:

''(రసము) యమకంబు గమకంబు నమరినజాతి
గ్రమహితాన్వయముఁ గారకముల సొంపు
నుడులలోఁ దూగు నానుడులలో బాగు
నడకని గతియు, జొప్పడినట్టి మితియు
ధ్వని, యలంకార, ముత్తమశైలి, పాక
మనవద్య మౌచితి యర్థ విన్యాస
మప్పు దప్పుడు గుప్పు గుప్పున వెదలి
మప్పిరి గాన......"

విబుధకోటికి మోదము గూర్చు రచన. బెళ్లూరివారి 'వివేకానందము' ద్విపద కావ్యము వెలువడినది. మరికొన్నింటి నామధేయములు స్ఫురణకు రాకున్నను ఉన్నవి. కాళిదాసుగారి 'ఆంధ్ర మహావిష్ణువు' ప్రసిద్ధము.

నన్నయనాటి మధ్యాక్కరలకు ఈ మధ్య ప్రత్యేక గ్రంథ గౌరవము వచ్చినది. విశ్వనాథమధ్యాక్కరలకుఁ బిమ్మట నేఁడు సుప్రసన్న-సంపత్కుమారులు మున్నగువారు ఆయొజ్జనమును ఉజ్జగింపక ఖండికలు వ్రాయుచున్నారు.

తెనుఁగులో అనుష్టుప్పులు-ఉత్సాహములు-వియోగినులు- మందాక్రాంతములు-మచ్చులు చూపించుచున్నవి. ఛందస్సు అవునను చునే వివిధములగు జాతులతో వృత్తములతో సాధనలు చేయు తీరు ముచ్చట గొల్పుచున్నది. లోకము భిన్న రుచికము, శతకములు, ద్విశతులు, త్రిశతులు, పంచశతులు ప్రచురితములై నేఁడు పెక్కు పాఠకులను కూడఁగట్టుకొనుచుండుట పరికించుచున్నారు. ఇట్లే ఉదాహరణ కావ్యములు అపుడపుడు పలుకరించు చున్నవి.

'ఉదాహరణము' చిన్నికావ్యశాఖ. సప్తవిభక్తుల ఒక్కొక్క విభక్తికి ఒక వృత్తము. కళిక, ఉత్కళిక, సంబోధనవిభక్తి సార్వవిభక్తికము. మొత్తము 'పాలిక' పద్యాల కబ్బము. ఏ యితర భాషలచే అందుచితమైన ప్రక్రియ. నిడుదవోలు వేంకటరావుగారు, ఉదాహరణ వాఙ్మయము' పై ప్రత్యేకగ్రంథము వెలువరిచి పరిశోధనాపరమేశ్వరు లనిపించుకొన్నారు. దక్షిణాంధ్రయుగమున — ప్రబంధయుగమున — శ్రీనాథయుగమున వంద వందయేండ్లకు ఒండురెండుగా లెక్కకు వచ్చిన ఉదాహరణకృతులు, ఈ యిర్వదేండ్లలో ఏడెన్మిది జతలు లెక్కకు వచ్చుట ఈ ప్రక్రియలోని విశేషము. కళికోత్కళికలతో గేయప్రాయమైన సోయగము దీనికి నైసర్గికము.

ఇటులీ లఘుకావ్యశాఖలు యథారుచిగా చిగుళ్లు మొగ్గలు పెట్టుచుండగా, ఈ నడుమ ఖండకావ్యములు కలకండముల వంటివి, అనల్పసంఖ్యాకములు సహృదయులను ఆకర్షించుచున్నవి. ఈ కృతులలో కొన్ని శతాబ్దిపూర్వార్థమున నే పుట్టి పునఃపునర్ముద్రణములు పొందినవి యుండినయుండవచ్చును.

మల్లెపూవులవంటి తన పద్యములు దండలుగ్రుచ్చి గాంధర్వకంఠమున వేసి వాసిగాంచిన జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కరుణశ్రీ, ఉదయశ్రీ, విజయశ్రీలు తెలుగునేల నాలుగు చెఱగుల నడయాడు జంగమ కృతులు. ప్రాంత వడని పద్యోపశ్రుతులు

చారిత్రక సారస్వత పథములో కీర్తనీయములైన అద్యతన కావ్యములలో కొండవీటి రెడ్డి రాజ్యమహోదయము బెళ్లూరి శ్రీనివాసమూర్తి గారిది క్రొత్తగా

ఉదయించినది. అష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమైన నవభారతము. రెడ్డి వంశవృక్షమ్మున రెమ్మరెమ్మ కొమ్మకొమ్మ కదల్చి సంతరించిన కబ్బము. రాయలసీమ సంభవములైన కతిపయ చరిత్ర కృతుల కిది సహోదరము. సమర్థము సరసము ప్రావాహికము నైన పద్య పద్య. ఈ సరణిలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి కీర్తితోరణము ప్రత్యగ్రప్రతిష్ఠకు వచ్చిన రచన. 'దశారామము'న మొగ్గదొడిగిన తీగలు 'కీర్తితోరణము'లో సురభిళపుష్పమూర్తులు. ఓరుగల్లుకోట-కీర్తితోరణము-వెయ్యిస్తంభాల మండపము-హనుమకొండ కొండలు రాజధానీస్మృతులు కదిపి పలికించిన కాకతీయచరిత్రరేఖాకృతి.

"ఈ పురాణ కవాటమ్ము లెపుడు బంధి
తమ్ములయ్యెనొ? యిపు డేరు తట్టితట్టి
పిలుతురయ్య! ఊరక యివి విడవు పొందు
వెల్గురాక పిల్పులు రేక బిగిసిపోయె."

ఏకశిలలో ప్రాంతవద్ద, తలుపుతలుపులు తట్టి పిలిచి, వెలుగునకు వచ్చిన 'కీర్తితోరణము' ఇంద్రగంటివారి పద్యరచనా చాతురీశిల్పములకు చారణగీతము.

సింహపురికి సంబంధించిన విస్మృతేతిహాసమునకు రసస్మృతి యనదగిన 'పూర్ణాహుతి' ముదివర్తి కొండమాచార్యులవారి ఖండకృతి. ఏకదేశవస్తుకమైనను సుపరిష్కృతమైన పల్కుబడిగల కావ్యము. తెలుగు పద్యనిర్మాణములో ఆచార్యులవారి మర్మజ్ఞత లోభనీయమైనది. సంప్రదాయ మనోజ్ఞములైన పద్యరచనలలో 'పూర్ణాహుతి' గుర్తుపెట్టుకొనదగిన జాతివార్తాప్రబంధము.

విద్వాన్ బీర్నీడి ప్రసన్నగారి "పృథ్వీభాగవతము" భావధారాసంయుక్తమైన రచన. ఇంతటి ప్రావాహికమైన జాతిపద్యమును ఎక్కడనో కాని చూడలేము. కవికోకిలము జాషువగారి 'క్రీస్తు చరిత్రము' వచ్చి అట్టే కాలము కాలేదు. ఆయన కలకంఠమునుండి వచ్చిన తెలుగు పద్యము వసంతవనము.

ఆ నడుమ వెలువడిన 'కృష్ణకథావిపంచి' బాడాల రామయ్యగారిది – 'వీరభారతము' వక్కలంక లక్ష్మీపతిరావుగారిది-'ఆంధ్రమహాయుగము' శష్ఠా లక్ష్మీ

కాంతశాస్త్రి కృతము - అనందభిక్షువు' వి.వి.యల్. నరసింహరావుగారిది-'అ్రమ పాలి' జ్ఞానానంకదవి ప్రణీతము - "కరుణాసౌగతము, తిష్యరక్షిత" — కరుటూరి సత్యనారాయణ గారి కావ్యయుగళము - "తిక్కన" వేముగంటి నరసింహాచార్య రచితము-"సుజాత" కాకర్ల వేంకటరామనరసింహ ప్రణీతము-ఏతాదృశములగు ఎన్నో ఖండకావ్యములు కవితా గోష్ఠులలో ప్రసక్తములు ప్రస్తూయమానము లగుచున్నవి.

విశ్వనాథ వేంకటేశ్వర్లుగారి 'కాళిందీపరిణయము' అంభోవాదములో కవితాస్వాదము ఉన్మిశ్రము చేసిన విలక్షణ పద్యరచన. లక్షణలక్షితము, వ్యుత్పత్తి రంజితమైన తెనుఁగు కావ్యము.

మోటూరి వేంకటరావుగారి రచనలు చకోరసందేశము, సింహబలి, పద్మినీ భాస్కరము దేనికదే ప్రత్యేకత సంతరించుకొన్నవి. వానిలో 'పద్మినీ భాస్కరము'లోని ఛందఃప్రణాళిక సరిక్రొత్తది. అనగా, భావగతికి ఛందస్సునకు గల పరస్పర సంబంధము ఈ కావ్యములో రమణీయముగా దర్శనీయము. ఈకావ్యమున ఎనుబదిరెండువృత్తములు సంస్కృతచ్ఛందస్సులు వాడబడినవి. ఆ వృత్తముల పేరులు శీర్షికానామములు. కవిత్వ చ్ఛందస్సుల ఉభయ విధ వైచిత్రికి ఈకృతి, సంకేతము.

యస్వీ జోగారావుగారి 'ప్రసన్న సుకుమాయుధము' ఒక క్రొత్త కూర్పు. విలక్షణమైన విచిత్రమైన శృంగారరసపర్యాలోచనము చేసిన యిట్టి కావ్యములు మనసారస్వతములో ఒండు రెండు ఉండవచ్చును. ఉన్నను, దాని కదిసాటి. పూర్వ ప్రబంధ పాకములో ప్రత్యగ్ర పరిమళమును వెలయింపజేసిన యిందలి పద్యము రసశ్రీ హృద్యము.

విమర్శకులుగా భావుకులుగా పేర్వడసినవారి పద్యరచనలును ఇపుడ - అపుడపుడు పొడసూపుట శుభోదర్కముగా నున్నది. ఆర్.యస్. సుదర్శన' ము గారి 'నిశాంతం' కవిత ధ్యానవస్తుకమైన నూతనకృతి; అనుభూతికావ్యము.

ప్రకృతి-ప్రపంచ-రహస్యములకు సూక్ష్మతరమైన వ్యాఖ్యాగీతము. సాంకేతిక మైన ధ్వనులకు ఛందస్సుందరమైన గీతమును ఊతగా చేసికొన్నారు.

దాగంటి గోపాలకృష్ణమూర్తిగారి 'హేమమాలి' ఒక భావుకుని ఉష స్స్వప్నమువంటి పద్యకృతి. శనగన నరసింహస్వామి గారి వాల్మీకి, చైత్ర వంది - సుందర పద్యరచనలు. వేదులవారి కృష్ణశాస్త్రిగారి భావకవిత్వపు జాడల కీనాఁడును అవకాశ మున్నదనుటకు నరసింహస్వామి కృతమైన 'చైత్ర నంది' ఒక యుదాహరణము.

'మహాంధ్రోదయము'తో ముందునకు వచ్చిన దాశరథి గారి 'కవితా పుష్పకము' సహృదయులకు మనోహరదృశ్యము. సంప్రదాయస్ఫూర్తి రుచిరమైన ఆయన తెనుగు పద్యము పునర్నవము. నాయని సుబ్బారావుగారి వేదనా వాసుదేవము, జన్మభూమి వెంబడి వచ్చిన ప్రతికృతియు సంప్రదాయ సాహితికి చేర్పుక. దేవులపల్లి రామానుజరావుగారి పద్యమాలికలతో ఆంధ్ర సారస్వత భవనము పచ్చతోరణము అలంకృతమైనది.

బోయి భీమన్నగారి ఖండ కృతులు సభలో హాయి హాయి అనిపించు కొనుచున్నవి. ఉత్పల వారి "జంట నగరాలు హేమంత శిశిరాలు" చమత్కార చారువైన కావ్యము. ప్రౌఢము, మధురమునైన పద్యరచనా రీతి దీనిలో విందు సేయును.

ముదిగొండ వీరభద్రమూర్తి గారి 'వందేమాతరం', దిగుమర్తి వారి 'స్వామి పుష్కరిణి', కోటగిరి విశ్వనాథరావుగారి 'ఖడ్గనారాయణము', కొర్లపాటి వారి 'సువర్ణరేఖలు', చేబోయి చిన్మయబ్రహ్మము గారి విశ్వాభిరామము మొదలగు కృతులు-తమ తమ శైలీ విలాసమును భావలీలను ఆయాసందర్భము లలో ప్రదర్శించుచున్నవి.

ఈ రెండు దశాబ్దులలో అవధాన ప్రక్రియకు సంబంధించిన పద్య రచనయు కొలఁది కొలఁదిగా సాగివచ్చినది. సి. వి. సుబ్బన్నగారి

'శతావధాన ప్రబంధము' మనము తీసికొనదగిన గ్రంథ సాక్ష్యము. ప్రసాద రాయ కులపతి, కుప్పేశ్వరరావు, కోట వీరాంజనేయ శర్మ, బులుసు రామ మూర్తి, దివాకర్ల వేంకటావధాని గారలు అవధానములు చేయుచున్నారు. మఱి కొందఱును ఈ శాఖను పెంచుచున్నారు. 'అవధానములు' అను పేర గాదే పల్లివారి పుస్తక మొకటి వెలువడినది. మంచి మంచి పద్యములు సంతరించు చున్న మహిళామణులు కొందరు నేఁడు పెర్కొనదగి యున్నారు. శ్రీమతి బుర్రా కమలాదేవి, కల్లూరి విశాలాక్షమ్మ, నండూరి చంద్రమతీదేవి, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, వేదుల మినాక్షీదేవి ప్రభృతులు.

పద్యరచనలు సంప్రదాయ మార్గములో ఇన్ని యీ నడుమ వచ్చినవి; వచ్చుచున్నవి. పఠితలు వీనిని చదువుచున్న సాక్ష్యములును లభించుచున్నవి. తర తమ భావములు తప్పవు. కవితకు ప్రధానములైన రసభావములను మన స్సులో పెట్టుకొని, ఎక్కడ పద్యరచన సాగినదో అక్కడ సహృదయుడు ఆనందింపగలుగు చున్నాడు. అట్టి కావ్యము రమణస్థానమగుచున్నది. పదికాల ములపాటు తాదృక్పద్యమునకు భావుకహృదయస్థితి యేర్పడుట జరుగుచున్నది. సమగ్రాంధ్ర సాహిత్యము పద్యరచనల మీద ఎంత అర్ద్రిభావము కలిగియున్నదో మన మెఱుఁగుదుము. పద్యము ఛందోబద్ధమే. అయిననేమి, అది భావమును స్వచ్ఛంద సుందరముగా ఆవిష్కరించుచున్నది. నిర్బంధముకాదు. పద్యరచనా వైభవమునకు లక్ష్యములు నేఁడు కానబడుచున్నట్లే, లక్షణప్రచారముకూడ చక్కగా సాగుచున్నది.

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి వంటివారు నాటి నేటి పద్యరచనలనుగూర్చి ప్రమాణ పురస్సరముగ చేయుచున్న ప్రసంగములు కావ్యములయెడ రుచిదార్ఢ్య మును కలిగించుచున్నది. 'యువభారతి'– ప్రభృతి సంస్థలు, 'ఆంధ్ర సాహిత్య ఆకాడమీ' పద్యరచనలకు చేసిన పురస్కారము, ప్రచారము మఱవఁ జాలనిది.

ఒకమాట: పద్యము రసవత్తరముగా వ్రాయగలిగిన వారు కొంత కాలము వ్రాసి వ్రాసి, ఆశ్రమాంతర ప్రవేశము చేసిన వారు మన తెలుగు

కవులలో ఉన్నారు. ఉండవచ్చును. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు చివరినాళ్ళలో వ్యావహారికమును ఐండ్లదోలినారు. అది వారి గ్రాంథికమునకు తిరస్కృతి కాదు తత్కాల ప్రయోజనము- స్థిరలాభము- అన్నవి రెండును కవియొక్క కలము చివరి మొనలు. వ్రాతఫలము ఒకటియే కావచ్చును. 'పుణ్యై ర్యశో లభ్యతే'. ఒకప్పుడు కాలములో, కవి యొక్క కాంక్ష తారుమారు కావచ్చును.

లబ్ధ ప్రతిష్ఠులు పెద్దలు సాధారణ రచనలు చేయుట- ఆకు మఱుగున యువకులు ఉజ్జ్వల రచనలు చేయుట- నేడు తత్ర తత్ర చూచుచున్నాము. మన సారస్వతమున ఈ శతాబ్దిలో మొలక దేఱిన ప్రక్రియలు కొన్ని యున్నవి.'పద్య రచన, యన్నది అట్టి ప్రక్రియ కానే కాదు. ఇది మొదలు. మొదలు లేనిచోచిగుళ్లు, పువ్వులు, పండ్లు ఎక్కడివి! "అహో! మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః." అన్నటులు తయారగును.

కలసి బ్రతుకుటయన్న సిద్ధాంత మొకటి సర్వాంగీకృత మని రాచఱి కపు మాటలలో వినుచున్నాము. మన సాహిత్యములో కొందఱు విభిన్న ప్రక్రియలలో వ్రాసికొనుచున్నారు. యథాప్రతిభముగా వారి రచనలు పాఠకుల నాకర్షించునవి. సహృదయావర్జనము చేయగలుగుచున్న ఆయా కవుల రచనల వెనుక వెనుక, ఒకానొక రమణీయ చ్ఛందోధర్మగీతమును సంప్రదాయవాది త్రవ్వి యెత్తుచున్నాడు.

గుంటూరి శేషేంద్రశర్మగారు, కుందుర్తి, ఆరుద్ర, బాలగంగాధర తిలక్, సి. నారాయణరెడ్డి గారలు పద్యములు సొగసుగా రసవంతముగా పాడి చూపించినవారు. శ్రీరంగం శ్రీనివాసరావుగారు సరేసరి, పూర్వాశ్రమముల యందలి వీరి పద్యములు, వీరి సంప్రదాయ గౌరవము క్రొత్తతరము వారికి కొంత తెలియజేయ వలసియున్నది. అదియు సాగుచున్నట్లే యున్నది.

నేటి పద్యరచనలను గూర్చి యిందాక నేను 'వంది'నై ప్రసంగించినట్లే నా కనిపించుచున్నది. ఇక- ముగించుచు రెండు మాటలు. భవితవ్య మన్న

విశేష్యమునకు మేలు, భాగ్యము అనుసర్గమే మన భాషలో ఉన్నది. భవితవ్యత- అనగా రాబోవునది- రాబోవునది యెప్పుడును మేలు; రసవత్కవితాధర్మము నాల్గు పాదముల నడచినంతవఱకు నేటి పద్యరచన భవితవ్యము సురక్షితము.



# వచన కవిత - ప్రయోగ వైవిధ్యం

శ్రీ ఆరుద్ర

ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో వచనకవిత వయస్సును కచ్చితంగా తేదీలిచ్చి తేల్చలేంగాని అది యాభయ్యోపడిలో పడింది. పుస్తకరూపంలో వచ్చిన అసలు సిసలు మొదటివచనకవితాగ్రంథం "ఫిడేలు రాగాల డజన్". ఇది 1939 జూలై ఆగష్టు నెలలమధ్య వెలువడింది. అయితే పఠాభి వింతరాగాం వెల్లువ దేశంమీద విరుచుకు పడడానికి ఒక ఏడాది ముందుగానే శిష్ట్లాకృతులు "నవమి చిలుక – విష్ణువు ధనువు'' అనే సంపుటాలు వెలువడ్డాయి. శిష్ట్లా తన కవిత్వం "పూర్వకవిత్వం కాదు, నవ్యకవిత్వం కాదు, భావకవిత్వం కాదు, నూతనములో బహునూతన కవిత్వ" మని చెప్పుకొన్నాడు. అలాగే పఠాభికూడా తను భావకవిని కాదని చెప్పాడు. అంతతో ఊరుకోలేదు. తాను అహంభావ కవి నని చాటుకొన్నాడు.

శిష్ట్లా సంపుటాలు కేవలం వచనగీతాల సంకలనాలని చెప్పడానికి వీల్లేదు. ఉత్తరోత్తరా రాబోయే వచనయుగంలోని ఘంటాపథం కోసం అడవిని కొట్టి, ముళ్ళకంపలను నరికి, దారి వేసుకోడానికి వీలుగా ఎవరూ నడవని నట్టడవిలో కొంతమేరను సుగమంచేయడం అందులో కనబడుతుంది. "ఇతడు భావ కవిత్వముపై తిరుగుబాటు చేసెనేగాని, క్రొత్తబాట వేయలేదని ఒప్పుకొనక తప్పదు". అని సాహిత్యపరిశోధకులు భావిస్తున్నారు.[1] దుర్గమారణ్యంలో ప్రవేశించడమే ఒక సాహసికకృత్యం, తనకు తాను బాటవేసుకోనిదే ఎవడూ కారడవిలో ముందుకు సాగలేడు. శిష్ట్లాది గొప్ప విప్లవారంభం.

అనాడే అతడు 'యుగశక్తికి' ఆహ్వానం పలికాడు. అది అనంత ముఖములుగల అందాల అనలం. ఆ అగ్ని కల్లోలమేఘాగ్ని, అది మెరుపు తీగలపై వసంతములాడే వివస్త్రమూర్తి. ఆ జ్వాలలో సకలవర్ణాలూ నిలయమై

ఉంటాయి ఆ తేజాన్ని, ఓజాన్ని, అఖిల బీజాన్ని కవి సూటిగా ప్రశ్నిస్తున్నాడు. "నక్షత్ర-స్ఫటికముల నవనవలాడే వెలుగువై, తళుకువై, నిబిడాంధకారాంధ్ర దేశాకాశాన, వజ్రాయుధమువలె- ఏనాడు గన్పడెదవో దెల్పుము". ఆమె కన బడితే కవి త్రిపురాంతకుడై లేస్తాడు

'ఉదయోదయాలనడుమ, ప్రాక్పశ్చిమప్రాకారములమధ్య
జీవితానంతరపు నిశ్శబ్దరూపముగ మొలకెత్తు-మున్నె
చీకటిలో నిరీక్షించుచుండేటి విత్తనపురూపుగా
నీయాలయము నిర్మింపబడినది, ఉత్పత్తి లయములలో
జీవితపు హాహాకారాలు, సంతోషధ్వానాలు నీయందు
నీ వుచ్చరించే హ్రాం—హ్రీం, హ్రూం హ్రః అనే యుచ్చైస్స్వరాలు
ఆద్యంతములు మిళితమై నగయు నిశ్శబ్దకాలచక్రం
బంగారు వడ్డాణ రూపమై నీనాభి కలంకారం
నీ నర్తనలావించి జీవితము వికసించు మృత్యువే ధ్వానించు
ఆకుపై ఆకుతో, వేరుపై వేరుతో, పూవుపై పూవుతో
సంధి సంధులమధ్య వాసిల్లు రహస్యాలగర్భాననే దాచి
ఏ మృత్యువునుండి జనించి యేమృత్యువుకై తాను
పెరుగునో యాజీవితానందపు కళలను వెన్నాడుచూ,
అంధకారాంతరాళాలనుండి వర్ణాల విత్తనా ల్వికసించు!'
అన్నది శిష్ట్లావిశ్వాసం'.

యుగశక్తిని ఇంత శక్తిమంతంగా, ప్రతిభావంతంగా వీక్షించినవాడూ, ఆహ్వానించినవాడూ, నిజంగా ప్రవక్త. అందుకే వచనకవితకు శిష్ట్లా ఆద్య బ్రహ్మ. నవ్యకవిత్వానికి నాంది పలికినవాడిగా అతణ్ణి ముందు స్మరించాలి.

శిష్ట్లా తన కవిత్వాన్ని ప్రాహ్లాదకవిత్వ మన్నాడు. దీనికి అడ్డాలున్నా యని అతనికి తెలుసు.

'అద్దము హిరణ్య కాశ్యపుడు! శంక హిరణ్య
కాశ్యపుడు అధైర్యము హిరణ్య కాశ్యపుడు!
అస్థిమితము హిరణ్య కాశ్యపుడు!
మూలము సమూలముగా త్రెంచి హృదయ
సభామంటప స్తంభము పగిల్చి మనస్సు
విజృంభించి నరసింహమూర్తిత్వము దాల్చును!
అప్పుడే ప్రాహ్లాదవికత్వ మాహ్లాదముగా
ఉద్భవిస్తుంది.

ఈ కవిత్వం, అద్దం లేనిదీ, శంక లేనిదీ, అధైర్యము లేనిదీ, అస్థిమితము కానిదీ అని శిష్ట్లా నిర్వచించాడు ఈ కవిత్వంలో 'ప్రౌఢత్వ మున్నది, పామరత్వ మున్నది, దేశివిదేశికి నేస్తమున్నది' అని చెప్పడమేకాక ఇందులో 'సావిత్రీ సత్యవంత జీవితమున్నది' అన్న మాటలతో ఈ కవిత్వం మరణానికి ప్రాణం పోస్తుందని ధ్వనించాడు.

శిష్ట్లా తన కవిత్వాన్ని ప్రహ్లాదకవిత్వ మని పేర్కొన్నా, అతని ప్రభావంలో రచనలు చేసినవాళ్ళుగాని, ఆతర్వాత సాహితీపరులుగాని, వచన కవిత్వాన్ని ఆ పేరుతో పిలవడంలేదు. అతని సంకేతాలకన్నా, అతడు పాదాల మధ్య ధ్వనించిన సందేశాలనే అందరూ విని చెవి పట్టించుకున్నారు.

శిష్ట్లాకు ముందే వచన కవిత ఆంధ్ర సాహిత్యవనంలో పూలుపూచిందా? కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు 1921-25ల మధ్య చేసిన రచనల సంపుటి "నైవేద్యం" అనేపేర ప్రచురిత మయింది. అందులో లూఠీ అనే రచనా "ఆనంద స్వతం" అనే రచనా, "మోహినీ ప్రకృతి" అనే రచనా వచన గేయాలని సాహిత్య పరిశోధకులు డిస్కవర్ చేశారు [2] అయితే 'ఇవి స్థూలముగా వచన గేయములవలె కన్పించు రచనలనీ, ఇవి మాత్రా నియమములేని వచన గేయ గంధముగల రచనలనీ' వారే భావిస్తున్నారు కాని, దువ్వూరి రామిరెడ్డి గారికీ వచనకవిత్వానికీ చుక్కెదురు. "యథార్థమైన కవిత్వమునకు అనివార్య

ముగా ఛందస్సు అనుగతమౌను' అన్నది కవికోకిలగారి కవితా మూలసూత్రా లలో ప్రప్రథమమైనది.[3]

ఛందోబద్ధమైన కవిత్వమంటే, పాత వృత్తాలనూ, పాత పద్యాలనూ వ్రాయడమన్నది దువ్వూరివారి ఉద్దేశంకాదు. 'క్రొత్త ఛందస్సులు ఆవిష్కరించుకొని కవిత్వము వ్రాయవచ్చును. అవి శ్రవణ సుఖముగానున్న యెడల నిలచి యుండును. ప్రస్తారము వలన ఎన్ని వృత్తములు పుట్టలేదు. అవి అన్నీ మన చెవికి రుచించుటలేదు. రుచించినవి మాత్రమే నిలిచి యున్నవి అని రామిరెడ్డిగారు స్పష్టంచేశారు.[4] నైవేద్యంలోని రచనలని ప్రస్తరించి అవి ఛందోబద్ధమైనవని నిరూపించవచ్చును. అందుచేత వచనగేయం 1921-25ల మధ్యనే దువ్వూరివారి రచనల్లో వికసించిందనిగానీ, కనీసం మొగ్గతొడిగిందనిగానీ ఎంత మాత్రం చెప్పలేం. వాస్తవానికి జయంతి గంగన్న పంతులుగారు '1922లోనో 1923 లోనో గాంధీ మహాత్ముడు యార్వాద జైలులో నున్న దినములలో' వ్రాసి 1935 జూలై మాసం భారతిలో ప్రకటించిన 'పరీక్ష చదువులు' అనే రచనలో వచన కవిత్వబీజా లున్నాయి.

నిజానికి, వచనపద్యం ముద్దుకృష్ణ "జ్వాల" పత్రికతోనే నిస్సంకోచంగా తెలుగు గడ్డమీద అడుగు పెట్టిందని చెప్పుకోవాలి. "జ్వాల" మొదటి సంచిక లోనే "పద్యాలు" అనే విభాగం కింద కవికొండల వెంకటరావు, విశ్వనాథ సత్య నారాయణ, 'ఒకరు', ముద్దుకృష్ణ రాసిన పద్యాలున్నాయని ముఖచిత్రం చెప్తూంది. ఈ నలుగురిలో కవికొండల మాత్రా ఛందస్సుతోనూ, విశ్వనాథ గీతపద్యాలు రాశారు. ముద్దుకృష్ణ, 'ఒకరు' మాత్రం అసలుసిసలు వచన పద్యాలే రచించారు. ముద్దుకృష్ణ పద్యం "ఒకటో పేజీ" లోనే ఉంది. దాని పేరు "తురాయి". శిష్ట్లా ప్రభావం వల్లనే కావచ్చు, తెలుగు పత్రికలో దొరికిన మొదటి వచన కవిత ఎలా వుంటుందో నన్న కుతూహలం తీర్చడానికి ముద్దుకృష్ణ చేసిన ఆచిన్న రచ రచనను ఉదాహరిస్తున్నాను.

**తురాయి**

''మొన్న
యీ దారినే నే వొచ్చినప్పుడు
బైటపడుతున్న సిగ్గును
బెరడుగప్పి దాచుకోబోయి
తత్తరిల్లినది, తల దించి
సిగ్గు సింగార మొలకి;

రెండు వానలు కురిసి
వాగులన్నీ పరుగు బారుతున్నవి
యిపుడు,
యెర్ర పువ్వుల తల దురిమి
ముసుగు చిగురుదాటునుంచి
ముసి ముసిగ నవ్వుతున్నది
నన్ను చూసి!''

ముద్దు కృష్ణ వ్రాసిన ఈ వచన పద్యం కన్నా, ''వాకరు'' రాసింది మరీ చిన్నది. అది ''నవ కవి'' అనే పద్యం.

"నీరులా వొస్తాను
గాలినై పోతాను
నా ప్రేమ ప్లేటోనిక్

నీ గుండె కోర్తాను
నా కంతె చాలు
నా హృదయ మేమిటో
యేకో ఎందుకో?''

ఈ వచన పద్యం అంతా కలిపి ఏడు పంక్తులు అయినా ఇందులో భావ కవులకైన 'అవఘోళన' ఎంతైనా ఉంది. దీన్ని రాసిన "వాకరు" ఎవరో తెలి

యదు. చాలా తప్పుపని చేశాను. ముద్దుకృష్ణ బ్రతికున్న చివరి రోజుల్లో కనీసం వారానికోసారి మాయింటికి ఆప్యాయంగా వచ్చేవాడు. అప్పుడు అడిగి తెలుసుకో వలసింది. బహుశా ఇది ముద్దుకృష్ణే రాసుండవచ్చు.

జ్వాల తొలి సంచికలలోని వచన పద్యాల ప్రభావం వల్లనే చాలా ప్రతిభా వంతంగా మాత్రా ఛందస్సులతో రచనలు చేసే కవికొండల వెంకటరావుగారు, కొన్ని వచన గీతాలు రాశారు. ఆయన రాసిన "నక్కాసామిగాడు" కృష్ణాపత్రి కలో అచ్చు పడినప్పుడు దానిని 'వచన గీతిక' అని కవిగారే పేర్కొన్నారు. దీని ప్రచురణకాలం 1933 జూన్ 17. ( ఈ వివరాలు సి. నా.రె. తమ గ్రంథంలో ఇచ్చారు.) ఈ వచన గీతిక 'కవికొండల గేయాలు' అన్న సంపుటిలో చేర్చబడింది. (పుట 81) అయినా తొలి వచన రచనల్లో ముఖ్యమైన ఈ గీతి కను ఈ ప్రసంగ వ్యాసానికి చేర్చిన అనుబంధాల్లో పూర్తిగా పొందు పరుస్తు న్నాను.[5] రచనా కాలం తెలియదుగాని, కవికొండల రాసిన మరొక వచనపద్యం' ఏవచన కవితా సంకలనంలోనైనా సగర్వంగా తొలి పేజీల్లో అచ్చువేయ దగ్గది. ఇవి పట్టుమని పది సంభాషణలేగానీ, హృదయాన్ని పట్టుకొంటాయి. చదవండి[6]

**చిన్నప్పుడు**

"దీనిని నీవు చిన్నప్పుడు బో బో బో అన్నావు"
"ఈ కోడిపుంజునా? అమ్మా!"
"దీనిని నీవు చిన్నప్పుడు కా కా కా అన్నావు"
"ఈ బొంతకాకినా? అమ్మా!"
"దీనిని నీవు చిన్నప్పుడు పుస్, పుస్, పుస్ అన్నావు"
"ఈ గండు పిల్లినా? అమ్మా!"
"ఊఁ"
"అమ్మా! మఱి నిన్నో – నే నే మన్నాన్ చిన్నప్పుడు!"
"అమ్మే అని అన్నావురా"
"అమ్మా మఱి 'బువ్వే' యని 'అమ్మా బొబ్బే' యని యన్నానట కాదే!"
"ఈ పేదరాలినా బిడ్డా!"

భాషలో, భావంలో, వస్తువులో, ఇది మస్తుగా అభ్యుదయ వచన కవిత. ప్రకృతి కవిగా పేరుబడ్డ కవికొండల ఆ ప్రకృతిలో ఉన్న పేదసాదల గురించే ఎక్కువగా రాసిన కవి. ఆయనకి గ్రామిక పక్షపాతిగా, సహజాభ్యుదయకవిగా రావలసినంత పేరూ, గుర్తింపు రాకపోవడం శోచనీయం. ఆయనకలం మాత్రా ఛందస్సులకే ఎక్కువగా అంకితమైనా, సంధియుగంలో సమర్థుడైనకవి కొత్త ప్రయోగాలు చేయడానికి వెనుకాడడని ఈవచన గీతాలు రుజువు చేస్తాయి. జ్వాలలోనూ, తరువాత వచ్చిన ఉదయినీ, ప్రతిభా పత్రికల్లోనూ, ఎందరో కవితలు రాశారు వీళ్ళలో చాల మంది ప్రసిద్ధులే. కొందరు వచన గీతాలకు దగ్గర్లో ఉండే మాత్రా ఛందస్సుల్లో, మాత్రా ఛందస్సులను తలపించే వచన గీతాలూ రచించినారు. కవికొండల, విశ్వనాథ, మల్లవరపు విశ్వేశ్వరరావు, అడవి బాపిరాజు, నార్ల, వెలువలి వీరరామస్వామి, శ్రీశ్రీ, నారాయణబాబు, కొంపెల్ల సూర్యారావు, బంగారమ్మ, వేదుల, కృష్ణశాస్త్రి, జనమంచి (వెంకట్రామయ్యః), శివరాం, 'శి' అదే పొడి అక్షరంతో ఒకరు. నా దగ్గర ఉన్న కొద్దిపాటి జ్వాల పత్రికల్లో కనబడే పేర్లు. జ్వాల సంపుటాలన్నీ దొరికితే యింకా ఎన్ని పేర్లు తెలుస్తాయో! జ్వాలలో పేరు లేకుండా కొన్ని పద్యాలు పడ్డాయి అవి ముద్దుకృష్ణ రచనలే కావచ్చును.

''జ్వాల''లో వచన పద్యాలు రాసిన కొంపెల్ల సూర్యారావుగారి పేరు ఈనాడు ఎవరికీ తెలియదు. ఈయన కొంపెల్ల జనార్ధనరావుగారికి ఏమవుతారో పరిశోధించాలి. ఈయన దేవుడి మీద ధ్వజమెత్తిన కవి "పాపం'' అనే వచన పద్యం చూడండి[7] మొత్తం పదే లైన్లు.

జనులు అందరూ తెలివిమీరితే
దేవుడి గుళ్ళో కెళ్ళక పోతే
దేవుడి కొక దబ్బియ్యక పోతే
అర్చకు లది మింగెయ్యక పోతే
దేవుడి బతుకేం కావాలి ?

సరసుల నమ్ముకొని సాను లందరూ
సాని మేళాల్ మానుకొంటే,
దేవుడి మేళాల్ చెయ్యకపోతే
పూజారుల పని పస్తడి పోతే,
దేవుడి బతు కేంకావాలి ?

ఇది నాస్తికత్వాన్ని ధ్వనిగా ప్రబోధిస్తుంది. ఈ కొంపెల్లవారే "ప్రంపంచమంతా పాడడిపోదూ" అనే మరొక వచనపద్యం రాశారు. ఇందులోనూ అధికార్లతో పాటు దేవుడిని ఎద్దేవా చేశారు.[8] మొత్తం 13 లైన్లు.

భజనలు చేస్తాం
బహుమతు లిస్తాం
పాదాలకి సాష్టాంగా లిడతాం
గొప్పలు యెరగకు కోపం యెరగడు
కోరిక లెరగడు గౌరవ మెరగడు
తులం ప్రతి పీల్చి టుప్పుదాసొక
'దొరే' యని పిలిస్తే 'ఓ' యంటాడే

ప్రజల సొమ్ములే జీతాలుచ్చుకు
ప్రజలకి నౌకరి చేస్తా మంటూ
చేరి అధికారం చెలాయించే
పోలీసునుంచి గవణరు దాకా
దేవుడిలాగే తేలికపడితే
ప్రపంచమంతా పాడడి పోదూ!

ఎంత వ్యంగ్యం ? ఏం ధ్వని ! తారీఖు చెప్పక పోతే ఈ పద్యాన్ని ఏ ఈనాటికవో రాశా దనుకోవచ్చు ఆనాటి యుగధర్మ ప్రభావం యువక

హృదయాలచేత విప్లవ గీతాలు రాయించింది. ఒక యువకవి జ్వాలలో రాసిన "విప్లవం" అనే పద్యం గమనించండి. [9]

హిమాలయమ్ములు
గుహా ముఖమ్ముల
తెలియని యేవో ప్రళయ రావములు ధ్వనించి
దద్దరిల్లెడు !

భగీరథాత్మజ
సభంగతనువై
ఏదో తనతడి యిగురు బెట్టు నెండ గొట్టి
ఆవటిల్లెడు

ధరిత్రియంతయు
ఏదో కలతవడి
తనమనస్సు త్రోవలు రహదార్లు లేక
గుడుసు వడియెడు ;

ఏది చూచినా
తుపానులో
విరిగిపోవుచున్న కెరటముపై నోడవలె
అటో ఇటో అన్నట్లున్నది.

ఇది యేశ్రీశ్రీయో రాశా డనుకోవచ్చుగాని, రాసింది సాక్షాత్తూ విశ్వనాథ సత్యనారాయణ. ఆ నూతన భావోద్రేకపు రోజుల్లో ఆ ఉత్సాహపు ఉద్వేగంలో గుండెల్లో ఏ మాత్రం యువకాంకురా లున్న మనిషైనా విప్లవాన్ని చూడక తప్పదు ముద్దుకృష్ణ సంపాదకీయాల్లోని వేడిని, వాడిని రుచి చూసిన ఏ యువక హృదయమైనా, ఉత్తేజితం కాక తప్పదు "జ్వాల ఎందు కంటే" అనే శీర్షికతో ప్రప్రథమం గానే ముద్దుకృష్ణ చెప్పిన మాటలు యథాతథంగా కోట్ చేయదగ్గవి.

"ప్రపంచమంతా ఒక యిల్లుగా, మానవ జాతి అంతా ఒక కుటుంబంగా మారిపోయే రోజులు వస్తున్నవి. ఏ మూలనో ఉన్న ఒక దేశం సాహసించి చేసిన యత్నంలో, అనాది నుంచీ మానవజాతి విశ్వసించిన నీతి, ధర్మం, సత్యం వలువలు తారుమారు అవుతూ వున్నవి. మనం కూపస్థంగా వుండడం వల్లనో, పూరాతన మగత చేతనో, రక్తంలో నీరసం చేతనో, నూతన తేజస్సుకు గుడ్లగూబల మౌతున్నాము. ఇది పనికి రాదు.

ఏది సంవత్సరాల నుంచి జరుగుతూవున్న ప్రచారం వల్ల నేడు హిందూ సంఘం కూడా కదిలినది. అంగీకరిస్తూ వున్నది. నూతన సత్యాన్ని, నీతిని. ఇదే ఆదను. మనలో పగిలిపోవలిసినవి యింకా వున్నవి. యువకుల దృష్టికి ఒక కొత్త తేజస్సు, ఒక కొత్త దారి కనబడుతూవున్నది. ధర్మాలలో, సంఘంలో, భావాలలో, భాషలో మార్పు మార్పు తప్పదు. దీనికి అడ్డు పీల్లేదు. వచ్చినా ఆగదు, పిరికి తనానికి ముక్తి లేదు. అందుచేత నచ్చని పాత బంధాలను తెంపి వేయడానికి ఎంతైనా సాహిస్తాము. నచ్చిన కొత్త దానికి దూకుతాము. భయపడము. తప్పు అవుతుందేమో అని జంకము.

సర్వసమత్వాన్ని అంగీకరిస్తాము. మాకు మతం లేదు. జాతి లేదు. వర్ణం లేదు. ఆడవాళ్ళందుకు మగవాళ్ళందుకు అనే భేదం లేదు. అంతా వొక్కటే. ఏ గుర్రాన్ని యెక్కి వచ్చిన వాణ్ణయినా సరే. కళ్ళెం పట్టిఆపి కిందకు దింపుతాము ; నీ కన్నా తక్కువ యెవరు' అని.

యౌవనం తెలుసుకోవలిసిన విషయాలను వయసు దాస్తూ వున్నది, అర్థం లేని భయం చేత. మేము ఇది అంగీకరించము. ప్రపంచం, జీవితం, అంతా తెరచిన పుస్తకం కావాలి అందరికీ. యువకులు ఉద్రేకంతో, సాహసంతో, ఏది తెచ్చినా దాన్ని ప్రచారంలో

పెడతాము ఉన్నది ఉన్నట్టు అంగీకరించి నిర్జీవంగా తుప్పుపట్టడం కన్నా నష్టం కలిగినా సాహసించి ఏదో యత్నించి జీవించడం ఉత్తమం.

యౌవనోద్రేకం రక్తాన్ని కదుపుతూ ఉన్న ప్రతివారూ మా యువకులే– వయస్సు పరిమితి లేకుండా."

ఇటువంటి ఆశయాలతో ఒక ఉద్యమం లాగా నూతన సాహిత్యాన్ని ప్రారంభించిన రోజుల్లో విశ్వనాథసైతం విప్లవాన్ని దర్శించడంలో ఆశ్చర్యం లేదు. ఎటొచ్చీ ఆయన తన వచనపద్యంలో ఆఖర్న చెప్పినట్టూ, ఆయన చూచిన ప్రతిదీ తుపానులో అటో ఇటో అన్నట్టున్నది. ఆయన అటే వెళ్ళిపోయాడు. శ్రీశ్రీ నారాయణబాబూ ఇటు వచ్చారు.

చిత్రం ఏమిటంటే, నారాయణబాబు "రుధిరజ్యోతి" శ్రీశ్రీ "మహాప్రస్థానం" అనే మాటలు జ్వాలలోనే, అందులోనూ ఒక సంచికలోనే ఒకదాని తరువాత ఒకటి తొలిసారిగా దేశానికి పరిచితమయ్యాయి.[11]

నారాయణబాబు 'జ్వలనా' అనే గీతికలో 'రుధిరజ్యోతిని వెలిగింపుమురా, విప్లవగీతిని వినిపింపుమురా' అని ఎలుగెత్తి చాటాడు. దానితర్వాత పేజీలోనే శ్రీశ్రీ మహాప్రస్థానం అచ్చుపడింది. వయస్సులోనే కాదు, నారాయణబాబు, శ్రీశ్రీ కన్నా ఎన్నోవిధాల పెద్దవాడు. ఒకసారి వచనపద్యాన్ని చేతపట్టాక నారాయణబాబు మరే ప్రక్రియనూ ముట్టుకోని ఏకపత్నీవ్రతుడు,

శ్రీశ్రీ ఎన్నో వచనపద్యాలు రాశాడు. ఆయన రాసిన "ఆకాశ దీపం" అనేపద్యం 1934 డిసెంబరు భారతిలో పడింది. దానికింద ఒక సంజాయిషీ సంపాదకుడిదో, స్వయంగా రచయితదో అచ్చువేశారు.

"ఛందస్సు యదేచ్ఛము. గణప్రధానము, లయప్రధానము కాకుండా, విరుపులతో, అనుప్రాసలతో, వివిధ స్వరవిన్యాసములతో భావానుగతి నిరూప్యమై ఈ రచనకు పద్యత్వసిద్ధి అర్థించబడ్డది. వచన కావ్యాలేకాని, గీతమువలె వ్రాయబడుటకూడా ఈ స్థితిని అందుకొనడానికే. చదవడం రాగయుక్తంగానే

అక్కరలేదు: పైకిమాత్రం చదివితే మంచివిరామసూత్రాలను పాటిస్తూ..."

ఈ వాక్యాలను ఉటంకిస్తూ శ్రీశ్రీ భక్తులు 'వచనగేయం తెలుగు కవిత్వం లో ఇంతకుముందే ప్రారంభమైనా ఈ గేయంద్వారా అది గణనకు రాగలిగిందన్న మాట' అని వ్యాఖ్యానించారు. అంతకుముందు వచ్చిన వచన కవితలు లెక్క లోకిరావు—లేక లెక్కచేయక్కర్లేదనేగా వీరి ఉద్దేశం. కానీ, "ముద్దుకృష్ణ, వచనగేయ రచనలో శిష్టాతోబాటు, తనుగూడ శ్రీశ్రీకి మార్గదర్శకుడైనాడు" అని సాహిత్య పరిశోధకులు సి. నా. రె. సత్యాన్ని చాటుతున్నారు. [12]

వచనరచనలో శ్రీశ్రీ ఆద్యుడే గాని కేవలం ఆద్యుడు కాదు. అతని ప్రఖ్యాత వచనపద్యం 'కవితా ఓ కవితా' లో ఆయన—

"నావిన్నవి కన్నవి విన్నవింపగా
మాటలకై మాటలకై వెదుకాగదబోతే
అవి
పుంఖానుపుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువులు దాటి
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి
ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి
వడిగా, వడివడిగా
వెలువడినై, పరుగిడినై, నాయెద నడుగిడినై"

అని తన కవితలో చెప్పుకొన్నా, ఆయన వాణి వ్యాకరణానికీ, ఛందస్సుకీ దూరంగా లేదు. నిఘంటువులనూ. వ్యాకరణాన్నీ, ఛందస్సునీ లక్ష్యపెట్టని వాళ్ళు పఠాభీ—నారాయణ బాబులే! "ఛందోబందోస్తులన్నీ ఛట్ ఫట్‌మని త్రెంచు"తా నని శ్రీశ్రీ అన్నా, ఆపని చేసింది పఠాభి. ఫిడేలురాగాల డజన్‌లో.

"నా ఈ వచన పద్యాలనే దుడ్డుకర్రలతో
పద్యాల నడుముల్ విరుగదంతాను
చిన్నయ్‌సూరి బాల వ్యాకరణాన్ని

చాల దండిస్తాను.
ఇంగ్లీషుభాషా భాండారంలోనుండి
బందిపోటుంజేసి కావల్సిన
మాటల్ని దోస్తాను
నాయిష్టం వచ్చినట్లు చేస్తాను''

అని కచ్చితంగా చెప్పి, చెప్పింది చేశాడు. ఈపాదాంలో శ్రీశ్రీ చెప్పిన ఛందస్సు వ్యాకరణం, నిఘంటువూ కనబడతాయి. నారాయణబాబు రుధిరజ్యోతి లో 'వ్యాకరణ దోషాలు' ఎత్తి చూపెట్టడం ఇప్పటికీ అతనంటే కిట్టనివాళ్ళకో సరదా.

పఠాభి తన వచన పద్యాల దుడ్డుకర్రలతో రంగ ప్రవేశం చేయగానే, ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఒక ఆశ్వాసం అంతమైంది. నూతనాశ్వాసం మొదలైంది. ఈ సంగతినే జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి 'ఆశ్వాసాంతం' అనే పద్యంలో ముక్తకంఠంతో చాటాడు.

'లలాటాన కుంకుమాన్ని, భుజమ్మీద మబ్బుదుబ్బు, కాళ్ళకింద కిర్రుచెప్పు, అంగోత్రం, పొడుంకాయ, వ్యవధిలేని అవధానం వెళిపోయిం దెళిపోయింది'— అంటూ తిరుపతి కవుల దగ్గర్నుంచి, ముద్దుకృష్ణ జ్వాలగోల, రాయప్రోలు దేశభక్తి, విశ్వనాథ విసురుళ్ళు, వైజాగులో కొత్త గద్ద, ఎముకముక్క, చేదుపాట, జరుగ్గొడ్డు సొడ్డులడ్డు, ఘనాజటా జనార్దనం, శరత్‌బాబు, రష్యన్‌కథ ఐపోయిం దైపోయింది' అన్నాడు. లేతవాళ్ల దారులకే కృష్ణశాస్త్రి దిగివచ్చిన ఆకలికాకవికేకలు చాంబల్లేను మంత్రిపెళ్ళి ఐపోయిం దయిపోయిందన్నాడు. 'పఠాభి కవి ఫిడేలు డజన్, పిఠాపురం యువరాజా, శ్రీ నారాయణబాబూ, అశాంతిలో ఇంద్రకాంతి, పూరీలో పురిపండా, బెంగుళూరు హరీన్ ఛటో— అతివిస్మృత, అతిరాజిత అతిపూజిత, అతికామిత అతివాస్తవికాకారం. ఆహార్యం, ఆచారం వొచ్చేశా యొచ్చేశాయి' అని కుండబద్దలుకొట్టినట్లు చెప్పాడు,

ఈ 'ఆశ్వాసాంతం' పద్యంలో రుక్మిణీనాధశాస్త్రి 'జరుగొడ్డుసొడ్డులడ్డు' అని తనను తెరచాటుకు వెళ్ళిపోయిన వాళ్ళలో చేర్చుకొన్నాడు, అలాగే శ్రీశ్రీని 'వైజాగులో కొత్తగద్ద; ఎముకముక్క చేదుపాట' అనేమాటల్లో చేర్చాడు. ఈ పద్యాన్ని జరుక్కు రాసేనాటికి శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలరచన రమారమి పూర్తయింది, అది అచ్చుపడక పోయినా అందరూ వాటి కాపీలు రాసుకొని దాచుకొన్న వాళ్ళే. అందుకే జరుక్ నిజం చెప్పాడు. అయితే రుక్మిణీనాధ శాస్త్రి చెప్పిన కొత్తవాళ్ళందరూ తన అనుయాయులే అని ధ్వనిస్తూ 'శ్రీశ్రీ పద్యాలనే వాడుడు' అనేగీతం శ్రీశ్రీ ఉత్తరోత్తరా రాశాడు.

"రెంటుట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ థియేటర్ స్టార్లు"
రెండు ఆరుద్రాభిషేకాలు
రెండు రిక్షాపై మౌనశంఖాలు
రెండు విజ్జి యార్భాటాలు,
రెండు హనుమత్ శాస్త్రిలు,
రెండు నమస్కరించదగ్గ విశ్వనారాయణాస్త్రిలు
రెండు నామరహిత ఫిడేలు రాగారాబాలు
రెండు పఠా పిఠా కఠోర కుఠరాలు
రెండు గోరా వీణావినాయకారాగారాలు"

ఈ పాదలలో, లిటల్ థియేటరు ఉద్యమాన్ని నడిపిన అబ్బూరివారు, నేనూ, మౌనశంఖం వ్రాసిన నారాయణబాబు, విజ్జియార్ దాసిన సింగరా చార్య, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, విశ్వనాధసత్యనారాయణ, పఠాభీ, పిఠాపురం యువరాజా, గోరాశాస్త్రి, అందరూ శ్రీ శ్రీ ప్రభావంలోని వాళ్ళే అన్నది కవి హృదయం కాని, వాస్తవానికి వీళ్ళంతా శ్రీ శ్రీ హృదయంలో మెదిలే కవిసింహాలు, సింహకిశోరాలు.

శ్రీ శ్రీ తర్వాత నారాయణబాబు పేరును ఆ రోజుల్లో ఎలాగ స్మరించే వాళ్ళో, పఠాభి తర్వాత పిఠాపురం యువరాజు పేరును తలచు కొనడం నాటి

సాహితీపరులకు అలవాటయింది. ఈనాడు సాహిత్యపరిశోధకులకు తప్ప, పిఠాపురం యువరాజా రచనల అవసరం కనబడడంలేదు. ఆయనరచనలు ఏ సంకలనగ్రంథంలోనూ, నేను చూడలేదు. ఆయన 'నామరహితం' 'తీరని కోరికలు' 'కంటికీ మనసుకీ కనిపించీ కనిపించనిదృశ్యా లందామా ? లేక మరేమందాం ? ఏదో అగాలి అంటే ?" అనే పొడుగాటి పేరుగల కావ్యరచనా చేశారు. ఈ మూడింటిలో చివరదైన 'దృశ్యాలు'లో 74 రచనలున్నాయి.

వచనరచనలో ప్రయోగ వైవిధ్యానికి ఇందులోంచి కొన్ని మంచి ఉదాహరణలు ఇవ్వవచ్చు. 81వ దృశ్యం మహాబీభత్సం. 20వ దృశ్యం జమీందారు రాసినా అది రైతులమీద రచన. ఈరెండిటినీ, ఈప్రసంగవ్యాసానికి అనుబంధాలుగ ఇస్తున్నాను.[13]

పఠాభి, పిఠాపురంయువరాజా తర్వాత వచనకవితారచనలో ప్రయోగ వైవిధ్యాన్ని ప్రదర్శించిన కవి పా. ప. ఈయన వ్రాసిన 'చీకటి', 'పురిటి పాట' అనేవి ప్రతిభావంతమైన రచనలు. పఠాభి, పిఠాపురం యువరాజాల్లాగా పా. ప. కూడ తర్వాత ఏకవిత్వరచనలూ చేయకపోవడం విచారించవలసిన విషయమే గాని, నలభైల్లో నయాగరాకవులూ, అనిసెట్టి, తిలక్, సోమసుందర్, దాశరథీ, నేనూ మొదలైన వాళ్ళం శ్రీశ్రీ అభ్యుదయమార్గాన్నీ నారాయణబాబు విమర్శనా దృష్టినీ అలవర్చుకొని కొన్ని వచనరచనలను కొత్త ప్రయోగాలతో చేశాం. అనిసెట్టి ఈసంగతినే చాల స్పష్టంగా ఇలాచెప్పాడు.[14]

"శ్రీ శ్రీ తన నిశితతీక్ష్ణదృష్టితో నేడు శిథిలమౌతున్న నాగరికతను, నిర్మితమౌతున్న నూత్న మానవోద్యమాన్ని దర్శించాడు. శ్రీరంగం నారాయణబాబు తన సహజ వైచిత్రితో నేటి జీవితపు అట్టడుగులను శోధించి, నేటి జీవితంలోని కల్లోలాన్ని నిర్భయంగా వెల్లడించాడు. నేటి జీవితంలోని సుఖదుఃఖాలు వీరిద్దరనీ ఆవహించి, నేటి మానవుల అంతరాంతరాలలో దాగివున్న తీరనికోరికలను భావిసమాజనిర్మాతలుగా రూపొందుతున్న ఆదర్శాలను పలికింప

జేశారు. వీరితర్వాత వచ్చిన కవిత్వోపాసకులు వా రవలంబించిన ఉత్తమశాస్త్రీయ దృక్పథాన్ని బహుముఖమైన జీవితానికి అనువర్తింపజేసి స్వరూప స్వభావాలతో కొత్తపోకడలు చూపడానికి ప్రయత్నిస్తున్నారు,"

అభ్యుదయకవులు సవ్యసాచుల్లాగ ఒకవంక వివిధమాత్రాఛందస్సుల తోనూ, మరోకవంక వచనరీతులలోనూ ఎన్నోరచనలు చేశారు. ఆనాటినుంచి ఈనాటిదాకా వానలో తడవనివాడూ, వచనపద్యం రాయనివాడూ లేడని చెప్పవచ్చు. తొలిరోజుల్లో 'వీళ్ళకు ఛందస్సు రాదు కనుక వచనపద్యాలు రాస్తున్నారు' అని ఛాందసులు ఎత్తిపొడిచేవారు. దాశరథీ కుందుర్తీ వృత్త రచనలో ఏ మార్గకవికీ తీసిపోరు. నేను త్వమేవాహంలో సినీవాలిలో ఎన్నో ప్రాచీనఛందస్సులు వాడాను. వస్తువునుబట్టి ఛందస్సు ఉంటుంది. నేటివిషయా లను నేటిమాటల్లో చెప్పాలంటే వచనకవితను విధిగా చేపట్టాలి. భావకవులు గీత పద్యాలకూ, తర్వాతవాళ్ళు ముత్యాలసరాల వివిధబాణీలకు కట్టుపడ్డట్టు, వచన కవులు దేనికీ తాకట్టు పడరు.

ఈసంగతే మాగురువుగారు రోణంకి అప్పలస్వామిగారు ఇలా చెప్పారు.[15]

''వచనపద్యాలంటే ఏదోఒకఛందస్సును పట్టుకొని ్రవేలాడడం కాదన్న మాట'' అట్లాఅంటే, కేవలం ఛందస్సును విస్మరించడంగానీ జారవిడవడంగాని కాదు. భావవ్యంజకమైన యమకాలు గమకాలు, విరుపులు, నాట్యవిన్యాసాలు, ప్రాసలు తప్పనిసరిగా పొడమాపుతవి. కవి స్వేచ్ఛాయుతమైన స్వీయశయ్యను పుణికిపుచ్చుకొంటాడు. ఈశయ్య వ్యర్థపదాలకు తావీయదు. అందుచేత ఛందో బద్ధమైన కవిత్వంకంటె కష్టసాధ్యమే గాని సులభసాధ్యం కాదు.''

ఈకష్టసాధ్యమైన కవితారచన చాలాసామర్థ్యంతో నిర్వహించిన కవులను పేరు పేరునా పేర్కొన వలసిందేగాని తొలితరంలోని కుందుర్తినీ, పునః ప్రవేశం చేసిన పిమ్మట తిలక్‌నీ, ఏనాడూ శ్రీశ్రీ ప్రభావంతో రచనలుచేయని అజంతానీ, నాకూ నారాయణబాబుకూ చాల సన్నిహితుడైన బైరాగినీ, మొదట

స్మరించాలి శ్రీశ్రీ ప్రభావం అభ్యుదయ గేయరచనకు ఎంత తోడ్పడిందో, అంతగా వచనకవితకు దోహదం చేయలేదు. ఇందుకు సరియైన కారణాన్ని వెల్చేరు నారాయణరావుగారు ఇలా చక్కగా చెప్పారు.[16] "శ్రీశ్రీ ప్రధానంగా కూర్పరి. భావకవులకి పద్యపు కూర్పుమీద ఎంత ఆసక్తి ఉందో, శ్రీశ్రీకి గేయ కూర్పుమీద అంత ఆసక్తి ఉంది. గురజాడది ఆశుసాహిత్య మార్గమని ఇంతకు ముందు వివరించాను. కూర్పరితనం లిఖితసాహిత్య లక్షణం. గురజాడగేయంలో సంగీతంతో నింపవలసిన జాగాలు, పాడడంవల్లనే సర్దుకొనే పదరూపాలూ వుంటాయి. శ్రీశ్రీ గేయంలో ప్రత్యక్షరమూ— చిక్కగా వుంటుంది రచన. గురజాడగేయం పాదాంతాల వద్ద ప్రాసస్థానాలవద్ద విరిగిపోతుంది. శ్రీశ్రీ ఛంద స్సుతో చిత్రవిచిత్రమైననడకలు నడిపిస్తాడు. వసుచరిత్ర ఆశ్వాసాంతగద్యాలూ, కలకరుడి భజగోవిందమూ, తిక్కనగారి కందపద్యాలు— ఇవీ శ్రీశ్రీ ఛందస్సుల నడకలకి వరవళ్ళయినవి."

నారాయణబాబు వచనగీతాలు వీటికి విభిన్నమైనవి. శ్రీశ్రీ చిత్ర శబ్దాల మోజునుండి విడిపోయాక, నారాయణబాబు శబ్దచిత్రాలప్రభావం అజంతాలాంటి వాళ్ళలో వ్యక్తమయింది. బైరాగిలో విజృంభించింది. నిజానికి, వచన కవితలో ఎంతో ఎత్తుకు ఎదిగినవాడు బైరాగి. అతని 'నూతిలో గొంతుకలు' విలక్షణమైన కావ్యం. అతని మాటల్లోనే ఆకావ్యం గురించి తెలుసుకోవచ్చు.

> "గొంతుకలు వస్తున్న నూతిలో నీళ్ళు లేవు. అదొక పాడు నుయ్యి" పాడునుయ్యి పతనానికి, మరణానికి సాంకేతం. అందులో జీవనం ఉండదు.— అందులో పడివున్నవారికి వెలుగు గోచరించదు. పైకి ప్రాకటానికి ఆధారం కనిపించదు. వారు కేకలువేస్తారు. కాని, వారి గొంతులు బయటవారికి స్పష్టంగా వినిపించవు. భూగర్భపు లోతులు వారిని బాహ్యప్రపంచంనుంచి వేరుపరుస్తున్నవి. వారు యాత్రీకులు కూడా కారు. వారి కొకగమ్యం లేదు. చీకటి తప్ప వారికి తోడెవ్వరూ లేరు. వారు గర్వాంధతవల్ల అభిశప్తులైన నహుషులు. కాని, ఆపాపం వారిదే కాదు. అందరిదీ. అది సమస్తమానవకోటికీ వర్తిస్తుంది.

"ఈ కావ్యంలో నేను అంటే కవి కాదు. నేటిమానవుని అనుభూతిలో అది కవితాదాత్మ్యం, స్వీయబాధ వెలువరించడం కవి పరమావధి కాదు. ప్రపంచంతో ఏతమైనవాడే కవికంఠం సరిగా పలకగలుగుతుందని నానమ్మకం. ప్రపంచానుభూతిలో స్వీయానుభూతి పరమైనపుడే ఉత్తమకవిత ఉద్భవిస్తుం దని నావిశ్వాసం"

బైరాగి నిర్వచించిన ఉత్తమకవిత, అతనికావ్యంలోనే కాక, ఉత్తరోత్తరా తిలక్ 'అమృతంకురిసిన రాత్రి'లో, తొలినుంచీ కుందుర్తి కృతులలో కనిపించడం వచనకవితకే గర్వకారణం.

హైదాబాదు రాజధాని కాగానే గేయకవిత్వం తగ్గుముఖంపట్టి, వచనకవిత పుంజుకుంది. కుందుర్తి ఫ్రీవర్సు ఫ్రంట్‌ని స్థాపించాడు. కేశవరావు వరవరరావు, మాదిరాజు రంగారావు చేతనావర్తనం కవులు,[17] సి విజయలక్ష్మి

ఎందరో వివిధరీతుల్లో విశృంఖలంగా వచన రచనలు చేశారు. కొందరి కొందరి రచనల్లో సంయమనం లేకపోవడంవల్ల సి. విజయలక్ష్మి కవిత్వంపై ఆరచయిత, రాసిన 'కారుచీకట్లో కాంతిరేఖ' ఉపోద్ఘాతంలో కె. వి రమణారెడ్డిగారు అన్న ఈ మాటలు వర్తిస్తాయి.[18]

"కృష్ణవరద, గోదావరి బురద- రెండూ ఒకటైనట్లుంది,
ఎన్ని పదాలూ! ఎన్నిపాదాలు, ఎంత నిప్పు- ఎంత బూడిద!"

దిగంబర కవుల ప్రవేశంతో వచనకవితకు ఉద్ధృతం వచ్చింది.[19] వాళ్ళు తమవి వచనపద్యాలు కావని చెప్పినా అవి వచనరచనలే. వీటిలో వాడితనం, పనివాడితనం ఉన్నాయి. తరువాత పైగంబరు కవులు.[20] తిరగబడు కవులు,[21] వచ్చారు. వచన పద్యాలే గుద్దారు. అరిపిరాల విశ్వం, శివారెడ్డి, శిలా వీర్రాజు, వేగుంట మోహన్‌ప్రసాద్, ఇస్మాయిల్, వజీర్ రహ్మాన్, విరసంలో చేరాక నగ్నముని, వదిలాక జ్వాలాముఖీ, చెరబండ రాజు, రంధి సోమరాజు, ఎందరో ప్రయోగ విన్యాసాలు చేశారు. వచన కవితకు లేటుగా

కన్వర్టు అయిన గుంటూరు శేషేంద్రశర్మ, సోమసుందర్‌తోసహా ఎందరో అభిమానులను సంపాదించుకొంటున్నారు.

పేజీలకు పేజీలుగా ఒకే శీర్షికమీద వచన పద్యాలు రాసేరోజులు పోయి, మూడు నాలుగు పంక్తులలో పద్యంచెప్పే యువకవులు వస్తున్నారు. "చేవగల వెదురుముక్క బాణమై భాసిస్తుంద"నే నమ్మకం గల వీళ్ళకి స్వాగతం చెప్పాలి. అలనాటి వైదికఋషుల ఋగ్వేదంలోనైనా ఈనాటి విరసం కవుల ఉద్వేగంలోనైనా కవిత్వం కవిత్వమే. అనాటినుంచి ఈనాటి దాకా, మంచికవిత్వం, చెడ్డకవిత్వం అన్న రెండే విభాగాలున్నాయి అయితే ఆదిశంకరులు చెప్పినట్లు లోకంలో చెడ్డపుత్రుడు ఉండవచ్చుగాని, చెడ్డమాత ఉండనట్లు, చెడ్డకవిత్వం ఉంటుందేమోగాని చెడ్డకవి ఎన్నడూ ఉండడు. కుకవులను కాకులతో పోల్చడం పాతపోలిక. కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ రాసిన ఈ పద్యం చూడండి[22].

చీకటి కాకి
చుక్కల గుడ్లను
రాత్రల్లా పొదుగుతుంది.
ఒకే ఒకటి
సూర్యకోకిలం ఔతుంది
మిగిలినవన్నీ
కాకిపిల్లలై
చీకటి కాకితో
ఎగిరిపోతాయి.
కాకులమంద తరిమేసిన
సూర్యకోకిలం
ఒంటరిదైనా
సమస్త జగత్తునీ
ధంజింప జేయగలుగుతుంది

సమకాలీన సాహిత్యంలో మేజరుపోయట్సూ, మైనరుపోయట్సూ ఉంటారు. అయితే మాగురువుగారు చెప్పినట్లు "ఎంత మైనరు కవి అయినా సరే, ఏదో విధంగా కవితాజ్యోతి ప్రజ్వలించేందుకు సహాయపడుతాడు. ఈపరమ సత్యాన్ని గ్రహించని జాతికి మోక్షం లేదు."[28] మైనరుకవులు వచన కవితలో చేసిన ప్రయోగవైవిధ్యాన్ని సోదాహరణంగా చర్చించడం తదుపరి కర్తవ్యం. తదుపరి విమర్శకుల డ్యూటీ!

## జ్ఞాపికలు


1. "ఆధునికాంధ్ర సాహిత్యము — సంప్రదాయములు: ప్రయోగములు" డాక్టరు సి. నారాయణరెడ్డి (1967) సికిందరాబాద్. పుట. 527.
2. —డిటో— పుటలు 508-9.
3. "కవికోకిల గ్రంథావళి - సంపుటి 4 - వ్యాసములు" దువ్వూరి రామిరెడ్డి. నెల్లూరు. పుట ౧౬౪.
4. —డిటో— పుట. ౧౩౭.
5. చూడు : అనుబంధం-1.
6. "కవికొండల గేయాలు." కవికొండల వెంకటరావు (1960) — కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్. పుట. 62.
7. జ్వాల : సంపాదకుడు- మద్దుకృష్ణ. సంపుటి - 2; సంచిక - 5 భోగి సంచిక. 16-1-35.
8. జ్వాల సంపుటి 3 సంచిక 4.
9. జ్వాల సంపుటి 2 సంచిక 4.
10. జ్వాల ప్రారంభ సంచిక.
11. జ్వాల సంపుటి 2. సంచిక 5 (16-1-35)
12. శ్రీశ్రీ సాహిత్యం (రెండు - కావ్యవిభాగం) కూర్పరి. కె.వి. రమణారెడ్డి. (1970) పుట 49.

13. "ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు : ప్రయోగములు." డాక్టర్. సి. నారాయణరెడ్డి. పుట 538.

14. "కల్పన" ఆధునిక కవితా సంపుటి. సంపాదకులు : అనిసెట్టి సుబ్బారావు వగైరాలు (1953) చేతన సాహితి, విజయవాడ-2. పుటలు 12—13.

15 'చితి-చింత' వేగుంట మోహనప్రసాద్ (1969) యం. శేషాచలం అండ్ కో. మచిలీపట్టణం. మద్రాసు—సికిందరాబాదు.— "వచన కవిత—మోహన్‌ప్రసాద్" అనే వ్యాసంలో పుట XLI.

16. "తెలుగులో కవితాపిప్లవాల స్వరూపం" వెల్చేరు నారాయణరావు (1978) పంపిణీదార్లు. విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-4. పుట 185.

17. చేతనావర్తంకవులు. 1 సంపత్కుమార 2. నరసింహారెడ్డి 3. పేర్వారం జగన్నాథం 4 సుప్రసన్న.

18. "కాదుచీకట్లలో కాంతిరేఖ" సి. విజయలక్ష్మి (1966) చేతన సాహిత్య సమితి. పాలకొల్లు. పుట 8.

19. దిగంబర కవులు : 1. నగ్నముని, 2. నిఖిలేశ్వర్, 3. జ్వాలాముఖి; 4. చెరబండరాజు; 5 భైరవయ్య 6. మహాస్వప్న.

20. పైగంబర కవులు:- 1. యం. కె. సుగమ్‌బాబు; 2. దేవిప్రియ; 3. ఓల్గా; 4 కిరణ్‌బాబు; 5. కమలాకాంత్.

21. తిరగబడు కవులు:- 1. వరవరరావు; 2. లోచన్; 3. అశోక్; 4. సంజీవరావు; 5. సుధాకర్; 6. యాదగిరిరావు; 7. కిషన్; 8. సుదర్శన్; 9. ఎక్స్‌రే; 10. ఐ.

22. "వెలుతురు పిట్టలు." కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ (1974) శ్రీ జీవన్ పబ్లికేషన్స్ రాజమండ్రి-3 పుట.16.

23 "చితి—చింత" వేగుంట మోహన్ ప్రసాద్. (పైన వివరించినదే) పుట XL.

## అనుబంధం—1

నక్కాసామిగాడు - వాడొక మాలవాడు
రాజుగారి కంపతంలో పాలేరు వాడు..,

వాడు పోయాడు - ఎంత కాలమైందో ఆ
పోయి ?- వానిని గురించి - మంచి

యజమాని తలపోసుకొంటూ - చెబుతుంటే
దెందులూరి కాడాక్కుండా వెళ్ళిన మెయిల్ని

ఆగిన మా ప్యాసింజరు రెయిల్ని
రెండిటినీగూడా మరిచి స్థాయి—

ఆ కథలో లీనమై పోయినాం - ఆకడే యుండిపోయినాం
రేయి - కథలో ఏమీలేదు - కబుర్లలో ఏమీ లేదు

జ్ఞాపకం రావడంలో ఉంది - ఓయీ - వాడు
ఆ స్వామిగా డన్నవాడు - బండికట్టడ మొస్తే

కొట్టేవాడు గాడు - ఏ యెద్లు నన్నా
కాడిమీ దో దెబ్బ - కమిచీతో వేస్తే

ఆ యెద్లు తమంతటవి - మోకరించి మోకరించి
యొకమాటుగా మెడలుపైకి ఎత్తుకోవాలి.

ఉవ్వెత్తుగా నుండి - మొండి - వాడున్నాడే
ఆ స్వామిగాడు ఉత్త శిఖండి.

అలా యజమాని అంటూంటే - వినేవాళ్ళలో ఒకరు
"అవునండి రాజుగారూ! నేనూ ఎఱుగుదును వాణ్ణి

మీ పెద్దెడ్లనూ ఎఱుగుదును - అది వాడిచేతిలో నలగమట్టి
అలా నేర్పుగా - అలా తీరుగా - అలా చేర్పుగా వుండేవి.

ముందు వాడెడుతూవుంటే, వెనకాల బుజ్జొంచుకు
కణుగూ చెణుగూ లేకుండా - ఎంత బరువైనా

లాక్కుపోవడమేగాని - రస్తా తప్పడమంటూ ఉందా!
        మహామంచివాడు వాడు - గుణాలకు నకులు దెబ్బంటివాడో-
ఎడ్లకి వా డల్లాటివాడు'' - అని హెచ్చరిగ్గా అన్నారు.
రాజుగారి కళ్ళమ్మట - బొట బొట కారాయి కన్నీళ్ళు-
        ''ఆ యెడ్లు పోయాయి యిప్పుడు - వాడూ పోయాడు
అంటూ రాజుగారు నిట్టూర్పు - ఓ జామన్నట్టుగా విడిచారు-
        అంతా ఓ నిముషం ! రైలు కదిలింది.

—కవికొండల వెంకటరావు

**అనుబంధం—2**

**దృశ్యం - 31**

అన్యోన్యం అయిన మహాప్రేమతో ఇద్దరు వివాహం చేసుకున్నారు -
సుఖాలు అనుభవించేరు -
ఒకనాడు భార్య మునిగిపోతుంటే తన ప్రాణానికి లెక్కచేయక
ప్రవాహంలో దూకి ఆమెను రక్షించాడు -
ప్రేమ చేసిం దా కార్యం -
కొన్నాళ్ళకు ఆమె ఇంకొకణ్ణి వలచింది - భావోద్రేకంతో ఆ
నూతనప్రియునితో అనుభవించింది -
అదిచూసి భర్త ఆమెను చేతులతో మెడపిసికి చంపేసేడు -
ప్రేమ చేసిం దాపని -
తరువాత ఏడుస్తూ చాకుతో పొడుచుకొని తాను
చచ్చిపోయాడు -
వలపుకాడు చచ్చిపోయిన తన ప్రియురాలి శవంచూచి కౌగలించు
కొని ఏడ్చేడు - భరించలేని విచారం, అంత ఉద్రేకం ఏకం

కాగా ఆ శవాన్ని భావోద్రేకంతో కలిసి అనుభవిస్తూ రతికేళి
చేసేడు - చచ్చిఉన్న భర్తశవం తినాలని నక్కలు చూస్తూ
ఉన్నాయి -
ఊరికే నక్షత్రాలు కళ్ళు మూస్తూ తెరుస్తూ చూస్తున్నాయి—

పిఠాపురం యువరాజా.

అనుబంధం—3
దృశ్యం - 20

గొప్పు తవ్వేడు - కట్టేడు - ఫలితం -
హాయిగా -
పువ్వులు వాసన చూసేడు - కూరలు
పళ్ళు ఆప్యాయంగా తిన్నాడు -
కాడికి ఎద్దులుకట్టి దున్నేడు
ఆకాశాన్ని చూసేడు - ఊరుకున్నాడు -
వర్షించింది - గింజలు చల్లి మళ్ళీ ఆకాశం చూసేడు-
వర్షం లేదు - భయంవేసింది-
పోలేరమ్మకు మొక్కుకున్నాడు-
వర్షం కురిసింది - నిట్టూర్పు ఇచ్చేడు -
కొంచెం పోయింది - చాలా పండింది -
గింజలతో తలవంచిన చేను మధ్య కిర్రుచెప్పులతో పెద్దకర్రతో
ఠీవిగా పచారు చేసేడు
కోతలు కోస్తుంటే కాపుపడచులతో పరియాచకం ఆడేడు -
ఆకాశాన్ని చూసేడు - మబ్బేసింది - కంగారులో వాన రాకుండా -
మళ్ళీ మొక్కేడు
చిన్న చినుకులు పడి వాన ఆగిపోయింది ...

కుప్పేసి తొక్కించి గాదిలో చేర్చేడు -
సంక్రాంతి పండుగ సంతోషంతో గడిపాడు —
కూతురుని అల్లుడిని తీసుకొచ్చి బట్టిచ్చి సాగనంపేడు -
సిస్తు ఇచ్చేడు — కొంత నసుక్కున్నాడు — గదిలో ఎలుకలు
కొన్ని గింజలు తిన్నాయి —
ధరబాగుంది - మంచిధరకి అమ్మేడు —
జాతర్లకి వెళ్ళేడు - పిల్లలని పుట్టించేడు —
సుఖానికి నవ్వేడు - బాధకి ఏడ్చేడు —
చాలా సంవత్సరాలకి చచ్చిపోయాడు -
తరువాత వానికొడుకూ ఇవన్నీ చేసేడు -
తరువాత వాని మనవలు, మునిమనవలు అదే చేసేరు —

—పిఠాపురం యువరాజా.

# 20 ఏండ్ల తెలుగు కవిత్వంలో భావకవిత్వచ్ఛాయలు (1957–77)

డా॥ నాయని కృష్ణకుమారి

మనుష్యుల చిత్తవృత్తులనూ, చేష్టలనూ, పఠితకు సరైనపద్ధతిలో అవగాహన అయ్యేట్లు చేస్తూ, అందుమూలంగా ఆకాలానికి ఆ మాట కొస్తే ఏ కాలానికైనా, పఠితను పనికివచ్చేట్లుగా, వాటి రూపురేఖల్ని దిద్దితీర్చడమే సాహిత్యానికి పరమ ధ్యేయం. సాహిత్యంతో రూపుదాల్చిన మహోజ్జ్వలమైన పంథా ఏదైనా సరే సమకాలిక విషయాలమీద తన ప్రభావాన్ని అపారంగా చూపుతుంది. కాలగమనంలో, దాని ప్రభావంచేత కొత్తపద్ధతులు లోకంలో తలయెత్తి, కావ్యాని నిలదొక్కుకుంటున్నప్పుడు, వెనకటి మార్గాలు, అవెంత గొప్పవైనా, క్రమేణా కాలగతికి తలవంచక తప్పదు. 20 వ శతాబ్దపు ప్రథమపాదంలో జనించి, తెలుగుసాహిత్యంలో ఉజ్జ్వలస్థానాన్ని ఆక్రమించుకున్న భావకవితాప్రక్రియ కూడా 1938–40 ప్రాంతాల్లోనే అభ్యుదయ కవితామార్గానికి దారియిచ్చి తప్పుకోనారంభించింది. ఇప్పుడు, దాదాపు 40 సంవత్సరాలు, కాలపుస్తకంలో పుటలై, విశదీయడానికి వీల్లేకుండా అతుక్కుపోయిన తర్వాత, 1957 నుండి 77 వరకూ తెలుగుసాహిత్యంమీద భావకవిత్వచ్ఛాయలు ఎట్లా ఉన్నాయో చెప్పమని అడగడం కొంత ఇబ్బందిని కలిగించే విషయమే.

భావకవిత్వ మంటే అందరికీ అర్థమై పోయేటట్లుగానే అనిపిస్తుంది. కాని అది, కేవలం భ్రమ. నిజానికి దానంత క్లిష్టమైన కవితావణితి మన సాహిత్యంలో ఇంకొకటి లేదు (1) కవికి సంబంధించిన మనోమయ ప్రపంచంలోని తీవ్రాకాంక్షా ప్రకంపనాలతో చలించే ఒకనిగూఢమైనతాపం, అతనిచేత తప్పని

సరిగా కావ్యసృష్టి చేయిస్తుంది. ఆ కవిత్వంలో స్పష్టాస్పష్టంగా దొరికీ దొరక నట్టుగా, భాసించే ఆ తాపం, భావమై, ఆ కవిత్వానికి ప్రాణాధారమై, దాన్ని భావకవిత్వంగా మలుస్తుంది. ఆ కవిత్వం పుట్టిన క్షణాలలో కవిఆంతరస్థితి మీదా, బాహ్యలోకంలో అతనికి సంబంధించిన జీవనవ్యాసంగంమీదా ఆధారపడి, ఆ కవిత్వానికి సంబంధించిన విలువలు నిర్ధారింపబడతాయి. కవికీ పఠితకూ మధ్య ఆత్మీయత పెరిగి కవిఅనుభవమే పఠితఅనుభవంగా మారే అవగాహన పొడచూపుతుంది. భావకావ్యవిమర్శకు, కవి హృదయానుభూతీ, దాన్ని కవి సహాయ నిరపేక్షంగా పఠిత తన హృదయస్థితినిబట్టి అర్థంచేసుకొనే సంస్కారమూ, మాత్రమే ప్రమాణమైనవీ, ముఖ్యమైన విన్నీ !

(2) భావకవిత్వానికి ఆలంబన 'నేను' అనే కవి యొక్క ఆత్మ వ్యక్తి ఆనేనుతో ఒకనువ్వు ఎప్పుడూ ముడిపడి, విడివడకుండా అంటిపెట్టుకునే ఉంటుంది. ఆనువ్వు కవియొక్క ప్రేయసి కావచ్చు. తల్లి కావచ్చు. లేదా కంటికి కనిపించే ఈచరాచరసృష్టిలోకానీ, కవిఊహకు మాత్రమే సంబంధించిన కాల్పనికజగత్తులో కానీ, ఏ వస్తువైనా ఏ విషయమైనా ఈ 'నువ్వు'గా రూపొందవచ్చు. ఈనేను నువ్వుల నిత్యక్రీడ లేనిదే అది భావకవిత్వం అని పించుకోవడానికి వీలుండదు.

అయితే ఈ రెండిటికీ మధ్య కవి జీవితానుభవపరమైన సాహచర్యం తప్పక ఉండి తీరాలి. అదే ఆనువ్వు నేనులను కలిపి ఉంచే భావబంధం.

(3) భావకవిత్వం, లిరిసిజాన్ని అంటే పాడేగుణాన్ని, తనతో అభిన్నంగా ఉందేటట్లు ఏర్పాటు చేసుకుంది. కవిఅనుభూతియొక్క ఉద్వేగం వెల్లడి కావడానికి, ఈ గేయగుణం ఒకవాహికగా ఈకవిత్వంలో మారవలసి వచ్చింది. భావకవి అందుకే పాడడం మొదలుపెట్టాడు. పైపెచ్చు ప్రాణంకంటే గానం నాకు తీపి అని చాటుకున్నాడు గానం చెయ్యకపోతే అంతర్గతమైన భావతీవ్రత బయటకి రాలేదు కనుక నేను గానం చెయ్యక తప్పదని నిర్ధారించుకున్నాను.

(4) ఒకవిషయాన్ని కేవలం వాచ్యంచెయ్యడానికి మనం వాడే భాష వేరు; మనోమయప్రపంచంలోని భావగాఢతను ప్రకటించడానికి ఈభాషకు శక్తి చాలదు. అందుకని ఆత్మీయతాసంకేతంగా నిలిచేశక్తిగల భాషను, భావకవి తనకు తానుగా తీర్చిదిద్దుకో వలసి వచ్చింది. దాన్ని అర్థం చేసుకునే హృదయ సంస్కారాన్ని సాధిస్తేనే తప్ప పఠితకు భావకవి ఒక పట్టాన అర్థం కాదు.

ఈ నాలుగులక్షణాలూ భావకవిత్వానికి ముఖ్యమైన లక్షణాలు. ఇందులో, నేను సమీక్షింపబోయే కావ్యాలలో అన్నిలక్షణాలూ ఉండేవి కొన్ని. కొన్ని మాత్రమే ఉండేవి కొన్ని.

ఇక ప్రస్తుతానికి వస్తే:-

ఈ ఇరవై సంవత్సరాల కాలంలో గీతాంజలికి కొన్ని అనువాదాలు తెలుగులో కనిపిస్తున్నయ్. 1962 లో శ్రీ పి. పార్థసారధిచేత అనువదింపబడి డా॥ గోపాలరెడ్డి గారికి అంకితంగా ఇవ్వబడినది ఒకటి. 1969 లో శ్రీ ఆచంట జానకిరామ్ అనువదించి ప్రకటించిన గీతాంజలి ఒకటి. అనువాద మైనా, భావకవిత్వాన్ని సమీక్షించేముందు ప్రప్రథమంగా గీతాంజలిని స్మరించ - డానికి ఇక్కడ కారణం ఉంది. 1913-14 ప్రాంతాలలో గురుదేవుని గీతాంజలి ప్రచురింపబడ్డది. ఆరోజుల్లో దానిచేత ప్రభావితులు కానివారు లేరు. అక్కడ రవికవి స్వీకరించిన నీవు నేను ప్రతీకలే భావకవిత్వంలో కూడా ఆలంబనలై కనిపిస్తాయి. కవి స్పృశించే వస్తువుకో, వర్ణనకో, ప్రకృతికో, చివరకు భాషకో, కవిత్వమనే చెరగని రంగుతో ఇవి రంజకత్వం కలిగిస్తాయి. అందుకే ఈ నేను-నీవు భావనను తెలుగుసీమలో జనించిన భావకవిత్వశాఖను ఉదారంగా పంచియిచ్చిన గీతాంజలినీ, దాన్ని విస్మరించకుండా తెలుగుకవులు రూపొందించిన అనువాదాలనూ ఇక్కడ ప్రప్రథమంగా స్మరించడం జరిగింది.

ప్రశంగవశాన ఇక్కడ మరొకవిషయం. తెలుగు సీమలో గీతాంజలికి మల్లేనే బ్రహ్మ సమాజ ప్రార్థనా సరణి కూడా భావకవిత్వజననానికి కారణ.

మైందని నా అభిప్రాయం. ఆ రోజుల్లో ప్రచారంలో ఉన్న బ్రహ్మసమాజానికి చెందిన ఏకేశ్వరోపాసనలో విశ్వవిభు డొక్కడే వాడు ప్రభువు ప్రాణ ప్రియుడు. తక్కిన జగత్తంతా ప్రియురాలు. ఈ నువ్వు నేనుల బంధం తెలుగు బ్రహ్మసమాజ ప్రార్థనా గీతాలలో స్పష్టంగా రూపుకడుతుండేది. ఆనాడు గీతరచయితల్లో హేమాహేమీ లుండేవారు. అందులో శ్రీ దేవుల పల్లి కృష్ణశాస్త్రిగా రొకరు. ఆయన బ్రహ్మసమాజానికి 1918 నుండీ కీర్తనలు వ్రాసినట్లు కనిపిస్తుంది. కన్నీరు అనే పేరుతో శ్రీ పెద్దాడ రామస్వామిగారి పీఠికతో 1922 లో ఆ కీర్తనలు అచ్చుకావడం జరిగింది. నిజానికి, ఒక విధంగా, దాన్నే మొదటి భావకావ్యంగా చెప్పవచ్చు.

కలుష దుర్దాంత పంక సంకలిత కుహర
ముల జనించు మదీ యాశ్రుమలినధార
స్వామి ! భవదీయ పాదదేశమున బారి
పరమ పావన జాహ్నవీ ప్రతిభ గాంచు -

అన్న ప్రసిద్ధమైన కృష్ణశాస్త్రిగారి పద్యం, తొటత, ఈ పాటల పుస్తకంలో అంకితంగా వ్రాసిన పద్యమే ఇంతకూ గీతాంజలితోపాటు ఏకేశ్వరోపాసనా మార్గం కూడా భావగీతాలు తెలుగులో పుట్టడానికి కారణమని మాత్రమే ఇక్కడ నేను స్పష్టంచేయదలచుకున్న అంశం.

అనువాదాలు కాబట్టి ప్రచురింపబడిన రెండు గీతాంజలీ కావ్యాలలో ఛాయలకోసం వెదుకులాడ వలసిన అవసరం లేదు.

ఇరవై యేళ్ళ కాల పరిమితిలో నా సమీక్షకు లోనయ్యే కొద్ది కావ్యాలనూ నేను నాలుగు విభాగాలుగా విభజించుకోవడం జరిగింది. అవి

1. స్పష్టంగా భావకావ్యాలుగా నిర్ణయింప దగ్గవి.
2. ఏ ప్రయోగ వాద ధోరణీ సోకకుండా, యాదృచ్ఛికంగా అక్కడక్కడా భావ కవిత్వచ్ఛాయలను సంతరించుకున్నవి.

3. అభ్యుదయవాదాన్ని సమర్థిస్తూ భావుకతకు ప్రాధాన్యమిస్తూ, భావకవితా ఛ్ఛాయలతో, అ భ్యుదయాన్ని కలగలిపి, రూదిపుద్దుకున్నవి.
4. భావకవితాలక్షణాలతో మితిమీరిన ప్రతీకాత్మకతను మిళితం చేసేవి.

**మొదటి విభాగం :-** భావకవిత్వం పేరు చెప్పగానే మొట్టమొదట స్మృతి పథంలో వెలిగే కవి శ్రీ నాయని సుబ్బారావు. నాయని కవిత్వానికి ఊపిరి అనుభవం. కవిత్వం ఆయన ఆత్మద్రవ్యంలోనుండి, బీజంలోనుండి ఉద్బుద్ధ మౌతున్న మొలకలాగ, విరిసి పలకరిస్తుంది. లబ్ధప్రతిష్ఠుడైన ఈ కవి సౌభద్రుని ప్రణయయాత్ర, మాతృగీతాలద్వారా, ఈ శతాబ్దపు ప్రథమార్థం లోనే, భావకవితాస్వరూపానికి, ఎకైక లక్ష్యంగా భాసించిన విషయం తెలియని వారెవరూ ఉండరు.

1960 తరువాత, ఈయన వ్రాసిన మరో రెండు కావ్యాల సమీక్ష ఈ విభాగంలో చేరక తప్పదు. అవి (1) వేదనావాసుదేవం, (2) విషాద మోహనం. ఈ రెండూ అనుభూతి ప్రధానమైన గాఢభావనకు ప్రతినిధులు.

కవి అంతరంగ భూమికలో పుష్కలంగా పండే అనుభవమే భావ, వస్తు, రచనలకు, మూడింటికీ, కవితా రంజకత్వం కలిగిస్తుండడం భావకవిత్వ ధర్మంగా చెప్పుకున్నాం కదా ! అయితే ఈ అనుభవమనేది రెండురకాలుగా ఉండవచ్చునని భావకవిత్వ చరిత్ర మనకు చెప్తుంది. అందులో నాయని అనుభవం ఒకటోరకం. కృష్ణశాస్త్రి అనుభవం రెండోరకం. కృష్ణశాస్త్రి వస్తువు వైయక్తికమైన ఆయన మనఃప్రపంచంలో మాత్రమే ఉద్భవించింది. నాయని వస్తువు ఈ ప్రపంచానికి చెంది, కవిచేత కంఠదఘ్నంగా అనుభూత పూర్వమైనటువంటిది. అంచే కృష్ణశాస్త్రి అనుభవం, ఊర్వశిని, నాయని వత్సలను, ఎరిగినట్లుగా ఎరుగదు. వత్సల విషయంలో నాయనిది అనుభవం. ఊర్వశి విషయంలో కృష్ణశాస్త్రిది అనుభవిస్తున్నానన్న కాల్పనికమైన తీవ్రభావన. అయితే కాల్పనికవాదంలో కూడా వస్తువుకూ, ఆత్మవ్యక్తికీ, జన్యజనక సంబంధం ఉంటుంది. అది నూటికి నూరుపాళ్ళు వాస్తవ ప్రపంచానికి

సంబంధించినది కానక్కరలేదు— ఉదాహరణకు నాయని ప్రణయయాత్ర అనుభవైక వేద్యమైనా అక్కడక్కడా ఆ అనుభవానికి కాల్పనికత తోడుగా వచ్చి హంగు చేయడం కనిపిస్తుంది.

వత్సలా ఫాలమున నెలవంక గురుతు
కందళించి వికాసించి కళలు దేరి
తరుణ శారద రాకా సుధా కరాచ్ఛ
బింబము లనంతములు లెక్కపెట్టుకొనెదు—
ఈ యమర్త్యాచ్ఛ చంద్రిక లెన్నినాళ్ళు
నా తనువుముంచుకొను నన్నినాళ్ళు ఒక్క
ఈ శరత్తేమి నాది సదా శివత్వ పదవి—

అన్న నాయని పద్యాలలో, వత్సలా ఫాలం, దానిమీది నెలవంక గురుతు, అది చంద్రికగా కవితనువును ముంచివేసేవైనం ఇవన్నీ ఆయన అనుభవంలోనివి. వీటిల్లో కాల్పనికత లేదు. కాని తరుణశారదా రాకా సుధాకరాచ్ఛ బింబాల్ని లెక్కపెట్టుకోవడం, ఆ అమర్త్యాచ్ఛ చంద్రికల్లో మునిగే కవి తాను సదాశివత్వ పదవిని వహిస్తున్నట్లు ఆనందపారవశ్యాన్ని భజించడం— ఇదంతా కవి అనుభవాన్ని ఆధారంగా చేసుకొని మనోహరంగా ఉత్ప్రేక్షితమైన కాల్పనికత-

ఇటువంటి కాల్పనికత మాతృగీతాల్లోనూ ఉంది. కాని 1970లో ప్రకటితమైన విషాదమోహనంలో లేదు.

చదువుకో తెరచు పొత్తమ్ము పొరటల సందుల నీవు
చెదిరిన దృష్టిలోన నస్ఫుటముగా చిక్కు జీరలుగ
పదిలమ్ము కొరవడ్డ ముద్రితాక్షర పంక్తుల నీవు
మది నంకురించెడి భావములు విప్పః మడతల నీవు
అదవదవదు గుండెలోతులందుండి యాగక యుబికి
వదలక రూపమ్ము కట్టు పద్యాల బరువులో నీవు
పది మాటలికనేల బ్రదుకు సర్వమ్ము ప్రతి పదమ్మిట్టు
లదయుడా నీమయమ్మయ్యేరా ఊపిరాడదు నాకు

ఈ నవ్వు లేతవయస్సున, తన్నువదలి తనదారి వెతుక్కుంటూ ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయిన, మృతపుత్రరూపమైన నవ్వు. ఇది వ్యావహారిక స్థితిని మించినదీ కాదు. కాల్పనికమైనదీ కాదు. అనుభూతి పరమైన భావగాఢతచే, దేదీప్యంగా వెలిగే నవ్విది—అయితే పఠితకు కవిజీవితం తెలియనప్పుడు, ఈ నవ్వుకూ, గీతాంజలి నవ్వుకూ భేదం కనిపించదు—

ఇటువంటి ఆత్మాశ్రయ లక్షణమే ఈయన వేదనావాసుదేవంలోనూ ప్రముఖంగా కనిపిస్తుంది. వాడిన ఛందాన్నిబట్టీ, పద్యసంఖ్యనుబట్టీ, లాక్షణికులు దీన్నిశతకాల కోవలో చేర్చడానికి ప్రయత్నించవచ్చునేమో।

"నను నెట్లుం కడతేర్పజాలని భవన్నాథత్వ మేపాటి నా
మన సిట్టారక దుఃఖవహ్ని మరగింపన్ సేమమా నీకు పే
నను కుక్కించెదనన్న భూరి బలవంతుండే కదా రాజు రా
జును చెక్కింపగ లేచి పేనను కథాసూక్ష్మమ్ము గుర్తించుకో।''

అన్నచోట కనిపించే నవ్వు, కవి బాధానుభవం చేత తిరస్కారానికి లోనైన, నాథత్వసామర్థ్యం కల నవ్వు. ఇది కృష్ణశాస్త్రి ఊర్వశి వంటిది. వ్యావహారిక స్థితిని మించి కవి మనోమయ ప్రపంచంలో భాసించేది. నాయని, తన జీవితంలో, తొలిదశలో దిద్ది తీర్చిన ఆ రెండు భావకావ్యాలకూ, దీటుగా మలిదశలో రూపొందించిన ఈరెండు భావకావ్యాలూ నిలుస్తాయి. మొదటి రెండింటిలో పడుచుతనపు ఉరవడీ, భావావేగమూ ప్రస్ఫుటమై, జనమనస్సు మాకర్షణ చేయగా, మలిదశలోని యీ కావ్యాలు రెండూ వయః పరిణతి సాధించిన శాంత గంభీరస్థితినీ, తాణకని భావపౌష్కల్యాన్నీ, పఠితలకు అందిస్తూ నాయనిని భావకవిత్వాకాశంలో ధ్రువతారగా నిలవబెట్టాయి.

ఈ విభాగానికి చెందిన మరోకావ్యం నిశాంతం. దీని కర్త శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం, కవిగాకంటె సాహిత్యవిమర్శకుడుగా ప్రసిద్ధివహించినవాడు. నిశాంతాన్ని ఆయనధ్యాన కవితగా పేర్కొని,

''ఎపుడో నా యెద పూచెను
జపమై కవిత్వ సాధన- ఆపూ
లిపుడే మాలికగా వచ్చె''—

నంటూ వివరణయిచ్చుకున్నారు. నిజానికి ధ్యానకవితా, భావకవితా, ఒకవిధంగా, మధ్య స్పష్టమైన విభాగరేఖ ఉండడానికి వీలులేని కవితలే. ఈ కావ్యానికి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ ప్రజ్వలింపజేసిన కావ్యతత్త్వప్రదీపిక వలన ఈ కావ్యం కుండలినీ శక్తిమూరురూపమైన దేవీరూపంగా భాసించిందని సుదర్శనం గారు సంతోషపడ్డారు. మాధుర్య స్వప్నానుభూతుల గుచ్ఛాలు విచ్చుకునేటట్లు మాట్లాడే సుదర్శనంగారి భాష భావకవిత్వభాషే ఈ భాష ఉండడంవల్లనే, తద్గత మైన భావాన్ని కవితో ప్రమేయం లేకుండా అర్థంచేసుకోవాలని ప్రయత్నించే విమర్శకుడు, దాన్ని ఉపనిషత్తుల నుండి ఊరిచాటువుల వరకూ, అనుభూత పూర్వమైన ఓ భావంతోనైనా పోల్చి విమర్శించడానికి ఆరాటపడవచ్చు. భావం విషయంలో ఇంత నిగూఢతనూ, పట్టివ్వని తనాన్నీ పటిష్ఠంగా కావ్యంలో నిలబెట్టి తానుమాత్రం పఠితకు అవతల నిలబడి తమాషా చూచే విచిత్ర లక్షణం భావకవికి మాత్రమే సొంతం. ఈ లక్షణమే కవికి సంబంధించిన అంతరాంతర దీప్తావధుల్ని కనీ కనపడనట్లుగా ప్రదర్శిస్తుంది. గుండెగుప్పిలిని పదేపదే మూస్తూ, తెరుస్తూ, లోపలికి తొంగిచూడబోయే పఠితను ఉయ్యాల లూగిస్తుంది. నిశాంతంలోని ఈ పద్యం చూడండి !

ఎన్ని జన్మలు! పూవులో నెన్ని రేకు
లెన్ని మధురవాసనలు నాహృదయమందె
యుగయుగమ్ముల కాలమ్ము నాదిగి యొదిగి
పుచ్ఛమును మ్రింగబోవు పాము వలె నుండు—

ఈ పద్యాన్ని కవి సహాయ నిరపేక్షంగా అర్థం చేసుకోడానికి ఆయా పఠితలకు వాళ్లవాళ్ల హృదయ సంస్కారాన్ని బట్టి భూమికలు తయారవుతుంటాయి. ఇందులో శర్మగారు కుండలినీ మహాశక్తిని చూస్తే, కృష్ణకుమారి ఆత్మవ్యక్తి

నుండి ఆవిర్భవించే ఒక అవిస్పష్ట వాంఛాంకురాన్ని ఒక అంతర్నిగూఢ తాపాన్ని చూస్తుంది. అవి ఆయా పఠితల మానసిక సంస్కారాన్నిబట్టి ఆవిర్భూతమయ్యే భూమికలు.

"నీవె నాలోని తత్త్వమ్ము నేను. నీకు
గరుడవాహన మౌదు పక్షముల విప్పి
పాదముల ద్వంద్వ గమనమ్ము పరిహరించి
ఎగిరివత్తు సర్వాంశమ్ము నేక మగుచు—"

ఈ పద్యంలో శర్మగారు ఉపనిషదాది తాత్త్వికవాక్యాలు సెలయేళ్ళలా దొర్లు తుండడం చూచారు. పక్షములు విప్పిన గరుడవాహనం, శర్మగారి దృష్టిలో సువర్ణాఖ్యుడైన పరమాత్మతో అభేధం సాధించింది. నా దృష్టికి, నువ్వూ నేను అనే భేదం లేని దశలో కవి అనుభవించే అంతర్గతతత్త్వం, కవికి సంబంధించిన సర్వాంశతో ఏకమయ్యేదశను నిర్ద్వంద్వంగా రెక్కలు కట్టుకుని ఎగిరే అద్భుత భావచిత్రం కనిపిస్తుంది.

నిజానికి ఈ పద్యంలోనినువ్వు ఎవరు?

"That I want thee Only thee. Let my heart repeat without end !" (గీతాంజలి) అన్న రవీంద్రుని నువ్వుతో దీనికి పోలికలు లేవా?

"ప్రణయ పవనధాటి తులికి
కలత నంది మసలి నాను
నింగికెగయు వలపు టలల
పొంగి పొరలి పరువు లెత్తి
ప్రాణనాధా –(కన్నీరు)

ఇదె వచ్చుచున్నాను!" — అని 1919లో పూర్ణిమనాటిరాత్రి గోదావరి మీద పడవలో కొవ్వూరు దగ్గర, శ్రీ కృష్ణశాస్త్రి రూపుదిద్దిన నువ్వులాంటిది కాదా యీ నువ్వు?

''కాలరేఖ సైతం కరిగిపోయే
నిర్మోహ మహాశూన్యంలో
చాచిన చేతులతో
సుడిగాలి వై చుట్టుకోక
నీకు తప్పదు!
అప్పుడు నా స్పర్శ
నీ ఉనికిని శాసిస్తుంది!
నువ్వూ నేనూ అనే భేదంలేనిచోట
నీవు నామీది ఆరాధనవే
నేను మాత్రం
ఆ ఆరాధనలోని (అగ్నిపుత్రి)
అనంత వేదనను!—అని కృష్ణకుమారి

పలవించిన నువ్వులాంటిది కాదా యిది! లేగ

''నీవు జీవనదాత్రివి నేను జీవి
నీవు లేకున్న నా లేమియే ధ్రువమ్ము'' (సౌభద్రుని ప్రణయయాత్ర) అని

నాయని నిర్ధారించిన నువ్వా యిది?

''నీ దృగంచలాలె వెలుగునీడ లవును
పవలురేయి మొదలుతుద లవును నాకు
ఉభయసంధ్యలమధ్య నిట్లూగుచున్న
బ్రతుకు టూయెల దీనికి స్వాస్థ్యమెట్లొ!

అని అర్థించిన సుదర్శనంగారి నువ్వులో, ఒకదేవుడు, ఒక కుండలీని శక్తి, ఒక ప్రియభావన, ఒక ప్రియురాలు ఎవరైనా కనిపించవచ్చు. ఇందులో కనిపించే నువ్వు ఎవరు ఎక్కడనుండి వచ్చినట్లు? పుట్టుపూర్వోత్తరాలేమిటి అని ఆరాలు తీయబోవడం, నీటిలో జాడలు వెదకడమే. పొగమంచును, పిడికిట బిగింపడం వంటు! ఈ 'నువ్వే' భావకవి అనుభూతి పర్వంలో అత్యుత్కృటమై,

ఒకానొక అంతరుద్రేక ప్రేరితమై, ఆవిష్కరింపబడే అంశం ఇది చాలు నిశాంత కవిని భావకవిగా నిర్ధారించడానికి.

ఇందులో నేను-నువ్వుల తెగనిబాంధవ్యాన్ని పటిష్ఠంగా వ్యక్తంచేసే ఆత్మీయ సంకేతపూర్ణమైన భాషాసరళికూడా ఉంది.

ప్రేమలేఖ అనే ఖండికలో,

''సృష్టి తొలిసంజ విచ్చు పూరేకులమయి
మృదుపరిష్వంగమున నిద్ర నొదిగి జారి
దూరమైనార మెరుగని తీరములకు
నీవు నేను పరస్పరాన్వేషణమున—''

అని ఒకవిషయానికి ఒకభూమికను పఠితకు అర్థమయ్యే భాషలోనే కవి తయారు చేయడం జరిగింది. తర్వాత, పోల్చుకొనలేదొః అనీ, ''ఇది విరహాకీల వ్రాసిన హృదయలేఖ" అనీ- ''విస్మరించితి గాంధర్వవిధిని"- అనీ,

''మఱపుచెఱవీడిన పునస్సమాగమమ్ము,

ఐక్య సంసిద్ధి విలయ నిశాంగణమున-" అనీ కవి తన మనోంతరాను భూతికి తానై విశిష్టంగా ఏర్పరచుకున్న సంకేతభాషను ఉపయోగించుకుంటూ వెళ్ళిపోతాడు. పఠితకు ఈఖండిక ఉన్నది ఉన్నట్లు అర్థం కావాలంటే ఆసంకేతాన్ని అర్థంచేసుకోగల సాన్నిహిత్యం కవితో ఏర్పడిఉండాలి. లేదా ఎవరెవరి వ్యక్తిగత భావసంస్కారాన్నిబట్టి వాళ్ళు వాళ్ళు, ఆ అర్థాన్ని Decode చేసే ప్రయత్నం చెయ్యవచ్చు. ఈ ప్రయత్నంలో కవి భావనకు పూర్తిగా వ్యతిరేక మైన, విపరీతభావనలు రావడానికి కూడ ఆస్కారం లేకపోలేదు. ఒక ప్రశ్న వేస్తే ఒకేజవాబు సూటిగా అందించే సంప్రదాయకవిత చదవడానికే మనం అలవాటు పడ్డాం. భావకవిత్వమనేది. ప్రశ్నలువేసి జవాబులురాపట్టగల ప్రక్రియ కాదు. ఒకవేళ వచ్చినా, ఆ వచ్చిన జవాబుల్ని భిన్నభిన్నాలుగా భాసించేట్లు చేసే స్తోమతగల విచిత్రప్రక్రియ. ఇటువంటి లక్షణాలు పుష్కలంగా ఉన్న నిశాంతం సిసలైన భావకవితాఖండిక.

రెండవ భాగం :-ఇక్కడికవులు నిర్దిష్టంగా తమకై తాము ప్రయోగవాదాన్నో, భావవాదాన్నో, చేపట్టినవారు కారు. వీళ్ళకవిత్వానికి ఒక ఇజంకానీ, ఒకసిద్ధాంతం కానీ లేదు. స్వచ్ఛందంగా ఎప్పుడు ఏక్షణాన ఏవిషయం తమ్ము ప్రేరేపిస్తే దాన్ని తమ మనస్సుకు నచ్చినతీరులో చెప్పజూచే స్వేచ్ఛావర్తనులు. వీళ్ళకు ఛందస్సూ, కమిట్‌మెంటూ, వంటివి ఏవి అడ్డురావు. అటువంటి చోట్ల భావుకత చొచ్చుకురావడానికీ, ఊహరెక్కలు విప్పడానికీ, అనుభవం కవిత్వమై వెలగడానికి కూడా ఆస్కారం ఉంటుంది. ఈ రకపు కవులలో నేను మొదట పేర్కొనదలచిన వారు శ్రీ గోపాలరెడ్డిగారు ఆయన్ని జనం, సాహిత్య సదస్సులకు అధ్యక్షుడుగా, రవీంద్ర సాహిత్య పక్షపాతిగా, అనువాదకుడుగా, ఎరుగుదురు. ఆయన కవితా వ్యవసాయాన్ని ఈ మధ్యనే చేపట్టడం జరిగింది. రవీంద్ర శిష్యత్వమూ, ఆయన కృతులకు ఈయన పూనిన అనువాదోద్యోగమూ, ఈయన భావకుడుగా మారడానికి ప్రథమకారణాలు. మొదట మొదట భావుకతను ప్రస్ఫుటంచేసే కవితాఖండికల్ని అటు బెంగాలీ నుండీ, ఇటు ఉర్దునుండీ అనువాదం చేయడంతో సరిపుచ్చుకున్న ఈయనలోని భావకవితాత్మ మెల్ల మెల్లగా స్వీయ మనఃప్రపంచాన్ని రంజనం చేస్తూన్న అనుభూతి ప్రకటనకు ఉన్ముఖమౌతున్నది.

కాలగమనాన్ని కాలవాహిని అనే పేరుతో ఆయన తీర్చిన పద్ధతిలో భావుకత కనిపిస్తుంది.

> ''నేడు ఒక బుద్బుదం
> రంగు రంగులతో రమ్యంగా ఉంటుంది
> కాలవాహినిలో తేలుతూ వస్తుంది.''—

అంటూ ఒక ఆకృతి యిచ్చి,

> రాక్షసిలాంటికాలం
> నేడును తన విపుల వదన గహ్వరంలోకి
> కరాళదంష్ట్రిలతో నమిలి
> అనంత ఉదరకుహరంలోనికి పంపేస్తుంది —

ఎన్నికోట్ల నేడులను,

పిల్చుకుంటుందో!— అని భావచిత్రాన్ని తయారుచేస్తారు, "నిన్నలు పురిపెడుతూ రేపులదూదినుండి వడికిన సన్నని దారంనేడు: అట్టి దారాలపోగులతో నేసిన బట్ట మనజీవితం"—అన్న అవగాహనలో రూపకసౌందర్యంకంటే జీవన సత్యం శక్తిమంతంగా స్ఫురిస్తుంది. — ఇటువంటిభావుకత, ఆయన కాల వాహినిలో అంతటా కనిపించకపోవచ్చునుగాని, కనిపించినంతవరకూ, స్పష్టమైనదీ, గాఢమైనదిన్నీ!

ఈ విభాగంలో చేరదగిన మరోకావ్యం శశాంక వ్రాసిన స్వరలహరి. ఈయన కృష్ణశాస్త్రిగారికి ప్రియశిష్యుడు. ఏకాంతసేవక ర్తల్లో ఒకరైన ఓలేటి పార్వతీశంగారి కుమారుడు. శశాంకరచనా సంస్కారానికి ఈ రెండుఅర్హతలూ మౌలికతను అందించా యనాలి.

స్వరలహరిలో భావకవితా లక్షణాలన్నిటినీ గుర్తించడం కుదరదు. భావకవిత్వం లిరిసిజాన్ని అంటిపెట్టుకుని ఉంటుందన్న విషయం మనకుతెలుసు ఈ లిరిసిజాన్ని సాధించేది లలితమైన భాష. దీన్నే శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు,

"మృదుల సరళాక్షరముల సమ్మేళనాప్తి
నార్ద్రి నవనీత మార్దవ మగును నుడువు
శ్రవణసుఖ మిచ్చు సలలితోచ్చారణమున
భంగిమ యటందురీ పదబంధసరణి- "

అని నిర్వచించారు. ఆంగ్ల విమర్శకులు Rhythmical language అంటూ దీనిచేతనే రచనను సూచించి, దీన్ని తొలుతగా స్వీకరించేదీ ఆనందించేదీ శ్రుతి అని నిశ్చయించడం జరిగింది. భావం హృదయసంబంధి, వస్తువు బుద్ధికి చెందిందీ ఎలాగో, ఈ రచనారీతి చెవికి సంబంధించింది, అలా అవుతుంది. శ్రవణసుఖగత కల రచనా విన్యాసం, భావకవుల కాలంలో పుష్కలంగా ఉండేది. అదే శశాంక కవిత్వంలో ఎక్కడచూచినా ప్రత్యక్షమౌతుంది.

"క్రొమ్మించు బొమ్మంచు కోక కట్టుకుని
తళుకు ముత్తెపు బెళుకు రైక దొడిగికొని
చికిలి చూపులలోన వలపు నిలుపుకుని
చిలిపి లేయదలోన నెనరు వించుకుని
వెదుకు లాడెద వెవరినే వానచాన
ఎండి బీటలు పడిన యీ నేలలోన:- "

కవి హృదంతర్గతానుభూతులతో చిక్కబడిన భావం ఇందులో లేకపోయినా, నిర్ణీతార్థం వాచ్యంగా, సామాన్యంగా, ఎదుట సాక్షాత్కరించినా, శశాంక వన్నీ మెత్తని మాటలు. చెవికి హాయిని గొలిపేవి. సరళంగా, సమప్రదేశంలో ఉరవడి లేకుండా, చల్లగా సాగే నీటి పాయల్లాగా, ఆకారాల్ని చెక్కుకుంటూ వెళ్ళిపోతా యి ఆ ఆకారాలలో దాగిన రహస్యా లుండవు. వెతికి పట్టుకోవాల్సిన భావగాఢత ఉండదు. అంతా వాచ్యమే అయినా మధురం. జీవహరిణాలూ, భావగంగా, గాలి పట్టే మూగనోమూ, కాలజీమూతాంధకారమూ, కావ్య పద్మాలూ, ప్రసవ మధు పాత్రలూ, వలిగాలి వలిపెముల తెలిమేలిముసుగూ, ఒకటేమిటి ఎన్నెన్నో ఇటువంటి పదబంధాలన్నీ భావ కవితా భాషా భాండారంలోనివే. ఈ ఒక్క లక్షణంమాత్రం, శశాంకకు వారసత్వంగా వచ్చిన ఆస్తి.

శ్రీ బోయి భీమన్న రాగ వైశాఖి కూడ భావకవితాచ్ఛాయలను అక్క డక్కడ పొందించుకొన్న కావ్యం. దాన్ని ఆయన శృంగార లేఖికా కావ్యంగా చెప్పుకున్నాడు. చలం ప్రేమ లేఖలకూ దీనికి క్వచిత్తుగా పోలికలు కనిపిస్తాయి. కాని చలం ప్రేమలేఖలు నూటికి నూరుపాళ్ళు భావకావ్యమైతే, భీమన్న రాగ వైశాఖిలో భావుకత ఎక్కడో ఒకచోట తళుక్కు మంటుంటుంది.

**మూడవ విభాగం :-**

ఇది భావవాద, అభ్యుదయవాదాలు కలగలసిన విభాగం ఇక్కడ తొలు త ఎన్నదగినవాడు తిలక్. ఆయన అమృతం కురిసిన రాత్రి 1968లో అచ్చైన కావ్యం.

తిలక్‌ను కుందుర్తిలాంటివాళ్ళు అభ్యుదయ భావకవితావాదిగా వివరించినా, తిలక్ తానే స్వయంగా తన్ను, అనుభూతివాది నని చెప్పుకున్నా, ఒక నిర్దిష్టమైన కవితా సంప్రదాయానికి చెందినవాడుగా ఇతణ్ణి నిర్దేశించడం కష్టం. భావకవిత్వం ఆంధ్రదేశాన్ని ఏలిన కాలంలో అక్కడ మార్క్సువాసన సోకలేదు; అంతమాత్రాన అప్పటి కవుల్ని సామాజికస్పృహ లేని వారనడం అతర్కిత విచారం. ఆ నాటి దేశదాస్య శృంఖలతా, తద్విమోచనోపాయాలూ, జాతీయ నాయకుల ప్రభావమూ, ప్రసిద్ధులైన భావకవుల మీదుండేవి ఇంచుమించు ప్రతి భావకవి రాష్ట్రగానం చేసినవాడే. సహాయనిరాకరణాన్ని ఆమోదించి చదువులు మానుకుని జైలుకు వెళ్ళిన వాడే. అందువల్ల, వారిని సాంఘికస్పృహ నుండీ నాటి సమాజం నుండి వేరుగా బతికేవారని అనలేము కాకపోతే, జీవితాన్ని సమాజ ధర్మానుసారంగా నడుపుతూ, కవిత్వాన్ని హృదయవాదియైన ఆనందానికి అంకితం చేసుకున్నారు. తిలక్ కాలానికి సామాజిక స్పృహ, మార్క్సు శాస్త్రమూ, కవిత్వాన్ని కూడా ఆక్రమించుకున్నాయి.

అయితే తిలక్ వైయక్తికంగా భావకవితా లక్షణాలు కలిగినకవి. భావుకత ఈయనకు కంఠదఘ్నమై ఉన్నదనడానికి అమృతంకురిసిన రాత్రి చక్కని ఉదాహరణ. సమాజం ఈకవికి అందించిన సంస్కారం అభ్యుదయ కవితా లక్షణాలను, భావుకతను జతకూర్చింది. ఈ రెండింటి కలగలుపుగా తిలక్ కనిపించడానికి కారణం, ఈ రెంటిలో ఏ ఒక్కదానిపట్లా అతనికి వైముఖ్యం లేకపోవడం. అట్లాగే ఏ ఒక్కదానిపట్లా గాఢనిష్ఠ లేకపోవడం. అందుకే ననుకుంటాను "అ ్యదయ కవిత్వం కొన్నిపాళ్ళు, భావకవిత్వం కొన్నిపాళ్ళు, కలిసిన మిశ్రరూపం" అని కుందుర్తి తిలక్ కవిత్వాన్ని నిర్ణయించవలసి వచ్చింది.

తిలక్ తనకు తాను తన కవిత్వానికి నిర్వచనం చెప్పుకుంటూ,

నా కవిత్వం కాదొక తత్త్వం
మరి కాదు మీ రనే మనస్తత్వం

కాదు ధనికవాదం సామ్యవాదం
కాదయ్యా అయోమయం జరామయం—అని

నేతినేతి, ధొరణితో కొంతవరకూ సాగి, తన కవిత్వ చందన శాలలోని చిత్ర విచిత్రాలుగా,

''గాజుతెరటాలనూ వెన్నెల సముద్రాలనూ
జాజి పువ్వుల అత్తరు దీపాలనూ
మంత్రలోకపు మణి స్తంభాలనూ—''

ఎన్నుకుంటాడు. అంతలోనే వాటితోపాటు,

అగాధ బాధా పాథఃపతంగాలు
ధర్మ వీరుల కృత్త రక్తనాళాలు
త్యాగశక్తి, ప్రేమరక్తి, శాంతిసూక్తి

ఇవి నా కళాకరవాల ధగద్ధగాయవాలు!'' అని చాటుకుంటాడు. కాని అతడు తీర్చే అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు. ప్రజాశక్తుల్ని వహించే విజయ ఐరావతాలు. వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆడపిల్లలు. ఈ వైరుధ్యం తిలక్ కవిత్వం అంతటా కనిపిస్తుంది.

"నా దేశాన్ని గురించి పాడలేను
నీ ఆదేశాన్ని మన్నించలేను" — అంటూ ఆ రగీతాన్ని ఆలాపించడం మొదలు పెట్టిన తిలక్‌ను అభ్యుదయ కవిగా అంచనా వేసుకుంటుండగానే, కవి వాడేభాష మన కళ్ళ ఎదుట గారడీలు చేస్తూ మనని వర్ణనీయ వస్తువునుండి దూరంగా వర్ణించే రీతి వైపుకు లాక్కుపోతుంది.

"కొత్త సింగారమ్ము వలదు
ఉదాత్త, సురభిళా తళయ్యా సజ్జితము వలదు
రసప్లావితము వలదు
చిత్ర శిల్ప కవితా ప్రసక్తి వాంఛింపను
తత్త్వ సూత్ర వాదోక్తి చలింపను"—

అంటూ చదువుకుంటూ పోయే పాఠకుడికి, ఇది, నా దేశాన్ని గురించి పాడలేను అంటూ కవి వినిపించబోయే ఆర్త గీతిలాగ స్ఫురించదు.

"ఒక్క నిరుపేద ఉన్నంతవరకు
ఒక్క మలినాశ్రుబిందు వొరిగినంతవరకు
ఒక్క ప్రేగు ఆకలికి కనలినంతవరకు
ఒక్క తల్లి నీరసాక్రోశరవమ్ము విన్నంతవరకు
ఒక్క క్షత దుఃఖిత హృదయ మూరడిల్లనంత వరకు"

ఇంతవరకూ ఇది గీతాంజలి ఫణితిని తలపిస్తూ సాగుతూ,

చివరకు ముక్తాయింపుగా.

"నాకు శాంతి కలగదింక నేస్తం" అనగానే ఏదో ఎగుడుదిగుడు తనంలో పతితను ఎత్తికునేసినట్లుగా అయిపోతుంది-

కవిత్వం ఒక ఆల్కెమీ అన్న తిలక్ తన కవిత్వానికి తానై ఒక ఆదర్శాన్ని నిర్ణయించుకోలేదు. కవితాసామగ్రి ఎన్నుకొనే విషయంలో కానీ, కవితారీతిని స్థిరం చేసుకునే విషయంలోకానీ, స్థిరమైన అభిప్రాయాన్ని కలిగి ఉండలేదు. ఆయన కున్న భావనాబలానికీ, భాషాధికారానికీ, ఒకనిర్దిష్టమార్గం ఎన్నుకోబడిఉంటే, తిలక్ మంచి భావకవి అయ్యేవాడు.

ఎల్లోరా కూడా తన నిశ్శబ్ద సంగీతంలో తనకవిత్వానికి తానే వ్యాఖ్యానాన్ని చేసుకుంటూ,

నా కవితలో అభ్యుదయకవిత్వం కొన్నిపాళ్ళు ప్రకృతి వర్ణనాత్మక భావ కవితకొంత-కలిసిన మిశ్రమ సంప్రదాయం!- అని చెప్పుకున్నవాడే.

తన 'రేపటి వసంతంలో' ఒకచోట
కవి బాహాటంగా, ప్రేయసితో
"రా! ఆ బుగ్గల స్నేహసన్నిధిలో
నా ప్రేమఋగాలు అద్దుకోనీ

రా॥ ఆ చిలిపి కనుఁరేకల్లో
భావ కవితలు రాసుకొనీ!" —అని చెప్పుకున్నా,

మరీ వాచ్యమైన కారణాననేమో, ఈయన కవితలో గాఢభావుకత ఎక్కడోగాని స్పందించదు.

**నాలుగవ విభాగం:-**

భావకవితా లక్షణమైన భావుకతతోపాటు మితిమీరిన ప్రతీకాత్మకత ఇక్కడ చోటుచేసుకుంటుంది- నిజానికి భావకవిత్వానికి ప్రతీకలతో సంబంధం కొత్తేమీ కాదు. ఒకదశలో, ఈ ప్రతీకలధాటి యెక్కువై, కవిత్వం, పఠితకు అంద కుండాపోయి, ఇది అభావకవిత్వమనీ, అయోమయకవిత్వ మనికూడా, సాంప్ర దాయికులచేత ఈ కవిత్వం ఈసడింపును పొందడం కూడా జరిగింది.

ఒక్కొక్కచోట ప్రతీకాత్మకత సర్వోత్కృష్టంగా కనిపించి, పఠితను ఆనందంచేత పులకింప జేస్తుంది-

ప్రణయయాత్రలో, నాయని,

"ఇది పగిలిపోవునను భయమ్మింతవరకు
ఈ తలంపున నిపు దుల్ల మిగురులెత్తి
తునిగిపోయిన చెక్కలతో పయోధి
గర్భమున రత్నరథ మీవు కట్టెదవని-
ఇది పగిలిపోవునను భయమ్మింతవరకు
ఈ తలంపున నిపు డాత్మ కింతశాంతి
విరిగిపోయిన చెక్కల దరికి చేర్చి
నీ చితికి కాష్ఠములుగ మన్నించెద వని!-"
అన్న పద్యాలలో పొదిగిన ప్రతీక అద్భుతమైనది.
ఆలోచనను ప్రేరేపిస్తూ మనస్సును కరిగించేది.

ప్రస్తుత విషయమైన ఇరవైసంవత్సరాల కవిత్వంలో, కవిభావుకుడైనా

ప్రతీకలమీద మోజు పెంచుకుని, ముందుకు సాగినవాడు శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ. భావకవులు లలితభాషను స్వేచ్ఛగా వాడుకుంటూ నిర్దిష్టగమ్యంలేని వస్తు వివరణలో తిలక్ మునిగిపోతే, భావకవిత్వభాషను స్వాధీనంచేసుకుని, పాశ్చాత్య ప్రపంచంలో గుబాళించే ప్రతీకాత్మతను, తెలుగు చేసుకుని, ఆవాహికద్వారా అటు సాహిత్యవిప్లవాలనూ, ఇటు సామాజిక విప్లవాలనూ ఆహ్వానించే కవి శర్మగారు.

ఈయన జన్మతః భావుకప్రకృతి కలవాడు. సంప్రదాయంమీద గౌరవం కలవాడు. ఏ కావ్యమైనా మనకు కథనమూ, ఔచిత్యమూ, శైలీమాధుర్యమూ, భావనిష్ఠా, వంటి అంశాలుగా కనపడితే, ఈయనకు, శ్రీవిద్యా కుండలినీశక్తి, ఉపనిషత్తత్వమూ, వైదికమహత్త్వమూవంటి మహార్థభాసితంగా దర్శనమిస్తుంది. అది ఆయన సంస్కారం. కాని, శేషేంద్రశర్మ సహజప్రవృత్తిమీద సమకాలిక సాహిత్యస్థితి విసిరిన ఒక సన్ననిపొర ఎప్పుడూ ఆక్రమించుకుని ఉంటుంది. తెలుగు సాహిత్యాన్నీ, అది పట్టిన మార్గాలనూ ఈసడించుకుంటూ పాశ్చాత్య కవితా సిద్ధాంతాలమీదా విజాత్యకవులమీదా ఆస్థచూపిస్తూ వాటిని ఆయన ఆశ్రయించి, అక్కడి ప్రతీకల్నీ భావాలముక్కల్నీ తనకవిత్వంలోకి ప్రయత్నపూర్వకంగా చొప్పించుకోవడానికి కారణం ఈపోరే: అటువంటి వాటిని కలుపుకుని, తనదైన విద్ధాంతాన్నీ బాణీనీ ఒకటి సృష్టించుకుని ఇప్పటితెలుగు సాహిత్యప్రపంచంకంటే ఒక విలక్షణ ప్రపంచాన్ని ఏర్పాటుచేయాలని ఈయన మక్కువ.

కాని, సహజంగా భావుకుడైన ఈకవి కవిత్వంలో అమూర్తరూపాన్ని ఆశ్రయించిన భావనాబలం గాఢంగా కనిపిస్తూనేఉంటుంది. ఇతరశ్రమల్ని సాహిత్యపరంగా ఈయన పనిగట్టుకుని పోషించక పోయినట్లయితే, స్వచ్ఛమైన భావకవిగా ఈయన రాణించేవాడు.

"నిన్నూహించి రెండు ముక్కలు చెబితే
అవే రెండు రెక్కలై ఊహ

విహాయసంలో కెగిరిపోతుంది
అదే ఒక గీతం అవుతుంది.

అదే ప్రేమ కపోతం అవుతుంది! ''— అంటూ 'శేషజ్యోత్స్నలో' సాగిన, కవి హృదయాంతర్గతమై, అనుభావితమైన భావన ఒకటి అందంగా రెక్కలు విరుస్తూ అలవోకగా తేలివస్తుంది. సధర్మభరచిత్తుడైన పఠిత హృదంతరాలను తాకీ తాకనట్లు చల్లగామెల్లగా స్పృశించి గిలికింతలు పెడుతుంది. తన్మయత్వాన్ని కలిగిస్తుంది.

అలాగే అందాల అతిధులు అనే శీర్షికలో.
"ఎందుకు వస్తున్నాయీ ఈ అందాల భావాలు
నిశ్శబ్ద బంధురమైన నా మందిరంలోకి''

అన్న కవితా వాక్యాలు అద్భుత ప్రతీకలు. విరిగిపోయిన కుర్చీల్లాంటి అనుభవాలు పడున్న జీర్ణమందిరమూ, చెరిగిపోయిన చిత్రాల్లాంటి స్వప్నాలు వ్రేలాడే శూన్య మందిరమూ, అని కవి తన మనోమందిరాన్ని భావించి, ఎడారి సత్రం లాంటి ఆ మండిరం లోకి అందమైన భావాలను రావద్దంటాడు.

"నేను నిర్జన ప్రదేశ వాసిని
లోకాంతరాల నుంచి వచ్చిన ప్రవాసిని
నన్నే ఎందుకు వరిస్తా" రంటాడు.

తొలిరోజుల్లో భావకవుల్లో ప్రచురంగా కనిపించిన ఆత్మన్యూనతాభావ మిది. కృష్ణశాస్త్రి గారిలో ఇది అందంగా, ఆకర్షణీయంగా కనపడుతుండేది — ఇంత వరకూ సరే ! ఆ పైన కవి,

''నీలాకాశంతో చెలిమబ్బులై పొంది
సాగరాల్లో నావలై తెరచాపలై పొంది
దూరతీరాలకు తరలిపోయే పవనాలై పొంది
రేపటి గులాబీల తోటల్లో

ఉషస్సులై పొండి !
పొండి !

అంటూ ఆ భావాల్ని లోకాభ్యుదయాన్ని కాంక్షిస్తూ, ప్రజాహితంకోరి, ప్రపంచం నలుదిక్కులకూ పంపేస్తున్నాడు- తన కవిత్వం ద్వారా అభ్యుదయాన్ని పంచిపెడుతున్నాడు.

రేపటి స్వర్గం వ్రాసిన అరిపిరాల విశ్వంలోనూ ఈ ఛాయ లెన్నో ఉన్నాయి.

కన్నీళ్ళు కార్చిన
మేఘాలు తాల్చే
ఇంద్రచాపం
నా లేఖినిగా చేసుకుని
అర్ధ రాత్రి ఆకాశంలో
చంద్రునిలోని బండలపై
సహస్ర లేఖినులతో
సూర్యుడు వ్రాసే వెన్నెల కవితలా
వ్రాయాలని నా కోరిక —

అన్న మరొక భావుకుడు సత్యశ్రీమన్నారాయణ. ఈయన తన వెలుతురు పిట్టలకు అందమైన భావాల తొడుగులు తొడిగి, ప్రతీకల్ని గుప్పించాడు. ఒక చోట ఈయనకు మృత్యువు ఎముకల చెట్టుగా దర్శనమిస్తుంది.

ఆ చెట్టు లోలోపల ఎదుగుతూ, ముందుగా వదిలే పువ్వు తెల్లని జుట్టు, అప్పుడే మృత్యువు,

''చర్మ కవచాన్ని
విదిలించుకుంటూ
బయట పడుతుంది
ఎముకల చెట్టు'' — రూపంలో

ఆయన భావనల్లో కొత్తదనం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

# నేటి తెలుగు కవితలో తిరుగుబాటు ధోరణులు

డా॥ కె. కె. రంగనాథాచార్యులు

స్వాతంత్ర్యం వచ్చింది. అదంటే ఏమిటో తెలిసినవాళ్లు వేడుకలుచేసుకున్నారు. ఇరవయ్యేళ్లు గడిచాయి అన్నిరంగాలలో ప్రగతిని సాధించామని చెప్తున్నా సామాన్యమానవుడు బాగుపడలేదు. ఉన్నవారికి, లేనివారికి మధ్య భేదాలు పెరిగిపోతున్నాయి. జరిగిన కనీసపు అభివృద్ధి కొన్నివర్గాలకు మాత్రమే లాభించింది కులం, మతం తమ పాతస్వరూపాన్ని కోల్పోయినా అంతకంటే భయంకరంగా రాజకీయ, సాంఘికస్వరూపాన్ని పొందాయి. ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. నిరుద్యోగం అంతకంతకు పెరిగిపోతున్నది. విశ్వవిద్యాలయాల్లోని విద్యావిధానం సమాజంలో బ్రతికాటనికి ఏమాత్రం పనికిరావటంలేదు. స్వాతంత్ర్య సాధనకు పూర్వం కనీసంగానైనా కొంతమందిలోనైనా కనిపించిన త్యాగం స్థానాన్ని స్వార్థం, అవినీతి, లంచగొండితనం ఆక్రమించాయి. తెల్లవాడు పోయి నల్లవాడు వచ్చాడు తప్ప సామాన్యుల స్థితిగతులలో మార్పేమీలేదు. కొందరు మేధావులు లభించిన కొద్దిఅవకాశాలతో సంతృప్తిపొంది ఉన్నపరిస్థితులలో సమాధానపడితే అధికసంఖ్యాక జనంలో అసంతృప్తి అసహనం రాజుకుంటున్నాయి. కాని, పరిస్థితిని ఎదుర్కొనే ధైర్యసాహసా లెవరికీ కనిపించటం లేదు.

ఒకవైపు రాజకీయ, ఆర్థిక. సాంఘికరంగాలలో యథాస్థితిని కొనసాగించే ప్రయత్నాన్ని పాలకవర్గాలు చేస్తుండగా, కనీసంగానైనా తప్పనిసరై మార్పులకులోనైన సమాజంలో తమ ఇదివరకటిస్థానాన్ని కోల్పోయిన మరొక వర్గంవారు సంప్రదాయంపేరిటా, సంస్కృతిపేరిటా సమాజాన్ని వెనక్కినెట్టే ప్రయత్నం చేస్తున్నారు. పెద్దలకు ఒకనీతి, చిన్నలకు ఒకనీతి పాతతరానికి, కొత్తతరానికి మధ్యఅగాధాన్ని ఎక్కువచేసింది. విద్యార్థులూ, యువకులూ రాజ

కీయాలకు దూరంగా ఉండాలనే నినాదం ఒకవైపు ఇస్తూ వారిని సామాజికస్రవంతి నుంచీ, రాజకీయ అవగాహననుంచి దూరంచేసి ఏకాకులను చేయటంద్వారా వారిని తమస్వార్థానికి తమనాయకత్వానికి భంగం కలిగినప్పుడు ఉపయోగించుకోవటం, బలిపెట్టటం రాజకీయనాయకుల నీతిగా మారింది. అభిప్రాయాలకు, ఆచరణకు సంబంధంలేదని బోధించి తప్పుడు విలువలు ప్రసాదించిన పరువు, ప్రతిష్ఠలకు ప్రాధాన్యమిచ్చి తమ సంతానమే తమను కాదంటే, ప్రశ్నిస్తే సహించలేని పెద్దం దురహంకారానికీ, తమధ్యేయాలకూ మధ్యసమన్వయం కుదరని ఫలితంగా యువ తరంలోని అశాంతి పాత కొత్త తరాలమధ్య అగాధాన్ని మరీ పెంచింది. మరొక వైపు కందుకూరి, గురజాడ ఏమూఢవిశ్వాసాలను పోగొట్టటానికి ఉద్యమాలను నడిపారో, ఏస్త్రీజాతిని బానిసతనంనుంచి ఉద్ధరించటానికి త్యాగాలు చేసారో ఆ మూఢవిశ్వాసాల్లోకి జనాన్ని, ఆ బానిసతనంలోకి స్త్రీలను నెట్టుతూ పౌరాణికాలకు, జానపదాలకు ప్రతిరూపంగా సాంఘికరూపాలు పొందిన సినిమాలు, వాటికే మాత్రం తీసిపోని నవలలు, కామోద్రేకాన్ని ప్రకోపింపజేసే సెక్స్‌రచనలు, మానసికరుగ్మతలనుపెంచే డిటెక్టివ్ సాహిత్యం కుప్పలుతెప్పలుగా వచ్చి పడు తున్నాయి. ఇంకొకవైపు పరిస్థితుల కనుకూలంగా అధికారంలో ఉన్నవారి అండ దండలను పొందటానికి అవాస్తవాలను వాస్తవాలుగా, వాస్తవాలను అవాస్త వాలుగా చిత్రిస్తూ జనం కన్నుమూస్తున్న వార్తాపత్రికలు.

సామాజిక, రాజకీయ రంగాలలో సరియైన ఉద్యమాలు లేనందున ఏర్పడిన స్తబ్ధతాస్థితి సాహిత్యరంగాన్నికూడ ఆవరించింది. యువతరాన్ని ప్రభావితంచేసి, ఎందరో మహాకవులుగా రూపొందటానికి కారణమైన అభ్యుదయ కవిత్వం రాజకీయోద్యమాలు కొంత చల్లబడటంతో 1955 తరువాత తన ఉద్యమస్వరూపాన్ని కోల్పోయింది. రాజకీయోద్యమం తీవ్రంగా ఉన్న దశలో సామాన్యుడు, అతని పోరాటాలు కవితా వస్తువులుగా ఉండేవి. ఉద్యమ తీవ్రత తగ్గడంతో మధ్యతరగతిజనం, గుమాస్తా జీవితం, నగర వాతావరణం మాత్రమే కవితావస్తువు లయ్యాయి అభ్యుదయకవికి. దానికి కారణం ఈ కవులు ముఖ్యంగా మధ్యతరగతికి చెందినవాళ్ళు కావటం. ఆకాలంలో వాళ్ళ

అం. ధపపద్ధ, చూస్తున్న జీవితం అదే అయిఉండటం. ఈవిధంగా అభ్యుదయ కవి మధ్యతరగతికి ప్రతినిధిగామాత్రమే మిగిలిపోయాడు. ''ఇక్కడ మా భారత వర్షంలో – ఎక్కువగా కబుర్లేగాని – సమాజ స్వరూపం మార్చే – సాహసం కనిపించకుండా ఉంది" అన్న స్థితిలో ఉంది సాహిత్యరంగం. ఇంతటితో ఆగ లేదు ఈ కవులు. తాము ఏ మహోద్యమాలవల్ల, ఏ సిద్ధాంతాల ఆధారంగా మహాకవులుగా నిలబడగలిగారో వాటిని పూర్తిగా వదలటమే గాకుండా పరిస్థితులతో పూర్తిగా రాజీపడి. 'ఇజా'లతో సంబంధంలేదంటూ 'శుద్ధకవిత' 'సాహిత్యం సాహిత్యం కోసం' అనే నినాదాలతో 'కాదు ధనికవాదం, సామ్య వాదం–కాదయ్యా అయోమయజరామయం'గా అయోమయశుద్ధమానవతావాదాన్ని ప్రబోధిస్తూ, కనీసం తమస్థితిని, ఆశక్తతను, పరిమితుల్ని అంగీకరించి కొత్త తరాన్ని నిరాకరించకఉండలేని స్థితినుంచి బయటపడలేక జడత్వాన్ని, స్తబ్ధతను కవితారంగంలో పెంచి పోషించారు. భావకవిత్వపు పోకడలను వ్యక్తిగత అనుభూతివాదంపేరుతో మళ్లీ ప్రవేశపెట్టారీకవులు. దీనితోపాటు వస్తువుకంటె రూపానికి ప్రాధాన్యమిస్తూ చదువుకున్న మధ్యతరగతివాళ్లకుమాత్రమే పరిమిత మైన 'వచనకవిత్వాన్ని' ఒక ఉద్యమంగా చేపట్టి శుష్కచర్చలతో సాహిత్య రంగంలోని స్తబ్ధతాస్థితిని మరింత పెంచడానికి కారణమయ్యారు. కవిత్వం ప్రజాకవిసమ్మేళనాల స్థితిని దాటి రచనలుచేసే కొద్దిమంది కవులు అక్కడా, ఇక్కడా గుంపులుగా చేరి తాము రాసినదాన్ని పరస్పరం వినిపించుకోవడం, చర్చించుకోవటం స్థితికి వచ్చింది. ఇంతకంటే దయనీయమైనస్థితి ప్రయోగ వాదం పేరుతో చమత్కారకవిత్వం ప్రాచీన సాహిత్యంలోని చిత్రకవితాస్థాయికి దిగజారటం. పైపరిస్థితుల్నే కొందరు అభ్యుదయకవులు తిరుగుబాటుపై తిరుగు బాటుగా అభివర్ణించారు

ఇది సంప్రదాయవాదులకు మంచి చేయూత నిచ్చింది. ఈ తిరుగుబాటుపై తిరుగుబాటుకు సంతోషంతో స్వాగతంఇచ్చారు. సిద్ధాంతం లేదు, సందేశం లేదు. నేను కవిత రాస్తున్నాననే మాటలను పట్టుకొని 'రాజకీయపక్షపు నియంతృత్వపు

సిద్ధాంతాల తాకిడిని తట్టుకోలేక దానిమీద తిరుగుబాటు ప్రారంభమైనట్టుగా ప్రచారంచేశారు. ఆస్థితిలోనే సారస్వతాన్ని జాతీయంచేయటం అనే నినాదాన్ని ప్రారంభించారు. నిజానికి అంతర్జాతీయతతో సంబంధంలేని శుద్ధజాతీయత అంటూ ఏదీ లేదు ఆధునిక ప్రపంచంలో. పాశ్చాత్యదేశాలలో వైజ్ఞానికీకరణ ఫలితంగా ఏర్పడిన పారిశ్రామికీకరణను, వైజ్ఞానిక సాధనాలను దిగుమతి చేసుకొని వాటి ఫలితాలనుమనం అనుభవిస్తున్నప్పుడు, తత్ఫలితంగా ఉత్పన్నమయ్యే సామాజిక సమస్యలు సాంఘికసిద్ధాంతాలు మనం దిగుమతి చేసుకోకపోయినా కొంచెం వెనుకా, ముందూ వాటంతట అవే ఉత్పన్నమౌతాయి. వాటి ప్రభావం సాహిత్యంలోనూ తప్పదు. అయితే ఆవేశానికి కాక ఆలోచనకు సంబంధించిన ప్రక్రియగా 'వచన కవిత'ను పేర్కొని సనాతనభావాలకు కూడా వాహికగా గ్రహించారు కొందరు కవులు. ఆధునికతలో భౌతికంగా జీవిస్తూ తాత్వికంగా సనాతనంవైపు దారి చూపిస్తూ, ఆధునిక కవితాప్రక్రియ 'వచనకవిత'ను మాధ్యమంగా గ్రహిస్తూనే ప్రాచీన సాహిత్యశాస్త్ర సంపదను ఉద్ధరించబూనుకుంటూ, ఆధునికతకు తాము నమ్ముతున్న సంస్కృతి, సంప్రదాయాలకూ సమన్వయం కుదరక ఏదీకాని, ఎవరికీ అందుకోని అస్పష్ట అయోమయ తాత్విక భావనలను ప్రవేశపెట్టేప్రయత్నం చేశారీరకం కవులు.

ఈ శతాబ్దపు అయిదవదశకం ఉత్తరార్థంలోను, ఆరవదశకం పూర్వార్థంలోను కనిపించే సంప్రదాయకవుల్లోను, ఆధునిక కవుల్లోనూ వ్యక్తిగతంగా చూసినప్పుడు భిన్నమార్గాలలోనే కొంతసామ్యం కనబడుతుంది. అది పెట్టుబడి దారీ వ్యవస్థలో బ్రతుకుతూ కొంచెం భేదంతో భూస్వామ్యమన స్తత్వంతో వ్యవహరించటం అభ్యుదయకవులలో చాలామంది పెట్టుబడిదారీ వ్యవస్థలోని ప్రలోభాలకు లోనై అవకాశాలకోసం అవసరాన్నిబట్టి వందిమాగధులై భూస్వామ్యమన స్తత్వాన్ని ప్రదర్శించగా, సంప్రదాయకవులు భూస్వామ్యవ్యవస్థకు చెందిన మన స్తత్వమే ప్రధానంగా కేవలం వందిమాగధులుగా మాత్రమే నిలబడి నాయకుల ఆశ్రయంతో పదవులనూ, సంస్థలనూ ఆశ్రయించారు. సంప్రదాయకవులెలాగూ ప్రజలకు దూరమే. కాని, అభ్యుదయకవులు కూడా జనానికి దూరమై జనంలోని అసంతృప్తినీ, వారి జీవనాడినీ పసిగట్టలేకపోయారు.

ఈ పరిస్థితుల్లో తెలుగు సాహిత్యరంగలో జడత్వాన్నీ, స్తబ్ధతనూ చీలుస్తూ 1964లో వచ్చిన యువకవుల కవితా సంకలనం 'రాత్రి'. రాత్రిని సంకేతంగా తీసుకొని సమాజికస్థితిగతులకు, ముఖ్యంగా నగరజీవితానికి అద్దంపట్టే ప్రయత్నం ఈ సంకలనంలో జరిగింది తరువాత అనేకకవితోద్యమాలలో చేరిన వరవర రావు, యాదవరెడ్డి, కేశవరావు, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు మొదలైనవాళ్ల కవితలు ఇందులో ఉన్నాయి. అయితే సమాజంలోస్థితిని విశ్లేషణమే ఈ సంకలనం సాధించింది అలాంటి సమాజం విషయంలో నిరసననూ, దానితోపాటు వ్యవస్థపైన నిజమైన తిరుగుబాటును ప్రేరేపించి తెలుగుసాహిత్యరంగలో స్తబ్ధతను పూర్తిగా చీల్చడంతోపాటు సంచలనాన్ని కలిగించి, ఒక్కసారి తెలుగు వాణ్ణి వీపుతట్టుకొనేట్టుచేసి, తననుగురించి తాను ఏ అరమరికలూ లేకుండా ఆలోచించుకోనేట్టు చేయటమేకాదు,కవితారంగంవైపు మళ్లీ జనదృష్టిని మళ్లించి 1955కు ముందులాగా అసంఖ్యాక జనం కవిసమ్మేళనాల్లో పాల్గొనేట్టు చేసింది, చాలామందిని మళ్లీ కవితారంగంవైపు మళ్లించింది దిగంబరకవులు.

ప్రపంచంలో అనేకదేశాల్లో పెట్టుబడిదారీసమాజం కారణంగా తలెత్తిన అనేక సామాజిక, వ్యక్తిగతమైన సమస్యల్ని, మానసిక సంక్షోభాన్నీ ప్రతిబింబిస్తూ, తాము నివసిస్తున్న సమాజంలోని తప్పుడు విలువల్ని నిరసిస్తూ సాహిత్యరంగంలో తిరుగుబాటును లేవనెత్తిన అనేక సాహిత్యోద్యమాలు కనిపిస్తాయి. 1952-58 సంవత్సరంలో అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కో స్టేట్‌కాలేజీలో 'పోయెట్రీసర్కిల్' లోని కొందరు యువకవులు బీట్నిక్స్‌కవులు ( Beat generation) గా ఉద్యమాన్ని ప్రారంభించారు. దానికి నాయకుడైన ఎలెన్ గిన్స్‌బర్గ్ రాసిచదివిన Howl అనే గీతం అమెరికాసాహిత్యంలో గొప్పసంచలనాన్ని లేవదీసింది. జాక్‌కెరువాన్ మొదలైన నవలా రచయితలు ఇందులో సభ్యులు.వీళ్ళరచనల్లో నూతన వ్యవస్థకోసం మార్గంచూపడంకంటే వాళ్లమానసిక విశృంఖలజీవితం, గంజాయిసేవనం, అరాచక విధానాలు చోటు చేసుకున్నాయి. దృశ్యజగత్తును అవాస్తవికంగా తిరస్కరిస్తూ, అవాస్తవికమైన అదృశ్య

ప్రపంచంలో వాస్తవాన్ని సందర్శించే నిరర్థక అన్వేషణ వారిలో కనిపిస్తుంది. భవిష్యత్తుపైన ఆశకంటే నిరాశే వీరిలో ప్రధానంగా చోటు చేసుకుం దని చెప్తూ గిన్స్‌బర్గ్ ద్వంద్వజీవితాన్ని కొంతమంది అమెరికన్ రచయితలు విమర్శించారు. ద్వితీయ ప్రపంచ మహాయుద్ధంతర్వాత నిరుద్యోగం, క్షీణించిన ఆర్థికస్థితిగతులు, జీవితపు విలువలకారణంగా నిరాశా, నిస్పృహలకు లోనైన సమాజానికి ప్రతిబింబమే 1950లో నవలారచయిత జార్జ్ ఆర్వెల్ నాయకత్వాన బ్రిటన్‌లో బయలుదేరిన కోపోద్రిక్త యువకులు (Angry youngmen). అయితే వీళ్ల కూడా నిరాశా, నిస్పృహలకు క్రోధావేశాన్ని వెలిబుచ్చినట్లుగా తాము ఆశించే సమాజాన్ని సృష్టీకరించలేదు అందుకే Rebels without cause అనే పేరు వీళ్లకు వచ్చింది. అమెరికాలో వచ్చిన గ్రేజనరేషన్ (Gray generation) కవులు, హంగరీలో గాయపడిన యువకులు, హాలెండ్‌లో, 'ప్రోవో' ఉద్యమం ఈ కోవకు చెందినవే. ఈ కోవలోనే మనదేశంలో ప్రారంభమైన సాహిత్యతిరుగుబాటు బెంగాల్‌లోని ఆకలి తరం (Hungry generation) కవులు, నిరుద్యోగం, నాయకుల శుష్కవాగ్దానాలు, సాహిత్యంలో వ్యాపారమన స్తత్వం, సాంప్రదాయిక నియమాలు, వందిమాగధులమ తలదన్ని పదవుల్లో ఉన్నవారిచుట్టూ అవకాశాల కోసం తిరిగే కవులు, పైపై మెరుగుల నీతులు, రాజకీయాలు, సాహిత్యదర్పాలు, వీటికి వ్యతిరేకంగా, నిరసనగా కలకత్తాలో ఎలెన్‌గిన్స్‌బర్గ్ ప్రేరణతో 1958లో బయలుదేరిన 24-28 మధ్యవయస్కులైన కవులు ఆకలితరం కవులు. మలయ్ రామచౌదరి, ఉత్పల్‌కుమార్‌బసు, సమీర్‌రాయ్‌చౌదరీ, మొదలైనకవులు ఈ తరంలో ఉన్నారు. అశ్లీలసాహిత్యాన్ని సృష్టిస్తున్నారనే కారణంగా ఈ కవులు అరెస్టుఅయ్యారు. నిరసనగా రోడ్డుకు అడ్డంగా పడుకోవడం, శ్మశానపేటికలను, తమ జెండాలను ఎగురువేయటం వీరు చేసినపనులు. సాహిత్యసృష్టికంటే తమ కార్యకలాపాలవల్ల ఎక్కువగా చర్చాపాత్రులయ్యారు వీళ్లు. ఈ కోవలోనే అయినా స్వతంత్రమైనమార్గంలో తెలుగుసాహిత్యంలో తిరుగుబాటు చేసినయువతరంకవులు 'దిగంబరకవులు' నిఖిలేశ్వర్, నగ్నముని, జ్వాలాముఖి, భైరవయ్య, చెరబండరాజు, మహాస్వప్న.

అయితే 'దిగంబరకవులు' అటు పాశ్చాత్యదేశాల్లో వచ్చిన సాహిత్యోద్యమాలకుగాని, ఆ ప్రేరణతో వచ్చిన 'ఆకలితరం' కవులకుగాని ప్రతిరూపాలు మాత్రమేనా ? కాదు. నాకు తెలిసినంతవరకు దిగంబరకవులలో ఏ ఒకరిద్దరికోగాని ఈ ఉద్యమాలనుగురించి అంతగా తెలియదుకూడా. ఈ ఒకరిద్దరికీ ఉండే పరిచయమే తెలుగు సాహిత్యంలో ఈ ఉద్యమప్రారంభానికి ప్రేరణ కలిగించిఉండవచ్చు. కాని, స్వరూపంలో, ప్రయోజనంలో, సార్థకతలో ఆ ఉద్యమాలకూ, దిగంబర కవితోద్యమానికి చాలాభేదం ఉంది. బీట్నిక్స్ లాగా మారుజువానా మత్తులో దిగజారి పోవటం, స్వేచ్ఛాశృంగారం లాంటివి దిగంబరకవులకు లేవు. ఒక సభలో గిన్స్బర్గ్ని 'You are speaking nakedness, but what is nakedness ?' అని ఎవరో అడిగారట, దానికి సమాధానంగా గిన్స్బర్గ్ బట్టలు విప్పేసి 'This is nakedness' అన్నాడట. అలాంటి వికృతవేషాలు దిగంబరకవు లెప్పుడూ వేయలేదు. దిగంబరత్వం అంటే మానసిక దిగంబరత్వంగా పేర్కొంటూ "ఏఆచ్ఛాదనకీ తలవొగ్గని, ఏ భయాలకీ లొంగని నిరంతర సజీవమానవుడికోసం ఎలుగెత్తి పిలుస్తున్నాం' అని కృత్రిమమైన మానసికఆచ్ఛాదనల్ని మాత్రమే వాళ్లు తిరస్కరిస్తున్నారు. బ్రిటన్లో Angry youngmen లాగా నిరాశా, నిస్పృహలకు లోనైనవాళ్లకూడా కాదు వాళ్లు. ప్రస్తుతవ్యవస్థలో ఉండే కుళ్లను తీవ్రంగా నిరసిస్తూనే కొత్తవ్యవస్థకోసం– దాన్ని స్వరూపాన్ని స్పష్టంగా నిర్వచించలేకపోయినా– చేతులు చాచే ఆశావాదులు దిగంబరకవులు. బెంగాలీ ఆకలితరం కవులులాగా వ్యక్తిగత విశుద్ధ జీవనాన్ని ప్రతిబింబిస్తూ రోడ్డు కడ్డంగా పడుకోవటంలాంటి అరాచకవాదులు కారు, జనందృష్టిని ఆకర్షించటానికి రిక్షావాలాతోనో, హోటల్ క్లీనరుతోనో, బిచ్చగత్తెతోనో అర్ధరాత్రి పూట తమపుస్తకాలను ఆవిష్కరింపజేసినా, అవి సామాజికంగా అట్టడుగు వర్గంతో తమకుండే identity ని చూపడం, మంత్రులతో, రాజకీయ నాయకులతో జరిగే గ్రంథావిష్కరణ సభలను హేళన చేయటం, వాటికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటం మొదలైన ప్రత్యేకప్రయోజనాలకోసం

చేసిందిగా కనిపిస్తుంది అన్నిటికంటె ముఖ్యంగా బీట్నిక్స్‌లోగానీ, యాంగ్రీ యంగ్‌మెన్‌లోగానీ ఆకలితరంకవుల్లో గానీ కనిపించే వ్యక్తిగత అరాచక ప్రవర్తన దిగంబరకవులలో కనిపించకపోగా, ఆకవులు అసంతృప్తితో దారీ, తెన్నూ తెలియక ఒకచోట ఆగిపోగా, దిగంబరకవులలో చాలమంది క్రమంగా సైద్ధాంతిక అవగాహనను పుంజుకొని, మార్క్సిస్టు సమాజాన్ని కోరుతూ విప్లవ కవులుగా ప్రత్యేకధ్యేయంతో నేటికి నిత్యసచేతనంగా జీవిస్తున్నారు. ఈ వేగాన్ని అందుకోలేని ఒకరిద్దరుకవులు తెరమరుగైపోయారు

దిగంబరకవులు మే 1965 ఆరవతేదీనాడు అర్ధరాత్రి 12 గంటలకు ఆంధ్రప్రదేశ్ రాజధానీనగరం హైదరాబాదులో తాము దిగంబరకవులుగా ప్రకటించుకొంటూ ఆచ్ఛాదనల్ని చీల్చుకొని కొత్తరక్తాన్ని ఇంజెక్ట్ చేయటానికని తమగుండెల్లోంచి ధైర్యంగా, స్థైర్యంగా దూసుకొచ్చిన కేకల్ని ప్రతిబింబిస్తున్న తమమొదటి కవితా సంపుటాన్ని రిక్షావాలా నాంపల్లి పాండుతో ఆవిష్కరింప జేశారు. రెండవసంపుటాన్ని 1966 డిసెంబరులో ఇంకా భయంభయంగా బానిసత్వంగా దుర్భరంగా హేయంగా ఛండాలంగా వున్న ఆంధ్రదేశం నడిబొడ్డు విజయవాడలో ఒక హోటల్ క్లీనర్ ఆవిష్కరించాడు. అవిద్యను అజ్ఞానాన్ని అశక్తతను ఆసరాగా తీసుకొని దేశాన్ని దోచుకొని తినటం మరిగిన పాలకులు సంఘంలోని పైవర్గాలవాళ్ళు నేడు ప్రజలపైన రుద్దుతున్న, కుష్ఠువ్యవస్థను ఎదుర్కొంటూ దిగంబరకవులు పలికిన 'దిక్' ల సంపుటాన్ని 1968 జూన్‌లో విశాఖపట్టణంలో బిచ్చగత్తె యదమనూరి యశోద ఆవిష్కరించింది. అంతవరకు వస్తున్న ఆవిష్కరణ తతంగాలపై దిగంబరకవులు జరిపిన తిరుగుబాటుగా దీన్ని పేర్కొనవచ్చు.

దిగంబరకవులు తమరచనలద్వారా సమాజానికి విద్యుత్చికిత్స (shock treatment) ఇవడంపైన నమ్మకం కలవాళ్లు • కనిపిస్తారు. ఉన్నపరిస్థితుల్లో మనిషి మొద్దుబారిపోయాడని, అతణ్ణి కదపడానికి విద్యుత్చికిత్స ఒకటే మార్గమని తీవ్రమైన పదజాలాన్నీ, తీవ్రమైన అభివ్యక్తిని వాళ్ళు చేపట్టారు. 'దిగంబరకవులు

మొదటి సంపుటంలోని మొదటికవిత 'ఆత్మయోని' సాహిత్యరంగంలో ఉన్న స్తబ్ధతను చీల్చటానికి ప్రయత్నం చేస్తూ నన్నయనుండి వచనకవులదాకా అందరికీ గుడ్‌బై చెప్పి నూతనకవితాసృష్టిని ఆహ్వానిస్తుంది.

'నన్నయను నరేంద్రుడి బొందలోనే
నిద్ర పోనియ్యి
లేపకు
పీక నలిమి గోతిలోకి లాగుతాడు
ప్రబంధాంగనల తొడలు తాడిమొద్దులు
తాకితే కాళ్ల విరగొట్టు
కుచములు ఎవరూ ఎక్కని పర్వతాగ్రములు
తలను డీకొని బద్దలు కొట్టు
పండితవర్యా ! రికార్డులా నోరు తిప్పకు
నవసృష్టిని కాలదన్నకు
భావకవుల నపుంసకుల హావభావాలకు సవాలు
అభ్యుదయకవీ నల్లమందు తిని నిద్రపోయావ్
నయాగరాజంపాతంలా
దూకలేక పోయిన అన్నయ్యా
గుడ్‌బై ! మీ కందరికీ సలామ్ వాలేకుమ్
వచనం లేదు !
కవిత్వం అంతకంటే లేదు !
చప్పబడిన చపాతీ బతుకు
.................................'

రెండవసంపుటంలోని మొదటికవిత 'కాస్మిక్ జాతికోసం' జుగుప్సా వహంగా ఉన్న ఆంధ్రదేశపు సామాజిక పరిస్థితుల్ని జుగుప్సాకరమార్గంలో వర్ణించి ఉన్నవ్యవస్థపైన అసహ్యాన్ని, నిరసననీ కలుగచేస్తుంది.

'కోడిపందాలకీ గొర్రెపందాలకీ
కత్తులు తెగ్గోసుకునే
ఓ ఆంధ్రదేశమా
నీ రోడ్లనీ గొడ్లనీ లారీల్నీ మైకాగనుల్నీ
టెండర్ల కాంట్రాక్టర్లనీ
మాదాకవళం మేధావుల్నీ లంగామార్కు సినిమాలనీ
ఎండల్నీ కల్లుకుండల్నీ
పొగాకుపైకాస్నీ వంటింటి పత్రికల్నీ
ఇళ్ల తగులబెట్టుకొనే సహజీవనాన్ని
బొర్ర పెంచుకు తిరిగే సెంటిమెంట్ల అంట్లవెధవల్నీ
వెలుగుముఖం చూడని వర్తకుల్నీ
ఓహోహో అఖిలాంధ్రదేశమా!
అజ్ఞానాంధ్ర సౌభాగ్య సీమా!
.................................'

మూడవ సంపుటంలోని మొదటికవిత 'వందేమాతరం' భారతదేశం మొత్తంగా ఉన్న ఆర్థిక, సామాజిక పరిస్థితుల్ని అంతర్జాతీయ, జాతీయ రాజకీయాల్ని గొప్పశిల్పంతో విప్పిచెప్తుంది.

'ఓ నా ప్రియమైన మాతృదేశమా
తల్లివి తండ్రివి దైవానివి నీవేనమ్మా
దుండగులతో పక్కమీద కులుకుతున్న శీలం నీది
అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టుపెట్టిన అందం నీది
సంపన్నుల చేతుల్లో మైమరచి నిద్రిస్తున్న యవ్వనం నీది
ఊసినా దుమ్మెత్తిపోసినా చలనం లేని మైకం నీది
కోత కొచ్చిన చేనులో కలుగులు తవ్వుతున్న
ఎలుకల్నీ పందికొక్కుల్నీ భరిస్తూ నుంచున్న 'భారతి' వమ్మా

నోటి కందని సస్యశ్యామలసీమవమ్మా
వందేమాతరం వందేమాతరం
ఒంటిమీది గుడ్డలతో జండాలు కట్టించి
వివస్త్రవై ఊరేగుతున్న ధైర్యం నీది
అప్పు తెచ్చి లేపిన మిద్దెల్లో
కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్న దీనత్వం నీది
ఎండిన స్తనాలమీదికి ఎగబడ్డ బిడ్డల్ని
ఓదార్చలేని శోకం నీది
ఆకలితో ఎండి మాడి ఎరువుసొమ్ములతో వీధినబడ్డ సింగారం నీది
అమ్మా భారతీ సిగమ్మం ఏమిటి తల్లీ
వందేమాతరం వందేమాతరం'

ఇలాంటి వ్యవస్థపైన తిరుగుపాటు తప్పదని కూడా మూడవసంపుటం లోని అనేకఖండికలు చెప్పాయి.

దిగంబరకవులు సాధించిన తిరుగుబాటు ప్రధానంగా నాలుగు రకాలుగా కనిపిస్తుంది.

1. సామాజికంగా దుర్భరమైన జీవనపరిస్థితులపైన తీవ్రమైన అసహ్యం, జనం చూపుతున్న సహనశక్తిపైన విపరీతమైన ఏహ్యభావం, సంప్రదాయంమీద ధ్వజం - క్షీణిస్తున్న విలువలపైన, సమకాలీన సామాజికవ్యవస్థపైన తిరుగుబాటును ప్రేరేపించటం

2. సాహిత్యపరంగా అనిర్దిష్టంగా, అస్పష్టంగా, అయోమయంగా అంతవరకూ వచనకవితలో కనిపిస్తున్న అభివ్యక్తీకరణ పద్ధతులపైన, మార్మికతపైన తిరుగుబాటుగా చెప్పదలచినదాన్ని సూటిగా గుండెల్లో గుచ్చుకొనేశైలిలో చెప్పగలగటం.

3 భాషావిషయకంగా అంతవరకూ సాహిత్యంలో నిషిద్ధం అనుకుంటున్న పదజాలాన్ని, బూతుపదాల్ని భావతీవ్రతకు, హేయంగా, జుగుప్సావహంగా

ఉన్న సామాజికపరిస్థితుల్ని చిత్రీకరించటానికి సాధనంగా సమర్థవంతంగా వాడటం - అంతకుముందు ప్రయోగవాదులు చేసిన కేవలభాషా చమత్కారాల పైన, ఆంగ్లపదాలను మితిమీరి వాడటంపైనా తిరుగుబాటు.

4. అంతవరకు మధ్యతరగతి విద్యావంతులకుమాత్రమే పరిమితమైన వచనకవితను ఆవేశపూరితంగా చదవేపద్ధతిలోని తీవ్రతద్వారా జనసామాన్యం దగ్గరకు తీసుకొనివెళ్లటం. వందలు, వేలు జనం కవితను వినటానికి, ఉపన్యాసాలు వినటానికి రావటం దిగంబరకవులు సాధించినవిజయాలు.

అయితే దిగంబరకవులలో బలహీనపక్షం అంటూ అసలేమీ లేదా ? అనే ప్రశ్న వస్తుంది. అశ్లీలపదాల్ని అవసరాన్నీ, ప్రయోజనాన్ని అతిక్రమించి వాడటం, ముఖ్యంగా స్త్రీలను అవమానపరిచే పద్ధతిలో లైంగిక ప్రతీకల్ని వాడడం- మరీ ముఖ్యంగా మూడవసంపుటంలో-వీళ్లలో కనిపించే ప్రధాన బలహీనపక్షం. అయితే కేవలం దీన్ని ఆధారంగా చేసుకొని దిగంబరకవులలో కవితే లేదనటం పక్షపాతదృష్టి అవుతుంది. తాము నిరసిస్తున్న, తిరుగుబాటుచేసి మార్చదలచుకున్న వ్యవస్థస్థానంలో రావలసిన వ్యవస్థను గురించిన స్పష్టమైన అవగాహన లేకపోవటం రెండో లోపం. రెండవ సంపుటంలో దిగంబరకవులు మానిఫెస్టోగా చెప్పదగిన పీఠికలో "ఈ భూగోళంపై దారిద్ర్యం, ఆకలి అలుముకుని ఉన్నంత వరకు మార్క్సిస్టు దృక్పథాన్ని సవాలుచేసే అధికారం ఎవరికీ లేదు" అంటూనే మరోవైపు "...నియమాల నిరంకుశత్వంలో సిద్ధాంత వక్రభాష్యంతో మనిషిని కీలుబొమ్మగా, యంత్రపు విడిభాగంగా తయారుచేసే నియంతృత్వాన్నికి అది మార్గం కారాదు" అని అస్తిత్వ వాదంతో ముడిపెట్టడం వారి అవగాహనా లోపాన్ని చెప్తుంది. ఋతువులనీ, వారాలనీ, శకాలనీ వాళ్లుచేసిన చమత్కారాలు కూడా వారి ధ్యేయాలకు ఏవిధంగానూ దోహదకారులు కావు. ఇక సమాజంలోని కుళ్లను అతిశయోక్తిగా చెప్పటం లోపం అనటంకన్నా ఒక ప్రయోజనాన్ని ఆశించే ఆపనిని వారు చేశారని చెప్పవచ్చు.

ఎన్నిలోపాలున్నా దిగంబరకవుల నిజాయితీని మనం శంకించలేం. వాళ్లల్లో ప్రతిభావంతులైన కవులున్నారు. ఏ మాత్రం సమాధానపడినా మంచిపదవులు, అవకాశాలు కలవాళ్లున్నారు వాళ్లు చేసిన పన్నుల్ని పబ్లిసిటీ స్టంటుగా, కీర్తి కోసం అడ్డదారిగా కొట్టిపారేయటానికి వీల్లేదు. దానివల్ల వాళ్లు వ్యక్తిగతంగా సాధించగలిగిందేమీ లేదు. మూడుసంపుటాల తరువాత కేవలం ఉన్నస్థితిని నిరసిస్తూ కూర్చున్నందువల్ల లాభంలేదని, ధ్యేయం లేని నిరసనకవిత్వం నిలవదనీ తెల్సుకున్నప్పుడు తమ అస్తిత్వాన్ని వదిలేసి విప్లవకవులలో భాగమై మార్క్సిస్టు సమాజాన్ని ధ్యేయంగా ఉద్యమాన్ని కొనసాగించటం వారి నిజాయితీని తెలుపుతుంది.

ఒక సామూహికోద్యమంగా కాకపోయినా వ్యక్తిగా నిలబడి సమకాలీన సమాజంపైన తిరుగుబాటుచేసిన వాళ్లలో ముఖ్యంగా సి. విజయలక్ష్మిని పేర్కొనాలి. 'విషాదభారతం', 'సుందరి-సుబ్బారావు' మొదలైన రచనలు "లక్షోపలక్షల రూపాలుగా విస్తరిల్లిన, అవినీతి బంధుప్రీతి ఆశ్రితపక్షపాతం లంచగొండితనం రాండాగొండితనం నిరంకుశత్వం శిరస్సులతో పస్తులు, సమ్మెలు, సత్యాగ్రహాలు మహోగ్రవుద్యమాలు, కోటానుకోట్లు అష్టదరిద్రుల ఆకలిమంటల హాహాకారాల్ని. ఘాతుకంగా, పరమకిరాతకంగా, కాలరాస్తున్న శతసహస్ర పాదాలపైన తిరుగుబాటు ప్రకటించాడు సి. విజయలక్ష్మి.

1970 జనవరిలో విశాఖపట్టణంలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా విశాఖ విద్యార్థులు 'రచయితలకు సవాల్' పేరుతో రచయితలలోని స్తబ్ధతను, తాటస్థ్యాన్ని, సమాధానపడటాన్ని ప్రశ్నిస్తూ పంచిన కరపత్రంతరువాత రాజకీయ విప్లవసాధనధ్యేయంగా 1970 పూర్వార్థంలో వరంగల్ కేంద్రంగా పదిమంది యువకవులు వరవరరావు, లోచన్, అశోక్, సంజీవరావు, సుధాకర్, యాదగిరి రావు, కిషన్, సుదర్శన్, ఎక్స్‌రే,ఐ- అనేవాళ్లు నూతన వ్యవస్థకోసం, విప్లవ సాధనకోసం 'తిరుగపడదాం' అని యువకులకు పిలుపునిస్తూ 'తిరుగబడు కవులు'గా బయలుదేరారు. దిగంబరకవులలోఉన్న నిశితమైనశైలి, భాషాతీవ్రత,

కవితాగుణం వారి కవిత్వానికి లేకపోయినా, దిగంబరకవులలాగా వారు వచన కవిత్వాన్ని ప్రజల దగ్గరకు తీసుకొని వెళ్ళలేకపోయినా, దిగంబరకవులకులేని లక్ష్యశుద్ధి వీళ్ళకు కనిపిస్తుంది. "...విషం కలిసిన పాయసం మనస్వరాజ్యం. డబ్బున్న ఖడవా పోషించే ఉంపుడుకత్తె మన ప్రజాస్వామ్యం.... శాంతియుత పోరాటం అసంభవం...ఇది ప్రజాస్వామ్యం కాదు మన విద్యావిధానం ఒక పెద్ద కుట్ర-తిరుగుబాటుతత్వాన్ని రాజధోరణిలోకి మార్చటానికి తొలగిపోని ఆర్థిక అసమానతలు...వీనికి మూలం పెట్టుబడిదారీ విధానంలోనే ఉన్నవి...ఈ నిజాన్ని పీడితతాడితులకు తెలిపి వారిని గాఢనిద్ర నుంచి మేల్కొల్పి చైతన్య వంతులుగా చేయటం అభ్యుదయవాదుల కర్తవ్యం" అంటూన్న 'తిరుగబడు కవుల'లో ప్రస్తుత వ్యవస్థతో రాజీలేని పోరాటానికి పిలుపూ, సమకాలీన సమాజంపై విమర్శలు, ప్రజలకు మందలింపులు, రాజకీయ సిద్ధాంత ప్రచారం స్పష్టంగా కనిపిస్తాయి. 'సహనం గాడిద లక్షణం' అని జనంలో కనిపించే 'సహనం' విషయంలో అసహనాన్ని ప్రకటించారు వీళ్ళు. ఈ సమాజంలో కుళ్ళును కడగటానికి 'శస్త్రచికిత్స' తప్ప వేరే మార్గం లేదని వీళ్లు భావిస్తారు. 1970 జూలైలో తిరుగబడుకవులు దిగంబరకవులతో కలిసి విప్లవ రచయితల సంఘ స్థాపనకు కారణం అయ్యారు.

దిగంబరకవుల కున్న తీవ్రమైనశైలీ, అభివ్యక్తీ, అవగాహనా లేకపోయినా, 'తిరుగబడుకవుల' కున్న నిర్దిష్టమైనలక్ష్యం లేకపోయినా, ప్రపంచసమస్యల కీకారణ్యపు ఘోరనిబిడనిశీధిని చీలుస్తామంటూ స్తబ్ధతనుపోగొట్టే మరొక ప్రయత్నంలో 1970 జూలైలో విజయవాడనుంచి బయలుదేరిన కవులే 'పైగంబర కవులు' సుగమ్‌బాబు, దేవీప్రియ, కిరణ్‌బాబు, కమలాకాంత్, ఓల్గా - అనే అయిదుగురుకవులు తమకవిత్వం 'సమస్యలకీకారణ్యంలో మానవతారథంపథం చూపించే. టార్చిలైటుగా తమది ప్రధానంగా మానవతావాదంగా చెప్పుకుంటూ "...... సమస్యల పరిష్కారానికి మానవత, సమరసభావం ఎంత అవసరమో- కొన్ని వేళల్లో కరకుకత్తిలా వ్యవహరించటంకూడా అంతే అవసరం అని నమ్మిన

వాళ్ళం-" అని అవసరమైతే తిరుగుబాటు తప్పదంటారు. వీరు చెప్పకపోయినా 'దిగంబరకవులు' వీరికి ప్రేరణకావచ్చు. అదేసందర్భంలో వీరుస్పష్టంగా, పేర్కొనకపోయినా 'ఏడ్వర్స్' పొయెట్స్‌గా పేర్కొన్నది దిగంబరకవుల్ని గురించే అని చెప్పటానికి అవకాశాలున్నాయి.

'అన్నా! ఇంకా యెందుకీ మురికికూపాన్ని కదిలిస్తావ్
ప్రపంచాన్నెప్పట్నించో
కుష్టు పెనవేసుకొని పీడిస్తోంది
మళ్ళీమళ్ళీ యెందుకు దాని పేరెత్తి రోతపుట్టిస్తావ్
ఔను కదూ....
సమాజం మురికిగుంటై పోయిందని కదూ నీబాధ?
చేతగానితనం, అన్యాయం
మనిషిని లోబర్చు కొన్నాయనేగా నీ ఆవేదన
అయితే సామాన్యుడిగుండెలమీద కురుస్తున్న
ఈముళ్ళవాన నాపటానికి
ముళ్లగుచ్చుకొంటున్నా మొద్దుల్లా
మత్తుగా పడివున్న సుషుప్తాత్మలను నిద్ర లేపటానికి
ఉపక్రమిద్దాం నాతో రా!
రోగగ్రస్తమైందని బాధపడి ప్రయోజన మేమిటి?
అది కుదిరే మార్గం వెతకాలికాని
అదిగో మానవతా క్షీరసాగరం!
అంటూ
ఇంకా ఈ మురికి గుంటను కెలుకుతూ
కాలం వృధా చేయకు
ఇంకా ఈ కుష్టును వర్ణిస్తూ
జుగుప్సను రేకెత్తించకు
అన్నా! పద పోదాం
మానవతా సుభిక్ష లోకానికి
కొత్తదారులు వేద్దాం.'

అంటూ దిగంబర కవుల్నే కాబోయి సంబోధిస్తూ మానవతాపథం వైపు పయనించ మంటున్నారు. ఓల్గాలాంటి పైగంబర కవులు కొందరు విప్లవ కవులతో, జనసాహితిలాంటి విప్లవ సాంస్కృతిక సాహిత్య సంస్థలలో కలిసిపోయారు.

శుద్ధ మానవతావాదం సామాన్యుడి సమస్యల్ని మార్చలేవని, ఉన్న వ్యవస్థనుంచి మరొక వ్యవస్థ పునర్నిర్మించ బడాలంటే హింస మంత్రసాని కావాలని, సమాజానికి పుట్టిన రాచపుండుకు 'ఆపరేషన్' తప్పదని తిరుగుబాటు కొనసాగింపు విప్లవమార్గమే నని నమ్మి సమకాలంలో జరుగుతున్న సాయుధ పోరాట ప్రభావంతో కవితాసంకలనా లనేకం వచ్చాయి. పేర్లు లేకుండా విప్లవ కవులుగా వరంగల్‌నుంచి పి. కిషన్‌రావు ప్రచురించిన 'ప్రజలను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేటి కవి' అనే నినాదంతో వచ్చిన 'మార్చ్' అనే సంకలనం విప్లవ రచయితల సంఘం స్థాపన సందర్భంగా 1970 జులైలో వచ్చింది. 1970 అక్టోబరులో ఖమ్మంలో విప్లవ రచయితల ప్రథమ మహాసభల సందర్భంగా కె. వి. రమణారెడ్డి సంపాదకత్వంలో 'ఝంఝ' అనే కవితా సంకలనం వెలువడింది. శ్రీ శ్రీ మొదలైన విప్లవ రచయితల రచనలు ఇందులో ఉన్నాయి. 1971 మార్చిలో తిరుపతిలోని విప్లవ సాహితి ప్రకటించిన 'లే' అనే కవితా సంకలనం వెలువడింది. నా విషయం తిరుగుబాటు ధోరణులకే పరిమితంకాబట్టి ఆ కవితా సంకలనాల సాహిత్యచర్చ, విషయచర్చ నేనిక్కడ చేయబోవటంలేదు. తెలుగు సాహిత్యంలోని తిరుగుబాటు ధోరణులు విప్లవమార్గం వైపు ఎట్లా పయనించాయో చెప్పటానికి మాత్రమే వీటిని పేర్కొన్నాను. పైవికాక విప్లవ రచయితల వ్యక్తిగత సంకలనా లనేకం వచ్చాయి. పైన చెప్పిన మూడు సంకల నాల్ని ప్రభుత్వం నిషేధించింది.

తెలుగు సాహిత్యంలో వచ్చిన తిరుగుబాటులో, సమకాలీన సాహిత్య రంగంలోని స్థితిగతుల్ని నిరసించటంలో 'కరపత్రాల' పాత్ర కూడా ఎంతో ఉంది. 1968 జనవరిలో సాహిత్య అకాడమి వార్షికోత్సవాల సందర్భంగా 24-12-1967నాడు హైద్రాబాదులో జరిగిన అఖిలభారత బెంగాలీ రచయితల

మహాప్రస్థానంలో జరిగిన తనసన్మానానికి సమాధానం ఇస్తూ విశ్వనాథ సత్యనారాయణ కందుకూరి వీరేశలింగంపంతులుగారిని సాహిత్యవేత్తగా అంగీకరించడానికి నిరాకరిస్తూ మాట్లాడటాన్నీ, ఇతరవిషయాల్ని నిరసిస్తూ దిగంబర కవులు పంచిపెట్టిన కరపత్రం 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి శవపరీక్ష' లో తీవ్రమైన అభివ్యక్తి, పదజాలం, పదును తర్వాత వచ్చిన కరపత్రాలకు మార్గదర్శకం అయింది. నిజానికి దిగంబరకవులు ఈనాటికి తరానికి అందించిన కానుక భాషాప్రయోగ నిషేధాల్ని అధిగమించిన పదునైనమార్గం. 1970ఫిబ్రవరిలో విశాఖపట్టణంలో శ్రీశ్రీషష్టిపూర్తి సందర్భంగా విద్యార్థులు పంచిన రచయితలకు సవాల్; 1970జులైలో హైదాబాదులో సెవెన్ స్టార్‌సిండికేట్ నిర్వహించిన అభ్యుదయ రచయితల సదస్సు సందర్భంగా దాన్ని బహిష్కరిస్తూ కొందరు కవులు పంచిన 'ఈ పగటివేషగాళ్ళ రంకు రాజకీయాల సినీకంపు సాహిత్య సంతను మేం బహిష్కరిస్తున్నాం' ; 1971లో కొందరు విప్లవ రచయితలు అరెస్టయినప్పుడు వచ్చిన, రచయితల స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్ని అరికట్టే ప్రభుత్వ దమననీతిని ఖండించండి'; జ్ఞానపీఠ్ అవార్డ్‌వచ్చిన సందర్భంగా విద్యార్థులు పంచిన 'రోమ్‌నగరం తగలబడుతుంటే నీరోచక్రవర్తి ఫిడేలువాయించాడు'; విశాఖవిద్యార్థులే నేటిరచయిత్రులనవలల్లోని వెనుకబడినతనాన్ని నిరసిస్తూ పంచిన 'ఆంధ్రరచయిత్రీ కళ్లుతెరువు'; నేటిసాహిత్య ప్రతికలస్థాయికి నిరసనగా వచ్చిన ఆబల మొదలైనవి సాహిత్యరంగంలో దుమారంలేపిన కరపత్రాలు. ఈ కరపత్రాలన్నీ తెలుగుసాహిత్యంలో మంచిసాహితీ ఖండికలుగా చెప్పుకోదగ్గవి.

1955లో అభ్యుదయ రచయితలతోపాటు చాలామంది రచయితలు ప్రజాస్వామ్యపక్షాలపైన విశ్వాసాన్ని ప్రకటిస్తూ ప్రకటనలు చేసింతర్వాత సాహిత్యోద్యమాల తీవ్రత తగ్గి స్తబ్ధత ఆవరించిఉండగా సమాజంలో ఉన్న అసంతృప్తినీ, అగమ్యగోచర పరిస్థితినీ పసిగట్టిదాన్ని ప్రతిబింబిస్తూ సాహిత్య రంగంలో రూపం భాష, అభివ్యక్తి, వస్తువు అన్ని విషయాల్లో, తిరుగుబాటు చేసి మళ్లీ సాహిత్యరంగంలో సంచలనం కలుగజేసిన వాళ్లు దిగంబరకవులే. సాధారణంగా

ఏతిరుగుబాటు ఉద్యమాన్నీ సంప్రదాయవాదులు అర్థంచేసుకోలేరు. అది సహజం. కాని ఒకప్పుడు విప్లవోద్యమాలతో ప్రభావితులైన కవులుకూడా వీళ్ళను సహించలేదు. వీరికిఉద్దేశాల్ని అంటగట్టారు. ప్రశాంతంగా సురక్షితమైన పరిస్థితులలో బ్రతుకుతెరువు గడుపుకుంటున్న సందర్భంలో వాళ్ళకు ఇలాంటివి చికాకు కలిగించటం సహజమేగాని ఈ ఉద్యమాలను కేవలం పబ్లిసిటీస్టంటుగా, ప్రచారం కోసం, కీర్తికోసం అడ్డదారిగా భావించి, కవులుగా వాళ్ళను నిరాకరించటం, వాళ్ళల్లోని Positive aspects ని గుర్తించకపోవటం సరియైందికాదేమో? పరిపక్వత కలిగినవాళ్లుగా వాళ్ళకి, సాహిత్యరంగంలో ఇతర పెద్దలకి నవతరం అభిప్రాయాలతో, విధానాలతో ఏకీభావం లేకపోయినా కనీసం వాళ్లుచెప్పేదాన్ని సానుభూతితో అర్థంచేసుకోవలసి ఉంది.

నేటితెలుగు కవితారంగంలో తిరుగుబాటుధోరణులకు ఆద్యులుగా దిగంబర కవుల స్థానాన్ని ఈవరకే పేర్కొనటం జరిగింది. వారితర్వాత తెలుగులో వచ్చిన సామూహిక కవులపైన ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారి ప్రభావం తప్పని సరిగా కనిపిస్తుంది. సామూహికకవులుగ రావటానికికూడా వాళ్లేప్రేరణనిచ్చారని చెప్పాలి. అంతకుముందు లబ్ధప్రతిష్ఠులైన కవులుగూడా 'నేనూ దిగంబరకవినే' అని స్వాగతంచెప్పటంవరకూ వెళ్లారంటే వారు కలిగించిన సంచలనంగురించి వేరే చెప్పనవసరంలేదు. ఆంధ్రదేశంలోనే కాదు అఖిలభారత సాహిత్యరంగంలోను దిగంబరకవులు సంచలనం కలిగించారు. వారికవిత్వం ఇంగ్లీషుతోపాటు ఇతర భారతీయ భాషలలోకికూడా అనువాదం అయ్యాయి. తమిళంలో 'వానంబడి కవులు' తమపైన దిగంబరకవుల ప్రభావం ఉందని స్పష్టంగా చెప్పుకున్నారు. దిగంబరకవులను కన్నడంలోకి అనువాదంమాత్రమే చేసి దిగంబరకవిగా పేరుతెచ్చుకున్నాడు. ఇది ఈ రోజుకీ తెలుగుకవిత నిత్యసచేతనంగా నూతన స్ఫూర్తితో ముందుకు సాగుతున దనటానికి నిదర్శనం.



# ప్రజాకవిత - పాట

శ్రీ ఎల్లోరా

కావ్య పరమార్థాన్ని గురించి లాక్షణికులు ఎన్నెన్నో లక్షణాలను, లక్ష్యాలను చెప్పి, చెప్పి ఆనాటి సంఘ మర్యాదలకూ, సామాజిక వాతావరణానికీ తగినట్లు కొన్ని నిర్దేశిక సూత్రాలను ప్రవచించి పెట్టారు.

అసలు కావ్యాత్మను సామాజిక దృష్టి నుంచీ, దృక్పథం నుంచీ పరిశీలించి నప్పుడు అంతమంది ప్రాచీన ఆలంకారికులు ఒకరితో ఒకరు ఏకీభవించకుండా ఒక్కొక్కరూ తలొక్క రీతిగా సాహితీ ధర్మాన్నీ, కవితార్థసారాన్నీ వివ రించడం ఏమిటీ అని ?

అప్పుడూ ఖండన మండనలు లేకపోలేదు. లక్షణాలను ధిక్కరించి, లక్ష్యాలనే ప్రబోధించడానికి వారికి తోచిన అనుకూలమూ, సానుకూలమూ, అయిన ఛందస్సూత్రాలతో అక్షరాలకు చెవిపోగులూ కుట్టించారు — రుద్రాక్ష తావళాలూ అల్లించారు.

అప్పుడూ ప్రాచీన కవులలో ఏకీభావం లేదు సరికదా- ఒకరి ఆశయాన్ని మరొకరు ఎద్దేవే చేయడం పుణికిపుచ్చుకున్నట్లుగా ఆలనాటి ప్రబంధ సుందరీ అలంకరణాల నుంచి మొన్నటి పలనాటి వీరుల చరిత్రదాకా ఎన్ని మార్గాలు, ఎన్ని పాయలు, ఎన్నెన్ని విమర్శలు ?

అంటే— నాడూ ఉన్నదే సాహిత్య ప్రయోజనం ఏమిటి ? సాహిత్య పరమార్థం ఏమిటీ అనే ప్రశ్న !

ఆలా అలా మారుతూ, పారుతూ అవహించిన సాహితీసాగరంలో ఎన్నెన్ని విశేషాలో ప్రాచీన భారతీయ సాహితీచరిత్రలో మనం చూశాం.

సాహిత్యం పరిణామశీలి! అన్నది నిజం.

నాటి కవులూ ఘంటాన రచియించి, కంఠాన పలికించి- అప్పటి సాహితీ సందనంలో కవిత కోయిలలచేత కుహూ కుహూ రాగాలు పలికించారు. రంగు రంగుల పుష్పకదంబాలనూ విరబూయించారు.

మారేది కాలం కనుక- మారుతూ వచ్చింది కాలం !

సాహిత్యం పరిణామశీలమైనది కనుక క్రమానుగతవికసనంతో ఆటుపోటులను తట్టుకొంటూ, నేటి సామాజిక వాతావరణానికి, రాజకీయ పరిస్థితులకూ నవతరపు ఆశల ఉచ్ఛ్వాసనిశ్వాసాలకూ తగినట్లుగా కవితారూపం, సాహిత్యాలోకనం- పరిథవిల్లుతూ వచ్చింది.

గతంలో ఏది రాసినా చూడని ఒక మూఢనమ్మకాన్ని కావ్యవస్తువుగా చేసి—నమ్మించడానికి అప్పటి ఆధ్యాత్మిక సమాజం ప్రయత్నించిం దనిపిస్తుంది. ఎందుకయ్యా అంటే—ఇప్పటికీ అసత్య్వస్తంగా నమ్మలేని నిజాలుగా, అభూత కల్పనా కథాకావ్యాలుగా దేశంమీద, జాతిమీద, సమాజంమీద బలమైన ప్రభావతాముద్రను వేసిన అనేక పురాణాలూ, చరిత్రలూ ఖండనమండనలతో నవతరానికి రోతపుట్టిస్తూన్నాయనడానికి ఇటీవలి కాలంలో, భారతం అసలు జరిగిందా ? రామాయణం నిజమేనా ? అన్న చర్చ మేధావివర్గంలో అపూర్వ సంచలనాన్ని కలిగించి, ఆగ్రంథాల ఉనికినే రచ్చకీడ్చి, బండవేసి, దండోరా వేయించిన దుమారం మరచిపోలేం కదా ?

ఏతావాతా- ఎందుకు చెప్పొచ్చానంటే-మారిన, మారుతున్న సామాజిక పరిస్థితులను, రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిణామాలతో అవగాహన చేసుకొన్నప్పుడు—

సాహిత్యపరమార్థం-అభూత కల్పనా చాతుర్యంతో కూడిన విన్యాసం, కానక్కరలేదని, చచ్చాక జరిగే అస్థిపంజర హరికథాకాలక్షేపం అవసరంలేదని మారినచరిత్ర ఘోషిస్తూ వస్తూనే ఉంది.

గతాన్ని తిట్టడం, నమ్మకాలను దుయ్యబట్టి అసభ్యపదజాలంతో పాతని రోతగా చిత్రించడం అవసరంలేదు. హృదయాలలో భావస్పందనను తీసుకు రావాలి.

వేయి పూవులు వికసించనీ ! వేయి పరిమళాలు పరిమళించనీ !! అదే సాహితీ సందర్శన మూర్తికి ధ్యేయం కావాలి.

నేడు మనం సామాన్యుల భాషలో చెప్పుకునే సూక్తి ముక్తాయింపులూ, భజగోవిందనామ సంస్మరణలూ, చీకటి సిమరనాదాలూ, వెలుగు బావుటాల ఆవిష్కరణలూ జరగక పోలేదు.

అలా కొంతలో కొంత సామాజికదృక్పథంతో సాహిత్య సింహావలోకనం చేస్తూ- వస్తూన్న సంప్రదాయానికి కొంచెం మార్పును సూచిస్తూ, కొత్తను తోడిస్తూ వచ్చారు కనుకనే నేడు మనం సాహిత్యావలోకనంలో వెతుకుతూన్న కొత్తప్రక్రియలు ఎన్నో చూడగలుగుతున్నాం.

నదీప్రవాహంలాంటిది కాలం ; కాలంతో మారేది సాహిత్య పరిణామం.

అదీ ఆధునిక చేతనావిష్కరణానికి స్వాగతం పలికే కొత్త గొంతు అలించే ధర్మం- నిర్మించే బాట- సాగించే ప్రస్థానం.

ఇన్ని జరిగినా సాహిత్యం ఇదీ అని కాని, కవితాత్మకు ఇదితప్ప వేరే ధ్యేయం, దృక్పథం లేదని కాని గిరిగీచి చెప్పినవారు ఎవరు ?

ఎవరు చెప్పింది ఎవరు విన్నారు కనుక ; ఎవ రేసినబాటను మరొకరు నడిచారు కనుక.

అలా నడిచే ఉంటే-నేడు సాహితీలోకంలో ఇన్ని మతాల పతాకాల ఛాయల నీడల్లో, నినాదాల రణగుణధ్వనుల్లో కవితాప్రపంచం వికావికలై ఉండేది కాదేమో ?

ఔనన్నా, కాదన్నా ఇది జరిగిన సత్యం ;

ఆ సమస్తమానం చర్చించుకోడం చర్వితచర్వణం ; లేకుంటే-కావ్యసృష్టికి ఇన్ని రాద్ధాంత సిద్ధాంత చర్చలా ?

సాహిత్య పరమార్థానికి ఇన్ని రకాల గొంతుల అకల వికల మహోకల రణన్నినాదాలా ?

ఏది ఏమైనా నేడు మారుతున్న ప్రపంచ పరిణామ క్రమ వికాసంలో యువతరపు ఆశల ఆశయాల పరవళ్లు చేప్పే సత్యాలు కోకొల్లలు.

చీకటి పోవాలి! ఎవరూ కాదనరు. తమసోమాజ్యోతిర్గమయ అన్నా, చీకటి నుంచి వెలుగుకు అన్నా ప్రపంచ మానవాత్మ ఆశయం ఇదే.

అయితే చిక్కెక్కడ ?

ఈ చిక్కు విడేదెట్లా?

అనేక దేశాలలో పరిస్థితులు మారాయి. సామాజిక శ్రేయస్సే పరమ లక్ష్యంగా ప్రజలూ, ప్రభుత్వాలూ, సాహితీలోకం, మేధావివర్గం వారూ మారారు.

మారాలికదా మరి!

మారం. గతాన్ని వదలం అంటే ఎలా? ఒకనాడు సీసపద్యం రాజ్యం ఏలి ఉండవచ్చు.

కాలప్రభావంవల్ల నేడు అది ఎవరినీ ఆకర్షించనప్పుడు, జనం అర్థంచేసు కొనేదీ, జనం జగం కోరేదీ సమాజానికి అవసరమైనదీ, సమాజ శ్రేయోదాయక మైనదీ ఏదో 'ప్రస్తుతం' గుర్తించాలి.

గుర్తించండి—అనే ప్రజాహృదయం ఘోషిస్తూంది.

గుర్తించం అంటే - ఎదిరించమంటూంది.

అంతేనా యువత జలపాతమై విరుచుకుపడుతూంది!

అలాంటి మార్పును కొత్తని, రేపుని. సమాజాన్ని-అందరికీ కావాలని గొంతెత్తి అడుగుతూన్నవారు ఎందరో.

అందులో ఒకొక్కరిది ఒకొక్కపద్ధతి.

అందరిదీ ఒకే పద్ధతి అయితే ప్రపంచం ఇలా ఉండేదికాదు.

మార్క్సిజం ఒక్కటే-దానికి భాష్యాలూ, భాష్యకారులూ ఎంతమందో౹.

పెట్టుబడిదారీ విధానం నాశనం కావాలనే, సామాన్యుడు అసామాన్యుడు కావాలనీ, సమసమాజం పరిఢవిల్లి నవసమాజంలో అందరికీ సౌఖ్యం అందాలనీ మార్క్సిజం కోరుతుంది.

ఇది నిజంగా అందరూ కోరేదే!

వస్తే, సాధిస్తే మరీ మంచిది.

ఏదీ! రష్యాలో ఒకతరహా మార్క్సిజం, చైనాలో మరో మార్క్సిస్టు అవగాహన, క్యూబాలో మరోపద్ధతి, యుగోస్లావియాలో మార్క్సిస్టు విధాన అనుసరణం వేరు,

భారతదేశంలోనూ ఎన్నిరకాల మార్క్సిస్టువర్గాలు - దానికి ఎన్నెన్ని భాష్యాలు!

ఆయావర్గాల సిద్ధాంతాలను నమ్మి, కమిట్‌మెంటు అన్న నినాదంతోనూ సాహిత్యసృష్టి చేసే వారిలోనూ అన్నివర్గాలూ, మరిన్ని మార్గాలూ, కోలాహలం నినాదాలూ వాద ప్రతివాదాలూ!

అందుకే తెలుగుకవులలోనూ ఎన్నిసంఘాలు, ఎన్నిమార్గాలు, మరెన్ని వర్గాలు, గ్రూపులు - మళ్లీలో పుట్టి పుళ్ళలో మాడిపోవడాలు.

ప్రబంధకవులమీద తిరుగుబాటుగా భావకవులు, వారిమీద దాడిలా అభ్యుదయ కవితోద్యమం. వారిమీద అసంతృప్తితో దిగంబరకవులు, అక్కడినుంచి విప్లవకవులు - వీరేదో మంచో, చెడో చేస్తున్నారన్నట్లుందే అని అనుకొనేలోగా నలుగురూ నాలుగు పక్కలకూ మూటా ముల్లే క రు.

తిరిగి మళ్లీ ఓ ఆశ! ఓ నలుగురిని చేర్చి ఒకటో రెండో సంస్థలు - తీరా చూస్తే కాస్తో, కూస్తో ఒకస్పష్టమైన ప్రణాళిక, ఒకపద్ధతిలో అభ్యుదయ రచయితల సంఘమే నలుగురినీ కూడగట్టుకొని వస్తూన్నట్లుగా అనిపిస్తూంది.

పైన చెప్పినవారేనా - జనసంఘం మైండ్‌గలవారు ప్రాచీన అభ్యుదయ భావ మిశ్రమకవులు, అనుభూతివాదులు, రసవాదులు, ఫ్రీవర్స్ ఫ్రంట్‌లు, కవి సేనలు, అరుణసాహితి, జనసాహితి, సాహితి — వీరూ ఎవరికీ తీసిపోలేదు-

ఎవరికి తోచిన మార్గంలో వారు సాహిత్యసేవ చేస్తున్నారు, ఇందులో మేధావివర్గం, మేతావివర్గం అంటూ ఏముంది?

వారని వీరూ, వీరిని వారూ అదే అంటున్నారు. మధ్యన పాఠకులే తిక మక పడవలసి వస్తూంది.

ఒక మాట నిజం.

తమఆశయం ఇది, తమధ్యేయం ఇది, గమ్యం ఇది అని దాపరికం లేకుండా -పదునుపెట్టిన కత్తిలాగా-హోరెత్తే జలపాతంలాగా చెప్పడంలోఉంది నిజాయితీ.

అందుకే అటువంటి యువతరం సాగించే ప్రస్థానంవైపు సమాజం ఆశతో ఎదురు చూస్తూంది- అలా ఎదురు చూడడంలో ఆశ్చర్యం ఏముంది?

ఇప్పుడు ప్రధానవిషయం ఈ ఇరవై సంవత్సరాలూ ఈ మధ్యకాలంలో ఆధునికాంధ్ర సాహిత్య పరిణామం - అందులో ప్రజాకవిత - ఆ ప్రజాకవితలో -పాట అన్న విషయం.

అందుకని ప్రజాసాహిత్యంలో పాటల పారిజాతాలను గురించిన విష యానికి వద్దాం.

—ప్రజాకవిత, ప్రజాప్రభుత్వం, ప్రజావాణి, ప్రజానాయకుడు-ప్రజా సాహితి-ఇవి ఎక్కువగా వినిపిస్తూంటాయి.

ప్రజాకవిత? అన్నప్పుడు ఏది? అన్నప్రశ్న ఉదయించకమానదు.

కొందరిదృష్టిలో దేశాన్ని, రాష్ట్రాన్ని, ప్రభువుల్నీ పొగడటం ప్రజా కవిత, కొందరు ప్రజా సమస్యలకు సంబంధించి రాసిన విషయమే ప్రజాకవిత.

ప్రజాకవి? ఎవరు? అది ఈ రోజే కాదు ప్రభువుని కాదన్న పోతన్న ప్రజాకవికాదా, రాజ్యాన్ని భోగింపవలసిన యోగివేమన్న ప్రజాకవి కాదా!

ఈ రెండు దశాబ్దాలుగా ప్రజలకోసమని కలంచేతబట్టి కంఠం విప్పిన వారూ లేరా?

ప్రాచీనవాదుల దృష్టిలో ప్రజాకవిత వేరు, అభ్యుదయవాదుల దృష్టిలో ప్రజాకవిత వేరు.

విప్లవవాదుల భావంలో ప్రజాకవిత వేరు.

అందుకని – మనం ఆశించే, ప్రేమించే ఆశయాలు, అవగాహననుబట్టి ప్రజాకవిత, ప్రజాకవి, ప్రజాప్రభుత్వం, ప్రజలభాష, ప్రజాసమస్యలు అనేవి నిర్ధారణ అవుతాయి.

అసలు దేశానికి స్వతంత్రం వచ్చేనాటికే తెలుగుకవిభావం చాలాముందుకు సాగిందనే చెప్పాలి అంటే స్వతంత్రం వచ్చినంతమాత్రాన అభ్యుదయ లేదా ప్రజాకవిత్వంలో పెద్దమార్పు – ప్రభావం ఏంకలగలేదనే చెప్పవలసి ఉంటుంది.

ప్రజాకవులు, ప్రజాసాహితి కోరుకున్న సమాజరూపం, స్వేచ్ఛ ఇవి కావు –వారి ఆలోచనలోనిది మరోప్రపంచం.

దేశానికి స్వాతంత్ర్యం వస్తే ఏదో జరుగుతుంది అనుకున్న యువతరం ఆశ నిరాశే అయింది.

అందుకే వారి సాహితీరంగంలో విప్లవ ప్రజాధోరణులు ఆగిపోలేదు.

ఇక్కడ ఒకటి గ్రహించాలి.

కవిత్వం నాడూనేడూ ఏనాడైనా కారుణ్యవాదమూ ఒక ఆశయంగా పయనిస్తుంది. అది లోపిస్తే అదిప్రజాసాహితి అనిపించుకోలేదు.

ఏ రచనకైనా హృదయస్పందన కావాలి కరుణభావం గుండెల్లో పొంగి పొరలాలి. అప్పుడే మనం చూపిన సంఘటనలను మన రచనల్లో ప్రతిఫలించ గలుగుతాము.

విశ్వజనీన కావ్యాలను రచించే కవి మహర్షివంటివాడు. ఆతనికి దర్శనశక్తి. వర్ణనశక్తి రెండూ ఉంటాయి. అందుకే– "నానృషిః కురుతే కావ్యం" అన్నారు

విశ్వజనీనతలో హితం ఏరూపంలో ఉన్నా ఉండవచ్చు.

విశ్వమానవ పరిణామంతో పాటు కవితాలక్షణంకూడా పరిణామం చెందు తూంది. నేడు గేయకవులు తమజీవితాల్లోని విచిత్రానుభూతుల్ని, రసవత్తర సన్నివేశాల్ని కలిపి రచనలు చేస్తున్నారు.

కవిత్వానికి పనికిరానిదేదీ లేదు ఈనాడు.

ఏది కవిత, కావ్యం, ప్రజాకవిత్వం అన్న ప్రశ్న ఏదోరూపంలో అప్పుడూ ఉంది.

కవిత్వ తత్త్వ మీమాంస నిన్నటిదీకాదు, మొన్నటిదీ కాదు – నేడూ జరుగుతూనే ఉంది దీనిని ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా నిర్వచించారు.

రసాత్మకమైన ఒక్క వాక్యమయినా కావ్యమే నన్నారు రమణీయార్థ ప్రాతిపదికమయితే అదీ కావ్యమే నన్నారు. సరే: అంతదాకా బాగానే ఉంది.

'విశ్వశ్రేయః కావ్యం' అని వక్కాణించారు మరి? దీని సంగతి ఏమిటి? ఈ నిర్వచనాలలో దేనిని మనం ప్రధానంగా తీసుకోడం? ఇందులో ఏది నిజం, ఏది ముఖ్యం?

కావ్యం కాగల రసాత్మకవాక్యమూ, రమణీయార్థాన్ని ప్రతిపాందిచే శబ్ద విశేషమూవిశ్వశ్రేయస్సాధనకు ఉపకరించవలెననే నియమం ఏమున్నది?

సరసమైన సాయంకాల వర్ణన రమణీయంగానే ఉండవచ్చును. ఏ రాజునో పొగడిన పద్యంకూడా రసాత్మకంగానే ఉండవచ్చును.

కాని అవి విశ్వశ్రేయస్సును సాధించినవా?

సాధించిన వనుకొన్నారు ఆ నాటి ఆ తరహాకవులు. కారణం? ఆ దర్బారు, ఆ రోజు అదే వారిలోకం. అదే వారికి కావ్యవస్తువు.

మరి నేడు అవి లేవు

ఆధునికయుగంలో అభ్యుదయ భావ ప్రేరితుడైన కవికి ప్రజలూ; ప్రజా సమస్యలే ఇతివృత్తాలు

ఆ కారణంచేతనే జానపదగేయాలు, పదాలు, పాటలూ అసలైన సిసలైన ప్రజసాహిత్యం అన్నది నిర్మివాదాంశం.

మొట్టమొదటి ప్రజాసాహిత్యం జానపద కవితలే!

అందులో — మనిషిని మనిషిగా బ్రతకమంటుంది. జీవితానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతోపాటు కర్తవ్యబోధ చేస్తుంది. త్యాగం సూచిస్తుంది. సమాజాన్ని కళ్లకు కట్టినట్టు ప్రతిబింబిస్తుంది.

వీరుల గాథలూ, వీరపదాలూ జానపదాలలో కోకొల్లలు.

అందుకే దీనిని ప్రజాకవిత్వ మంటున్నాను. ఇవి ప్రజలకవితా మణి హారా లంటున్నాను.

శ్రీ కె. వి. రమణారెడ్డిగా రన్నట్లు, ప్రజాకవిత్వం అంటే తిట్టడం, కొట్టడం, నరకడం, దుర్భాషలాడటం— కిట్టని వారిని, పట్టని వాటిని కుష్ఠు నామావళితో నోరుపారేసుకోడమే అంటే వారికో నమస్కారం.

కాని, సమాజస్పృహతో సమాజానికి దగ్గరగా— నీతులూ, ప్రబోధాలూ కూడా అవసరమే కదా. వేమన్న చెప్పింది అందుకే ప్రజాకవిత అయింది.

గురజాడగీతం ప్రజాకవిత అయింది. శ్రీ శ్రీ గీతం ప్రజాకవిత అయింది.

ప్రజల కోసం, ప్రజల గురించి చెప్పింది ప్రతిదీ ప్రజాకవిత్వం అయింది.

ఇక్కడ ఒక్కమాట చెప్పదలచాను.

మార్క్సిజం, కమ్యూనిజం, కమిట్‌మెంటు ఇలాంటి నిబద్ధతలు నిండి ఉండాలి. అదే ప్రజాకవిత అంటే నేను ఏకీభవంచలేను. యువకవులమీద, నేటి తరంమీద గతితార్కిక భౌతికవాద ప్రేరణ ఉంది— ఉంటుంది

మొన్న మొన్నటి వరకూ— అంటే భావకవిత్వంమీద తిరుగుబాటు చేసే వరకూ, అభ్యుదయ రచయితలు జన్మించేవరకూ మార్క్సిజం ప్రధానంగా వీరిలో ధ్వనించినా, తిలక్ వంటి వారి కవితల్లో ప్రగతి గోచరిస్తుందే కానీ మార్క్సిస్టు ఛాయలు కానరావు.

మంచిని బోధించడానికి ఏ చందం అయినా బాగానే ఉంటుంది.

మార్క్సిస్టు అవగాహన ఉంటేనే ప్రజల పాటలు రాయగలడన్న సూత్రం ఏంలేదు. ఉంటే మంచిది.

జానపద సాహిత్యంలో ఎన్నో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను వినిపించే పాటలు ఉన్నాయి—ఆనాడు మార్క్సిజం ఎక్కడిది? ఏ కమిట్‌మెంటు ఉంది?

సరే! అది అలా ఉంచుదాం.

భావగీతాలు—ఆ కాలంలోనే ప్రజల భాషలో, ప్రజల బాణీలో ఎంకి పాటలు, బంగారుమామ పాటలు వెలువడ్డాయి. ఈ నాటికీ వాటి ప్రాధాన్యం మనకు తెలిసిందే!

అవి ప్రజాకవితలా? అంటే మనం చూసే చూపునుబట్టి, ఆలోచనను బట్టి ఉంటుంది.

గురజాడను అందరూ ప్రజాకవిగా గుర్తిస్తున్నారా?

సమసమాజ స్థాపనకు మార్క్సిజాన్నే ఏకైకసూత్రంగా అందరూ అంగీకరిస్తున్నారా?—ఇదీ అంతే!

ప్రబంధాలు, కావ్యాలు తాత్త్వికపుతాకిడి నుంచి భావకవితలు విడిపి విప్పారినాయి. అందుమీద అభ్యుదయకవులు ఉద్భవించారు.

తర్వాత తర్వాతి కాలంలో వచనకవితకు ప్రాచుర్యం లభించింది. అంటే రీతికన్నమాట.

వచనకవిత ఎక్కువగా మార్క్సిస్టు ప్రచారం, కమిటెడ్ సిద్ధాంతాలతో చాలా వెలువడినా, వచనకవితలోనూ చక్కని కవితారసాన్ని, రసవాదాన్ని ప్రవేశపెట్టవచ్చని నిరూపించిన కవితా సంపుటాలు- తిలక్ 'అమృతం కురిసిన రాత్రి', శేషేంద్రశర్మ 'శేషజ్యోత్స్న'; ఎల్లోరా 'రేపటి వసంతం' మొదలైనవి.

అయితే ఒకనాడు మార్క్సిస్టు భావాలకే వాహికగా ఉన్న వచనకవిత పరిధిపెరగడం జరిగింది.

అభ్యుదయ కవులుగా పరిగణింపబడడానికి ఇష్టంలేని వారుసైతం వచన కవితా నిర్మాణాన్ని చేపట్టారు.

## ఈ రెండు దశాబ్దాలలో ప్రజాకవిత-పాట

ఈ ఇరవైసంవత్సరాల కాలంలో ప్రజాసాహిత్యం అంటున్న జానపద పాటలను, సినిమాకవులు హాయిగా అన్నింటినీ పల్లవులుగా, చరణాలుగా మలుచుకోవడం గమనించతగ్గవి.

ఇది గొప్పమలుపు! ఎందుకంటే, తిరస్కృతాంధ్రవాఙ్మయంగా ఛాందసుల చేత పట్టాపొందిన ప్రజాకవితలు నేడు సినిమాలలో, పత్రికల్లో, రేడియోల్లో, టెలివిజన్‌లో, గ్రంథాలుగా ఎన్నోచోట్ల పీఠం వేసుకోడం.

ఇదీ ఒక విశేషం !

మరిఒక ప్రత్యేకత ఏమిటీ అంటే విప్లవకవులూ, అభ్యుదయకవులూ, దిగంబరులు వేరు అనుకోండి. వీరంతానూ వీరితోపాటు- ఏ రాజకీయ సిద్ధాంతంతోనూ సంబంధంలేని కవులు ప్రజాసమస్యలను జానపదసరళిలో ప్రజల పాటలుగా రాసి, పాడి ప్రచారం చెయ్యడం :

తమ సిద్ధాంతాల ప్రచారం ప్రజలకు దగ్గరగా వెళ్ళడానికి, గేయాలుగా కాకుండా పాటలుగా పాడుకోడానికి వీలుగా రాయడం అన్నది. ఇప్పుడే కాదు, ఆదినుండి ఉంది. అయితే ఈ దశాబ్దికాలంలో ప్రజాసంఘాలలో-ప్రజాకవితలో పాట ప్రాధాన్యం వహించింది.

ప్రజను మేలుకొలుపడానికి, సమాజానికి మంచిని ప్రబోధించడానికి, దేశభక్తిని రగిలించడానికి, దోపిడికి ఎదురు తిరగమని చెప్పడానికి సరైన సామాజికస్పృహ ఉండటం అవసరం. రాజకీయాల మలుపులన్నీ తిరుగగలరనుకోవడం భ్రమ.

ప్రముఖకవులు డాక్టర్ దాశరథి, నారాయణరెడ్డి, ఆరుద్ర, శేషేంద్ర శర్మ ఇలా ఎందరో-ఏ పార్టీకి చెందకనే విప్లవకవితావీణను మీటి ప్రజావాణిని కుదిపి కదిలించడం లేదా?

భీమన్న, బాపురెడ్డి మొదలు, ఎందరో పాటలు రాశారు. చెరబండరాజు మొదలయినవారు పాటనే ప్రచారసాధనంగా ఆవిష్కరించారు.

ఈ 20 ఏళ్లలో కాస్త అటూ, ఇటూగా ప్రజాకవితల్లో పాట ఎలా సింగారించుకొందో చూద్దాం.

ఇక్కడ రెండుపాటలు చాలాకాలంనాటివి స్మరించుకొని, ఈనాటి పాటల మధురిమను పరిచయంచేస్తాను.

'దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
ఒట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్'

అని గురజాడ ప్రబోధించారు.

ఏ పార్టీకోసం రాసింది కాదు.
అలాగే శంకరంబాడి సుందరాచారి ఎంత దేశభక్తిని ప్రభోదిస్తాడో-
'మా తెలుగుతల్లికీ మల్లెపూదండా
మాకన్న తల్లికి మంగళారతులూ
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు
దొరలించు మాతల్లి'

ఈ రెండు రచనల్లో వారివారికి దేశమంటే ఉన్న అవగాహన ద్యోతక మవుతుంది. అలాగే ఏనాడో రాసింది. గరిమెళ్ళ సత్యనారాయణది— 'మాకొద్దీ తెల్ల దొరతనము...' అనేపాట. ఈపాట నాటి సమాజాన్ని తట్టి మరీ కుదిపింది.

జానపదగేయంలో ప్రజలపాట.
'ఊరిముందర చేను
చేయకుర అన్న
ఊళ్ళోన వియ్యంబు

అందకుర అన్న
ఊరిముందర చేను
కాకుల్ల పాలు
'ఉళ్ళోన వియ్యంబు
మాటలా పాలు'

అలాగే—

'జప తపంబులకన్న
చదువు సాముంకన్న
ఉపకారమే మిన్న
ఓ కూనలమ్మా!—'

ప్రముఖాంధ్ర ప్రతాకవి మాఆరుద్ర చేతితో చెప్పినట్లల్లా కొత్త గొంతులో ఎన్నో పాటలు ఈ కూనలమ్మ పాడింది.

అలాగే మరోటి— ఇది సినిమాపాట కాదు. దీనినే సినిమాయలోకం దక్కించుకొంది.

'సిన్నీ నా సిన్నీ
ఓ సన్నజాజుల సిన్నీ
పొన్నపూల సిన్నీ...'

ఇలా ఎన్నో!

అలాగే ఇదీ సినిమాలో వినిపించే ఉంటుంది.
'నల్ల నల్ల మబ్బునుండి లగ్గో పిల్లా
చేను చేను గలిసినట్టు లగ్గో పిల్లా
మేను మేను కలపరాద లగ్గోపిల్లా—'

—ఇలా ప్రజల పాటలు అనేకమంది సినీకవులకు పాటలుగా మారి కీర్తిని ఇస్తూండడం గర్వకారణమే మరి!

అలాగే ప్రజాకవితలో నేటికవుల పాటలు కొన్ని.
కవి భీమన్న- 'గుడిసెలు కాలిపోతున్నై
ఓహో : కాలిపోతున్నై

ఎవరిగుడిసెలో పాపం
మాలమాదిగలవే అయి ఉంటై
గుడిసెలు మరెవరి కుంటై' ॥గుడి॥

తన జాజి పాటల్లో పైడిపాటి సుబ్బరామశాస్త్రి—

'నాచుదారులు పోక
త్రాచులా సాగాలి
రేచుత్తె ఒకరొకరు రెచ్చిపోవాలీ...'
అంటారు.

నిజాం నిరంకుశత్వంపై కవులు ఎలా విరుచుకుపడ్డారో పాటల్లో ఈ తెల్లాంటి గెరిల్లా యాదగిరి భావాలు చూడండి,

'చుట్టుపట్టు సూర్యాపేట
నట్టనడుమ నల్లగొండ
ఆవాల హైద్రబాద
తర్వాతా గోలుకొండ
గోలుకొండజిల్లా క్రిందనే
గోరీ కడ్తాం కొడుకో
నైజాము సర్కారోడు
నాజీల మించినోడు'

ఈ పాట రచయిత ఆశలు ఫలించాయి. ఇతనిశాపం నిజాంకు గోరీకట్టడం జరిగింది.

—అనూచానంగా వస్తున్న ఈ జానపదగేయాల బాణీలలో, బాసలో అటు సినీమావారు, ఇటు ప్రజోద్యమాలకోసం రాసేకవులూ, అదే బాణీలలో రాజకీయ సమస్యలను ఇతివృత్తంగా తీసుకుని రచనలు చేయడం ఇక్కడ గమనించాలి. మచ్చుకు—

'సంచామయా గురుడ సందామయా
అందరూ ఇది ఆలకించండయా
లాఘవంబుగ ప్రజలు లంఘించి తంతుంటే
తొత్తు నాదిలీ తోక ముడిచారయా—'

యువకులు చాలామంది పాటలనే ప్రజాసమస్యలకు వాహికలుగా చేసుకోడం కనిపిస్తుంది.

ఎస్వీ తన సరిగమలులో—
'ఏమి బతు కిది—ఏమి బతుకన్నా
ఒకమెతుకు దొరకని
అతుకు గతుకుల బతుకు గిదిరన్నా-'

ఇలా సాగుతుంది.

అలాగే-బిగుళ్ళ అనే ఓ యువకవి తననిప్పురవ్వల్లో—
'ఎగిలివారి పోతూందిరా
ఓ కూలన్నా
ఎండెక్కి పోతూందిరా!
ఎన్నాళ్లీ చీకట్లో
దోబూచులాడతావు
భూదేవిని కన్నాడా
భూమి నాదె అంటాడు
ఒళ్లొంచి దున్నాడా
ఒడ్లు నావె అంటాడు
నిజం తెలుసుకోని నడువరా
ఓ కూలాన్నా
నిప్పువయీ లేచి దుముకరా
ఓ రైతన్నా !'

—విప్లవ కవులు ప్రత్యేకంగా గేయాలూ, వచనకవితలవల్ల జనాన్ని కదిలించ లేమనీ, వారి శైలిలో వారి కర్థమయ్యే భాషలోనే వారి సమస్యలను ఎత్తిచూపడం అవసరమనీ, అందుకు పాడుకోడానికీ, ప్రచారానికీ వీలుగా పాటలు రాయడం ప్రారంభించారు.

ఈ ఆలోచన, ఈ జానపద కళారూపాలను ప్రజావసరాలకు మలచుకొని ప్రచారసాధనాలుగా వాడుకోడం ప్రజానాట్యమండలి, అభ్యుదయ రచయితల సంఘం రెండు దశాబ్దాల క్రితమే ప్రారంభించాయి.

ప్రజాకవితలో ప్రత్యేకించి పాట కున్న ప్రత్యేకత చాలా విలువైనది.

తన భాషలో, తనకు వినబడే సంగీతలయలో- అంటే జానపదశైలిలో నడకలో పాట వింటే ఆకర్షితుడౌతాడు, కొత్త అని కానీ, అర్థం కానిది కానీ ఉండదు.

దానికి మంచి ఉదాహరణంగా చెరబండరాజు 'జన్మహక్కు'లో వాడిన వడుసలూ, భాష, భావాలూ చూస్తే అర్థమవుతుంది.

చెప్పదలుచుకున్న వస్తువులోనే కాకుండా, చెప్పేరీతిలో కూడా వైవిధ్యం సాధించడం ఈ రకం రచయితలలో ప్రత్యేకత.

ఇదే పుస్తకానికి ఆముఖం రాస్తూ 'చేరా' అంటాడు—'ప్రజాకవిత్వం రాసేకవి ప్రజలకు సన్నిహితమైన ప్రకృతిని తన వస్తువుకు అనుకూలంగా వాడుకుంటాడు. ఈ పద్ధతి ఒకేసారి కవిత్వపు స్థాయిని పెంచుతుంది. ప్రజలకు సన్నిహితమూ అవుతుంది' అన్న మాట నిజం.

ఈ తరహా పాటలు శివుడు, శివసాగర్, పాణిగ్రాహి, చెరబండరాజు మొదలయిన వారి పాటలు ప్రజల పాటలే.

వారి సిద్ధాంతాలతో మనం ఏకీభవించక పోవచ్చు.

సుంకర, వాసిరెడ్డి, నాజర్ మొదలయిన కవులు ఈ పనిని ఏనాడో చేశారు.

ఈనాడు ఈకవులు చేస్తున్నారు. 'నరుడా-భాస్కరుడా' అన్న గేయం శివుడివి లక్షలాది అమాయకుల గుండెల్లో ధైర్యాన్ని, స్థైర్యాన్ని ఆలోచననీ రేకెత్తించి బానిస సమాజంపై ఎదురుతిరగడానికి ఊపిరి నిచ్చింది

ఎందుచేత ?

నేను ముందే నుడివినట్లు వారికి తెలిసే భాష, వారి బాసలో వారి సమస్యలతో నిండిన పాట.

గుండెను కుదిపే పాట—అది ప్రజల పాట.

చెరబండరాజు అంటాడు—

'కొండలు పగిలేసినం
బండలనూ పిండినం
మా నెత్తురు కంకరగా
ప్రాజెక్టు గట్టినం
శ్రమ ఎవడిదిరో
సిరి ఎవడిదిరో'

ఇలా అంతా సాగుతుంది.

ఇటీవలి కాలంలో జానపద శైలిలో రచనలే వస్తున్నాయని చెప్పానుగదా!

ప్రజలను పోరాటానికి, ఉద్యమానికి ఆయత్తం చేయడానికి ఈ యాసలో ఈ శైలిలో రచించేవీ ఉన్నాయి. రసవాదంతో, ప్రకృతివర్ణనాత్మకతతోనూ రచిస్తున్నవి ఉన్నాయి.

ఎంకి పాటలు, బంగారుమామ పాటలు. వీటిలో సమాజం, విప్లవం కనిపించదు.

అయితే ఏం- మనిషి కనిపిస్తాడు. మనసు కనిపిస్తుంది. బతుకులోని ఆశల ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు వినిపిస్తాయి. అందుకే అవీ ప్రజల పాటలే అంటాను—ప్రజాకవిత్వమే అంటాను.

'పల్లెల్ల పొద్దు పొడిసింది'

అని యెల్లండ రఘురామారెడ్డి రచన-ఇందులో చాలావిలాప గోచరిస్తుంది.

'సేతుల్ల సింతోల పండున్నదీ దాన్ని
సించంగ మీదపడ్తె ఎరుకైతదీ
పల్లెల్ల తెలువని జనమున్నదీ వాళ్ళను
గిల్లంగ ఎగవడ్తె మరుకయితదీ' అని.

ఇది, సీతాఫలం పండు చించితే మీదపడ్డట్టు, ప్రజలను గిల్లితే తెలుస్తుంది పస అంటున్నాడు.

ఇటీవలే వరవరరావు రచించిన కవితాసంపుటిలో అంటాడు.

కొందరుకవులు ఏలినవారి అడుగులకు మడుగు లొత్తుతారూ అని-వారిని సర్కారీకవులు అంటాడు.

ఇక్కడే ఆలోచనాసరళి, అవగాహన, అంచనాలలో భేదం అంటున్నాను.

వామపక్ష పార్టీలు ఏలుతున్న రాష్ట్రమో, దేశమో అనుకుందాం. వారిని పొగిడే కవులు వీరిదృష్టిలో సర్కారీకవులు కారా? అంటే దీనర్థం యాంటీ ఎస్టాబ్లిష్‌మెంట్ అన్నమాట.

వారిని కాదనే మరోపార్టీ ఏలుతున్న రాష్ట్రంలోని వారే సర్కారీ కవులు.

ఇవి సిద్ధాంత భేదాలు.

ప్రజలు నిగ్గు తేల్చుకోవలసిన సత్యాలు. కాలం చెప్పేనిజాలు-

వరవరరావు పాటల్లో జానపదశైలీ విన్యాసం అంతగా లేదు చెరబండ రాజులా.

మచ్చుకు-

'పేద ప్రజల కష్టంలో
రగిలిన కోపాగ్నులం
పీడిత జన విప్లవాలు
పొడుతున్న రచయిత్రులం...' అంటాడు.

ప్రకృతినుండి ధ్వనీ,ధ్వనినుంచి సంగీతమూ పుడుతున్నట్లుగానే ప్రజలతో, ప్రజాసమస్యలతో సంబంధంఉన్న 'కవిత ప్రజాకవితగా వికసిస్తుంది.

అందుకు పైనచెప్పిన పాటలు సాక్ష్యాలు. ప్రఖ్యాతకవి మా ఆరుద్ర కూనలమ్మ చేత సమాజంలోని మంచి చెడులను చక్కగా చెప్పించాడు.

ఆయన, 'పైలా పచ్చీసు' లో అంటాడు-

'కేకేసి దూకండి
ఈ అగ్నిలోన
ఈ వేడి కన్నీళ్ల
మనచెమట బిందువులె
ఈ బాధ నాపాలి
ఈ మంట నార్పాలి
కేకేసి దూకండి' అని-.

దీనివెనక సామాజిక చైతన్యం కనపట్టం లేదా!

సమాజిక స్పృహ, అవగాహన నిజమైనకవికి ఉంటుంది. అందుకే ఆరుద్ర అనగలిగాడు.

వాల్మీకి హృదయంలో కరుణ అనేది ఉంది కనుకనే పక్షి పరితాపాన్ని భరించలేక శోకించాడు, శ్లోకం రాశాడు. దానిని ఆ రోజున కమిట్‌మెంటనీ మార్క్సిజమనీ అనలేదు. కాని, ఆ దృశ్యాన్ని, ఆ సంఘటనని నేటికవులే చూస్తే ఏమనేవారు అన్నది నా ఆలోచనలో శిల్పించుకున్న భావచిత్రం.

అధర్మాన్ని సహించలేనివాడు కవి. అందుకే కవిజగత్తుకోసం తపిస్తారు. అధర్మం అనుకున్నదానిని ఖండిస్తాడు.

కవి పుట్టుక కవి కోసం అంటే నేను ఏకీభవించను.

కవి మనిషిని బ్రతికించడానికి- సమాజాన్ని తట్టి మేలుకొలుపడానికి- ఇదే నా నిశ్చితాభిప్రాయం.

ఇక ప్రజాకవితను గురించి ఒక్కమాట చెప్పి ముగిస్తాను.

ఈశావాస్యోపనిషత్తు వర్ణించింది—

'యస్తు సర్వాని భూతాని ఆత్మన్యేవాను

పశ్యతి సర్వ భూతేషు చాత్మా

నం, తతోన విజుగుప్సతే' —అని

అంటే ఇలా అర్థం చెప్పుకుందాం.

'ఎవడు సమస్త భూతాలలోనూ తన ఆత్మనే చూసుకొంటాడో వానికి అన్ని భూతాలలోనూ తానే కానవస్తాడు. జుగుప్సాభావం ఉండదు'-అంటోంది.

ఈ స్థితి కవితాభ్యాసానికి అవసరం అంటే అభ్యంతరం లేదనుకుంటాను.

కవిత్వానికి ప్రాచీనత లేదు- అందుకు రామాయణం ఉదాహరణ. అందులోని సాంఘికధర్మం, అందులోని ఆలోచన కవిత్వం.

కనుక కవిత్వం మనిషిని, తద్వారా సమాజాన్ని మార్చాలంటే రాసే కవిత్వం సమకాలీన జీవన ప్రతిబింబం కావాలి. మనుషుల జీవన్మరణ సమస్యలతో నిండి నిబిడీకృతం కావాలి. అలా ఉండబట్టే జానపద గేయాలింకా బతికి బట్ట కడుతున్నాయి.

ప్రజాకవిత-అంటే అతనికి అర్థం అయ్యేభాషలో అతని సమస్యలను వినిపిస్తూ, తరణోపాయం చూపిస్తూ- కాంతిపథానికి, క్రాంతిపథానికి జనతను నడిపించే శంఖారావం కావాలి.

ఇది-పాటలో పాడుకునేటట్లు ఒక రాగయుక్తం, తాళయుక్తంగా ఉంటే అది ప్రజాకవిత అనీ, ప్రజలపాట అనీ నా అభిప్రాయం.

మచ్చుకు కవితలో-ప్రజాకవితలో రసవాదం—

నండూరి వారి జానపదశైలీ విన్యాసంలో—

'రవల వెలుగుల గంగ రమ్మందిర యెంకి

శివమెత్తి తానాలు చేసిందిరా!

తెలంగాణా ప్రజాకవిగా చాలామంది చేత గౌరవింపబడుతూన్న కాళోజీ కవితలో—

'దొంగలు దొంగలు
ఊళ్లు పంచుకొని
దొరలై వెలిగేదెన్నాళ్లు?'

అని ప్రశ్నిస్తూన్నాడు. ఇదీ ప్రజాకవిత లక్షణం. ప్రజాకవిలక్ష్యం!

కవిగొంతు ఒకశాశ్వత నైతిక శంఖారావంలా వినదిస్తూనే—జనాన్ని కదిలిస్తూనే—దోపిడిగుంపులను ఒణికిస్తూనే ఉండాలని ఆశ—ఆ ఆశ ఫలించడానికి తగినబాట—పాట!!—



# ఆధునిక కవిత - ఆదానం ప్రదానం

డా॥ ఇలపావులూరి పాండురంగరావు

అనుభూతి ఆత్మ లక్షణం. అభివ్యక్తి వ్యక్తి లక్షణం. శివత్మాకమైన అనుభూతికి రసాత్మకమైన అభివ్యక్తిని చేకూర్చే చిరంతన చైతన్య వాహిని సారస్వతం. అక్షరపరబ్రహ్మకు మామూలు మాటలు శరీరంలోని అవయవాల్లాంటివి. మేధాశక్తికి మెరుగుపెట్టే శాస్త్రవాఙ్మయం మనస్సులాంటిది. హృదయానికి ఆహ్లాదం కూర్చే ఆనందపద సంపద ఆత్మలాంటిది శరీరం స్థూలం. ఆత్మ సూక్ష్మం. పరమాత్మ అతిసూక్ష్మం, సూక్ష్మాతిసూక్ష్మం. కాబట్టి అక్షరపరబ్రహ్మ యొక్క ఆత్మతత్త్వాన్ని ఆహ్లాదకరంగా హృదయాలకు విప్పి చెప్పే కవిత సారస్వత ప్రక్రియలన్నింటిలో సున్నితం, సునిశితం అయినప్పటికీ అందరికీ సన్నిహితమైన సాధన. స్థూలమైనశరీరం దేశకాలాలకు కట్టుబడి ఉంటుంది. సూక్ష్మమైన ఆత్మ ఈ పరిధుల నధిగమించి జనమానస రసబిందువును ఆత్మకళారససింధువులో లయింపజేస్తుంది. ఈ కళాభవనమే కమనీయమైన కావ్యకళానిలయం.

కాబట్టి కావ్యజగత్తుకు పరిధులు లేవు, అవధులు లేవు ఏ దేశంలో, ఏ భాషలో, ఏ కవి ఎలాంటి భావాన్ని పలికినా, ఆ పలుకులకు ప్రతి మానవుని హృదయం స్పందిస్తుంది. శాస్త్రీయంగా, పారిశ్రామికంగా అభివృద్ధి చెందని రోజుల్లో కూడా దూరదేశపుకవుల భావాల్లో విచిత్రమైన వివేక సామ్యం కనిపిస్తుంది. దేశకాలవ్యవధానం తగ్గిపోయిన యీరోజుల్లో ఇలాంటి భావసామ్యం మరీ సులువుగా సాధ్యమవుతూ ఉంది. ఈనాడు సజీవమైన సారస్వతాన్ని రూపొందించుకుంటున్న ప్రతిభాషలో పరిసర భావాలూ, ప్రభావాలూ, ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కనిపిస్తూనే ఉన్నాయి. అందులోనూ తెలుగు ఇలాంటి ప్రభావాలను అవలీలగా అందుకొనేందుకు అనుకూలమైన స్థితిలో

ఉంది. ఉత్తరాదికి దక్షిణంగా, దక్షిణాదికి ఉత్తరంగా ఉన్నందువల్ల తెలుగు భాషకు పరిసరభాషల భావ సంపద సునాయాసంగా లభించింది. శతాబ్దాలనుంచి సాంస్కృతిక సేతువుగా వ్యవహరిస్తున్న తెలుగులో సహజమైన సాంస్కృతిక సౌరభం చోటుచేసుకున్నందువల్ల దూరదేశాల్లోని భాషల భావసంపదకూడా ఈ భాషలోకి నైసర్గిక సూత్ర పద్ధతిలో ప్రసరించింది

అతిప్రాచీనమైన కొన్ని భాషలను మినహాయిస్తే దాదాపు మనదేశభాషలన్నిటిలో సారస్వతసాధన ఆరంభించి రమారమి వెయ్యిసంవత్సరాలయింది. ఈ వెయ్యి సంవత్సరాల్లో వేరువేరు యుగాల్లో, వేరు భాషల్లో దాదాపుగా ఒకే విధమైన సమాంతర సారస్వత సంవిధానకం కనిపిస్తుంది. మచ్చుకు హిందీ తెలుగు సాహిత్యాలను పరిశీలిస్తే హిందీలో పృథ్వీరాజ్‌రాసో, బీసల్‌దేవ్ రాసోలాంటి వీరగాథలను వర్ణించిన సమయంలోనే తెలుగులో వీరశైవవాఙ్మయం, భారత సంహితారచన కొనసాగింది. ఆ తర్వాత సూరదాసు తులసీదాసులాంటి భక్తకవులు అవతరించినసమయంలోనే తెలుగులో పోతనామాత్యుని భాగవత రచన జరిగింది. తెలుగులో దక్షిణాంధ్ర యుగంలోని శృంగారరచనలు వెలువడిన సమయంలోనే హిందీలో రీతివాఙ్మయమనే పేరిట భీతిలేని ప్రీతి ప్రసరించింది. ఇటీవలి కాలంలో మనకు వీరేశలింగం పంతులు లభించినట్టుగా వాళ్ళకు భారతేందు హరిశ్చంద్ర, గురజాడ అప్పారావులా మహావీర్‌ప్రసాద్‌ద్వివేదీ, విశ్వనాథ సత్యనారాయణలా జయశంకర్‌ప్రసాద్ — ఇలా ఎందరో మేధావులు రెండు భాషల్లో కవితా స్రవంతిని యుగధర్మాన్ని అనుసరించి నడిపించారు. 'ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి వడివడిగా కవిత పరుగిడుతూ కవులఒడిలోకి అడుగిడిన' గడియల్లోనే హిందీలో రబ్బరు ఛందస్సు, నయీకవిత తయారయినాయి. మొదట మొదట పదునైన పదజాలాన్ని ఛందస్సుల సంధులలో బంధించి ప్రబంధించిన మేధావులే ఈనాడు వచనాన్ని కవితగా తీర్చిదిద్దటం తెలుగులోనే కాదు, దినకర్ లాంటి దిట్టల 'అకవితా' ఖండికల్లో కూడా కనిపిస్తుంది. ఇది యుగధర్మం. కాల ప్రభావాన్నిబట్టి వచ్చిన యీ మార్పులు మనదేశభాషలన్నింటిలో కనిపిస్తాయి.

ఇవి ఒకరినొకరు చూచుకొని చేసినవి కాకపోవచ్చు. కొన్ని సందర్భాల్లో అయినా కావచ్చు. మొత్తంమీద మన సారస్వత సాధనలో- ముఖ్యంగా కవితా ప్రవంతిలో- పరస్పర భావసామ్యం స్పష్టంగా గోచరిస్తుంది.

ఇందులో కొంత ఆదానం కొంత ప్రదానం. తెలుగులోకి బయటినుండి ప్రసరించిన కావ్యచ్ఛాయలు కొన్ని. తెలుగునుండి బయటికి ప్రసరించినవి కొన్ని. ఇరువైపుల సరిసమానంగా ఈ వినిమయం జరిగితే అది భావసామ్యాన్ని సాధించడమే కాక, భావసమైక్యాన్ని నెలకొల్పగలదు. ఇతర భాషలతో తెలుగుకు గల యీ భావానుబంధం ముఖ్యంగా రెండు విధాలు. సాంస్కృతికంగా సంక్రమించింది కొంత. రాజకీయంగా- పాలక పాలితుల సంబంధ బాంధవ్యాల మూలంగా-సంక్రమించింది కొంత. సాంస్కృతిక భావానుబంధంలో ముఖ్యంగా పేర్కొన దగ్గది సంస్కృతం. సంస్కృతం తెలుగుకు ప్రసాదించిన సారస్వతం అపారం. ఇది చాలావరకు కవితకు సంబంధించినదే. ఆదికవి నన్నయభట్టు కలం పట్టినప్పటి నుంచి యీనాటి ఋతుఘోషల వరకు సంస్కృతకావ్య సమీరమే మనకు- మనకే కాదు, పెక్కు భారతీయభాషలకు- ప్రాణవాయువును ప్రసాదిస్తూఉంది. ఇలా మన ఊపిరిలో ఊపిరిగా కలిసిపోయిన సంస్కృత వాఙ్మయం కొంత అనువాదాలద్వారాను, మరికొంత అనుసరణల ద్వారానూ, ఇంకొంత అపహరణల ద్వారానూ మనకు లభించింది. సంస్కృతం నుండి తెలుగులోకి వచ్చిన అనువాదాలు చాలవరకు అనుసరణలనే చెప్పాలి. మక్కికిమక్కి-ముక్కకుముక్క అనువాదాలు ప్రాచీనకవులకు ఇష్టం కాకపోవడంవల్లనే మన ప్రాచీనవాఙ్మయం అనువాద భూయిష్ఠమైనప్పటికీ అలా అనిపించలేదు. నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, పోతనలాంటి ఋషితుల్యులైన కవులు ఇలాంటి సారవంతమైన సరస సారస్వతరచనకు మేలుబంతి చూపించారు. దానికి ఫలితంగా భారతం, భాగవతం, రామాయణంలాంటి ప్రసిద్ధవాఙ్మయమేకాక, కాళిదాసాదికవుల సత్కావ్యాలూ, పురాణాలూ, ఉపనిషత్తులూ, అనేక వైదికగాథలూ కావ్యరూపంలో తెలుగులోకి వచ్చాయి తెలుగుకవులు శాకుంతలంలాంటి నాటకాలను కూడా కావ్య

రూపంలోనే తెలిగించారు. కవితపయి తెలుగు కవులకు గల మమకారానికి ఇది నిదర్శనం. సంస్కృత వాఙ్మయంలో ముఖ్యంగా రామాయణం దాదాపు ఏడు వందల సంవత్సరాలనుంచి తెలుగుకవుల చెవులకు వినవినగా వింతలను సంతరించుకొనగల కవితాపారాయణ మయింది, రంగనాథరామాయణం నుంచి విశ్వనాథరామాయణం వరకు పయనించిన యీ కావ్యాయనం ఈనాడు కూడా రమణీయరామాయణం, జనప్రియ రామాయణంలాంటి అభినవ రచనలకు వెలుగు చూపుతూ ఉంది సంస్కృతవాఙ్మయంనుండి తెలుగులోకి వచ్చిన సారస్వత సంపదను సమీక్షించటం ఈ 'వ్యాసా'నికి సాధ్యమయే 'వృత్తం' కాదు. కాని, యీనాటికీ ఋతుమంగళం, ఘనసందేశం, ఉషాపరిణయం, సౌందర్యలహరిలాంటి అనువాదాలు, అనుసరణలు చూస్తుంటే సంస్కృతంతో తెలుగుకు గల సన్నిహిత సంబంధం స్పష్టంగా గోచరిస్తుంది.

తెలుగునుండి సంస్కృతంలో ప్రవేశించిన సాహిత్యం కూడా లేకపోలేదు. కాని, సంస్కృతం ప్రస్తుతం వాడుకలో లేకపోవడంవల్ల ఇలాంటి రచనలకు సామాన్య పాఠకుల ప్రోత్సాహం లభించుటలేదు. అయినప్పటికీ 'కళాపూర్ణోదయం' లాంటి కావ్యాలను సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి లాంటి పండితులు సంస్కృతంలో సాధించారు. అలాగే కుంటిమద్ది శేషశర్మగారు 'మనుచరిత్ర'ను సంస్కృతపద్యకావ్యంగా వ్రాశారు. తెలుగు శతకాలు కూడా కొన్ని సంస్కృతంలోకి వచ్చాయి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఇలాంటి రచనలను ప్రచురించి ప్రోత్సహించటం ముదావహం. వరదాచారిగారి శతకానువాదం సరళంగా ధారాళంగా సాగింది. 'మనుచరిత్ర'కు మధురమైనఅనువాదం 'మనుసంభవం'లో తెలుగు ప్రబంధచ్ఛాయలు బాగా కనిపిస్తాయి. కాని, యీ అనువాదాలు ఆంధ్రేతర విద్వత్సమాజందాకా వ్యాపించకపోవటం శోచనీయం. కనీసం నారాయణ తీర్థులవారి 'కృష్ణలీలాతరంగిణి' లాంటి కర్ణరసాయన రచనలు కూడా తెలుగుల పొలిమేరను దాటలేక పోయాయి.

అయినా పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి, పుల్లెల శ్రీరామచంద్రుడు, కాశూరి హనుమంతరావు, చెంమచర్ల రంగాచార్యులు లాంటి పండితులు సంస్కృతంలో

రచించిన కావ్యాలు తెలుగు వారికి సంస్కృతభాషపై గల అనురాగాన్ని ఆధి కారాన్ని తెలియపరుస్తాయి. కాని, తెలుగువారు, పొరుగువారు ఈ కృషిని అర్థం చేసుకొని ఆనందించినప్పుడే దీనికి సార్థక్యం.

సంస్కృతం తర్వాత తెలుగు వారికి పరిచితమైన భాష-ఉర్దూ. ముఖ్యంగా తెలంగాణ మండలం వారికి ఇది మాతృభాషలాంటిదిగా చాలారోజులు తెలుగుల కష్ట సుఖాలలో పాలుపంచుకుంది. ఉర్దూ మాతృభాషగా గల వా రనేకులు తెలుగును ఆదరించటమేకాక తెలుగులో చక్కని రచనలు కూడా చేశారు. ఉమ్రా ఆలీషా, షేక్‌దావూద్ లాంటి కవులు ఉర్దూ-తెలుగుల సౌహార్దానికి మచ్చుతునకలు. ఉర్దూసాహిత్యంలో చాలా ప్రసిద్ధి కెక్కిన 'గజల్' రచన తెలుగు కవులను ఎక్కువగా ఆకర్షించింది. పారశీక గజల్ పద్ధతిలో గురజాడ వారు మొట్టమొదట కొంత కృషి చేశారు. కాని, యీ ప్రక్రియను సమర్థంగా తెలుగులోకి అవతరింప జేసిన తొలికవి కాళోజీ అని చెప్పవచ్చు. ఆ తర్వాత దాశరథిగారి చేతిలో ఇది 'మంజరి'గా మారి మంజులనిస్వనాన్ని వినిపించింది. వారి 'గజల్' గీతాలు తెలుగు కాణాచిగా అనిపిస్తాయే, కాని అరువు తెచ్చుకున్నట్టుగా తోచవు. గాలిబ్, మీరా, జఫర్ రచించిన గజళ్ళను తెలిగించిన గౌరవం కూడా దాశరథి గారికే దక్కింది. ఇలాగే రెండు భాషలతో సమానమైన సంబంధం కల నారాయణరెడ్డి గారి గేయాల్లో కూడా ఉర్దూ కవిత్వంలోని పదవిధి, అంత్యానుప్రాసం, మధుర పదబంధం, భావసౌకుమార్యం కనిపిస్తాయి. దాశరథి గారు గజళ్ళను గౌరవిస్తే నారాయణరెడ్డి గారు ఖవాలీని చేరదీసినట్లు తోస్తుంది. ఈ సందర్భంలో సదాశివ గారి 'రుబాయీ' అనువాదాలను గురించి తప్పక చెప్పుకోవాలి. ఇటీవల సుప్రసిద్ధ సాహితీ పోషకులు బెజవాడ గోపాలరెడ్డి గారు కూడా ఈ రంగంలో ప్రవేశించారు. 'ఆమె' అనే కావ్యసంకలనంలో వీరు రచించిన కొన్ని చిన్న చిన్న పద్యాలు ఉర్దూకవుల ప్రేమభావాలను స్ఫురింపజేస్తాయి. నాయిక కంటె నాయకునికి విరహవేదన ఎక్కువగా ఉండడం, నాయిక గడుసరితనం, మాటిమాటికి నాయకుడు అమాంతంగా అంతా మునిగి పోయినట్టు కుంగిపోవటం- ఇలాంటి

భావచ్ఛాయలు ఈ పద్యకల్లో అడుగడుగునా కవి వయస్సు తెలిసిన వాళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. 'చందన తరువును నరికే కొద్దీ సువాసన' వచ్చినట్లుగా 'కవి వృద్ధాప్య కర్పూరంలో యౌవనాగ్నులు దాగియున్న'ట్లు తోస్తుంది ఈ పద్యకాల్లోని ప్రణయార్తి హృద్యమో చోద్యమో భవిష్యత్తు నిర్ణయించాలి.

ఉర్దూ కవిత సౌరభాన్ని తెలుగు వారు తమ కవితా వాటికలో నాటు కొన్నంతగా తెలుగు వాసనలు ఉర్దూలోకి ప్రవేశించలేదు. డా॥ బూర్గుల రామ కృష్ణరావు, దేవులపల్లి రామానుజరావు, శ్రీమతి జీనత్ సాజిదా, కె. గోపాలకృష్ణ రావు, ఇరివెంటి కృష్ణమూర్తి లాంటి ఉభయ భాషావిశారదుల సత్కృషివల్ల తెలుగుసారస్వత చరిత్ర, విశేషాలు ఉర్దూభాషీయులకు అందజేయడం వరకు జరిగింది. తెలుగు కావ్యాలను ఉర్దూలో అనువదించడం తెలుగులో పూర్తిగా అభినివేశం కలిగిన ఉర్దూ కవులు చేయవలసిన పని. కాని, ఈ రంగంలో కృషి జరగలేదు.

మహమ్మదీయుల తర్వాత ఆంగ్లేయులు మన దేశాన్ని పాలించారు. ఆంగ్లేయులతో, ఆంగ్ల భాషతో పరిచయం ఏర్పడ్డ తర్వాత దేశభాషలన్నింటిలో క్రొత్త రకపు కవిత అవతరించింది. వర్డ్సు వర్తు, షెల్లీ, కీట్స్‌లాంటి కవుల రచనలు చదివిన తర్వాత తెలుగు కవితలో భావకవిత్వం అవతరించింది. పాత జరీ పట్టు చీరె కంటె నిగనిగలాడే నైలాన్ నాణ్యమనిపించింది. ప్రబంధ రచనా పాటవంలో పటిష్ఠులైన విద్వత్కవులకు ఆంగ్ల భాషతో, ఆంగ్ల కవుల నవీన భావాలతో పరిచయం ఏర్పడడంతో తెలుగు కవిత మరోమలుపు తిరిగింది. క్రొత్త పాతల మేలు కలయికకు మంచి అవకాశం లభించింది. కాని, యీ మార్పుకు చలించని మహాకవులూ ఉన్నారు, కదిలి కదిలించిన కవిపుంగవులూ ఉన్నారు. విశ్వనాథ కావ్యనిష్ఠ మొదటి తెగకు ప్రాతినిధ్యం వహించగా శ్రీ శ్రీ మహా ప్రస్థానం రెండవ తెగకు నాంది పలికింది. పాశ్చాత్య సారస్వతసారాన్ని రస దృష్టితో పరిశీలించి రసవత్తరంగా తన కావ్యంలోనే కాక తనతోటివారి రచనల్లో కూడా ప్రతిబింబించేట్టు చేసింది-శ్రీరంగం శ్రీనివాసరావు. శ్రీరంగం ప్రాచ్య

కవితారంగానికి ప్రాతినిధ్యం వహిస్తే శ్రీనివాసరావు చైతన్యవంతమైన పాశ్చాత్య కవితా సువాసనలకు నివాసమయిన స్ఫూర్తిశ్రీగా రూపొందినట్టు తోస్తుంది. శ్రీశ్రీతో పాటు ఆరుద్ర, శేషేంద్రశర్మలాంటి పలువురు కవులు కూడా ఈ రస తరంగిణిలో చేరారు. వీరు ముగ్గురూ ప్రాచీనసాహిత్యాన్ని కూలంకషంగా మథించిన మేధావులు. ఆరంభంలో అలాంటి రచనలతోనే కావ్యసాధన ఆరంభించి రాను రాను మారిన మనీషులు. 'ప్రభవ'తో ప్రారంభించిన శ్రీరంగం శ్రీనివాస రావు "ఫ్రెంచికవుల మంచి రీతు"లను, "షెల్లీ హాల్లీసకా"న్ని, "ఎజ్రా కాంతుల ఇనోదయా"న్ని, "రెక్క విప్పిన రెవిల్యూషన్నూ", "కదలి వలపూ వలపు కదలీ కలిసిపోయి కాన రాక కదలి పోయిన" స్విన్‌బర్న్ పాటలను విని విని శ్రీ శ్రీగా మారారు. శ్రీ శ్రీ శ్రీకంఠంలో పలువురు పాశ్చాత్య కవుల అనువాదాలు చక్కగా పలికాయి. శ్రీ శ్రీ సాహిత్యంలో చేరిన అనువాద కవితా ఖండికలు దాదావు 40 పేజీలకుపైగా నిండి ఉన్నాయి. ఇందులో E. E. Cumming అనే అమెరికా కవి నుంచి ఆంద్రే వోజ్‌నెసెన్‌స్కీ (Andre Voznesensky) అనే రష్యాకవి వరకు ఎందరో మహాకవుల భావనాభువనం కనిపిస్తుంది. ఇవి అనువాదాలని చెప్పుకుంటేతప్ప ఆమాట ఎవ్వరికీ తెలియదన్నంత సొంత గొంతుకతో ఈ పద్య రచన సాగింది. 'ఆనందం అర్ణవమైతే। అనురాగం అంబరమైతే। అనురాగపు టంచులు చూస్తాం। ఆనందపు లోతులు చూస్తాం' -అనే ఆనందపు గీతికలో స్విన్‌బర్న్ కవిత 'మ్యాచ్' ధ్వనిస్తున్నదని ఎవరు పసిగట్టగలరు? 'పిచ్చి దానిమ్మ చెట్టు' అనే శీర్షిక ఒడిస్యూస్ ఎలిటిన్ గేయానికి అనువాదం అని ఎవరు ఊహించగలరు? 'జగద్గురువులు, చక్రవర్తులు। సత్కవీశులు, సైన్య నాథులు। మానవతులగు మహారాజ్ఞులు। కానరారేమీ... । పసిడి రెక్కలు విసిరి కాలం। పారిపోయిన జాడలేవీ। ఏవి తల్లీ! నిరుడు కురిసిన। హిమసమూహములు......" అనే ఛాయాన్వేషణలో ఫ్రెంచి కవిత 'The Snows of yester year' లోని భావచ్ఛాయలను ఎవరు పోల్చుకోగలరు? ఇలాంటి అనువాదాలను, అనుసరణలను చదువుతుంటే శ్రీశ్రీని అనువాదకంఠీ రవుడని అనిపిస్తుంది. ఇలా దేశదేశాంతరాల హృదయాంతరాలలో సంచ

రించినా ఆ తెమ్మెరలకు సౌమ్మసిల్పక తన సొంత గొంతుకను సవరించుకొన్న శ్రీ శ్రీ పాశ్చాత్య కావ్యసంపదను అవలీలగా సంక్రమింప జేశారు.

అలాగే ఆరుద్రగారి 'త్వమేవాహం' సామ్యవాదాన్ని లెక్కప్రకారం అప్పజెవుతుంది. శేషేంద్రశర్మగారి మండే సూర్యుడిలో విశ్వవ్యాప్తమైన కవితా కాంతి గోచరిస్తుంది. 'నాదేశం నాప్రజలు' అని తనలో తను మురుసుకొని పోయిన కవి సముద్రంతో ముడిపెట్టుకుంటాడు. సముద్రం పేరు పెట్టుకొన్న కవివాక్కులో అంతర్జాతీయ దృక్పథం గల వ్హిట్‌మన్ (Whitman) కవిత్వం తొంగి చూస్తుంది. శేషేంద్రకవిత దాదాపు అంతా ఆంగ్లానువాదంతోనే అచ్చయింది. కాబట్టి కవియే తన కవితకు కాంతి కవాటం కల్పించినట్టయింది. ఇది అందరికీ సాధ్యం కాదు. సాధ్యమయితే అంతకుమించిన సాధనలేదు. ప్రతిభాషలో ఇలాంటి ద్విభాషిక సంకలనాలు తయారయితే భావసంప్రసారణం సులభమవుతుంది. ఈ పద్ధతి కనీసం సారస్వత సంస్థలద్వారా వెలువడే కవితాసంకలనాల్లో నయినా కనిపించటంలేదు. మూలం, అనువాదం పక్క పక్కనే కనిపిస్తే ఉన్నదున్నట్లుగా మాట తేట తెల్లమవుతుంది. ఆరిపిరాల విశ్వం, బాపురెడ్డిగార్లుకూడా ఇలాగే తమ రచనలను ఆంగ్లానువాదంతో అందించేందుకు ప్రయత్నిస్తున్నారు.

ఇటీవలికాలంలో హిందీద్వారా భావసమైక్యాన్ని సాంధించాలని ప్రభుత్వం ద్వారా, ప్రభుత్వసహాయంతో పనిచేసే సంస్థలద్వారా, ప్రజ్ఞావంతులైన పండితుల ద్వారా తీవ్రంగా కృషిజరిగింది. ఈ ప్రణాళికలక్రింద హిందీనుంచి తెలుగులోకి, తెలుగునుంచి హిందీలోకి అనేకరచనలు అనువాదరూపంలో వచ్చాయి. ఒక విధంగా ఇలాంటికృషి హిందీ జాతీయభాషగా రూపొందక మునుపే ఆరంభ మయింది. తెలుగులోకి వచ్చిన హిందీ కావ్యాల్లో మొట్టమొదటిది తులసీ రామా యణమనే చెప్పాలి. క్రీ. శ. 1880 ప్రాంతంలో శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి తులసీ రామాయణాన్ని దోహా-చౌపాయీ ఛందస్సులో తెలిగించటం ఆరంభించి అరణ్య కాండలో మారీచవధవరకు సాధించారు. తర్వాత మండా నరహరిశాస్త్రిగారు దీన్ని సొంతంగా సాగించారు అనువాదం తెలుగు పాఠకులకు అంత హృద్యంగా

ఉండదు. కాని హిందీలో తులసీదాసు వాడిన ఛందస్సునే వాడుతూ దానికితోడు తెలుగు ఛందోనియమాలను గూడా పాటిస్తూ ఒకమహాకావ్యాన్ని రూపొందించడం సామాన్యమైన పనికాదు. కాబట్టి పరిశోధన దృష్ట్యా ఈ అనువాదానికి ప్రాశస్త్యం ఉంది. తర్వాత తర్వాత ఈ గ్రంథానికి రెండు మూడు పద్యానువాదాలు వెలువడ్డాయి. గద్యానువాదాలుకూడా చాలాఉన్నాయి. వీటిలో దినవహి సత్యనారాయణగారి గద్యానువాదం, శ్రీరామతీర్థ సేవాశ్రమం ప్రచురించిన 'శ్రీమదాంధ్ర తులసీ రామాయణం' (పద్యానువాదం) హృద్యంగా ఉంటాయి. ఈ రెండు ఇటీవల వచ్చిన అనువాదాలు. 1956-57లో మైలవరపు సత్యనారాయణ గారి 'ఆంధ్ర తులసీరామాయణం' కూడా చెప్పుకొనదగ్గ పద్యానువాదం. అంతకు ముందు 1927లో వేగుచుక్క గ్రంథమాల క్రింద భాగవతుల నరసింహశర్మగారి పద్యానువాదంకూడా ప్రచారంలోకి వచ్చింది. గ్రంథరూపంలో కాక పురాణ కాలక్షేపంద్వారా తులసీ రామాయణాన్ని తెలుగు శ్రోతలకు పరిచయం చేసినవారిలో నోముల అప్పారావుగారి కృషి అభినందించదగినది. కాకినాడ ఆధ్యాత్మిక గ్రంథ మాల తరఫున వీరి రచనలను ప్రచురించేందుకు కూడా కొంతకృషి జరిగింది. కొంతవరకు ఫలించిందికూడా. ఇలా అనేకులు అనేకవిధాల తులసీదాసు కవితా వైభవాన్ని, భక్తితాత్పర్యాలను తెలుగు వారికి అందించేందుకు ఎంతోకృషి చేస్తున్నారు. తెలుగువారికి రామాయణమంటే ఆరాట మెక్కువ. భారత భాగవతాలు తెలుగులో వచ్చినంత ఆపాతమధురంగా రామాయణం లభించకపోవటమే దీనికి కారణం. అనువాదాలు, అనుసరణలు అనేకా లున్నాయి. కాని, తులసీదాసు సూక్తిలోని సుళువు, సొగసు, మనసుకుపట్టే మాధుర్యం మరో అనువాదం అందించగలదా అని అనుమానం వేస్తుంది. దానికి మరో తులసీదాసు కావాలి.

హిందీలో తులసీ రామాయణం తర్వాత చెప్పుకొనదగ్గ కావ్యం జయశంకర్ప్రసాద్ వ్రాసిన 'కామాయని'. ఈ కావ్యానికి ఇప్పటికి రెండు అనువాదాలు తెలుగులో ఉన్నాయి. మొదట మొదట అయాచితుల హనుమచ్ఛాస్త్రి గారు ఈ పనికి ఉపక్రమించి తర్వాత ఉపసంహరించుకున్నారు. ఆ తర్వాత వావిలాల సోమయాజులు గారు 'స్రవంతి' మాసపత్రికలో ధారావాహికంగా

'కామాయని'ని కొనసాగించారు ఇది చాలా ప్రౌఢంగా సాగింది. కాని, యీ అనువాదం ఇంకా పుస్తకరూపాన్ని పొందినట్టు కనిపించలేదు. దీనికి సాహిత్య అకాడమి వారి సహకారం లభించింది ఇది ఇలా ఉండగా యం. శేషాచలం కంపెనీ వారు ఎమెస్కో పాకెట్ బుక్స్ కింద ఈ వ్యాసకర్త వ్రాసిన 'కామాయని'ని 1974 లో ప్రచురించారు. ఇందులో మాత్రాఛందస్సు వాడటం జరిగింది అంతకుముందు వెలువడిన అనువాదాల్లో తెలుగు ఛందస్సు వాడబడింది. మొత్తం మీద జయశంకర వాగ్విభూతికి మకుటాయమానమైన యీ ప్రసిద్ధ హిందీ కావ్యం ఈనాడు తెలుగు పాఠకులకు చదివి ఆనందించే అవకాశం లభించింది. జయశంకర ప్రసాద్ వ్రాసిన మరో ఖండకావ్యం 'ఆఁసూ'. దీనికి కూడా తెలుగులో రెండుమూడు అనువాదాలు ఉన్నాయి, షేక్ దావూద్ గారు చేసిన అనువాదాన్ని వారి నోటనే నేను విన్నాను. ఒకానొక విషాదకరమైన పరిస్థితిలో నామనఃస్థితికి ఈ కావ్యంలోని భావాలు అద్దంపట్టినట్టు కనిపించి నప్పుడు నేను కూడా ఈ కావ్యాన్ని తెలుగులో వ్రాసుకున్నాను అదే 'కన్నీరు' అనే పేరిట దేశిబుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారు 1987 లో ప్రచురించారు.

మహాభారతంలోని శాంతిపర్వాన్ని ఆధారంగా చేసుకొని రామధారీసింహ్ 'దినకర్' వ్రాసిన 'కురుక్షేత్ర' కావ్యం కూడా తెలుగులో వచ్చింది. మైథిలీశరణ్ గుప్త వ్రాసిన 'పంచవటీ' కూడా తెలుగులో లభిస్తుంది. సుకుమారకవి సుమిత్రానందన్ పంత్ వ్రాసిన కావ్యఖండికలను కొన్ని ఏరి వాటికి రసనిర్భర మైన తెలుగు అనువాదాలను వ్రాయించి స్రవంతి మాసపత్రిక ఒక ప్రత్యేక సంచికను ప్రచురించింది. బహుశా ఇది పంత్ షష్టి పూర్తిని పురస్కరించుకొని 1960 లో వెలువడింది. ఇందులో దాశరథి, దుర్గానంద్, వావిలాల లాంటి సిద్ధహస్తుల అనువాదాలు ఉన్నాయి. ఆ తర్వాత 1969 లో పంత్‌కు భారతీయ జ్ఞాన పీఠ బహుమతి లభించింది. బహుమతి పొందిన కావ్యం 'చిదంబర' కు నా అనువాదాన్ని జ్ఞాన పీఠమే ప్రచురించింది. ఇంకా మహాదేవీ వర్మా, నిరాలా లాంటి ప్రముఖుల రచనలు తెలుగులోకి రావాలి. 'ఆధునిక హిందీ కవిత' వైపు మన దృష్టి ఇంకా ప్రసరించలేదు ఈ విషయంలో అకాడమీలు కొంత శ్రద్ధ

పరిస్తే నేటి హిందీ కవితకు పరిచయం చేసే ఒక కావ్య సంకలనం రూపొందించవచ్చు.

ఇలాంటి సంకలనాలు తెలుగుకవితను గురించి హిందీలో రెండుమూడు వచ్చాయి. ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ యాజమాన్యాన 1969 లో డా॥ వావలి సూర్యనారాయణమూర్తి గారు 'ఆధునిక తెలుగు కవిత' అనే సంకలనానికి మొదటి భాగం తయారు చేశారు. దీన్ని అకాడమి ప్రచురించింది. దీనికి అనుబంధంగా మరో సంకలనం అదే పేరిట ఆలూరి బైరాగి తయారుచేశారు. దీన్ని కూడా అకాడమీ వారే ప్రచురించారు. కాని, యీ రెండు సంకనాల నిర్వహణతో వ్యత్యాసం ఉంది. వావలి సూర్యనారాయణమూర్తి పలువురు అనువాదకుల సహకారంతో మెదటి సంకలనాన్ని తయారు చేస్తే, బైరాగిగారు ఒంటరిగా అన్ని అనువాదాలను సాధించారు. బైరాగి రెండు బాసలకు మేటియైన కవి. ఇందులో బైరాగి గారి రచనలు కూడా ఉన్నాయి. తన రచనలను తానే అనువాదం చేసుకోవడంలో ప్రత్యేకమైన సౌకర్యం ఉంది. మొదటి సంకలనంలో కంటె రెండవ దానిలో ఆధునికత ఎక్కువగా ఉన్నట్టు తోస్తుంది. ఈ తరం కవుల రచనలు ఎక్కువగా ఇందులో చేరటమే కారణం. అనువాదాలు రెండింటిలో హృద్యంగానే ఉన్నాయి. మొదటి సంకలనంలో అనువాద కార్యంలో మూర్తి గారికి సహకరించిన వారిలో రాపర్తి సూర్యనారాయణ, అయాచితుల హనుమచ్ఛాస్త్రి, కోట సుందర రామశర్మ, సూర్యనారాయణ 'భాను', బాలశౌరి రెడ్డి, పి. ఆదేశ్వరరావు, కర్ణ రాజశేషగిరి రావు, కె.వి.యస్. అప్పారావు, ముట్నూరి సంగమేశం, దువ్వూరి రామకృష్ణమూర్తి పేర్లు కనిపిస్తాయి. ఇందులో స్వతస్సిద్ధంగా హిందీలో కావ్యరచన చేసే వారి అనువాదాలు వినసొంపుగా ఉంటాయి. మిగిలిన వాటిపై అనువాదముద్ర కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. మొత్తం మీద ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ చేసిన యీ కృషి చాల మంచిది.

ఇలాంటి కృషి చిన్నయెత్తులో సూర్యనారాయణ 'భాను' వ్యక్తిగతంగా చేశారు. 'ఆధునిక కావ్యధారా' అనే శీర్షికతో వారు దాదాపు అరవై కావ్య

ఖండికలకు సరళమైన పద్యానువాదం కూర్చారు. ఈ సంకలనానికి కేంద్ర ప్రభుత్వం బహుమతి కూడా లభించింది. ఈ సంకలనం కూడా 1969 లోనే వెలువడింది. ఇవి కాక కేవలం శ్రీ శ్రీ రచనలతో మరో కావ్య సంకలనం గౌ॥ ఖానుగారు హిందీలో ప్రచురించారు.

ఈ సంకలనాల తర్వాత ఒక దశాబ్దం గడిచింది. ఈ దశాబ్దంలో తెలుగు కవితలో ఎన్నో మలుపులు వచ్చాయి. వీటిని హిందీ ప్రపంచానికి పరిచయం చేయవలసిన బాధ్యత సారస్వత పరాయణులపై ఉంది.

ఇలాంటి సంకలన రూపంలోనే కాక గ్రంథరూపంలో కూడా తెలుగు సాహిత్యం హిందీలోకి ప్రవేశించింది. ఇందులో ముఖ్యంగా పేర్కొనదగింది వారణాసి రామమూర్తిరేణుగారి 'భాగవత పరిమళ'. పోతన భాగవతంలోని ముఖ్యమైన ఘట్టాలను ఎన్నుకొని వాటికి పద్యానువాదం ఇందులో అందించటం జరిగింది. అసలు భాగవతం తెలిసి పలకటమే కష్టం అని పోతన అణకువతో విన్నవించుకుంటాడు. అలాంటి భక్తాగ్రేసరుని వాక్కును మరోభాషలో వ్రాయటం సామాన్యమైన పనికాదు. పోతన హృదయాన్ని అందుకొనేందుకు 'రేణు' గారు ఇందులో చాలావరకు ప్రయత్నించారు. 'అడిగెద నని కడువడి జను' లాంటి అమోఘ వాగ్వైఖరిని హిందీలో అలాగే అందించేదుకు వారు చేసిన ప్రయత్నం అభినందనీయం. శబ్దసౌకుమార్యమే కాక భావలాలిత్యం, భక్తితాత్పర్యం పోతన కవితకు ప్రాణం. ఇలాంటి రచనను హిందీచేసేందుకు పూనుకొన్న రేణుగారు పూజ్యులు.

ఆంధ్ర భాగవతాన్ని అనువదించిన రేణుగారే జాషువాగారి 'గబ్బిలా'న్ని హిందీలో వ్రాశారు. ఇది చిన్నపద్యకావ్యం. ఇదికాక వేమనపద్యాలకు హిందీ అనువాదం కూడా చేశారు. కాని, అది గద్యం. ఇలాగే బాలశౌరిరెడ్డిగారు తెలుగు కావ్యాలలోని సారాన్ని హిందీవారికి అందజేసే ప్రయత్నం చేశారు. చావలి సూర్యనారాయణమూర్తిగారు 'కళాపూర్ణోదయం' హిందీలో వ్రాశారు. బూదరాజు సుబ్బారావుగారు 'పారిజాతాపహరణా'నికి చేసిన అనువాదం కొంతభాగం నేను

వారి నోటనే విన్నాను. తెలుగు ప్రబంధాలను హిందీలో కావ్యరూపంగా అందించ గల శక్తి వద్దిపర్తి చలపతిరావు గారిలో ఉంది. 'మనుచరిత్ర' ను చక్కని హిందీలో వ్రాశారు, కాని, అది వెలుగులోకి వచ్చినట్టులేదు. కవితను కవితలో అనువదించాలా, గద్యంలో వ్రాయాలా అనేవిషయం మీద పండితులు, అకాడ మీలు చాలాతీవ్రంగా చర్చలు చేసి, చివరకు గద్యంలోనే ఉంటే క్షేమం అన్నట్టుగా తీర్మానించారు. ఇది చాల విచారించవలసిన విషయం. అనువాదం అంటే ఏమిటో అర్థంచేసుకోలేనివారు చేసిన నిర్ణయం ఇది కాని, తప్పు వారిది కాదేమో! అలాంటి నిర్ణయానికి అవకాశం ఇచ్చిన అనువాదకులు ఈ బాధ్యతను తప్పించుకోలేరు.

అడపా దడపా తెలుగుసాహిత్యం హిందీలో సమర్థవంతంగానే వస్తున్నది. పురిపండా అప్పలస్వామిగారి కవితను గుఱ్ఱం సుబ్బారావుగారు అనువదించి పుస్తకరూపంలో ప్రచురించారు. ఇలాగే కవిశ్రీ గ్రంథమాలలో డా॥ భీమసేన్ నిర్మల్‌గారు కాటూరి-పింగళికవుల రచనలను హిందీవారికి పరిచయంచేశారు. ఇదికాక రాయప్రోలు సుబ్బారావుగారి 'రూపనవనీతం', అబ్బూరి రామకృష్ణా రావుగారి 'నదీసుందరి' వారి వాక్కులలోనే హిందీవారికి అందింది. యం బి.వి. ఆర్. శర్మగారు 'సుమతీశతకం'లాంటి రచనలను హిందీలో వ్రాశారు. హిందీ-తెలుగు రెండింటిలో సమానమైన పాండిత్యం కల దుర్గానంద్‌'పిరదౌసి'కావ్యాన్ని హిందీలో వ్రాశారు. సూరదాసు పాటలను కూడా వీరు తెలుగులో వ్రాశారు.

కీ. శే. కామాక్షిరావుగారు 'రంగనాథ రామాయణా'నికి హిందీలో గద్యానువాదం చేశారు. ఇటీవల భువన్‌వాణీట్రస్టు ఆధ్వర్యాన డా॥ నిర్మల్‌కూడా ఈ గ్రంథాన్ని యథాతథంగా నాగరీలిపిలోవ్రాసి దానికి యథామూలమైన అనువాదాన్ని కూడా సమకూర్చారు. అదేసంస్థ 'మొల్ల రామాయణాన్ని' కూడా నాగరీ లిపిలో హిందీ అనువాదంతో ప్రచురించింది డా॥ రాములు ఈ అనువాద కార్యాన్ని నిర్వహించారు. ఇలాంటి ప్రచురణలు వ్యయప్రయాసలతో కూడినవే. కాని, మూలాన్నికూడా హిందీభాషీయులకు అందించడంలో ఇవి బాగా తోడ్పడు

తాయి. కాని, అనువాదం గద్యరూపంలో ఉండటం అంత హృద్యంగా లేదు. అయితే ఏదోరూపంలో తెలుగుల కావ్యసంపద హిందీలోకి, హిందీద్వారా తదితర భాషల్లోకి, అందడం ఆనందించవలసిన విషయం.

ఇలా గ్రంథరూపంలో వెలువడిన అనువాదాలేకాక సారస్వత పత్రికల్లో కూడా ఇతర భాషలకు చెందిన కవిత అనువాదరూపంలో చదువుకునే అవకాశం దాదాపు అన్ని భాషలవారికీ లభిస్తూ ఉంది. ముఖ్యంగా 'స్రవంతి' మాసపత్రిక ఇలాంటి సదుపాయం కల్పించటంలో ముందంజవేస్తున్నది. ఈ సంస్థద్వారా ఇటీవల వెలువడుతున్న 'పూర్ణకుంభ్' అనే హిందీ పత్రిక తెలుగు కవితల హిందీ అనువాదాన్ని బీరుపోకుండా ప్రతిసంచికలో ప్రచురిస్తున్నది. 'దక్షిణ భారత్' అనే పత్రిక యీ పని ఇంతకుముందు నుంచే సాధిస్తున్నది కాని 'పూర్ణకుంభ్' పూర్తిగా తెలుగువారికి ఉద్దిష్టమైన హిందీ పత్రిక.

హిందీ-తెలుగు భాషలమధ్య జరిగే యీ ఆదాన-ప్రధాన కార్యక్రమాన్ని ముఖ్యంగా కవితారంగంలో జరిగే కృషిని-గమనిస్తే రెండువిషయాలు తెలియ వస్తాయి. మొదటిది-హిందీనుంచి తెలుగులోకి వచ్చినంతగా తెలుగుకవిత హిందీలో ప్రవేశించలేదు. ఆ ప్రవేశించిన కొద్దిభాగంకూడా హిందీవారి దృష్టిని ఆకట్టుకోలేకపోతున్నది. నిజానికి తెలుగును హిందీ చేయడం తెలుగువారి పని కాదు. హిందీకవితా వైభవాన్ని తెలుగువారికి ఆస్వాదయోగ్యంగా అందించటం మాత్రమే తెలుగుకవులు చేయవలసిన, చేయగలగిన పని- తెలుగులోని ఉత్కృష్ట కావ్యసంపదను హిందీ చెవికి ఇంపుగా ఉండేట్టు రూపాంతరితం చేయటం హిందీ కవుల కర్తవ్యం. ప్రస్తుతం ఈ రెండురంగాల్లో తెలుగువారే కృషిచేస్తున్నారు. కాని, ఇతరుల కార్యభారాన్ని తమమీద వేసుకొన్నా, సమర్థవంతంగానే చేస్తున్నారని చెప్పకతప్పదు. వారణాసి రామమూర్తి, ఆలూరి బైరాగి, రాపర్తి సత్యనారాయణ 'భాను', ఆదేశ్వరరావులాంటి ప్రతిభాసంపన్నులయిన కవులు ఈ రంగంలో సాధించిన సాఫల్యాన్ని హిందీ-తెలుగు సారస్వతాలు ఎన్నడూ మరువలేవు. అనువాదరంగంలోనే కాక స్వతంత్ర కావ్యరచనలోకూడా వీరిది అందె వేసిన చెయ్యి. కాని, యీ ప్రతిభను సక్రమంగా సద్వినియోగం చేసుకోనే

సంస్థలుకాని, వ్యవస్థకాని ఇంతా అంత బాధ్యతతో ఈ పనిని నిర్వహించడం లేదేమో అనిపిస్తుంది. కాలం గడవాలి. కవి సేతువులను గమనించి గౌరవించే కాలం రావాలి.

ఉత్తరదేశ భాషల్లో హిందీ తర్వాత తెలుగుకు ఎక్కువ మక్కువ కూర్చినభాష- బెంగాలీ హిందీభాషతో గల సంపర్కం కొంత రాజకీయం, చాలావరకు సాంస్కృతికం. కాని, వంగభాషపై తెలుగులకు ఏర్పడ్డ అనురాగం, మమకారం కేవలం సాంస్కృతికమైనవి పద్యసారస్వత రసపిపాసువల్లనే తెలుగు కవులు వంగదేశీయుల కవితను గౌరవించారు రవీంద్రుని గీతాంజలి తెలుగులో ఎన్ని రూపాలనో తాల్చింది ఇప్పటికీ సరికొత్త అనువాదాలు కోకొల్లలుగా వస్తూఉన్నాయి. గోపాలరెడ్డిగారు శాంతినికేతనవాసులుగా వంగభాష నభ్యసించిన సహృదయులు కావటంవల్ల ఈ రంగంలో చాలా కృషిచేశారు. నైవేద్యం, సంస్మరణలాంటి కావ్యాలను తెలుగులోకి తర్జుమా చేశారు. ఆంగ్లానువాదాలను ఆధారం చేసుకొని అనువదించిన రచనలకంటే రెడ్డిగారి అనువాదాల్లో నిజాయితీ ఎక్కువగా ఉన్నదనటంలో సందేహంలేదు. కాని, రవీంద్రుని పదబంధం యథాతథంగా ఈ అనువాదాలు తీసుకరాలేకపోయినాయేమో అనిపిస్తుంది. రెడ్డిగారు సహృదయులు. కాని, కవిహృదయం సహృదయులకు సహజంగా లభించే వారసత్వపు సొత్తు కాదు. 'నైవేద్యం'లోని గేయాలు కొన్ని గీతాంజలిలో కూడా ఉన్నాయి. 'గీతాంజలి'కి తెలుగులో వచ్చిన అనువాదాలను తులనాత్మకంగా పరిశీలిస్తే మన అనువాదాల్లో ఎంతవరకు మూలం అందిందో అర్థమవుతుంది. ఎక్కువమంది ఒకేరచనను అనువదించడంలో తప్పేమీ లేదు. అది ఆ రచన ప్రాశస్త్యాన్ని తెలియపరుస్తుంది. అదీకాక ఉత్కృష్టమైన రచన ఒకరాగాన అనువాదానికి లొంగదు పలువురు పలుకీతుల్లో ప్రయత్నిస్తారు. ఎవరో ఒకరు కృతకృత్యులవుతారు. మహోన్నతమైన కావ్యాన్ని మరో భాషలో అమర్చడం తాజ్‌మహల్‌ను పడగొట్టి మళ్ళీ కట్టడంలాంటిదని ఒక హిందీకవి అన్నాడు. నిజమే. కాని, ప్రయత్నించడంలో తప్పు లేదు.

రవీంద్రుని తర్వాత బెంగాలీలో కవిత్వం చాలా దూరం పయనించింది. ఆతీసుతెన్నులు తెలుగువారికి పరిచయం చేసే అనువాదాలు రావడం లేదు. బెంగాలీతో పరిచయం కలిగి కవితా రచనలో సహజమైన ప్రవేశం కలిగిన యువకులు ఈ పనికి పూనుకోవాలి.

అలాగే మిగిలిన భాషల్లో కూడా ప్రస్తుతం ఎలాంటి కవిత వస్తున్నదో తెలుసుకునేందుకు దోహదం చేసే అనువాద సాహిత్యం మన కీనాడు కావాలి పంజాబీలో 'గ్రంథ సాహెబ్' లోని కొన్ని కీర్తనలు తప్ప మరియేమీ మనకు తెలియదు. ఈ మధ్య బాబా ఫరీద్ అనే తత్త్వవేత్త వ్రాసిన ఆధ్యాత్మికకవితను గురునానక్ విశ్వవిద్యాలయం వారు అన్ని భాషల్లో ప్రచురించేందుకు ఒక ప్రణాళిక తయారు చేశారు. బాబా ఫరీదు 12వ శతాబ్దానికి చెందిన సూఫీకవి. ఈయన రచించిన గేయాలు 'గ్రంథసాహెబ్'లో చాలా ఉన్నాయి ఇవి తెలుగులో వస్తే ఆధ్యాత్మిక జిజ్ఞాసువులు చదువుకొని ఆనందించగలరు. కాని సమకాలీన పంజాబీ సమాజాన్ని స్పందింపజేస్తున్న కవితారీతులు ఎలా ఉన్నాయో తెలుసుకునేందుకు ఉపయోగపడే అనువాదాలు తక్కువగా వస్తున్నాయి.

అలాగే అస్సామీ, ఒరియా, మరాఠీ, గుజరాతీ లాంటి భాషల్లో ఈనాడు ఎలాంటి కవిత వ్రాస్తున్నారు- అనే విషయం ఆ భాషలతో ప్రత్యక్షపరిచయం లేనివారికి బోధపడటం లేదు. అలాంటి అనువాదాల ఆవశ్యకతను బట్టి ఎవ్వరూ పట్టించుకున్నట్టు లేదు. అందాకా అక్కరలేదు. మనకు ఇరుగు పొరుగు భాష లయిన తమిళం, మళయాళం, కన్నడంలోని కవితారీతులను గురించి కూడా మనకు తెలియవలసినంతగా తెలియదు. మలయాళంనుంచి చెప్పుకోదగిన ఒక్క కావ్యం కూడా తెలుగులో అనువదింపబడినట్టు తెలియదు. తెలుగునుంచి మలయాళంలోకి వెళ్ళిన కవిత కూడా మృగ్యం. ఇటీవల కన్నడ-తెలుగు సారస్వతాల మధ్య పరస్పరమయిన అవగాహన హెచ్చుతూ ఉండడం మంచి లక్షణం. రెండు భాషల్లో సమానమయిన పాండిత్యం గల ప్రతిభావంతులయిన తెలుగు కవులు కన్నడవాసనలను తెలుగు కవితలో వెలయించగలుగుతున్నారు,

కాని, కన్నడ కవితను తెలుగులో, తెలుగుకవితను కన్నడంలో అనువదించ గలిగితే అది అందరికీ ఉపకరిస్తుంది. ఇతర భాషలతో సంబంధం కల కవులు తమ రచనల్లో ఆ భాషాగంధాన్ని ప్రవేశ పెట్టడం వ్యక్తికి మాత్రమే పరిమిత మవుతుంది. అలాంటి మేధావులు చక్కని అనువాదాలు చేస్తే అవి సార్వజనీన మైన శ్రేయస్సును సాధించగలుగుతాయి. కన్నడంలో కనిపించే తెలుగు కావ్యాల్లో ముఖ్యంగా పేర్కొనదగినవి- సోమనాథుని బసవపురాణం, పండితా రాధ్య చరిత్ర, మనుచరిత్ర, రుక్మిణీ కల్యాణము, దిగంబరకవిత. దిగంబర కవితను గురించి కన్నడ దేశీయులే కాక భారతీయ కవులందరూ అభిరుచి చూపించారు. కన్నండంలోని 'బసవవచనామృతా'న్ని బాడాల రామయ్యగారు తెలుగు చేశారు. వేదాంతం, భక్తికి సంబంధించిన రచనలు అనువాదరంగంలో ప్రాముఖ్యాన్ని వహిస్తున్నట్లు తోస్తుంది.

ఈ విషయం తమిళ సారస్వతంపట్ల పూర్తిగా వర్తిస్తుంది తిరుప్పావై తిరుక్కురళ్‌లాంటి రచనలకు తెలుగులో ఎన్నో అనువాదాలు కనిపిస్తాయి. పరవస్తు వేంకట రంగాచార్యులు, మాడభూషి గోపాలాచార్యులు, దేవులపల్లి కృష్ణ శాస్త్రి వానమామలై వరదాచార్యులు, పి సీతారామయ్యలాంటి సహృదయులు తిరుప్పావైను పలురకములుగా అనువదించారు. ఇలా బహుముఖంగా వెలసిన అనువాదాలను తులనాత్మకంగా పరిశీలిస్తే అనువాదశిల్పులకు చాలా ఉపకరి స్తుంది. తిర్కుకురళ్‌కు కూడా రెండుమూడు అనువాదాలు కనిపిస్తాయి. వీటిలో చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారి అనువాదం హృద్యంగా సాగింది. వారి కుమారులు చల్లా రాధాకృష్ణశర్మగారు తండ్రిజాడల్లోనే ఈ కావ్యానువాదాన్ని పూర్తి చేశారు. తమిళంలోని కంబ రామాయణమేకాక సిలప్పదికారం, మణిమే ఖలై, లాంటి ప్రసిద్ధ రచనలనుకూడా పూతలపట్టు శ్రీరామములు రెడ్డిగారు చాల సమర్థవంతంగా తెలుగు చేశారు. కొత్తపల్లి సూర్యారావుగారు అవ్వైయార్‌ను తెలుగులకు అందించారు.

తెలుగునుంచి తమిళంలోకి వెళ్ళిన కావ్యాల్లో మనుచరిత్ర, వసుచరిత్ర, కవిత్రయ మహాభారతంలాంటి ప్రసిద్ధ గ్రంథాలేకాక తెలుగువారికికూడా బాగా

తెలియని భానుమద్విజయం (వెలగపూడి కృష్ణయమాత్యులు), భాగవతసారం (పుష్పగిరి తిమ్మన) లాంటి లఘుకావ్యాలు కూడా ఉన్నాయి. ఈ కావ్యాలు చాలాకాలం క్రితం తమిళంలో తర్జుమా చేయడం జరిగింది. ఇవికాక సుమతి శతకం, వేమన పద్యాలు, త్యాగరాజ కీర్తనలు కూడా ఈ శతాబ్దారంభంలో తమిళంలో ప్రవేశించాయి కాని, హృదయరంజకమైన త్యాగరాజ కీర్తనలు అర్థం చేసుకునేందుకు ఈ అనువాదాలు ఉపకరించాయేకాని పాడుకుని ఆనందించేందుకు అసలు కీర్తనలే కావాలి అనువాదం ఎంతవరకు మూలాన్ని అనుభవంలోకి తీసుకుని రాగలదో ఈ అనువాదాలవల్ల బోధపడుతుంది. సుబ్రహ్మణ్య భారతిలాంటి నవయుగ వైతాళికుల కావ్యసారాన్ని తెలుగులకు అందజేయడంలో చల్లా రాధాకృష్ణశర్మగారు చాలా కృషి చేస్తున్నారు వారి తండ్రిగారి కార్యదీక్ష, కావ్యశక్తి వారికి స్ఫూర్తిని ప్రసాదించాయి. వారి తండ్రి చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఒకవైపు తమిళం, మరోవైపు హిందీ సాహిత్యాలతో సమానమైన సంబంధబాంధవ్యాలను పెంచుకొన్నపెన్నిధి హిందీలో 'మోతియోంకాహార్' అనే ముక్తకకావ్యం వారు వ్రాశారు. ఇందులో వేమన పద్యాలు, సుమతీ శతకం, భాస్కర శతకం లాంటి నీతికావ్యాలసారం హిందీ పద్యాల్లో హృద్యంగా వినిపిస్తుంది. ఈ సందర్భంలో ముఖ్యంగా చెప్పుకోవలసింది– శాస్త్రిగారి 'విరివాన' అనే అనువాదకావ్యం. ఇది ఫలానా కావ్యానికి అనువాదమని ప్రత్యేకంగా చెప్పకపోతే ఇది అనువాదమని ఎవ్వరూ అనుకోరు. ప్రాచీన హిందీ సాహిత్యంలో తులసీరామాయణం భక్తికావ్యాలకు ప్రతినిధి రచన అయితే 'బిహారీ సత్‌సయీ' శృంగారరస కలశం ఏడువందల దోహా ఛందస్సులలో సారగర్భిత పదసంపదతో కూర్చబడ్డ యీ బిహారీ కావ్యాన్ని శాస్త్రిగారు సరళంగా, సరసంగా తెలుగు చేశారు. నాయిక రూపలావణ్యాన్ని వర్ణిస్తూ కవి అన్న మాటలు :

వ్యయము తగ్గించుకొన లోభియైనమామ
చిట్టి చేతుల బిచ్చంబు పెట్టు మనుచు
కోడలిని నిల్ప– పురిలోని కోడిగాండ్రు
బిచ్చగాం డ్రౌచు మూగిరి బిచ్చమునకు.

ఈ కావ్యాన్నే ఇటీవల యస్. పానయ్య చౌదరి గారు కూడ తెనిగించినారు. ఇది కూడ చాల ధారాళంగా ధారాపద్ధతితో సాగింది. ఒకే కావ్యానికి వెలువడిన అనేక అనువాదాలను నిరసించక నిశితంగా పరిశీలించడం అనువాదకులకూ, అనుమోదకులకూ ఆరోగ్యకరం.

ఇతరభాషల్లోనుంచి తెలుగులోకి, తెలుగునుంచి ఇతరభాషల్లోకి ప్రవేశించిన సారస్వతాన్ని తులనాత్మకంగా పరిశీలించిచూస్తే ఇలాంటి సాహిత్యంలో-ముఖ్యంగా కవితలో-హిందీతో తెలుగుకు ఉన్నంతస బంధం మరో భాషతో ఉన్నట్టు కనిపించదు అందుచేను హిందీనుంచి తెలుగులోకి వచ్చిన కావ్యాలే ఎక్కువగా కనిపిస్తాయి. మరోవిశేష మేమంటే ఈ అనువాదాలు ఎక్కువగా ప్రాచీన సాహిత్యానికి చెందినవి. కామాయని, చిదంబర, కురుక్షేత్రలాంటి కొన్ని నవ్యకావ్యాలు తప్ప ఇటీవల హిందీలో వెలువడిన సారస్వతంపై పు అనువాదకుల దృష్టి మళ్ళటంలేదు సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్ ట్రస్టులాంటి సారస్వత సంస్థలుకూడా ఈ ప్రక్రియపట్ల చూపవలసినంత శ్రద్ధ, ఆసక్తి చూపించటంలేదు. కథా సాహిత్యం, జ్ఞానవిజ్ఞానం లాంటి విషయాలపై వారిధ్యానం కేంద్రీకృతమై ఉంది. ఎవరోఒకరు పట్టించుకొని ఈనాడు మనభాషల్లో వెలువడుతున్న కవితలో భారతీయతను గమనించి పెంపొందించేట్టు చూడాలి. మాటిమాటికి భారతీయ సాహిత్యం అని అంటుంటాం. కాని, వేరువేరుభాషల్లో వినిపించే అమూలస్వరాన్ని ఎలా అందుకోవాలో ఆలోచించి, ఆ ఆలోచనలను కార్యరూపంలో అనువదించేందుకు ఇంతటనైనా గట్టి ప్రయత్నాలు జరగాలి. దీని కొక వ్యవస్థితమైన ప్రణాళిక అవసరం. మేధావులైన కవులు, బహుభాషాకోవిదులు తెలుగువారిలో అనేకు లున్నారు. వారి మేధాశక్తిని పురస్కరించుకొని సరియైనదారిలో సారస్వత సహజీవనానికి సంస్కార సంపన్నులైన వ్యక్తులు, 'సర్కారీ' సహకారంగల సంస్థలు త్రికరణశుద్ధిగా ప్రయత్నించాలి. వేరు వేరు భాషలకు చెందిన యువ కవులను ఒకవేదికపైకి రప్పించి వారిలో పరస్పర అవగాహన పెంపొందించేట్టు కొన్ని సదస్సులు ఏర్పాటుచేయవచ్చు. ఆ సదస్సుల్లోని చర్చలను పుస్తక రూపంలో ప్రచురించవచ్చు. వేరువేరు భాషలతో సన్నిహిత పరిచయం

గలిగి తెలుగులో కవిత వ్రాయగల యువకుల (ఉత్సాహవంతులైన పెద్దల) జాబితా ఒకటి తయారు చేసి, వారి సహకారాలతో సమర్థవంతములైన అనువాద కావ్యాలు తయారుచేయించవచ్చు. ఇంతవరకు వెలువడిన అనువాద కావ్యాలను పరిశీలించేందుకు ఒక పరిశోధన సంస్థ నెలకొల్పవచ్చు. లేదా విశ్వవిద్యాలయాల్లో జరిగే పరిశోధనలో దీనికికూడా స్థానం ఇయ్యవచ్చు. అన్నిటి కంటె ముఖ్యం అనువాద కార్యాన్ని గౌరవ భావంతో చూడడం. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, మరాఠీ హిందీ మొదలయిన భాషల్లో వెలువడే సాహిత్యం ఆ భాషకే పరిమితం కాకుండా దాన్ని భారత భారతీ బృహత్ సంహితలో చేర్చే మహత్తర కార్యాన్ని అనువాద భారతి సాధించగలదు. ఆ భారతి అందరికీ ఆరాధ్యం కావాలి.

వాణీ రక్షతి రక్షితా



# నవల - మహిళ

—డా॥ జి. లలిత

శీర్షిక కొంచెం అస్పష్టంగా ఉన్నది. ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలలో ఒకటైన నవలలో చిత్రితమైన "మహిళ" అన్న అర్థస్ఫూర్తి కలుగుతుంది. లేదా ప్రస్తుతం నవలామణుల కలాలనుండి వెలువడుతున్న నవలారత్నాలన్న భావమూ స్ఫురిస్తుంది. ఈ రెండంశాలూ పరిగణనీయాలే.

హ్రస్వాంత, దీర్ఘాంత ఉభయరూపాలు గల 'నవల' అన్న ఆచ్ఛిక పదము సూర్యరాయాంధ్ర నిఘంటువులో లోపించడానికి కారణము దురూహము.

ఆ. దేవునానమున్న దేశాన కొక కవి
సిప్పు దూరనూర సింట నింట
నేను దాడ్గు రేడ్గు రెనమండ్రు తొమ్మండు
పదుగురేసి కవులు పద్మనాభ.

అన్నది అడిదము సూరకవి చాటువు. 'పలువురైరి రచయిత్రులు పద్మనాభ' అని దాని నించుక మార్చి ప్రస్తుతము రచయిత్రుల కన్వయించవచ్చు. ఇది నవలల యుగం. ఈ యుగశకట సారథులు నవలామణు లన్నది జగద్విదితం. కనుక వారి రచనలు అవశ్యపరిశీలనార్హాలు.

'నవల' అన్న సాహిత్యప్రక్రియ తెలుగుగడ్డపై ఎప్పుడు కాలుమోపిందన్న చరిత్రను చెప్పనక్కరలేదు. అది విదితచరం. చివికి, వసిచెడి, విస్తీర్ణమైన సంఘాన్ని నవ్యమార్గంలో నడిపింప, నడుం బిగించి, కలంపట్టి కాగితాన్ని దున్నిన సాహితీనవ్యసాచులు వీరేశలింగం ప్రభృతులు. సామాన్య ప్రజల్ని ప్రబుద్ధం చేయడంకొరకే కథానిక, నవల, నాటకం, వ్యాసం వంటి సాహిత్య సాధనాల్ని ఉపయోగించిన చైతన్య స్రవంతులు ఆ తొలితరం నవలాకారులు. తొలి తెలుగు నవల సంఘసంస్కరణోద్దేశంతో అవతరించడం హర్షింపదగ్గ విషయం

కథలు, నవలలు-రెండూ ప్రజాదరణ పాత్రమైనవే. కాని, కథలయొక్క వేళ్లు కల్పనా జగత్తులో పాతుకొని ఉంటే, నవల యొక్క మూలాలు సంఘంలో నాటుకొనిఉంటవి. కథలోని ఔత్సుక్యంతో పాత్రపోషణని మేళవించి సమకాలిక నాగరికతను ప్రతిబింబిస్తూ వ్రాయబడేదే నవల. అందుచేతే తదితర వాఙ్మయ ప్రక్రియలకన్నా నవల, సాంఘిక జీవితానికి సన్నిహితంగా వుండి, వాస్తవికంగా సమాజాన్ని చిత్రిస్తుంది. అత్యద్భుతమైన మానవజీవితంలోని సంచలననాలను ఆవేగాలను అవగాహన చేసుకుందామన్న ఆసక్తే నవల ఆవిర్భావానికి బీజం.

16, 17 శతాబ్దాలలో సంఘటిల్లిన పారిశ్రామిక విప్లవం, మొలకెత్తిన సామ్యవాద సిద్ధాంతాలు పాశ్చాత్యదేశాలలో గొప్పభావసంచలనాన్ని రేకెత్తించినవి. తత్కారణంగా ధనికవర్గాల దౌర్జన్యం, ధార్ష్ట్యం, అపహతం అవుతూ అట్టడుగునఉన్న ప్రజల అంతస్థు గుర్తింపబడసాగింది. ఈ రెండు వర్గాల అంతర్యాన్ని అదృశ్యం చేస్తూ మధ్యతరగతి ఒకటి వంతెనలాగా ఉత్పన్నమైనది. ఈ "మధ్యతరగతే" నవలకు, అన్ని సమాజాలలోను వెన్నెముక. అందుకే నవలల్లో "సామాన్య మానవుడి"కి పెద్దపీట వేసి ప్రథమ పూజలు చేయటం కనిపిస్తుంది.

ఆంధ్రసాహిత్య చరిత్రలో భావకవిత్వపు రోజులలో కథానికకే ప్రచార మెక్కువ. అయినా నవల తచ్చట్లాడుతూ, తప్పటడుగులు వేస్తూ వచ్చింది. 1960 నుండి ఉగాది నవలల పోటీలతో మరల నవల నిలద్రొక్కుకుని కథానికను పక్కకు నెట్టి నిలువెత్తున నిలిచింది. గమనింపదగ్గ విశేష మేమి ంటే నీరసంగాఉన్న తెలుగునవలల్ని పరిరక్షించి పోషించినవారు నవలలు. ఈ తల్లని తల్లుల ఆలనాపాలనలతో తెలుగునవల కొంత ఎదిగింది. శ్రీ యస్వీ. జోగారావు గారు "తన చరిత్ర ప్రథమ పాదములోనే నవలారచన ఆడంగులను హడ ఆకర్షించినది.[1]" అని కొంత పరిహాసంగా అన్నా, తెలుగమ్మల హృదయాలు ద్రవించేలా రచయిత్రులు ఆదినుండి నవలలు వ్రాస్తున్నారు. స్త్రీల రచనలను

1 డా. జోగారావు, యస్వీ ; తెలుగు నవల-సంస్కృతి, జూలై 1954

ప్రచురించి ప్రోత్సహించిన ప్రథములు గృహలక్ష్మి సంపాదకులు డా. కే యన్. కేసరి గారు. ఆ తరువాత వార, పక్ష, మాసపత్రికలు విశేషంగా బయలుదేరి రచయిత్రుల సశేషమైన అశేష నవలన్ని ప్రకటించడం వలనను, "స్వాతి ముత్యాలుగ", "జ్యోతి అనుబంధాలుగ" నవలికలు వెలువడడం వలనను అవి తామరతంపరగా విస్తరిస్తున్నవి.

తొలి తెలుగు నవలా రచయిత్రి జయంతి సూరమ్మ గారు 1906 లో "సుదక్షిణా చరిత్రను" వ్రాశారు. 1914 లో మల్లవరపు సుబ్బమ్మగారు "కళావతి చరిత్ర" వ్రాశారు. ఆ తరువాత కాంచనపల్లి కనకమ్మగారు, కనుపర్తి వరలక్ష్మమ్మ మున్నగువారు నవలారచన కుపక్రమించారు. రచయిత్రులు రచించిన సాంఘిక నవలలలో తొలినవల "శోభావతి". రచయిత్రి ఏ పి. పిరాట్టమ్మ. ఇది 1924 లో ముద్రితమయిన 189 పుటల నవల. ఇందులో త్రాగుబోతు జూదరియైన భర్త కారణంగా భార్య పడిన పాట్లను చిత్రించారు. 1924 లోనే మూడుమాసాల వ్యత్యాసంతో కనుపర్తి వరలక్ష్మమ్మగారు కూడ, "శోభావతి" వంటి సమానేతివృత్తంతో "వసుమతి" అన్న నవలను వ్రాశారు 1947 వరకు మహిళల నవలలు సుమారు 50 ఉండవచ్చునని అంచనా. ఈ తొలిరచనల్లో స్త్రీజనోద్ధరణ, సంఘసంస్కరణ ప్రియత్వము, దేశస్వాతంత్ర్య సముపార్జన ప్రధానంగా ప్రతిబింబించాయి. రెండుదశాబ్దుల క్రిందటి వరకు మహిళలరచనలో ప్రచారోద్దేశము అధికంగా కనిపించేది. స్త్రీలు, అందునా బాలవితంతువుల దుర వస్థలు పురుషుల బహుభార్యాత్వంవలన కలిగే అనర్థాలు, అత్తగారల ఆరళ్లు, ఆర్భాటాలు, సవతి తల్లుల వేధింపులూ ఇతివృత్తాలుగ రూపొందినవి.

ఆతరం నవలల్లో ఆదర్శాలతో, ఆశయాలతో భవిష్యత్తు ఆశాజనకంగా ఆవిష్కరింపబడింది. కాని, ఆతరం సమస్యలు వేరు. నేటి సమస్యలు వేరు. ఆనాటి నవలల్లో ఆదర్శాలకు, చిత్తప్రవృత్తులకు సంఘటిల్లిన సంఘర్షణను సందర్శిస్తాము. నేటి నవలల్లో భౌతిక అస్తిత్వానికీ, సంఘదురంతాలకూ మధ్య జరిగే పోరాటాన్ని తిలకిస్తాము ఆనాటినవలలు సంపన్నుల కాలక్షేపం కొఱకు

ఉద్దేశింపబడినవి. నేడు మధ్యతరగతి హృదయావేదన బహిర్గత మవడానికి సాహిత్య మొక ఉపకరణ. అందువలన నవల సామాన్యమానవుని తాత్కాలికోప శాంతికారకంగా రూపొందింది. కనుక కేవలం చదువగలగడ మేతప్ప, గాఢమైన సాహిత్యరుచి లేని పాఠకులకు తృప్తిపరచవలసిన అవసరం హెచ్చింది.

గత 20ఏండ్లుగ రచనలు కొనసాగిస్తున్న రచయిత్రులు తమకు అందని విచిత్ర కల్పనల జోలికి పోకుండా తమకు నిత్యపరిచితమైన సామాన్యగృహ వాతావరణాన్ని గ్రహించి మధ్యతరగతి మన స్తత్వాన్ని, సమస్యల్ని ప్రధానంగా చిత్రిస్తున్నారు. వీరి నవలల్లో ప్రేమాయణాలు కొన్ని; టీన్ఏజర్స్ కొఱకే ఉద్దేశింప బడినవి కొన్ని; పల్లెటూళ్ళ వాతావరణాన్ని, పల్లెకుటుంబాల ఆత్మీయతని ప్రతి బింబించినవి కొన్ని; 'కష్టజీవుల, కర్మవీరుల వ్యథార్తజీవిత యథార్థ దృశ్యాలను' స్పృశించినవి కొన్ని; తరాలమార్పుకు, అంతస్తుల అంతరానికి అద్దంపట్టినవి కొన్ని; ఉద్యోగం పురుషలక్షణమే కాక స్త్రీలక్షణంగా కూడా మారడంలోని సాధక బాధకాలను చర్చించినవి కొన్ని; ఆర్థికసమస్యలను విడమర్చినవి కొన్ని, రాజకీయాలను తడవి చూచినవి కొన్ని. ఇన్నింటిలో ఎక్కువగా చర్చింపబడు తున్నది వర్ణాంతర వివాహాలు, వరకట్నాల ఉపద్రవాలు; ప్రేమలు పెళ్ళిళ్లూను.

ఈ విశాలవిశ్వంలోని విజ్ఞానశాస్త్రపు వివిధవిన్యాణాలకన్న సంసారం లోని ఎత్తుపల్లాలను స్త్రీ బాగా అవగాహన చేసుకుంటుంది. అందుకే స్త్రీల సున్నిత హృదయాలకు, ఆడవారి ఆవేదనలకు, ప్రస్తుత సమాజంలో స్త్రీ స్థానాన్ని చిత్రించడంలో వీరు కృతకృత్యులైనా రనవచ్చు. సూటిగా సమస్యని చెప్పడం, సరళంగా, సహజంగా వర్ణించడం, సాంసారికంగా స్వాభావికంగా వివరించడంలో వీరు సిద్ధహస్తులు.

తెలుగు నవలాలోకాన్ని దీప్తిమంతము చేసిన, చేస్తున్న రచయిత్రులను పేరుపేరువరుసన పేర్కొనాలంటే నాకు కేటాయించిన పుణ్యకాలంకాస్తా గడచి పోతుంది. క్షమించాలి. తెలుగులో నవలలు, నవలికలు వ్రాసినన కీర్తిశేషులు, కీర్తి కెక్కినవారు, కీర్తికెక్కనున్నవారు, పెద్ద, చిన్న నవలామణులందరు వెరసి 200

మందని లెక్క తేలింది. వీరిలో కొందరు ప్రచ్ఛన్నామధారులైన పురుషులు కూడా వుండవచ్చు. తెలుగులో ఇప్పటికి వెలువడిన నవలలు 30 వేలని, అందులో రచయిత్రుల నవలలు 2 వేలని అంచనా. అంటే పురుషపుంగవుల నవలలు 94 శాతమయితే స్త్రీల రచనలు 6 2/3 శాతంమాత్రమేనని పెద్దలు గమనించాలి.

శ్రీపుల్లాభొట్ల వేంకటేశ్వర్లుగారు 'తెలుగునవల'నుగురించి సమీక్షిస్తూ: "ఈనాడు రచయిత్రులు ఎందరో తమనిశిత భావనాబలముతో, రచనావిన్నాణముతో వైవిధ్యవిలసితమైన నవలల నెన్నింటినో వ్రాసి ... తెలుగు నవలారంగ సంక్రాంతిని ముత్యాల రంగవల్లులతో ముచ్చటగా తీర్చిదిద్దగలుగుతున్నారు. వారి ఈ అపూర్వకృషి తెలుగు నవలారంగంలో వసంతారామమై వర్ధిల్లుచున్నది." అని ప్రశంసించారు. [ఆంధ్ర సారస్వత పరిషత్తు రజతోత్సవ సంచిక, పుట. 325.]

మహిళల నవలలను గూర్చిన ఇటువంటి ప్రశంస సర్వజనాంగీకృతము కాదుకనుకే ఈ చర్చ ఆకాశానికి ఎత్తే ఈ పొగడ్త లలాగే పాతాళానికి అణగద్రొక్కే విమర్శలు, విసుర్లుకూడా విన్నవిస్తాను. శ్రీ. ఎ. సూర్యప్రకాశ్ గారు "మన నవలామణులు" అన్న వ్యాసంలో [స్రవంతి. నవంబరు 1973 పుట. 16] కొందరు పెద్దల అభిప్రాయాల్ని ప్రకటించారు.

i) "తెలుగు నవలా ప్రపంచాన్ని నవలామణులు ఏలుతున్నారు. ఠీవిగా, ముచ్చటగా, ముద్దుముద్దుగా రాజ్యం చేస్తున్నారు. అరవైలనుంచీ తెలుగు పాఠకుని తలమీద కూర్చున్నారు. పత్రికల అమ్మకాలు పెంచి, తమ బేంక్ బేలెన్స్ పెంచుకున్నారు. కాని, వాళ్లు మాత్రం ఇంకా మానసికంగా పెరగలేదు" అన్నది సూర్యప్రకాశ్ గారి అభిప్రాయము.

ii) శ్రీపురాణం సుబ్రహ్మణ్య శర్మ గారు : "ఈ ఆడ కెరటం లేచి 'తెలుగు నవల'ను పాతిక నలభై ఏళ్లు వెనక్కు నెట్టేసింది. కారణం రాసేవారి అభిరుచులస్థాయి సాంస్కృతికంగా మనల్ని ఒక అర్ధశతాబ్దం వెనక్కు తరిమేసింది''అని నిర్మొహమాటంగా విమర్శించారు.

iii) 'రచయిత్రులు మరీమరీ విజృంభించారు. మరుగున పడిన పాతకాలపు ఇంగ్లీషు నవలల, కథల సంపుటాలు గాలించి వెదకి బూజు దులిపి, వాటిలోని ఇతివృత్తాల్ని, పాత్రల్ని తీసికొని, కాస్తంత ''స్వదేశీయత'' ప్రాకారంలో ముంచి, రసాయనిక ఎరువులవలె ఉపయోగించి, కథల పొట్లకాయలు నవలల గుమ్మడికాయలు పండిస్తున్నారు' అన్నది శ్రీ గోరా శాస్త్రి నిర్దాక్షిణ్యమైన విసురు.

iv) శ్రీ సూర్యప్రకాశ్ గారే: "మన రచయిత్రులు, నవలలు చదివి నవలలు వ్రాస్తున్నారు. సినిమాలు చూచి నవలలు వ్రాస్తున్నారు. కాని జీవితాన్ని చూచి రాయడం లేదు. అందుకనే అవి వాస్తవిక ప్రపంచానికి ఎంతో దూరంగా రంగు రంగుల స్వప్న స్వర్గలోకానికి చేరువుగా ఉంటున్నాయి. తెలుగు రచయిత్రులు కథల స్మాల్ స్కేల్ ఇండస్ట్రీని, లాభసాటియైన నవలల లార్జ్ స్కేల్ ఇండస్ట్రీని నడుపుతున్నారు...'' పుంఖానుపుంఖంగా నవలల పిల్లలను కనెయ్యకూడదు. సమాజంలో కుటుంబ నియంత్రణ ప్రచారం ఉన్నట్లుగానే సాహిత్యంలో కూడ నవలా కుటుంబ నియంత్రణ ఉంటే సాహిత్యలోకానికి ఎంతో మేలు కలుగుతుంది'' అని నిష్కర్షగ హెచ్చరించారు

పట్టి చంపేవేళ, పట్టం గట్టేవేళ తాళ్లపాక అన్నమయ్య చలించలేదట! అలాగే పొగడ్తలకు పొంగకుండ, తెగడ్తలకు క్రుంగకుండ ఉండటమే విజ్ఞుల లక్షణము.

తెలుగులో 'నవల' పుట్టి ఇప్పటికి నిండుగా నూరేండ్లు దాటిందిగదా. మఱి ఈ నూఱేండ్ల నవలా చరిత్రలో నూఱుకు మించి తెనుగు నవల్ని ఎంచలేమన్న నా వ్యక్తిగతాభిప్రాయాన్ని వ్యక్తం చేయటానికి ముందు కొంత జంకాను. కాని, డా॥ అక్కిరాజు రమాపతిరావు గారు, ''తెలుగు నవల పుట్టి నూరేళ్లు గడిచాయి.. నూరు మంచి నవలలను ఎంచడమైనా కష్టమే అవుతుంది' అని [తెలుగునవల-సామాజిక దృక్పథం-మహతి, పుట. 99] శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారు, "ప్రపంచ సాహిత్య స్థాయిలో పడనుంది తెలుగు నవలా రచయితల పేర్లు చెప్ప

వలసి వస్తే, వారా, వీరా అని తరుచుకోవలసి వస్తుంది." [తెలుగునవల పుట. 48] అని నాతో ఏకీభవిస్తున్నారు. నవలలకు సంబంధించిన సమీక్షలకు, విమర్శక వ్యాసాలను ఓ 20, 30 పరిశీలించాను వీటన్నింటిలో "మాలపల్లి, ఏకవీర, వేయిపడగలు, చివరకుమిగిలేది, అసమర్థునిజీవయాత్ర, అల్పజీవి, కీలుగుఱ్ఱాలు, చదువు" అని ఓ 10, 15 నవలలే చర్వితచర్వణంగా పేర్కొనడం జరిగింది. అంటే ఇవితప్ప చెప్పుకోతగిన నవలలు తెలుగులో లేవన్నమాట. తెలుగులో నవలల ఖార్ఖానాను స్థాపించి నూతేండ్లయినా, రచయిత్రులే కాదు, రచయితలు కూడా ఉత్తమ నవలల్ని అధిక సంఖ్యాకంగా తయారుచేయలేదన్నది తేలిన సారాంశము.

రచయిత్రుల నవలలు, రచయితల నవలలకన్న భిన్నంగా ఉండాలనీ ఆశించటం కాని, ఆదేశించటం కాని సహజసంగా తోచదు. రచయిత-రచయిత్రి-ఇరువురూ వ్యక్తులే. హృదయస్పందనకు లింగభేధ ముండదు. "Every man has something of the women in him, every woman something of the man. From the literary point of view we find that where the two elements are .proportion-ately mingled we get the happiest results. Genius is bi-sexual' అన్నారు. (Cromption Rickett : A History of English Literature from Earliest Times to 1916.) కాకపోతే స్త్రీకి సున్నితమైన భావా లుండవచ్చు. జాలి, కరుణ, దయా సానుభుతి ఇత్యాది గుణాల పాళ్లు ఎక్కువ కావచ్చు. పురుషున కున్న సాహసం, తెగింపు మన సమాజంలో స్త్రీల కుండకపోవచ్చు. ఏమయినాను శ్రీ శంకరాచార్యుల వారు అన్నట్లు "శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్" (సౌందర్య లహరి) అన్నది నిజం.

విమర్శించడం సులువే. కాని, దానికి కారణాన్ని వితర్కించడం వివేకం. తెలుగు సారస్వతంలో కథాసాహిత్యం చేరుకున్న ఉన్నతస్థాయికి నవలా రచన

చేసుకోలేము. అందుకు రచయితల రచయిత్రుల బాహ్యకనున్న ప్రతిబంధకాలుగా వెలసిన సమస్యాత్మక వికృతి. తెలుగులో నవల సర్వాంగ సుందరంగా సాక్షాత్కరించక పూర్వమే నాటకం, సినిమా, రేడియో, Mass Media అయి నవలను వెనక్కు నెట్టినవి ఆదీగాక నవల విద్యాగంధం గల సంస్కారయుత సభ్య సమాజం మీదే ప్రభావాన్ని చూపగలదు. అటువంటి "Literate Society" తెలుగుదేశంలో ఇటీవలే ఏర్పడినది.

ఇది ప్రాయికంగా పురుషాధికారం పట్టం గట్టుకున్న ప్రపంచం. స్త్రీని తనతో సమంగా చూడగల దృష్టి పురుషుని కింకా పట్టుపడలేదు. Peral S. Buck వంటి వ్యక్తికి Noble Prize ఇవ్వాలనుకున్నపుడు "స్త్రీరచనకా" అన్న తర్జనభర్జనలు జరిగినవట. ఆడ, మగ అన్న తేడా లేకుండా గుణాన్ని గుర్తించ గలిగినపుడే ఏరచనకైనా రాణింపుంటుంది. ఈ అకాడమీ వెయ్యినూటపదహారు లిచ్చి సత్కరించిన నవలారాజాలలో "బలిపీఠం" "సమత" అన్న రెండు నవలారే రచయిత్రులవి. 1960 నుండి ఉగాది నవలల పోటీలను నిర్వహిస్తున్న ఆంధ్రప్రభ పత్రికలు ఓ పదిమంది రచయిత్రులను మాత్రమే బహూకరించినవి వాస్తవ మిలా ఉంటే నవలారంగాన్నంతటిని ఆడవాళ్లే ఆక్రమించారన్న అపప్రథ ప్రబలిపోయింది.

తెలుగులో స్త్రీలు నవలా రచనకు కొంగుబిగించి ఇప్పటికి సుమారు పాతిక ముప్పయి ఏండ్లు కావస్తుంది. నేటి ప్రసిద్ధ రచయిత్రులలో కొందరికి "ప్రమాదావనమే" పుట్టినిల్లు. ఇప్పు డిప్పుడే చీకటిలో నుండి వెలుగులోనికి వచ్చి తమ పరిసరాలను పరికిస్తున్న వీరు "సీరియస్" నవలలకన్న "సీరియల్" నవలలనే వ్రాయడం అబ్బురం లేదు. శిల్పదృష్ట్యా అవి అంత బరువైనవని చెప్పలేము. తేలికగా పాఠకులనందరను చదివించగల శక్తి వీరి నవలల కున్నా ఆలోచనాత్మకమైనవి, మనస్సును మథించి నిలిచేవి చాల తక్కువ. ఉన్నమాట అనుకోవాలి ఉన్న ఊరు అచ్చిరాక పోయినాను. ఈ విమర్శ తెలుగు నవలల కన్నింటికి వర్తిస్తుంది.

తెలుగునవలల్లోని స్తబ్ధతకు ప్రధానకారణం సద్విమర్శ అభావం అని నా అభిప్రాయము. బెంగాలీనవలల్ని గూర్చి ఉపన్యసిస్తూ Dr. Humayun Kabir ఇలా అన్నారు: "It has been suggeted that the absence of a tradition of literary Criticism is one reason why Tagore's novels often miss the highest peak of achieve-ment... A genius can create a short story or a lyric out of his own experience. Even a genius needs social backing in the drama or the novel and such social background or criticism was what contemporary Bengal could not provide." [Kabir: The Bengal novel. 1938.] అలాగే తెలుగులోనూ కనిపిస్తుంది "విమర్శకులు రచయితల నవలలమీద తగినంత శ్రద్ధ చూపడంలేదు." అని శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు కూడా పేర్కొన్నారు [తెలుగునవల-మహతి. పుట. 88]

Jane Austin వ్రాసినవి ఆరే ఆరునవలలు. ఆఆరింటిపై అనేకవేల పైబడిన వ్యాసాలు. పుస్తకాలు ఉన్నవి. "Janites" అన్న ఆమె అభిమానుల సంఘాలు ఇప్పటికీ ఆమెరచనల ప్రచార ప్రచురణలకి పాటుపడుతున్నవి. Charlotee Bronte తన 2వ నవలను ప్రచురించడంతోనే విమర్శల వెల్లువ ఆమెను ముంచెత్తింది. ఆ విమర్శలను ఆకళింపుకొని 'Shierly' నవలను వ్రాయడమే కాకుండ, కొన్ని విమర్శలకు తననవలలోని పాత్రల ముఖంగా సమాధానమిచ్చింది 'Virgina wolf' రచనల్ని కోణకోణాలనుండి పరిశీలించి చేసిన "The Nature of Virgina wolf's Art; Her Characters Limitations; Notes on the Style of mrs. Wolf; Some Verbal Features of Virgina Wolf's Novels" ఇలా సాగినవా వ్యాసాలు

మనతెలుగులో ఆరుగాదుకదా అనేకనవలల్ని వ్రాసినరచయిత్రులున్నారు. అటువంటి రచయిత్రుల్ని గురించికూడా పట్టుమని పదివ్యాసాలు కనిపించవు. "లతనవలలు-ఆమెపాత్రలు" (స్రవంతి. 1965) "నేటినవలాసాహిత్యం శ్రీమతి

ముప్పాళ్ల "రచయిత్రి" ఒకవిమర్శ "(స్రవంతి 1968)" శ్రీమతిముప్పాళ్ల రంగనాయకమ్మ నవలాసాహిత్యం (భారతి 1969) "లతసాహిత్యం - ఒక పరిశీలన"(స్రవంతి 1977) అన్న 4 వ్యాసాలు తప్ప నా దృష్టి కింకేమీ కనుపించ లేదు. ఇన్ని విశ్వవిద్యాలయాలలో తెలుగు సాహిత్యంపై ఇతోధికంగా పరిశోధన కొనసాగుతున్నా నవలల్ని గూర్చిన పరిశ్రమను వేళ్లమీద లెక్కింపవచ్చు. అయినా సమష్టిగ నవలలన్నింటినిగూర్చిగాని, వ్యక్తిగతమైన పరిశోధనలు ఇంకా వెలుగుకు రాలేదు. డా॥ కుటుంబరావుగారి "ఆంధ్రనవలా పరిణామము" ఉద్గ్రంథమే అయినా ప్రచురించిన ప్రథమ సంపుటంలో రచయిత్రులకు స్థానంలేదు. శ్రీమతులు ఆట్లూరి వేంకటసీతమ్మ, మల్లాది వసుంధరలనవలలు మాత్రం సమీక్షింపబడినవి. ద్వితీయసంపుటం వెలువడితేకాని కంరూపు తెలియదు శ్రీ మొదలి నాగభూషణ శర్మగారి "తెలుగునవలా వికాసం" వందసంవత్సరాల తెలుగునవల చరిత్రను గూర్చిన విమర్శకపరిశీలనము. 866 పుటలుగల యీ పుస్తకంలో కేవలం రెండే పుటలు స్త్రీలరచనకు సంబంధించిన విమర్శ ఇందులోని 5 వ భాగము తెలుగు లోని కొన్ని ఉత్తమనవలల సమీక్ష. అందులో 12 తెలుగునవలలు సమీక్షింప బడినవి. కాని, ఒక్క రచయిత్రి నవలయినా ఈసమీక్షకు నోచుకోలేదు. "తెలుగు నవల నూరు సంవత్సరాలు "అన్నది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి ప్రసంగవ్యాసాల సంకలనము ఇందులోని 3 వ్యాసాలలో ఒక్కటైనా మహిళల నవలలకు సంబంధించినది లేకపోవడం శోచనీయము. ప్రపంచతెలుగు మహా సభల సందర్భంగా ప్రచురించిన పుస్తకం శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారి "తెలుగునవల". ఇది 48 పుటల పుస్తకము వ్యాసాన్ని పూర్తి చేయడానికి ముందు వారికి మహిళలనవలలు గుర్తువచ్చాయనుకుంటాను. 40 వ పుటమధ్య భాగంలో స్వర్గీయ పి. శ్రీదేవిగారితో ప్రారంభించి, 42 వ పుట మధ్యలో గత పాతికసంవత్సరాలలో మంచిరచనలు మహిళలనుంచే ముఖ్యంగా నవలా ప్రక్రియకు సంబంధించి వెలువడినా యనడం అతిశయోక్తి కాదని" ముక్తసరిగ చెప్పి ముగించారు. "Telugu Novel" అన్నయువభారతి ప్రచురణ 2 వ భాగంలో "బలిపీఠం, కాలాతీతవ్యక్తులు, మోహనవంశి" అన్న మూడునవలల్ని

ముచ్చటగా సమీక్షింపనున్నట్లు ప్రకటించారు. అయితే అది ఇంకా గజగర్భమే ననుకుంటాను. ఈ అకాడమీవారి సాహిత్యోపన్యాసాల 14 వ సంపుటిలో శ్రీ అమరేంద్రగారు "వెలుగునవల" అన్న తమచిన్న వ్యాసంలో మహిళలనవలలకు ప్రాధాన్య మిచ్చి చర్చించడం ముదావహము. విమర్శకుల యీ పక్షపాతమే రచయిత్రుల రచనలకు పక్షపాతాన్ని కలిగిస్తుందని తెలుసుకోవడం అవసరము.

నవలా రచనకు సునిశితపరిశీలన, మానవస్వభావపు అవగాహన అత్యవసరము. ఈ రెండిటికి మనసమాజంలో రచయిత్రులకు అవకాశం తక్కువగా ఉన్నది. పురుషునకున్న స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు స్త్రీకి అన్నివిషయాలలో లేవు. ఆమె పదిస్థలాలకు వెళ్లి, పలువురిని కలుసుకొని, తన రచనకు అవసరమైన విషయాన్ని సేకరించుకోలేదు అందువలననే ఈ రచనలలో లోకానుభవం సన్నగిల్లడం. స్త్రీల రచనలలో నవ్యత, వాస్తవిక దృక్పథం సమాజచైతన్యం ఇత్యాదులు లోపించడానికి కారణం స్త్రీపురుషునితో సమానస్థాయికి చేరుకోలేకపోవడమే.

సాధారణంగా స్త్రీలలో సాహసం తక్కువ సర్దుకుపోయే మనస్తత్వమే కాని ఎదురుతిరిగే స్వభావం నైజం కాదు. అందువల్ల సాంఘిక అన్యాయాలపై తిరుగుబాటు చేయడం లేదంటున్నారు. స్త్రీలు అలజడిని వాంఛించకపోవడం వాస్తవమే. అరాచకం అసలే కోరరు. సభ్యసమాజంలో ప్రశాంతంగా జీవనం గడిస్తే చాలనుకుంటారు. కాని, అటువంటి స్త్రీలకూడా తమ కట్టెదుట జరుగుతున్న అన్యాయాల్ని చూస్తూ ఊరుకోలేరు. "ఇదేనా న్యాయం" ముప్పాళ్ల, "మారిన విలువలు" (శ్రీవేదుల) "కొత్తనీరు" వంటి నవలలు సాంఘిక దౌర్జన్యాలను తీవ్రంగా ఖండించినవి.

ఇప్పటి రచయిత్రులలో చెక్కురకు రచన అన్నది ఒక వ్యాసంగం మాత్రమే. ఒక వృత్తి కాదు. మనకు సినిమా రచయితలు తప్ప Professional writers లేరు. రచయిత్రులు దీనిని ఒక వృత్తిగా పరిగణించినపుడు దానిమీద తగిన శ్రద్ధ చూపగలరు. అంతే కాకుండా వారంలో నాలుగు వారపత్రికలకు సీరియల్స్ వ్రాస్తే, ఏకాగ్రత ఎలా కుదురుతుంది? ఈ అష్టావధానం

ఆరోగ్యకరం కాదు. అందువలననే నవలలన్నీ ఇంచుమించు ఒకే మూసలో పోసి తీసిన కమ్మచ్చులా కనుపిస్తున్నవి.

రచయిత్రుల నవలల్లో వస్తువైవిధ్యం కొరవడిందంటున్నారు. యథాశక్తి ప్రయత్నించిన వారూ ఉన్నారు. "పుణ్యభూమీ కళ్లుతెరు" (బీనాదేవి) అన్న నవల సమాజంలో అట్టడుగుకు చెందిన వ్యక్తుల జీవితచిత్రణ "ఆశయాల ఆఖరి మెట్టు" కూడా అటువంటిదే (మా. సులోచన). ఈ నవలలో ప్రభుత్వ ఆసుపత్రులలో జరిగే అక్రమాలను కండ్లకు కట్టించారు "సమత" (వాసిరెడ్డి) రాజకీయాల ముసుగులో జరిగే అన్యాయాలను బట్టబయలు పరిచింది. ప్రస్తుత సమాజంలో స్త్రీ స్థానాన్ని నిరూపించిన నవల "స్త్రీ". "పుంస్కోకిల" (లత) నవల యువతీయువకులు ఆవేశంలో అనాలోచితంగా జీవిత నిర్ణయాలు తీసుకుంటే కలిగే అనర్థాలకు అద్దంపట్టింది. మాంగల్యానికీ, న్యాయానికీ సంఘర్షణ ఏర్పడితే దేన్ని రక్షించుకోవాలన్న విషమసమస్యకు రూపకల్పనే "దారితప్పిన తండ్రి" (కె రామలక్ష్మి). ఒక పత్రికాసంపాదకుని అసంతృప్తి జీవితకథనమే "ఎన్ని మెట్లెక్కినా" అన్న నవల (మాలతీ చందూర్). ఒక పుట్టు గ్రుడ్డివాడు తన అంగవైకల్యాన్ని అధిగమించి, జీవితాన్ని తీర్చిదిద్దుకున్న గాథే' బందీ'(య.సులోచన) ప్రేమకు కలిగిన విఘాతాన్ని క్రొత్తరూపులో సంతరించిన మధుర కథ 'రాజీ' (విమలారాం). ఇలా ఎన్నైనా చెప్పవచ్చు. 'వరకట్నాల గురించీ ఇంకా ఎందుకు వ్రాస్తున్నారని' ఒక రచయిత్రి నడిగాను. "ఆ సమస్య ఇంకా సమసిపోలేదు కదా. దాన్ని గురించి చెప్తూఉంటేనైనా సామాజికస్పృహ కలుగుతుంద" న్నారు. అదీ నిజమే ననిపించింది.

రచయిత్రుల రచనలు రాణించకపోవడానికి కొన్ని కారణాలు సూచిస్తాను. పాఠకుడు, నవలల్లోని పాత్రలతో తాదాత్మ్యాన్ని పొందలేకపోవడం ఎప్పుడో చితికిపోయిన జమీందారీ వ్యవస్థకు సంబంధించిన కథనాలు నేటి పాఠకునికి అపరిచితాలు. నవలల్ని ఆసాంతం సంభాషణలతో నడిపించడం వలన అవి పేలవంగా ఉంటున్నవి. సంభాషణలకు నవలల్లో ఒక ప్రత్యేకస్థాన మున్నది.

వీరి నవలల్లో ప్రకృతివర్ణనలు, ఆయాకథలకు పూర్వరంగాలయ్యే పట్టణాల, స్థలాల వర్ణనలు, పాత్రల స్వభావవివరణలు చాలా అరుదు. భావుకత, పాత్రోన్మీలన, మనస్తత్త్వ విశ్లేషణ, హృదయదఘ్నత అన్న లక్షణాలను సంతరించుకోవాలి. నేటి ప్రజాజీవితంపై ప్రగాఢమైన ప్రభావాన్ని చూపిస్తున్న రాజకీయాలరంగులు ఈ నవలల్లో ప్రసరించడం లేదు. రచయిత, తనకు రాజకీయాంతో నిమిత్తంలేదని ముడికట్టుక కూర్చోకూడదన్నారు గోపీచంద్. "రచయితలూ-రాజకీయవేత్తలూ-ఇతరులూ సంఘంలో వుండి జీవిస్తున్నవాళ్లే. సంఘం సర్వాంగశోభితం కావాలంటే ఈ విభజన ఉండకూడదు" అన్నారు. అందుచేత రచయిత్రుల వ్రాతలు కాలక్షేపపు వేడి బఠాణీల్లా కాకుండ, కారపు శెనగల్లా ఘాటుగా ఉండాలి. భుక్తికొరకో లేక రక్తికొరకో రచనలు చేయక ప్రజల్ని మూడగట్టి సక్రమదృష్టి కలిగించి, ఒక బాట నడిపించాలన్న ధ్యేయం ఉన్నపుడు ఉత్తమ రచనలు వెలువడగలవన్నది గోపీచంద్ ఆశయము. మానవప్రకృతిని, ప్రపంచ ప్రగతిని, సాంఘిక పరిణామాన్ని అన్వయించి వ్రాసిన రచనలు మేలుబంతులుగా రాణిస్తవి

ఇంక ఈ నవలల్లోని స్త్రీ పాత్రలు. వీరి స్త్రీ పాత్రచిత్రణలో ధీరత్వం కనిపిస్తుందని చెప్పవచ్చు. పదేండ్ల క్రితం వచ్చిన నవలల్లోని స్త్రీ పాత్రలు పురుషాధికారాన్ని ధిక్కరించడానికి ప్రయత్నించినవి. ఇప్పటి నవలలో స్త్రీ ప్రేమమూర్తిగ, కఠోరకాళికగా, విషనాగిగా, అమృత సరసిగా, ప్రేమలాలసిగా, త్యాగశీలినిగా దర్శనమిస్తుంది. నేటి స్త్రీ కోరుతున్నది వివాహం సుఖప్రదం కావాలని మాత్రమే కాదు. వ్యక్తిగా స్వతంత్రప్రతిపత్తి గలదిగా, గుర్తింపు. అంతే సంఘంలో గృహిణిగా మాత్రమేకాక ఇతరత్రా ప్రత్యేక వ్యక్తిగా తనకు గణన, వికాసము ఉండాలన్నది ఆమె తాపత్రయం. ఈ పరిగణన పొందడానికి లోకంతోటి ఆమె పోరాటం, ఆమె ఓటమి, గెలుపూ, సుఖదుఃఖాలు నేటి స్త్రీపాత్ర చిత్రణలో ప్రాధాన్యం వహిస్తున్నవని శ్రీ ఆర్ ఎస్. సుదర్శనంగారు సమన్వయించారు (మహతి. పుట 103).

స్త్రీకి సంఘంలో ఆర్థిక స్వాతంత్ర్య మెలా వున్నా, ఆలోచనా స్వాతంత్ర్యంతో జీవనప్రవాహాన్ని మార్చాలన్న మనస్తత్వంగల స్త్రీపాత్రలు లత నవలా ప్రపంచంలో ఎక్కువగా ప్రత్యక్షమవుతాయి. "లత వ్రాసిన నవలల్లో స్త్రీ వ్యక్తిత్వ వైశిష్ట్యానికి కాక జీవితంలో అనుభూతి వైవిధ్యానికికూడా సాహసంతో అన్వేషిస్తున్నట్లు పాత్రచిత్రణ జరిగింది సంప్రదాయానికి మారుతున్న స్త్రీకి అనివార్యంగా సంభవించే ఘర్షణనే పదేపదే గుర్తుకుతెస్తూ పాత్రచిత్రణ చేస్తుంది. ఆమె" అన్న అభిప్రాయాన్ని కూడా వ్యక్తంచేసినవా రున్నారు.

"మట్టిమనిషి" (వాసిరెడ్డి) లోని వరూధినివంటి స్త్రీ నేటి యువతుల మనస్తత్వానికి ప్రతినిధులు.

అమూల్యమైన జీవితాన్ని ఆటవిడుపుగా గడపకూడదని, జీవితపు విలువల్ని విడమర్చే విజ్ఞురాలు "శారదరాత్రుల" లోని (వేదుల శకుంతల 1969) శారద. జీవితాన్ని ఈస్ట్‌మన్‌కలర్‌లో తీసిన హిందీచిత్రంలా ఊహించు కునే కుమారీల ముగ్ధత్వాన్ని "చేదునిజాల" లోని పాత్రలలో చూడవచ్చు. (పరిమళా సోమేశ్వర్ 1969)

అనుమానాలతో జీవితాన్ని నరకప్రాయం చేసుకున్న మూర్ఖురాలిని "చీకటికడుపున కాంతి" లో దర్శించవచ్చు. (సి ఆనందరామం).

స్థైర్యంతో పాతసంప్రదాయాన్ని కాదని కొత్త సంప్రదాయాన్ని స్వీకరించిన ఆధునికురాలు "గ్రహణం విడిచి" భారతి (ద్వివేదుల. 1967).

సహన సౌశీల్యమూర్తులు "వైకుంఠపాళీ"లోని పార్వతమ్మ. (ద్వివేదుల. 1965) "జీవనయాత్ర" లోని శాంతమ్మ. (మాదిరెడ్డి. 1972). భారత నారీత్వానికి ప్రతీకలు.

ఈ నవలల్లోని భాషనుగురించి రెండుముక్కలు ;

"స్త్రీలను ఆశ్రయించే నేను నేర్చుకున్నాను తెలుగుభాష. ప్రయోగ విజ్ఞానంకూడా స్త్రీలవల్లనే నాకు అలవడినది. పురుషుల భాషలోకంటే స్త్రీల భాషలో మాధుర్యము, హృదయాలను పట్టేసే జాతీయతా కనబడిం"దని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అన్నారు. కాని, రచయిత్రుల నవలల్లోని భాష పలుచగ ఉన్నదని విమర్శ. వీరికి పరిచయమైన పదజాలం తక్కువ అనిపిస్తుంది. అన్ని నవలల్లో ఇంచుమించు ఒకే విధమైన భాష కొంత విసుగును కలిగిస్తుంది. ప్రతి కథానాయికా "గులాబి మొగ్గలా" ముడుచుకుంటుంది. 'అతని బాహువుల్లో గువ్వలా ఒదిగిపోతుంది.'' 'కన్నీటి ముత్యాన్ని" కురిపిస్తుంది. ఆమెకు జీవితం "రంగుల హరివిల్లు"లా కనిపిస్తుంది. "ఆవేశకావేశాలకు" లోనవుతుంది. "పెద్ద ఆరిందాలా" బుద్ధిచెప్తుతుంది "ఆస్తంతా హారతికర్పూరంలా హరించుకపోతుంది." "పరుగులాంటి నడక, బుంగమూతి, మనస్సు పారేసుకోవడం" అన్ని నవలల్లోను చూడవచ్చు.

ద్వివేదుల, మాద్దిరెడ్డివంటివారి రచనలలో మాండలికాలు ప్రయుక్తాలు. అయితే మాండలిక పదాలకు అర్థాన్ని ఇస్తే బాగుంటుంది. తెలంగాణా మాండలికంలో ఉర్దూపదాలు అధికం. అవి అందరకు అర్థంకావు. భాషావిషయకంగా రచయిత్రులు పరిశ్రమించవలసివున్నది.

"రచయిత్రులకు నవలా రచనలో అనుకూలమైన రెండుగుణాలు ప్రస్తావిస్తాను. ఒకటి వాడుకభాష, తెలుగునుడికారం తీరుతెన్నులు వారిలోనే పురుషులలోకంటే ఎక్కువగా నిలిచి ఉన్నదనే సత్యము రెండవది అనాదిగా పిల్లల నలరించే కథలు చెప్పేది తండ్రితాతలకంటే అమ్మమ్మలూ, నాయనమ్మలే. కథాకథనము స్త్రీలకు ప్రకృతిసిద్ధము. కాబట్టి నవలా రచనలో స్త్రీలకు ఉజ్జ్వల భవిష్యత్తు కలదనడానికి సందేహంలేదు'' అని శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు ఆశాభావాన్ని వ్యక్తం చేసారు (మహతి. పుట 93)

'మంచి రచన చదివాక బాగా భోంచేసినట్టుండాలి
కొంచెం బాధపశ్చాత్! చింతకొన్నట్టుండాలి

మనస్సుకు జ్వరం రావాలి, ఒళ్లు తిరగాలి
ఈ బాధలోంచి తేరుకొని బాగుపడాలి.

['సినీవాలి'లో ఆరుద్ర]'

ఇటువంటి మంచిరచనల్ని రచయిత్రులు చేస్తారని ఆశిస్తున్నాను. మహిళల మంచి నవలల నీడలో పాఠకుల మనస్సు చల్లనై సేదతీరేకాలం అతిసమీపంలో ఉన్నదనే నమ్ముతున్నాను.



# తెలుగునవల - ప్రమాణాలూ, ప్రయోగాలూ

డా॥ అక్కిరాజు రమాపతిరావు

## భూమిక

నవల అనే సాహిత్యప్రక్రియ సర్వభారతీయ ప్రాంతీయ సాహిత్యాలలోనూ ఆంగ్లసాహిత్య ప్రభావంవల్ల ఉద్భవించిందే ఆపైన పెంపుగాంచిందే. భారతీయ భాషల్లో ఆధునికసాహిత్య ప్రక్రియగా నవలారచనకు ఆద్యుడనుకొంటున్న బంకించంద్ర చటర్జీ ఇంగ్లీషుసాహిత్య ప్రభావంతోనే నవలారచనకు పూనుకొన్నాడు. భారతీయ సామాజికజీవనాన్ని ఇతివృత్తంగా చేసుకొని ఇంగ్లీషులోనే ఒకనవల రాయాలనికూడా ఆయన మొదట సంకల్పించుకున్నాడు కొంతదూరం సాగిన తర్వాత అది వ్యర్థప్రయత్నంగా కనపడింది ఆయనకు. అందువల్ల తన మాతృభాషలోనే, ప్రాంతీయభాషలోనే నవలారచనలకు పూనుకొన్నాడు. బంకించంద్ర చటర్జీ ఇంగ్లీషులోనే రాద్దామని ప్రారంభించిననవల శ్రీమతి రాజమోహన్ అనే పేరుతో ప్రారంభించాడు. కానీ, అది మధ్యంతరంగా వదిలేసి దుర్గేశనందిని, ఆనందమఠం, వంటి నవలలు వంగభాష కలంకారాలుగా సమర్పించాడు.

1872వ సం.లో ఆనాటి భారతదేశపు గవర్నర్ జనరలైన లార్డు మేయో, వంగీయుల ఆచార వ్యవహారాలను తెలియజేసేనవల రచించినవారికి బహుమానం ఇస్తామని ప్రభుత్వం తరపున బెంగాల్ గెజెట్‌లో ప్రకటించగా ఆగెజెట్ వార్తనుంచి ప్రేరణను పొంది. అప్పట్లో కర్నూల్లో డెప్యూటీకలెక్టరుగా అధికారం నిర్వహిస్తున్న నరహరి గోపాలకృష్ణమ్మ శెట్టి. తెలుగులో రచించి ప్రకటించిన నవీనవచనప్రక్రియ శ్రీరంగరాజు చరిత్ర మనేరచన. ఇది 1872వ సంవత్సరంలోనే ప్రకటితమైంది. సమకాలీన సాహిత్యపత్రికలున్నూ, మద్రాసు గెజెటున్నూ, ఈ రచనను నవలగానే పేర్కొన్నాయి. ఇది తొలి తెలుగునవల

అవునా కాదా అని ఇటీవల కొంత చర్చ జరిగింది. ఇంగ్లీషు సాహిత్య ప్రభావం వల్ల, ఈనవల ఇతివృత్తమూ, దేహబంధమూ ప్రభావితమైనవి కావు అయితే గోపాలకృష్ణమ శెట్టిగారు తప్పక ఆంగ్లవిద్యా ప్రభావితుడే అయిఉంటాడు. అదీ కాక దేశీయోద్యోగులు అకాలానికి నిర్వహించగల అత్యున్నతమైన అధికార స్థానంలోనూ ఉన్నాడు. అందువల్ల శ్రీరంగరాజు చరిత్రను, తెలుగులో తొట్ట తొలుతగా నవలారచనా ప్రయత్నానికి తార్కాణంగా ఎంచుకోవచ్చు.

తెలుగుసాహిత్యంలో నవీనయుగ ప్రవర్తకుడైన కందుకూరి వీరేశలింగం 1878వ సంవత్సరంలో రాజశేఖరచరిత్రమనే నవలను తా మారోజుల్లో నడుపుతున్న వివేకవర్ధని పత్రికలో వరసగా ప్రకటించి 1880వ సంవత్సరంలో పుస్తక రూపాన ప్రచురించాడు. తెలుగులో నవలారచనకు తానే ఆద్యుణ్ణని ఆయన స్వీయ చరిత్రలో చెప్పుకోవడం వల్లనై తేనేమి, రాజశేఖరచరిత్ర ప్రకటితమైన తర్వాత, తెలుగునవలలు రాసినవారు, ఆనవలను మార్గదర్శకంగా ఎంచుకోవడంవల్లనై తే నేమి, రాజశేఖర చరిత్రకు మంచి ప్రచారం వచ్చింది. వీరేశలింగం ప్రతిభావంతుడైన రచయితకాబట్టీ, నవీన సాహిత్యయుగప్రవర్తకుడు కాబట్టీ, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి వంటి లబ్ధప్రతిష్ఠులు కూడా తమకు నవలారచనలో రాజశేఖరచరిత్రమే మార్గదర్శకంగా ఉన్నది అని చెప్పుకోవడంబట్టి, తెలుగునవలా సాహిత్యచరిత్రలో రాజశేఖరచరిత్ర ఒక విశిష్టమైన స్థానం సంపాదించుకొన్నది.

## తొలి ప్రయోగమూ, ప్రమాణమూ

అందువల్ల రాజశేఖరచరిత్ర రచన తెలుగు సాహిత్యంలో, సాహిత్య పరమైన ఒక విశిష్ట ప్రయోగంగా యథార్థ స్థానాన్ని సముపార్జించుకొన్నది. ఇంగ్లీషు సాహిత్యంలో గొప్ప పేరు ప్రతిష్ఠలు గడించిన ఆలివర్ గోల్డ్‌స్మిత్ రచించిన 'ది వికరాఫ్ వేక్ ఫీల్డ్' అనే నవలను దృష్టిలో పెట్టుకొని వీరేశలింగం రాజశేఖరచరిత్రకు రూపకల్పన చేశాడు. అంతే కాని ఇంగ్లీషు నవలకు తెలుగు నవల అనువాదం కాదు. అనుసరణం మాత్రమే, లేదా అనుసృష్టి అని చెప్పాలి.

ఇంచుమించు వేయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో వర్తమాన సమాజాన్ని ప్రత్యక్షేతివృత్తంగా స్వీకరించడం వీరేశలింగంతోనే ప్రారంభమైందని చెప్పాలి. తంజాపురాన్నదానమహానాటకమూ, మరి ఇలాంటి కొన్ని యక్షగానాలలోనూ సమకాలిక సమాజం ప్రసక్తమైనా సాహిత్యంలో ఉద్యమస్ఫూర్తి కోసం అవి పుట్టలేదు ఆధునిక కాలంలో అది వీరేశలింగంతోనే ప్రారంభమైంది, భాషా విషయికంగానూ, నవీన భావ చైతన్య ప్రసారణ విషయికంగానూ, రాజశేఖర చరిత్రం ఒక గొప్ప ప్రయోగం. వీరేశలింగం రాజశేఖరచరిత్రలోని పాత్ర లన్నింటినీ తా నెరిగిన సమాజంనుంచే అనుసృష్టి చేశాడు. ఈ నవలలో ప్రధాన పాత్ర అయిన రాజశేఖరుడు పూర్తిగా కల్పిత పాత్ర కాక, వీరేశలింగం స్వానుభవంనుంచి అంటే సమకాలీన సమాజంనుంచి ప్రభవించాడు. తక్కిన పాత్రలు కూడా ఆయన సమాజంనుంచే స్వీకరించాడు. వీరేశలింగం ఈ నవల రాయడానికి సమాజమే ప్రేరణ. కాబట్టి తెలుగు నవల సామాజిక ప్రేరణలతోనే పుట్టి, పెరిగి, వికాసోన్ముఖమై, అనేక ప్రయోగాలను, ఉన్నత ప్రమాణాలను సాధించిందనీ, నెలకొల్పిందనీ చెప్పవచ్చు

1872 లో అంటే ఇంచుమించుగా నూటఎనిమిది సంవత్సరాల క్రితం తెలుగు నవలా రచనకు శ్రీకారం చుట్టడం జరిగిందన్నమాట. శ్రీరంగరాజు చరిత్రంలో కూడా సమకాలీన సమాజంలోని అనౌచిత్య ధోరణులను విమర్శించడం కనపడుతుంది. అయితే ఈ నవలలోని ఇతివృత్తానికి చారిత్రక నేపథ్యం కన పడుతుంది. సమకాలీన సామాజిక భూమిక కాదు. శ్రీరంగరాజు చరిత్రం వచ్చిన తర్వాత మరి ఆరు సంవత్సరాల వరకూ ఎవరూ నవలా రచనకు పూను కోకపోవడం ఆశ్చర్యమే ననిపిస్తుంది. అంతే కాదు, 1880 వ సంవత్సరంలో వీరేశలింగం రాజశేఖరచరిత్రను పుస్తక రూపాన్న ప్రకటించినా, 1883 వ సంవత్సరంలో తాను ప్రత్యేకించి స్త్రీలకోసం నిర్వహిస్తున్న సతీహితబోధిని అనే పత్రికలో సత్యవతీచరిత్రమనే సాంఘిక నవలను ప్రచురించినా, ఇంచు మించుగా 1892వ సంవత్సరంవరకూ తెలుగులో నవలలు రాయాలనే ఆసక్తి ఆనాటి రచయితలకు కలగనేలేదు. అంటే 1872 వ సంవత్సరం నుంచి 1892

వ సంవత్సరం వరకు ఇరవై సంవత్సరాలలో మనం నవలలు అని చెప్పుకోవ డానికి మూడేచరనలు కనపడుతున్నా యన్నమాట సత్యవతీచరిత్రం తెలుగులో వెలువడిన సాంఘిక నవళ్లలో మొదటిది అని చెప్పవచ్చు. పూర్తిగా మౌలికమైన నవల ఇది. కొంతలో కొంత ఈ సత్యవతీచరిత్ర రచనను కూడా ప్రయోగం గానే భావించవచ్చు. ఏమంటే వీరేశలింగం మహిళల మానసిక వికాసాన్ని ప్రధానంగా దృష్టిలో పెట్టుకుని ఈ నవల రాశానని చెప్పారు.

ఆనాటివరకూ మహిళలకంటూ ప్రత్యేకించిన రచనలే లేవు. సామాజిక జీవనంలో స్త్రీ ప్రతిపత్తిని గూర్చి వివిధదృక్కోణాలనుంచి వీరేశలింగం ఈ నవలలో పరిశీలించారు. స్త్రీ విద్యావంతురాలై సామాజికావాసరాలను, సామాజిక చైతన్యాన్ని అవగాహన చేసుకుంటే తప్ప, ఆ సంఘానికి, ఆజాతికి అభ్యుదయం లేదని కథనాత్మకంగా ప్రతిపాదించా రీ నవలలో పంతులుగారు.

## సాంఘిక చారిత్రక అనుక్రమణిక

తెలుగు నవలాసాహిత్య చరిత్రలో 1872వ సంవత్సరం ఏవిధంగా ఒక ప్రధానఘట్టం అనుకొంటున్నామో 1892 ను కూడా అటువంటి మరొక ప్రధాన ఘట్టంగానే భావించాల్సి వుంది. ఈ ఇరవై సంవత్సరాలలో నవలారచనం తెలుగులో అంతగా వికసించలేదు. ఆకర్షకం కాలేదు. ప్రథమముద్రణ ప్రతులు చెల్లడానికే తమకు చాలాకాలం పట్టిందనీ, దానివల్ల ప్రతిఫలంకూడా ఉత్సాహ జనకంగా ముట్టలేదనీ రాజశేఖరచరిత్రనుగూర్చి ప్రస్తావిస్తూ వీరేశలింగం స్వీయ చరిత్రలో చెప్పుకున్నాడు. 'హిందూ' పత్రిక రాజశేఖరచరిత్రను ఎంతగానో మెచ్చుకుంది. వీరేశలింగం ప్రతిస్పర్ధులలో అగ్రేసరుడైన కొక్కొండ వేంకట రత్నం పంతులుగారుకూడా 'సుందరమైనది రాజశేఖరచరిత్రమ'ని ప్రశంసించారు. అయినా తెలుగులో నవలలు రాయాలని, ఆనాటి కవులు, పండితులు, నాటకరచయితలూ ఎవ్వరూ పూనుకొన్నట్లులేదు. 1892 వ సంవత్సరంలో రాజ మహేంద్రవరం నుంచి 'చింతామణి' అనే సాహిత్యమాస పత్రిక వెలువడ సాగింది. న్యాపతి సుబ్బారావుగారి ఆర్థికమైన అండదండలతో వావిలాల

వాసుదేవశాస్త్రి, ఆచంట సుందరరామయ్య, వీరేశలింగం ప్రభృతుల సంపాద కత్వ నిర్వహణలో ఈ పత్రిక ఏడెనిమిది సంవత్సరాలు వెలువడి కిందటి శతాబ్ది చివరిదశకంలో తెలుగు సాహిత్యాన్ని ఎంతగానో సుసంపన్నం చేసింది. తెలుగు సాహిత్య చరిత్రలో మొట్ట మొదటిసారిగా నవలారచనలో పోటీలు నిర్వ హించిన ఘనకీర్తి ఈ పత్రికకే దక్కుతుంది. 1892వ సంవత్సరంలో మొట్ట మొదటిసారి జరిగిన పోటీకి మూడేనవలలు వచ్చాయి అనాటి గంజాం జిల్లాలో రసూల్‌కొండ అనేఊళ్ళో బడిపంతులుగా పని చేస్తున్న ఖండవల్లి రామచంద్రుడు గారు రాసిన ధర్మవతీ విలాసానికి ప్రథమ బహుమానం లభించింది. తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారి సంజీవరాయచరిత్రానికి రెండోబహుమతి లభించింది. ఆతర్వాత సంవత్సరంలో జరిపిన పోటీకి చిలకమర్తి రామచంద్ర విజయం పంపించాడు ఆయన నవలకే ఆ సంవత్సరం ప్రథమబహుమానం లభించింది. ఆతర్వాత వరసగా నాలుగు సంవత్సరాలు నవలారచనలో పోటీకి చిలకమర్తి తన రచనలు పంపించాడు. మొదటిబహుమానమో, రెండోబహుమానమో ఏదో ఒకటి గెలుచుకుటూంనే వచ్చాడు. ఈ చింతామణి పోటీలకే దేకుమళ్ళ రాజ గోపాలరావుగారు కూడా త్రివిక్రమవిలాసం వంటి నవలలు పంపించి బహుమా నాలు పొందారు.

1897వ సంవత్సరం వరకూ ఈ సాహిత్య ప్రక్రియను నవల అని అనే వాళ్ళు కాదు. వచన ప్రబంధమనే సంభావించేవాళ్ళు. 1897వ సంవత్సరంలో కాశీ భట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు రాజశేఖరచరిత్రను విమర్శిస్తూ, వివేకచంద్రికా విమర్శనమన్న గ్రంథాన్ని ప్రకటించారు. రాజశేఖరచరిత్రకే వివేకచంద్రిక అనే నామాంతరం కూడా వుంది. ఈ విమర్శలో ఆయన ఆధునికమైన ఈ ప్రక్రియ మనం ఇంగ్లీషునుంచి తెచ్చుకున్నాం కాబట్టి, పేరుకూడా తెచ్చుకొని ప్రచురపరచడం తప్పులేదని నిష్కర్షించారు. ఆనాటినుంచి నవలగానే నలుగురూ ఈ ప్రక్రియను ప్రాచుర్యానికి తెచ్చారు. కాబట్టి తెలుగునవల పాతికసంవత్సరాల వయసొచ్చేదాకా పేరు నిర్ధారణ కాలేదన్నమాట. 1897 ప్రాంతంలోనే చింతామణి పత్రిక ఆగిపోయింది, ఆగామి శతాబ్ది నవోదయం వేపు అందరి

దృష్టి ఆకర్షితమైవుంది. చిలుకూరి వీరభద్రరావు, ముఖ్యంగా, సాంఘికేతివృత్తాంతాలతోనూ, చారిత్రికేతివృత్తాంతాలతోనూ, అనుసరణలూ, అనువాదాలూ కూడా నిర్వహిస్తూ మౌలికరచనలూ చేస్తూ వచ్చారు. తెలుగునవల సాంఘికోద్బోధన కోసం తను వెత్తి చారిత్రకేతివృత్త ప్రాధాన్యంగా క్రమక్రమంగా రూపొందుతూ రావడమనేది మొదటి పాతిక సంవత్సరాల చరిత్ర. ఇది ఆశ్చర్యకరం.

1906వ సంవత్సరంలో విజ్ఞాన చంద్రికామండలి ఆవిర్భావంతో నవల అంటే కేవలం చారిత్రక నవలే అనుకునేంతగా చారిత్రక నవల ప్రతిపత్తిని సముపార్జించుకుంది. దీనికి తగిన కారణాలు లేవా? లేకేం! ఉన్నాయి. ఇరువయ్యో శతాబ్ది ప్రథమదశకంలో వంగదేశ విభజన ప్రతిఘటనోద్యమం ద్వారా జాతీయ సాంస్కృతిక పునరుజ్జీవనం భారతీయ సాహిత్యాన్ని, సమాజాన్ని ఎంతగానో ప్రభావితంచేసింది అందువల్ల జాతీయోద్యమస్ఫూర్తి ఇరవయ్యో శతాబ్ది ప్రథమ పాదంలో వెలువడిన సాహిత్యంలో ప్రాణశక్తిలాగా దర్శనమిస్తుంది. కవిత్వం లోనైనా కథల్లోనూ, కాల్పనికమైన నవలల్లోనూకూడా స్థూలంగా జాతీయోద్యమ స్ఫూర్తి కనిపిస్తూనే వుంటుంది.

## చారిత్రకాలు మాత్రమే కావాలి

విజ్ఞాన చంద్రికామండలి నవలా పోటీలను నిర్వహించినప్పుడు వారు కేవలం చారిత్రక నవలలను మాత్రమే స్వీకరించగలమని స్పష్టంచేశారు. ఈ పోటీలకు వచ్చి బహుమానాలు పొందినవే రాయచూరు యుద్ధం, విమలాదేవి, విజయనగరసామ్రాజ్యం మొదలైన నవలలు. ఇరవయ్యోశతాబ్దిలో మొదటి ఇరవై సంవత్సరాలు ఇంచుమించుగా చారిత్రక నవలలకే ఎక్కువ ప్రాధాన్యం కన్పిస్తుంది. ఇంకొక ముఖ్యవిషయం ఏమంటే తెలుగుదేశంలో వంగ సంస్కృతి పట్ల, భాషాసారస్వతాల పట్ల విపరీతమైన అభిమానమూ, ఆరాధనా ఏర్పడటం. ఈ కాలంలోనే వంగభాషనుంచి నవల లనేకం తెలుగులోకి అనూదితమైనాయి. అపరాధ పరిశోధక నవలలు, మొగలాయి దర్బారువంటి భారతీయ చారిత్రాత్మక నవలలూకూడా తెలుగులోకి వంగభాష ద్వారా అనూదితమై వచ్చాయి. కేతవరపు

వెంకటశాస్త్రిగారు రాసిన లక్ష్మీప్రసాదంవంటి సాంఘిక నవలలుకూడా వెలువడినా ఇంచుమించుగా ఈ శతాబ్దంలో మొదటి ఇరవై సంవత్సరాలూ పురాభారతీయ పీరగాథోజ్జ్వలేతివృత్తాలకే ప్రాధాన్యం నవలా రచనలో కనపడుతూవచ్చింది. 1918 నుంచి భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణం కూడా తెలుగుదేశాన్ని అధికాధికంగా ప్రభావితంచేసిన సామాజిక సాంస్కృతికోద్యమమైంది. తదాదిగా తెలుగు దేశంలో ప్రధానమైన కేంద్రాలలో ఆంధ్రమహాసభలూ జరుగుతూ వచ్చాయి. స్వాతంత్ర్యోద్యమమూ, ఆ ఉద్యమ ప్రవాహంలో అంతర్వాహినిగా స్వీయ రాష్ట్రోద్యమమూ తెలుగువాళ్ళను చైతన్యవంతులను చేస్తూనేవచ్చాయి.

## తెలుగు నవలకు స్వర్ణోత్సవము

తెలుగు నవలా సాహిత్య చరిత్రలో 1922 ఒక పరమోజ్జ్వల ఘట్టం. తెలుగు నవల కది స్వర్ణోత్సవవత్సరం. తెలుగు నవలలో సాంఘిక చారిత్రకేతి వృత్తక్రమం, చారిత్రక సామాజికేతివృత్త క్రమంగా పరిణమిస్తున్న దశకు స్పష్టమైన ఆనవాలు మాలపల్లి నవల. మాలపల్లి ఆవిర్భావం తెలుగు నవలా సాహిత్య వికాసంలో చాల ముఖ్యఘట్టం. మాలపల్లి గొప్ప సామాజిక నవల. సాంఘిక దృక్పథం సామాజిక దర్శనంగా పరిణతి చెందుతున్న సాహిత్య దర్శనం మాలపల్లి. దేశీయమైన ఎల్లలను దాటి ఖండాంతర సామాజిక రాజకీయ విప్లవ పరిణామావగాహన కల గొప్ప రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ.

తెలుగు నవల పుట్టినప్పుడు సాముదాయిక జీవితం ఇతివృత్తంగా పుట్టింది. ఎభై సంవత్సరాలు గడిచేసరికి సామాజిక చైతన్యం ప్రేరకమైంది రచనకు.

తెలుగు నవలా సాహిత్యంలో మాలపల్లి మేరుశృంగంవంటిది. ఆధునిక ఇతిహాస గౌరవం సముపార్జించుకున్న దీ నవల. తత్కాలీనమైన సాంఘికార్థిక రాజకీయ మత నైతిక పరిణామాలన్నీ ఈ నవలలో ప్రతిభావంతంగా ప్రసక్తమైనవి. రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణగారు తా మీ నవలను వాడుక భాషలో రచిస్తున్నామని చెప్పి శైలీ సంవిధానంలో కూడా అపూర్వమైన, అనన్యసాధా

రణమైంది ఉన్నవ ప్రవచించారు. 1923వ సంవత్సరంలో అసహాయోద్యమంలో కారాగారవాసం చేసినప్పుడు ఉన్నవవారు ఆ చెరసాలలో ఈ నవల రాశారు. ఈ నవల ప్రచురితం కాగానే ప్రభుత్వపు నిషేధాజ్ఞలకు గురిఅయింది. ప్రతులన్నీ జప్తు చేశారు పత్రికలు ప్రభుత్వంవారి ఈ నిరంకుశచర్యను గర్హించాయి. మేధావులు నిరసించారు. ప్రభుత్వ దృష్టిలో తీవ్రమైన అభ్యంతరకరభావాలని తామనుకుంటున్న భావాలను, భాగాలను తొలగిస్తే, సవరిస్తే పునర్ముద్రణకు అనుమతిస్తామని ప్రభుత్వమే ప్రకటించడంతో 1935 లో రెండో ముద్రణం వెలువరించారు ఆంధ్రగ్రంథమాలవారు. ఈ సంస్కరణ ముద్రణకు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు గొప్పపీఠికను కూర్చారు. 1936 వ సంవత్సరంలో మళ్ళీ ప్రభుత్వం మాలపల్లిని నిషేధించింది. అంటే ఈ నవలను పదిహేను సంవత్సరాల వ్యవధిలో ప్రభుత్వం రెండుసార్లు నిషేధించిందన్నమాట. ఆనాటి స్వాతంత్ర్యోద్యమస్ఫూర్తికి, ప్రజలలో రాజకీయ చైతన్యం పెంపొందించటానికీ తెలుగుదేశంలో మాలపల్లి నిర్వహించినపాత్ర అనన్యసాదృశ్యమైనట్టిదని చెప్పాలి. ఈ నవల నాలుగు భాగాలుగా విభక్తం. ఆనాటి సమాజంలో పరిష్కారం కోరుతున్న సమస్యలన్నింటినీ ఇందులో చర్చించారు ఉన్నవవారు. అత్యంత వాస్తవికమైన రీతిలో పాత్రపోషణం చేశారు. జైళ్ళు, న్యాయస్థానాలు, నేరస్థులను సంస్కరించే దృష్టితో ప్రభుత్వం నిర్వహించే నిర్బంధ సంస్థలైన 'సెటిల్మెంట్లు', విద్యా, వైద్య, సాంస్కృతిక వ్యవస్థలలో ఆనాడు ప్రచురంగా కనపడుతున్న అక్రమాలు, అన్యాయాలు, అన్నిటినీ కనుల ముందు నిలిపారు. రష్యాలో నెలకొన్న సామ్యవాద ప్రభుత్వాన్ని అభినందించారు. గుంటూరుజిల్లాలోని మెట్టప్రాంతమైన మంగళాపురమనే పల్లెటూరును రంగస్థలంగా చేసుకొని సమాజంలో బలవంతులు బలహీనులను దోచుకొనే కీలకాన్ని వర్గకలహాలను, వాస్తవిక చిత్రణం చేశారు ఉన్నవవారు.

మాలపల్లి వచ్చిందాకా ఈ ఏభై సంవత్సరాలు తెలుగు నవల సాంఘిక సంస్కరణమూ, వీరశృంగారరేతివృత్త చారిత్రక కాల్పనికోన్ముఖమూగా సాగుతూ వచ్చింది. సామాజిక చైతన్యోద్బోధకంగా తెలుగు నవల పరిధి-

విస్తృతమైంది మాలపల్లితో. తెలుగు నవలా చరిత్రలో విశిష్టపథ ప్రవర్తకుడు ఉన్నవ. ఆయనతో ఒక సంప్రదాయం, ఒక మార్గదర్శకత్వం, ఒక సాహిత్యోద్యమం ముఖ్యంగా నవలా రచనలో ప్రారంభమైన దనదం నిర్వివాదం.

## సామాజిక చారిత్రక అనుక్రమణిక

1922 వ సంవత్సరాన్ని ఒక గొప్ప మలుపుగా, ప్రధాన ఘట్టంగా గ్రహించి 1947 లో స్వాతంత్ర్యం వచ్చేనంతవరకూ మరొక ఘట్టంగా తెలుగు నవలను పరిశీలిస్తే రెండు ప్రధానమైన మార్గాలు కనిపిస్తాయి. ఒకటి సామాజికం, రెండు చారిత్రకం. విశ్వనాథ నోరి, అడవి బాపిరాజులు మళ్ళీ మళ్ళీ చారిత్రక నవలలు రాశారు. ఈ కాలిక విభాగంలో చలం సామాజికోద్ధారం కోసమే రాసినా ఆయన ధోరణి అభాస విప్లవాత్మకమైనది. ఆయన సామాజిక వ్యవస్థా స్వరూపాన్ని సమగ్రంగా దర్శించలేదు. మధ్యతరగతి సాంఘిక గార్హస్థ్య జీవనంలోని లోటుపాట్లను బలంగా చిత్రించిన మాట వాస్తవమే అయినా, సమకాలీన రాజకీయార్థిక సాంఘిక సాంస్కృతిక పరిణామాల సదవగాహన ఆయనలో లోపించింది. వైయక్తికమైన సమస్యలను, సాముదాయకమైనవిగా, సామూహికమైనవిగా చలం భ్రాంతి చెందటం జరిగింది. సమాజంలో స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం వుండి, తగిన విద్యాసంస్కారం వుంటే ఆయన తన నవలల్లోనూ కథల్లోనూ చిత్రించిన వ్యక్తుల ప్రవర్తనలు, సన్నివేశాలు, మానసిక ఉద్వేగ రుగ్మతలకు తార్కాణాలుగానే మిగిలిపోయేవి. ఆయనలో అవితథమైన భావోద్వేగమూ, సౌందర్యాభినివేశమూ ఆయన శైలిలో ఒక వేగాన్ని, వాడుపును తెచ్చినమాట కొంతవరకు ఒప్పుకోవచ్చు. చలం నవలలు తెలుగు నవలా సాహిత్యంలో ప్రయోగాలుగానూ, ప్రమాణాలుగానూ, పథప్రవర్తకాలుగానూ సముచితమైన స్థానాన్ని పొందలేవు. రాజశేఖరచరిత్ర, మాలపల్లి, వేయిపడగలు, చివరకుమిగిలేది, చంఘిజ్‌ఖాన్, అతడు–ఆమె వలె చలం నవలలు భావితరాల వారిని కూడా ఇతివృత్త దృష్ట్యాగానీ, శిల్ప దృష్ట్యాగానీ, ఆకట్టుకొని కొంత కాలమైనా స్థిరంగా మనగలవని ఆయనను అభిమానించే సాహిత్యవిమర్శకులు స్థాపించి నిరూపించవలసివుంది. గోపీచంద్ అసమర్థుని జీవయాత్ర, రాచకొండ

విశ్వనాధ శాస్త్రి అల్పజీవి, జి. వి. కృష్ణారావు కీలుబొమ్మలు సాహిత్యంలో మనో విశ్లేషణం, అస్తిత్వవాదం, మొదలైన నూతన సిద్ధాంతాలకు వాహకాలుగా నైనా విలక్షణతను ప్రదర్శించగలవు. చలంజీవితంలో ప్రయోగాలు,సాహిత్యంలో కన్నా ఎక్కువ. ఆయన ఆధ్యాత్మిక గవేషణమూ, తాత్త్విక చింతనా నిత్య జీవితంతో తారసపడే వాస్తవ జీవితానికి పొందిపొసగేవి కావు. ఆనాటి సాంఘిక జీవనంలో ఆ పరిస్థితులు ఎందుకు ప్రచురంగా కొనసాగుతున్నాయో విశ్లేషించి ఆ సమస్యలకు పరిష్కారమార్గా లేమిటో సాహిత్యంలో ప్రతిపాదించడానికి చలం పూనుకోలేదు.

ఏమైనా 1922నుంచి 1947వరకూ తెలుగునవలా సాహిత్యచరిత్రలో విశ్లేషణకు సాధ్యపడని అంశాలు ఎన్నో కనిపిస్తాయి మాలపల్లి వెలువడ్డ పది సంవత్సరాలకు వేయిపడగలు రావడం. అదే సంవత్సరంలో మైదానం రావడం అటుతరవాత విశ్వనాధ, అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రిగారలు చారిత్రక నవలలు రాయడం, 1923, 24లలోనే బాపిరాజు హిమబిందు నవల వచ్చింది. బాపిరాజు గొప్పభావుకుడు, సౌందర్య పిపాసికాబట్టి, 1913వ సంవత్సరంలో మొదలైన ప్రత్యేకాంధ్ర రాష్ట్రోద్యమం, ఆతర్వాత క్రమక్రమంగా బలపడి తన ప్రభావం చూపుతూ వచ్చిందికాబట్టి, చారిత్రక నవలలపట్ల బాపిరాజువంటి రచయితలలో అభిముఖ్యం అర్థంచేసుకోవచ్చు. కాని రెండు ప్రపంచయుద్ధాల మధ్య సంక్షోభకాలంలో, సామాజిక పరిణామాలను చిత్రించే నవలలు తెలుగులో ఎన్నివచ్చాయి? తీవ్రమైన అసహాయోద్యమం, ఆర్థిక సంక్షోభం, నగరీకరణ ప్రభావం, కులవైషమ్యాలు, గ్రామీణజీవితంలో కలుగుతున్న మార్పులు, నాటి తెలుగు రచయితలను అంతగా ప్రభావితం చేసినట్లు కనపడదు. అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన సంగతి. 1937వ సంవత్సరంలో వాసిష్ఠ గణపతిముని 'పూర్ణ' పేరుతో ఐతిహాసిక సామాజిక చారిత్రక రాజకీయాత్మకమైన నవలను రెండు వందల ప్రకరణాలలో సంకల్పించి సుమారు నలభై ప్రకరణాలు రచించి భారతిలో ప్రకటించడం. వాసిష్ఠగణపతి ముని మహావిద్వాంసుడు. మంత్రద్రష్ట. అరుణాచల రమణునిగా ప్రసిద్ధికెక్కిన రమణమహర్షిచే సంభావితుడు. ఈయన

తెలుగులో నవలారచనకు పూనుకోవడమూ, వేదకాలంనాటి సామాజిక స్వరూపాన్ని ఆవిష్కరించడానికి తలపోయడమూ, ఈ నవలారచనలో విశేషం. గణపతిముని జీవితచరిత్రను రచించిన గుంటూరు లక్ష్మీకాంతంగారు ఈ నవలను గూర్చి ఇట్లా రాశారు—

"వేదకాలమునాటి సంఘ జీవనమును వర్ణించి మెల్లరకు నట్టి నానాత్వ భావములు లేని సరళ ప్రేమమును జీవితసౌఖ్యమును గౌరవ చెప్పను పుట్టించెను. తరువాత సంఘర్షణ లేనివిధమైన నాట్య ఒకానొక దివ్య మతిదృష్టి వచించబడి వారిచే సాధింపబడిన వివిధశాస్త్రపరిశోధనలు, కళాభివృద్ధి, నాగరకత మొదలగునవి కథలవలె శ్రోతలచిత్తములందు హత్తుకొనునట్లు మనోహరముగా వర్ణింపబడెను" (నాయన-పుటలు).

ఈ నవలను గణపతిమునిచంద్రులు రచించడానికి ఆనాటి సామాజిక కారణాలున్నవి. ప్రేరణలున్నవి. అప్పటికి జాతీయోద్యమ ప్రభావం ముమ్మరంగా వుంది. పురాగాథోజ్జ్వల దివ్యచరిత్రద్వారా, సమాజంలో అవాంఛనీయమైన అజ్ఞానాన్ని నిర్మూలించి ఇందుకు ఒకనాటి సువ్యవస్థితమైన విజ్ఞానం, సామాజిక నాగరకతలు ప్రేరకాలు కావాలని ఆయన ఆశించారు. అప్పటికి పాతిక ముప్పై సంవత్సరాలుగా దివ్యజ్ఞాన సమాజంవారి పురావైభవస్మరణం, పునరుద్ధరణాభిలాషలుకూడా ఈ నవలా విర్భావానికి ప్రేరణ కలిగించి వుండవచ్చు.

## సాముదాయికం × వైయక్తికం

తెలుగునవల ఆవిర్భవించిన నాటినుంచి ఏభై సంవత్సరాలవరకు సాముదాయిక జీవితచిత్రణ ప్రధానాంశంగా చేసుకొన్నది. మాలపల్లి వరకూ ఇంచుమించుగా ఇంతే. ఆతర్వాత పదిసంవత్సరాలలో వైయక్తికమైన సమస్యలకు ప్రాధాన్యం హెచ్చింది అడవి బాపిరాజు నారాయణరావు, కోనంగివంటి నవల్లో కాని, చలం రచించిన మైదానం, దైవమిచ్చిన భార్యవంటి నవలల్లోకాని, ఆటు తర్వాత యువతరంవారైన గోపీచంద్ వి. కృష్ణారావు బుచ్చిబాబు,

కుటుంబరావు నవలల్లోనేమి, వైయక్తిక జీవనం కేంద్రబిందువుగా సామాజిక జీవనం పరిధిగా నవలారచన జరిగింది. మొదటి ప్రపంచయుద్ధానంతరం ప్రపంచ సాహిత్యంలో వచ్చిన అనేకానేక మార్పుల ప్రభావం తెలుగుసాహిత్యం మీదకూడా ప్రసరించడం వల్ల శిల్పంలోనూ, సంవిధానంలోనూ పాత్ర చిత్రణ, పోషణలలోనూ నవలారచనలో కొత్తరీతులు ప్రారంభమైనాయి. స్వాతంత్ర్యావతరణానికి పూర్వం జాతీయోద్యమ ప్రభావమూ, గాంధీజీనేతృత్వంలో సాగిన సత్యాగ్రహ పోరాటాలూ తెలుగునవలను ప్రభావితంచేశాయి 1946లో 'చివరకు మిగిలిలేది' వచ్చింది. 1950లో 'అతడు-ఆమె' తొలిసారిగా పుస్తకరూపంలో వచ్చింది. స్వాంతంత్ర్యానంతరం తెలుగునవల సాహిత్యప్రక్రియగా గొప్ప ప్రాచుర్యం పొందింది. 1972వ సంవత్సరంలో తెలుగునవల శతజయంతి జరుపుకొన్నది. మొదటి డెబ్బైఅయిదు సంవత్సరాలలో వచ్చిన సంఖ్యకన్నా అటు తరువాత వెలువడిన నవలలసంఖ్య ఎన్నోరెట్లు ఎక్కువ. సగటున సంవత్సరానికి ఏభై నవలలు వచ్చినవనుకున్నా, ఇప్పటికి ఈ నూరు నూటఎనిమిది సంవత్సరాలలో ఐదారు వేల నవలలు వచ్చి వుండవచ్చు. ఈ సంఖ్య ఇంకా ఎక్కువే కాని, తక్కువ కావడానికి మాత్రము ఏమీ వీల్లేదు. నెలకు నాలుగు నవలల చొప్పున లెక్కవేసుకున్నా సంవత్సరానికి సుమారు యాభై నవలలు వచ్చినట్లనుకోవచ్చు. స్వాతంత్ర్యానంతరం తెలుగునవలకు, కుటుంబజీవనం ఆసక్తికరమైన ఇతివృత్తం అయింది. ఈశతాబ్ది పూర్వార్థం గడచిపోయి ఆరోదశకం ప్రారంభమయ్యేసరికి యువతరంలో మహిళలు నవలారచనకు పూనుకొని శరపరంపరగా రాయడం ఈ శతాబ్ది సాహిత్యవిశేషాల్లో ప్రముఖంగా చెప్పుకోదగింది. 1883వ సంవత్సరానికి మహిళలు చదువుకోవడానికే తెలుగులో పుస్తకాలు లేవు అనే స్థితి నుంచి 1973వ సంవత్సరం వచ్చేసరికి కాల్పనిక సాహిత్యంలో ముఖ్యంగా అత్యధిక ప్రాచుర్యం గల నవలా ప్రక్రియ మహిళారచయితల విహారభూమి అయిపోయింది. అటుతర్వాత చెప్పుకోదగిన అంశం వ్యక్తిగతమైన సమస్యలకు, సంవేదనలకు, సంఘర్షణలకూ కాక, మళ్ళీ సామాజికదృక్పథం, రాజకీయ వ్యవస్థాత్మకమైన లోటుపాట్లు, యువతరం రచయితల నవలల్లో ప్రముఖంగా చోటుచేసుకోవడం.

## చైతన్య స్రవంతి × అస్తిత్వవాదం

చైతన్యస్రవంతి నవలారచనలో శిల్పానికీ సంవిధానానికీ సంబంధించినది. అస్తిత్వవాదం ఇతివృత్తానికి సంబంధించింది. సమాజంలో ప్రధానమైన కేంద్రం వ్యక్తికాబట్టీ, సమాజమనేది అతడి అస్తిత్వానికి, ఉనికికి పరిధిమాత్రమే కాబట్టీ. ఈ పరిధి నిర్ణీతంగా, నిర్దిష్టంగా, నిబంధనాసహితంగా వుండవలసిన పనిలేదు అన్నది అస్తిత్వవాద సిద్ధాంతం. వ్యక్తిత్వం ముఖ్యంకాని సమాజం ఏర్పాటుచేసిన నియమనిబంధనలు ముఖ్యంకావు, అనేది సామాజిక తాత్త్విక సిద్ధాంతంగా ఈ శతాబ్ది తొలిపాదంలో సాహిత్యమేవావుంను ఆకర్షించి ప్రామర్శ్యం పొందిందీ అస్తిత్వవాదం ఇంగ్లీషులో జేమ్సుజేయిస్ పకటించిన 'యులిసిస్' చైతన్యస్రవంతి ధోరణిరచనకు మార్గదర్శకమైంది మొట్టమొదటి సారిగా తెలుగులో ఈ రచనాధోరణిని ప్రవేశపెట్టిన ప్రముఖులు, దీనివల్ల ప్రభావితులైనవారూ శ్రీశ్రీ, బుచ్చిబాబు, రాచకొండ విశ్వనాథశాస్త్రి ప్రభృతులు. శ్రీశ్రీ కథలుమాత్రమే ఈ ధోరణిలో ప్రకటించాడు. ఈ శిల్పాన్ని అందిపుచ్చుకొని విశ్వనాథశాస్త్రి అల్పజీవి అనే నవలను ప్రకటించి, ఒక కొత్తప్రయోగాన్ని ఆకర్షణీయంగా నిర్వహించాడు. మనోవిశ్లేషణాత్మక సిద్ధాంతాలనుగురించి ప్రాతిపదిక విషయాలనైనా తెలుసుకొంటేతప్ప. నవలారచనాశిల్పమైన చైతన్యస్రవంతినికాని సంవిధానవిన్యాసమైన అస్తిత్వవాదాన్ని గాని అవగాహన చేసుకొని ఆనందించడం కష్టం.

'వాస్తవికత బహిరంతస్సంబంధంగా సాహిత్యంలో ప్రదర్శించడమే జాయిస్ సంకల్పం. దీన్ని అతడు తన Stream of consciousness ప్రక్రియద్వారా సాధించాడు' అన్నాడు శ్రీశ్రీ.

ఈ చైతన్యస్రవంతి, అస్తిత్వవాదధోరణుల విషయికంగా తెలుగులో వెలువడిన మనోవిశ్లేషణాత్మక ప్రాయోగిక నవలలు, చివరకుమిగిలేది, అసమర్థుని జీవయాత్ర, అల్పజీవి మొదలైన నవలలు. ఆటు తదనంతరకాలంలో భాస్కరభట్ల కృష్ణారావు, నవీన్‌వంటివారుకూడా ఈ ప్రయోగాన్ని సమర్థవంతంగా నిర్వహించారు

'అతడు—ఆమె' ఏ ప్రమాణాలనుబట్టి చూచినా గొప్పనవల. ఇటీవల రెండోభాగంకూడా వెలువడింది ఈ శతాబ్దిలో అర్ధశతాబ్ది సాంఘికపరిణామ చరిత్ర ఈ నవల. ఈ నవలకికూడా అర్ధశతాబ్దిచరిత్ర ఉంది. ప్రథమ ముద్రణ సందర్భంగా రచయిత ఇలా రాశారు.

"పాతికేళ్ళ క్రితం నేను జర్మనీలో వున్నప్పుడు మా కుటుంబపత్రిక 'ఉషఃకాలం' కోసం యీ నవల వ్రాయడం ప్రారంభించాను. స్ఫురణ భార్యాభర్తల దినచర్యగా ఆలివ్ వాడ్సలీ రచించిన చిన్నకథ. నా నవలలో కొన్ని ప్రకరణాలు అప్పుడప్పుడు 'ఉషఃకాలం'లో పడుతూవచ్చాయి. పదేళ్ళపాటు పూరుకుని మళ్ళీ కొన్ని ప్రకరణాలు చేర్చి మొన్న యూరపు వెళ్లొచ్చాక ప్రచురిద్దాం అనుకున్నాను. కాని కథ ఇంకా పెంచి వ్రాస్తే బాగుంటుందని తోచి వెనుకటిని కొంత మార్చి క్రొత్తఘట్టాలు కొన్నికల్పించి కథ పూర్తిచేశాను"- అన్నారు శ్రీ ఉప్పల లక్ష్మణరావుగారు 1949 లో. అంటే ఈ నవలారచనకు శ్రీకారం 1924 లోనే జరిగిందన్నమాట రెండోభాగం ఆంధ్రజ్యోతి వారపత్రికలో నిన్నమొన్న పూర్తిఅయింది. కాబట్టి అర్ధశతాబ్ది చరిత్ర వుంది. ఈలోపున జాతీయ, అంతర్జాతీయ సామాజిక రాజకీయ సాంస్కృతిక ఉద్యమాలన్నీ దేశ దేశాలను ఏవిధంగా ప్రభావితం చేశాయో, ఈ నవల చదివితే తెలుసుకోవచ్చు. సంగీతం, సాహిత్యం, శిల్పం, రాజకీయాలు, మానవమనస్తత్వ చిత్రణలో అత్యద్భుతమైన సన్నివేశాలు. నవలారూపంలో వుండే ఒక విజ్ఞాన సర్వస్వం లాంటి దీరచన. అట్లాఅని ఎక్కడా విసుగనిపించదు. ఇంజనీరింగునూ, టెక్నాలజీగూర్చి చెప్తున్నప్పుడుకూడా. భార్యాభర్తల దినచర్య వృత్తాంతంగా రాయడంలో గొప్పసొగసును, ఆకర్షణీయమైన శిల్పాన్ని ప్రదర్శించారు రచయిత.

"కుడ్య చిత్రరచనవంటిది నవలారచన. బహుశా మన ఆంధ్రుల ప్రతిభ మినియేచర్ పెయింటింగ్‌లో కనపడుతుందనుకుంటాను" అంటాడు శ్రీశ్రీ- తెలుగులో మంచి నవలలు రాలేదన్న తన అభిప్రాయాన్ని విశ్లేషణపూర్వకంగా సమర్థించుకోవటానికి ప్రయత్నిస్తూ కాని, అతడు- ఆమె, చెంఘీజ్ ఖాన్ వంటి

నవలలు శ్రీశ్రీ ఫిర్యాదు అర్థం లేనిదన్న విషయాన్ని స్పష్టం చేయగలవు. రావి శాస్త్రి రాజు-మహిషి నవలకూడా పూర్తిగా వస్తే ఈ శతాబ్దపు పది గొప్ప తెలుగు నవలల్లో స్థానం సంపాదించుకోగలదు.

## వైయక్తికం × సామాజికం

స్వాతంత్ర్యానంతరం దేశంలో ఒక నవీన సంపన్నవర్గం బలిసింది అన్ని రంగాలలోనూ రాజకీయాలు, వ్యాపారవ్యవస్థలూ, విద్యాలయాలు, న్యాయ స్థానాలు, ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగ నిర్వాహణంలోని లొసుగులు, ఇవన్నీ మేధావి వర్గ రచయితలను ప్రభావితం చేశాయి. అందువల్ల వశీ: వైయక్తిక మైన సమస్యలు వదిలేసి సామాజిక వ్యవస్థాదర్పణాలైన రచనలు చేయడానికి రచయితలకు ప్రేరణకలిగింది. చంఘిజ్ ఖాన్ పేరుకు చారిత్రక నవలే అయినా ఆధునిక శతాబ్దిలోని రాజకీయ విలయాలకు చరిత్ర పరిణామాలతో సమన్వయం చేసి చూపిన సామాజికప్రయోజనంగల గొప్ప నవల. శిల్పవిషయికంగా చూసినా ఇతివృత్త నిర్వహణ విషయికంగా చూసినా చంఘిజ్ ఖాన్ గొప్పనవల. ఇది మహాకావ్యంలా సాగింది.

ఇదే విధంగా కేవలం రాజకీయ సంఘటితోద్యమాలను, సామాజిక సంచలనాలను ఇతివృత్తాలుగా చేసుకొని నవలలు రావడం కూడా జరిగింది. మహీధర రామమోహనరావు 1937 నుంచి 1947 వరకు తెలుగుదేశంలో కమ్యూనిష్టు ఉద్యమ ప్రభావాన్నీ, ఆ తర్వాత 1952 నుంచి 1955 వరకు తెలంగాణ భూస్వామ్యవ్యవస్థా వ్యతిరేక పోరాటాన్నీ ఇతి వృత్తాలుగా చేసుకొని రథచక్రాలు, ఓనమాలు వంటి నవలలు రాశారు. ఇది తెలుగు నవలా సాహిత్యంలో చెప్పుకోదగిన ప్రయోగం

స్వాతంత్ర్యానంతరం తెలుగులో పత్రికల సంఖ్యకూడా బాగా పెరిగింది. ముఖ్యంగా మాస వార పత్రికల ఎక్కువ సంఖ్యలో వెలువడజొచ్చాయి. పాఠకులను ఆకట్టుకోవడానికి ధారావాహికంగా నవలలు ప్రచురించసాగాయి

పత్రికలు. పంధొమ్మిది వందల యాభై, అరవై ల మధ్య బలివాడ కాంతారావు "శారద" రంధి సోమరాజు. ఎమ్. ఆర్. చిదంబరం, ఇచ్ఛాపురపు జగన్నాధ రావు వంటి రచయితలు, వార పత్రికలలో ధారావాహికంగా నవలలు ప్రచురించి పాఠకులను ఆకట్టుకున్నారు. 1960 వ సంవత్సరం తర్వాత వారపత్రికలు నవలా పోటీలు ప్రారంభించాయి. అరవై తర్వాతనే మహిళల రచనలకు ప్రాచుర్యం బాగా పెచ్చింది కుటుంబ జీవనం ఇతివృత్తంగా ఎందరెందరో మహిళలు నవలలు రాశారు రాస్తున్నారు రంగనాయకమ్మ. వాసిరెడ్డి సీతాదేవీ, మాలతీ చందూర్. లత స్వర్గీయ పి. శ్రీదేవి వంటివారు సామాజిక దృక్పథంతో సామాజిక సమస్యలను విశ్లేషిస్తూ నవలలు రాశారు

ఇదే కాలంలో సామాజిక పయోజనాన్ని దృష్టిలో పెట్టుకొనే ప్రయో గాత్మకమైన నవలలుకూడా వచ్చాయి. భాస్కరభట్ల కృష్ణారావు అస్తిత్వ వాద ధోరణిలో వెల్లువలో పూలికపుల్లలనే నవల ప్రచురించాడు. అంతకు పూర్వమే యుగసంధివంటి ఆధునిక పరిణామాలను ఇతివృత్తంగా చేసుకొన్న నవలలు రచించాడు. భవిష్యద్దర్శనం అనే నవల కృష్ణారావు సాహిత్యదర్శనంగా రచించాడు, ఈ నవల్లోనే ఆయన వింత ప్రణయంవంటి నవలికనుంచి ఏ విధమైన క్రమపరిణతి సాధించుకుంటూ వచ్చింది మనకు స్పష్టపడగలదు.

ఆధునిక ప్రయోగాల దృష్ట్యా మాండలిక భాషలో రచించడమనే ప్రయత్నాన్ని పేర్కొనవలసివుంటుంది. ఈ శైలిలో వెనకటి రోజుల్లో మా గోఖలే కొన్ని కథలు రచించాడు పంధొమ్మిదివందల అరవైలలో ఒక ప్రాంతం లో జనసామాన్యపు నిత్యవ్యవహారభాషలోనే నవలలు రచించడమనేది ఒక ప్రయోగంగా కొందరు రచయితలు చేపట్టారు. శ్రీమతి మాదిరెడ్డి సులోచన. డా॥ పోరంకి దక్షిణామూర్తి, దాశరధి రంగాచార్యులగారివంటివార్లను, ఈ ప్రయోగం చేసినవారిలో ప్రముఖులుగా పేర్కొనవలసి వుంటుంది గోదావరి జిల్లా మాండలికాన్ని రాయలసీమ మాండలికాన్ని, తెలంగాణా మాండలికాన్ని కూడా నవలారచనలో స్వీకరించి మూడునవలలు వెలువరించడం డా॥ దక్షిణా మూర్తి ప్రత్యేకత.

శ్రీ పినకొండ నాగరాజు ప్రతీకాత్మకి నవలలు రాశాడు చైతన్య స్రవంతి, మనోవిశ్లేషణము, ఈయన కథిమూలవిషయాలుగా కనపడతాయి. ఇటీవల శ్రీ ఎన్. ఆర్. నంది నైమిశారణ్యం నవలలో సామాజిక దృక్పథాన్ని బాగా ప్రతిబింబింపచేశాడు. వడ్డెర చండీదాసు రచించిన 'హిమజ్వాల' శిల్పంలోనూ, ఇతివృత్తపరంగానూ కూడా ప్రయోగాత్మక నవల

వర్తమాన కాలంలో మళ్ళీ చారిత్రాత్మక నవలలు రచిస్తున్నవాళ్ళుకూడా వున్నారు. శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు గొప్ప భావుకుడు, మంచి పండితుడు. వ్యుత్పన్నుడు. ఆయన ధర్మనిర్ణయమనే నవల ఉత్తమ ప్రమాణాలు గలది. తిక్కనసోమయాజి, అన్నమాచార్యులు. పోతనల జీవితాలను గూర్చి వీరు గొప్ప చారిత్రాత్మక నవలలు రచించారు

**కలలు, కాంక్షలు, కాలక్షేపం**

తెలుగు దేశంలో తెలుగు పాఠకులలో నేడు నవల కున్నంత ఆదరణ మరే సాహిత్య ప్రక్రియకూ లేదు ఇది ఆదనుగా తీసుకొని ప్రచురణకర్తలు కోకొల్లలుగా నవలలు ప్రచురిస్తున్నారు. వాస్తవిక జీవితానికి ఏమీ సంబంధించని ఊహాగానాలు, తారుణ్యభావోద్రేకాలు, కాలక్షేపంకోసం కొందరు రచయితలు, ముఖ్యంగా కొందరు రచయిత్రులు రచనలు చేయడం కనపడుతున్నది. నేటి సమాజంలో జీవన ప్రమాణాలుకాని, సంఘర్షణలుకాని, రాజకీయార్థిక ప్రభావాలు కాని అవగాహన చేసుకొని వాస్తవికమైన దృష్టితో సమాజానికి సాహిత్యం చేరువగా వుండాలనే ఆశయం నేడు చాలామంది రచనలలో కనపడటం లేదు. అందుకే నవలారచన నూరు సంవత్సరాలుగా చేస్తూనేవున్నా, పట్టుమని పాతిక గొప్ప నవలలు చెప్పుకొందామంటే కనపడవు ఇది మన ఒక్క తెలుగు సాహిత్యానికే పరిమితం కాదేమో. తక్కిన భారతీయ భాషలలో ఆధునిక సాహిత్యపు తీరుతెన్ను లెట్లా వున్నాయో పరిశీలిస్తేగాని, ఇందుకు కారణాలు చెప్పుకోవడం కష్టం. పాఠకుల సంఖ్య అధికమైనట్లే రచయితల సంఖ్యకూడా పెరిగిపోయింది. ఇందులో ఏమీదోషం లేదు. పైపెచ్చు సంతోషించాల్సిన విషయంకూడానూ.

ఒక విషయం ఇక్కడ మనం గుర్తుంచుకోవాలి. సుమారు వెయ్యి నవలలు దాకా రాసి, పాఠకులలో కల్పనాసాహిత్యంపట్ల అధికమైన కుతూహలాన్ని రేకెత్తించిన కొవ్వలి నవలలు ఇప్పుడు చూస్తామన్నా దొరకవు. ఒకప్పుడు కొవ్వలినవలలకు ఎంతో ప్రాచుర్యముండేది. అలానే జంపన చంద్రశేఖరరావు అనేఆయన కూడా చాలా నవలలు ప్రకటించాడు అయినా ఇరవై పాతిక సంవత్సరాలలోనే ఆ రచనలు విస్మృతమైపోయినవి. కాబట్టి సమకాలికమైన ప్రాచుర్యం, ప్రామాణికంగా చేసుకోదగిన కొలతబద్ద కాదు తెలుగునవలా సాహిత్యపరిణామ చరిత్ర చెప్పేందుకు బుచ్చిబాబు, గోపీచంద్, కుటుంబరావు, జి. వి. కృష్ణారావు, రాచకొండ విశ్వనాథశాస్త్రి రచనలు ఉపకరించినట్లు, పదుల కొద్దీ చిత్రచిత్రవర్ణ, త్రివర్ణ, బహువర్ణ ముఖచిత్రాల నవలాభాసా ఉపకరించవు. ఈ రెండుమూడు దశాబ్దాలుగా వెలువడుతున్న నవలల్లో 'శారద' బలివాడ కాంతారావు, అవసరాల రామకృష్ణారావు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, కొమ్మూరి వేణుగోపాలరావు, దాశరథి రంగాచార్య, వట్టికోట ఆళ్వారుస్వామి, ఇప్పుడు కలువకొలను సదానంద వంటి రచయితలు రాసిన మంచినవలలు ఎన్నో ఉన్నాయి

## ముగింపు

వీరేశలింగం నుంచి ఉన్నవవరకు అంటే 1878నుంచి 1920వరకు సాముదాయిక జీవన సామాజిక సమస్యాచిత్రణం తెలుగునవలని ప్రభావితం చేసింది. అక్కడినుంచి సంఘంలో కేంద్రబిందువైన వ్యక్తి, అతడి సమస్యలు సామాజిక సమస్యలుగా ఎలాగు పరిణమిస్తున్నాయో చిత్రంచడం ప్రాచుర్యం పొందింది. సామాజికసమస్యలు వ్యక్తిసమస్యలుగా మొదటితరం వ్యక్తి సమస్యలు సామజిక పరిణామాలుగా రెండోతరం, సంఘ సంస్కరణోద్యమాలు మొదటి తరం రచయితలని ప్రభావితం చేశాయి. కిందటి శతాబ్దిఉద్యమాలన్నీ సంఘ సంస్కరణోద్యమాలే. ఈ శతాబ్ది ఉద్యమాలు రాజకీయవ్యవస్థా ప్రాభావికమైనవే. అయితే అవి ఏ ఉద్యమాలైనా, సంఘ సంస్కరణ,

సాంస్కృతిక, రాజకీయ ఉద్యమాలన్నీ కూడా తెలుగునవలా రచయితను బాగా ప్రభావితం చేశాయి

కిందటి సంవత్సరం భారతదేశంలో ఇటీవలి ఆత్యయిక పరిస్థితి పరిణామాన్ని, ప్రభావాన్నీ చిత్రిస్తూ నవీన్ చీకటిరోజులనే మంచినవల ప్రచురించారు. 1878ని ఒక హద్దుగానూ, ఈ 1978ని మళ్ళీ ఒక ఘట్టంగానూ, తెలుగునవలా చరిత్రగతిని సమీక్షిస్తే. సామాజిక పరిణామావగాహనకు వెలిగా సమర్థుడైన రచయిత ఎప్పుడూ రచనకు పూనుకొన్నట్లు కన్పించదు.



# నేటి - కథ వాస్తవికత - తెనుగుదనం

శ్రీ మధురాంతకం రాజారాం.

తెలుగులో పద్యవిద్యకు వాగనుశాసను డెలాగో కథాసాహిత్యానికి గురజాడవా రలాగన్నది పెద్దలందరూ ఒప్పుకొన్నమాట. మంత్రం ఉచ్చరించగానే తెరుచుకున్న మాయా కవాటంలా గోపాలరావు 'తలుపు, తలుపు' అనగానే తెరుచుకున్నది అతడి యింటి తలుపులు మాత్రమేకాదు, కథాసాహిత్యజగత్తు తలుపులుకూడా. గురజాడవారు రచించిన కథలయిదింటిలోనూ రెండు తెలుగు కుటుంబాల కథలు, రెండు తెలుగుగ్రామాల కథలు. ఒకటేమో వేశ్యాగృహానికి సంబంధించినది. విషయలోలుపత్వానికి లోనై కులస్త్రీలను నిర్లక్ష్యంచేసే గృహస్థులు, అనుమానంతో పడుచుభార్యల్ని హింసించే వృద్ధభర్తలూ, మత విషయికమైన మూఢవిశ్వాసాలతో కావేషాలు పెంచుకునే మనుషులు ఆనాటి సమాజంలో కొల్లలు. సమకాలీన సమాజజీవనాన్ని తీవ్రంగా ఎదుర్కొన్న సమస్యలనే అప్పారావుగారు తమకథలకు ఇతివృత్తంగా స్వీకరించారు. ఆయన పాత్రలుగూడా సూటిగా సంఘంలోనుంచీ కథలలోకి వచ్చినట్టే వుంటాయి. పూర్ణమ్మ, బుచ్చమ్మ, మధురవాణి, గిరీశం, పాత్రలలాగే మెటిల్డా, కమలిని, నాంచారమ్మ లాంటిపాత్రలుగూడా మనకు కళ్లకు గట్టినట్టుంటాయి. పైగా కాలాని కన్నా ఎంతో ముందుకువెళ్లి సజీవవ్యావహారిక భాషను స్వీకరించడంవల్ల ఆయన కథలకు నిండైన తెనుగుదనం చేకూరినట్టయింది. వేరకే చెప్పుకోవలసిందేమంటే గురజాడకథల్లో ఇతివృత్తాన్నిబట్టి చూచినా, పాత్రల్నిబట్టిచూచినా, భాషనుబట్టి చూచినా, దేశీయతకు, వాస్తవికతకు బాహిరమైన అంశాలు వెదికినా కనబడవు. ఇవన్నీ బాహ్యమైన హంగులైతే, ప్రాణభూతమైన శిల్పంలోకూడా గణనీయమైన పరిణతి కానరావడంవల్ల తెలుగు కథానికకు పుట్టగానే ఈడొచ్చినట్టు చెప్పుకోడం జరిగింది. అవి దేశభక్తి ఆంధ్రాభిమానమూగూడా జోడుగుర్రాల్లా తెలుగుజాతి

రథాన్ని పరుగెత్తించిన రోజులు. గురజాడ తరువాత కథాసాహిత్యం పెంపొంద డానికి కారకులైన కథకులలో చాలామంది గొప్పగానో, కొద్దిగానో పైరెండింటి ప్రభావానికీ లోనైనవాళ్లు తమరచనలద్వారా సమాజానికి ఏదైనా ఒక సందేశం యివ్వాలనే ఆకాంక్ష, ఈకొత్త సాహిత్య ప్రక్రియ మూలంగా తెలుగు సాహిత్యా నికి పెంపూసొంపూ చేకూరాలన్న హూనిక వాళ్లచేత కథలు వ్రాయించాయి. విధానంకోసం పాశ్చాత్య సాహిత్యాన్ని పరిశీలించినా, వస్తువుకోసం నాటికథ కులు తెలుగువారి జీవితాన్నే పరిశీలించారు. ఇంతలో దేశంపైకి సామ్యవాద సిద్ధాంతాలగాలి వీచింది. మధ్యతరగతి జీవితంపైకి, ఆర్థికసమస్యలపైకి కథకుల దృష్టి మళ్లింది. కుటుంబరావుగారి ఆగమనంతో తెలుగుకథానికకు ప్రౌఢనిర్భర వయఃపరిపాకం చేకూరినట్టు చెబుతారు పద్మరాజుగారు. కథారంగం పల్లెలనుంచీ పట్టణాలకు తరలివెళ్ళడం అప్పుడే ప్రారంభమైంది. అయినా జనపదాలు పూర్తిగా విస్మరింపబడలేదు. అరకులోయలో అద్భుతదృశ్యాలు, కోనసీమరామ ణీయకత, గోదారిపైన రాదారి పడవల ప్రయాణాలు, పాపికొండల్లో పల్లెటూళ్లు, కృష్ణాగుంటూరు జనపదాలు, రాయలసీమనిమ్నోన్నతాలు, తెలంగాణా పీఠ భూములు మొదలైనవన్నీ కథాసాహిత్యదర్పణంలో ప్రతిబింబిస్తూ వచ్చాయి. పుట్టి అయిదుపదుల సంవత్సరాలు నిండకమునుపే తెలుగుకథానిక అంతర్జాతీయ బహుమతికి పాత్రమై ప్రపంచవిఖ్యాతిని సముపార్జించుకోగలిగింది. కానీ ఒక సాహిత్య ప్రక్రియ యొక్క సార్థక్యత కేవలం దాని శిల్పవిన్నాణంమీద మాత్రమే ఆధారపడివుండదు. అది సమకాలీన సమాజజీవనాన్ని ఎంతవరకు ప్రతిబింబించిం దన్న విషయంపైన ఆధారపడివుంటుంది. గడచిన అర్ధశతాబ్దికాలంలో తెలుగు మాగాణానికి సంబంధించి ఒక సమగ్రసాంఘికచరిత్ర వెలువడినట్టులేదు. కానీ ఆ కొరత కొంతవరకూ మన కథాసాహిత్యంవల్ల తీరింది. అనంతమైన వస్తువై విధ్యంతో జనాని కింత చేరువగా వెళ్లి, అంతగానూ పాఠకులకు అభిమానపాత్ర మైన సాహిత్యప్రక్రియ యింకొకటి లేదనే చెప్పవచ్చు. తెలుగు జాతి జీవితానికి సంబంధించిన సమస్తరంగాలలోని మంచిచెడ్డలు, మేలుకీళ్లు, రాగద్వేషాలు, వాళ్ళ ఉద్యమాలు, వాటి కేర్పడిన ప్రతిఘటనలు, జయాపజయాలు అన్నీకూడా కథా

సాహిత్యంలో ప్రతిఫలిస్తూ వచ్చాయి. తెలుగునాట గల పల్లెసీమలను, నాటక జనుల జీవితాన్ని, నగరాల్లో అక్కడి జీవన సంరంభాన్ని కళ్ళకు కట్టినట్టుగా చిత్రించి తెలుగుకథానిక చెంగి పోని దేశీయతాముద్ర వేసుకోగలిగింది.

ఈ మాత్రం భూమికతో గడచిన యిరువదేళ్ల కథా సాహిత్యాన్ని పరిశీలించడానికి యిక్కడ ఒక ప్రయత్నం జరిగింది

* * *

నల్లకొండల్లో పుట్టి పరుగు పరుగునా తెలుగునేలపై కొస్తుంది కృష్ణవేణి. నెమలిపించపుఛాయ చీరచుట్టాబెట్టి, పాలపొంగుల ఛాయ పట్టురైకా గట్టి లోయల్లో జారుగా బారుజడ వేసుకొని, కొంత పుప్పొడితేనె ఒడిలోన ఒంపుకొని, కోన పక్షులరవము కొంగులో కప్పుకొని, వాగుల్ల వంకల్ల రాసుకుంటూ, దూసుకుంటూ గట్టుపుట్టల మీదనుంచీ గబగబాదూకుతూ, అందెల్లు గల్లుమన, మట్టెల్లు జల్లుమన ఝుణ ఝుణా, పెళ పెళా, గల గలా, సర సరా, ఉరుకులతో, పరుగులతో, తరలివస్తున్న కృష్ణమ్మ. ఆఒడ్డూ, ఈఒడ్డూ ఒరుసుకొని పారుతూ, అమ్మతల్లిలా అలల చేతులు అన్నివైపులా విప్పుతూ, అందరినీ చేరబిలుస్తుంది. ఆనది ఒడ్డున ఓ గుడి వుంది. గుడి చుట్టూ ఓ వూరుంది. ఆవూళ్లో జనమున్నారు. దాదాపుగా ఆవూరి జనులందరికీ కథల్లో పాత్రలై, సాహిత్య ప్రపంచంలో స్థిరంగా నిలిచి పోయే అదృష్టం పట్టింది.

పుణుకులమ్ముకుని లక్షాధికారి అయిన సుబ్బాయి, స్వామి ప్రసాదం తప్ప మరేదీ ముట్టని గుడ్డి గంగన్న, పోటీఐడితే రెండు వందల ఆవడలను పెరుగులో నంజుకు తినేసే భోజనవీరుడు అప్పంభొట్లు, నదిలో స్నానమాడి లేచిన ఉప్పరపిల్ల అందచందాలను చూడాక–కట్టుకున్న పెళ్లాంపైన మోజు పెంచుకున్న పరమనైష్ఠికుడు రామశాస్త్రి, కోతి నాడించి కోతిని ప్రేమించి కోతి వల్లనే పొట్టకింత తిండి గడించి–చివరకది చనిపోతే తానే కోతిలా ఆడడం మొదలుపెట్టిన ముసలి సత్తెయ్య, పులివేషంతో ఊరినంతా గడగడ లాడించి తనయింటి బీబీ దగ్గరికెళ్లే సరికి పిల్లిలా మారిపోయే నబీసాయెబు, తన చావు

పల్లగూడా ఊళ్లో కల్లోలాన్ని సృష్టించిన తంపులమారి సోమలింగం, కొడుకు చనిపోయినా ఏడు పెరగని కాటికాపరి ఏసోబు, రిటైర్డై ప్రావిడెంటుఫండు చేతి కొస్తే కట్నం ముట్టజెప్పి కూతుర్ని అత్తవారింటికి పంపాలని ఆశపడే ముసలి మాష్టారు, అమ్ముకోడానికని జేసిన తినుబండారాలను ఉచితంగా అందరికీ పంచి పెట్టి-ఆఖరికి బ్రతుకు గడపకపోయేసరికి పెళ్లాన్ని వెంటబెట్టుకొని ఓ రాత్రివేళ ఊరువిడిచిపోయిన తాతగారు, తన యిష్టాయిష్టాలమేరకు న్యాయాన్నీ ధర్మాన్నీ నవరించగలిగిన సమర్థుడు పులిగడ్డ చలమయ్య, వెయ్యిమందికి సుష్టుగా వన సంతర్పణజేసి-తానుమాత్రం గరిటె పప్పుతో గుప్పెడు పులిహోరతో తృప్తిపడే పూర్ణయ్య, తనదగ్గర వాడుకగా పూలదండ కొనుక్కునే అయినింటి కోడలికి వైధవ్యం ప్రాప్తించినట్టు వినగానే తనవ్యాపారం చాలించుకున్న పూలసుల్తాను-యిలా ఎంత మందినైనా జాబితాలోకి తీసుకురావచ్చు. ఆవూరిని గురించి చెప్పుకోదగ్గవిశేషాలు అంతటితో ముగిసినట్టుగాదు. ఈతిబాధ లొచ్చి, జీవితాన్ని బీభత్సం గావించినవేళ ఆవూరి బ్రాహ్మలు, మాలలు ఏకోదరుల్లా మసలు కుంటారు. మూడురోజులు కాలినడకన ప్రయాణంచేసి మోగులూరునుంచి వచ్చిన ముసలమ్మ దీపారాధన చేస్తేగానీ ఆవూరి దేవుడి రథం కదలదు. మాన్యా లనుభవిస్తూ సోమరిపోతులయిన భజంత్రీలు సంగీతం నేర్చుకోరు. ఆవూరి ఆడవాళ్ళ ఆశలు కార్తీక దీపాల రూపంలో నదినీటిలో ప్రతిఫలిస్తాయి. కొన్ని దశాబ్దాల కాలం గిర్రున తిరిగి పోయేసరికి ఆవూరి చరిత్రలో గుర్తించుకోదగ్గ మార్పులెన్నో చోటుచేసుకున్నాయి. అవధాన్లుగారు బహిరంగంగా నడిబజారు మిఠాయికొట్లో చిట్టిగారెలు తింటున్నాడు. చాకలిపీరాయి కొడుకు ఆఫీసరుద్యోగం చేస్తున్నాడు. అభిషేక బ్రాహ్మలు సాయంత్రాల్లో ఫాంటూ, షర్టూ వేస్తున్నారు. అర్చకులు హిప్పీక్రాపులు, కటింగు మీసాలు పెట్టారు. ముతరాసు పోలయ్య పొగాకు వ్యాపారం చేస్తున్నాడు. పురోహితుడు ప్రొద్దుగూకంగానే మద్యం సేవిస్తున్నాడు. ఒకప్పటి బస్సుక్లీనరు లారీలుకొని ఆపైన పంచాయితీ ప్రెసిడెంటయ్యాడు. హరికథలు, భజనలు వినిపించడం లేదు. మునుపు రామాయణ కాలక్షేపం జరిగిన మండపంలో యిప్పుడు పెట్రమాక్సులైటు

వెన్నెలలో పేకాట సాగుతోంది సినిమాకు టికెట్లు దొరకడం లేదు. సెలవల్లో వూరికొచ్చిన కాలేజీ కుర్రాళ్లు, అమ్మాయిలవేటకోసం గుళ్లోకి పెందరాళే వస్తున్నారు. కట్నం యివ్వలేని ఆడపిల్లలకు పెండిండ్లు కావడంలేదు. బాకీల తాకట్టు క్రింద యిళ్లు, పొలాలు చేతులు మారుతూనే వున్నాయి. రోజూ సూర్యుడు ఉదయించి గ్రుంకుతూనే వున్నాడు. అదీ కథ !

అది ఒక వూరికథ. ఆవూరు ఒకనాటి మహానగరం. ఆవూరు ఒకప్పటి శిల్పకళానిలయం. ఆవూరు ఒకకాలంలో గొప్పవిద్యాపీఠం అయితే ఈ నాడది తెలుగునాడులోని వందలకొలది, వేలకొలది పల్లెటూళ్లమాదిరిగా ఒక చిన్నగ్రామం మాత్రమే. ఆవూరిపేరు అమరావతి.

పాలిచ్చి పెంచినతల్లికి బంగారుగుడి నిర్మించినట్లు, నీడనిచ్చిన చెట్టుచుట్టూ చలువరాళ్ళ వితర్దిక కట్టినట్టు, వరమిచ్చిన దేవుడికి బ్రహ్మోత్సవం జరిపినట్టు శంకరమంచి సత్యంగారు తాను పుట్టిపెరిగిన వూరిని గురించి వందకథలు వ్రాసి ప్రచురించారు. అవే అమరావతికథలు.

ఒక వూరినిగురించి వందకథలు—అందునా దేశీయతకు దర్పణంపడుతూ, వాస్తవికతకు న్యాయంచేకూడుస్తూ యిన్నికథలు వెలువడడం ఏదేశంలోనైనా అపురూపమైన విశేషమే!

కలిమీ లేమీ, నీతీ అవినీతీ, ఆచారం అనాచారం, దొంగలూ దొరలూ, భక్తులు, రిక్తులు, నాస్తికులు, స్వార్థపరులు, త్యాగధనులు, వానలువరదలు, పండుగలూ పబ్బాలు, నవ్వులూ కన్నీళ్లు, వ్యవస్థలూ వృత్తులూ- యిలా అందరితోనూ అన్నిటితోనూగూడిన తెలుగుజీవన విశ్వరూపం అమరావతి కథలు.

పల్లెపట్టుల ప్రకృతి సౌందర్యంతో బాటుగా, అక్కడి కర్షక కుటుంబాలలోని వ్యక్తులమధ్య గల పరస్పర అనుబంధాలుగూడా కళ్యాణసుందరీ జగన్నాథ్ గారి కథల్లో కళ్లఎదుట గీచిపెట్టిన చిత్తరువుల్లా కానవస్తాయి. పచ్చని తాటాకు పందిరి క్రింద బరేనెకుండలసొంపులు; చిరుచెమటలపైన చందనచర్చలూ;

గాలిలో పువ్వు ఎగిరినట్టు బంగారు జడకుచ్చులతో కాళ్ళగజ్జలతో డాంతో చేతి కంకణాలతో లోగిలి ఆవరణంతా ఎగిరి ఆడుకునే పసిపాపలు; పూచిన తంగేడు లాంటి అమ్మాయిలూ; ఆకుమళ్ళరోజులు; ఉగ్గబట్టలేని మనుషులు, ఆకాశపురంగు చీరకట్టావోసికట్టుకుని వడిసెలచేత బట్టుకుని మంచెమీద నిలబడ్డ రైతు పడుచులు; స్వామి ముందర వేసిన సాంబ్రాణి పొగలా ఆకాశంలో నినదించే పల్లె పాటలూ; కంచంలో పాలుపోసి అంచున వెన్నపెట్టి బిడ్డల్ని పెంచేతల్లులూ; ఆలరాన పుట్టిళ్ళ పరువుకోసం అవసరమైతే తోబుట్టువుల్ని బల్లకట్టుమీదినుంచీ ఏటిలోకి తోసివేయగల అన్నలూ; ఆడపడుచుల్ని ఆరడిపెట్టే రాకాసి వదినలూ; ఊరించి పూరించి చినుకునేలపైన పడకనే మాయమైపోయే మాడంతమబ్బులూ; తల బొప్పికట్టి నెత్తురెలువారేటట్టుగా కురిసే వడగళ్ళవానలూ; వానరాకడను సూచిస్తూ జమ్ములో నిలువెత్తుగూళ్ళు కట్టుకునే కొంగలూ; చిమ్మచీకటిలో దారి తప్పిన బాటసారి పెట్టిన పొలికేకను విన్న గ్రామస్థులు ఎదురు అరచుకుంటూ ఆపన్నుడి దగ్గరికి చేరుకునే సంప్రదాయాలూ-వెరశీ యిదంతా కళ్యాణసుందరి కథాసాహిత్యం. చిన్నబస్తీలకు, పెద్దపట్టణాలకు పరిమితమైపోయిన అధునిక కథాసాహిత్య ప్రపంచలో ఈ రచయిత్రి కథలు మహానగరం నడుమ కలకల లాడే పద్మసరోవరంలా కానవస్తాయి. తెనుగుదనాన్ని త్రవ్వి రాసులు పోయడం వాటి ప్రత్యేకత.

1971 జనాభాలెక్కల మేరకు అంధ్రప్రదేశ్‌లోని గ్రామాలసంఖ్య 28997. మొత్తం జనాభాలో 82 శాతం ప్రజలు ఈ పల్లెసీమల్లోనే నివసిస్తున్నారు. వీరిలో దాదాపు ముప్పాతికవంతువరకూ రైతులుగానో, రైతుకూలీలుగానో జీవిస్తున్నారు అయితే అత్యధిక సంఖ్యాకులైన ఈభూమి తల్లిబిడ్డల ఉనికిని మన కథాసాహిత్యం గుర్తించిన సూచనలు ఎంతవెదికినా కనిపించవు వ్యవసాయ రంగంలో నూతన యంత్రాలు, నూతన పద్ధతులు చోటుచేసుకున్నాయి. వ్యాపార పంట లెక్కువయ్యాయి భూస్వాములు బలపడ్డారు. ఆర్థికవనరులలో పంవల్ల సన్నకారు రైతులు చితికిపోయారు కూలీలకు బ్రతుకు లేకపోయింది,

పంచాయితీ రాజ్యవ్యవస్థ ప్రారంభమైంది మొదలు ముఠాలమధ్య తగాదాలు, సంఘర్షణలూ బలిసిపోయాయి. అక్షరాస్యత హెచ్చింది. ఉద్యోగాలకోసం, పల్లెల్లో లభించని అదనపు సౌకర్యాలకోసం ఎందరో గ్రామీణులు పట్టణాలకు తరలిరావడం రివాజైపోయింది. కులాలమధ్య అంతరాలు తగ్గిపోయి ఆర్థికస్థితి గతులనబట్టి సమాజంలో పైతరగతి, మధ్యతరగతి, అట్టడుగుతరగతి అంటూ మూడువర్గా లేర్పడ్డాయి. మూఢవిశ్వాసాలపై తిరుగుబాటు ప్రారంభమై శాస్త్రీయ ఆలోచనాసరళి హెచ్చింది. అయితే ఈ పరిణామాలేవీ మనకథల్లో ప్రస్ఫుటంగా కనిపించవు. పల్లెసీమ రంగస్థలంగా, గ్రామీణసమస్యలే యితివృత్తంగా, అక్కడి మనుషులే పాత్రలుగా వెలువడే కథానికలు నూటికొకటి రెండయినా లేకపోవడంవల్ల మనకథాసాహిత్యంలో ప్రతిబింబితమయ్యే తెలుగుదేశంయొక్క పరిధి చాలాసంకుచితమై పోయింది; ఆమేరకు దేశీయతగూడా లుప్తం కాజొ చ్చింది. మన కథారచయితల్లో ఎక్కువమంది నగరాల్లో స్థిరపడిపోవడం తప్పితే యిందు కింకొక కారణం కన్పించదు. స్వగ్రామానికి బయల్దేరి వెళ్లిన కథారచయిత అక్కడి స్టేషన్లో బండిదిగి, దారిలోనూ, వూరిలోనూ కానవచ్చిన మార్పుల్ని చూచి తెల్లబోయే కథలు కొన్ని అప్పుడప్పుడూ పత్రికల్లోఎదురౌతూ వుంటాయి. పెక్కు సందర్భాల్లో రచయిత లిలా స్వగ్రామాలకు వెళ్ళడం, అక్కడ తమకు మిగిలివున్న యింటినో, పొలాన్నో తోటనో అమ్ముకరావ డానికే నన్నది యిక్కడ గమనార్హమైన విషయం.

కథకులు గ్రామీణ జీవితంనుంచీ దూరంగా మరీదూరంగా వెళ్ళిపోతున్నా రనేది ఈ విచికిత్సద్వారా తేలే సారాంశం.

ఇట్టి పరిస్థితులవల్ల ఒక్కరైతు ఆర్తనాదం ఎక్కడైనా వినిపిస్తుందేమో నని పనిగట్టుకుని కథాసంపుటాలన్నీ వెదకవలసి వచ్చింది.

నదుల కెంతగా ఆనకట్టలు నిర్మించినా, కొత్తగా ఎన్నిచెరువులు కట్టించినా దేశంలో కొన్నిచోట్ల ఇంకా సేద్యమంతా బావినీటిపైనే ఆధారపడి జరుగుతూ వుంది. అదునుకు వానకురిస్తేగానీ, ఆబావుల్లో నీళ్లుండవు. అశకొద్దీ అప్పుచేసి

రైతు బావి త్రవ్విస్తాడు. అదీ దొంగసారా యమ్మి సర్పేటమ్మి, నానా దొంగ గడ్డి తిని మిగిలించిన డబ్బు ఎవరిదగ్గరయితే వుందో వాడిదగ్గరే అప్పుచేయాల్సి వస్తుంది. 'ముచ్చొడ్డీ' అంటారు. నూటికయిదు రూపాయలు. వాన కురిస్తే మిరప కాయలు తొలికోత తెగేసరికి వాడిడబ్బు వాడి ముఖాన కొట్టాలనే అనుకుంటాడు. తొమ్మిది మట్లు తెగినా ఒక అరఎకరం గూడా పారకానికి రాని బావిని చూస్తాడు. వడగాలికి గిలగిల లాడుతున్న మిరపమొక్కల్ని చూస్తాడు. భవిష్యత్తు చెప్పని చీకి చెట్లు చూస్తాడు. ఆశనిండిన కళ్ళతో ఆకాశంలో కదలుతున్న మబ్బులవైపు చూస్తాడు. వాన కురవదు రైతుల కళ్ళల్లోనుంచి కన్నీళ్ళు మాత్రమే కురుస్తాయి చెరువులు నిండవు వాళ్ళ గుండెలు మాత్రమే చెరువులౌతాయి.[1] పెళ్ళిళ్ళ ఖర్చులు, యింటి ఖర్చులు, చదువుల ఖర్చులు, కోర్టుల ఖర్చులు, చావు ఖర్చులు, యిన్నింటి కోసమూ అప్పులు పెరుగుతాయి ఇంతలో వానలేకనే పిడుగుపడ్డట్టు దండోరా మోత వినిపిస్తుంది బయానలెక్కల వసూళ్ళ కోసం తాశీల్దారు వేంచేస్తున్నారు తినడానికి తిండి గింజలు లేక చస్తోంటే రైతు అప్పు లెక్కడ కడతాడు? ఇల్లాలి మెడలో మిగిలివున్న దొక మంగళసూత్రం మాత్రం! తాళిబొట్టుకు మెడలో వున్న విలువ బ్యాంకులో ఉందని అతనికి తెలుసు. తక్కువ డబ్బుతో దేశ పెద్దుల్ని కొనక్కోడానికి సిద్ధపడి, మంచి వయసులో వున్న కోడెల్ని భూస్వామి పరంచేసి జప్తునుంచి తనను తాను రక్షించు కుంటాడు.[2] క్రమక్రమంగా పొలాలు గూడ బాకీల క్రిందే దఖలయి పోతాయి.

అంతో యింతో స్వంత పొలమున్న రైతుల పరిస్థితే యిలా వున్నప్పుడు, యిక భూమిని కౌలుకు చేసేవాళ్ళగతిని గురించి చెప్పేదేముంటుంది? కౌలుదారు రాంసామి కాడుబీడుగా పడివున్న దేవుడి మాన్యాన్ని రెండేళ్లు కష్టపడి చదునూ, పదునూ చేశాడు. మోటు తోలి కూరగాయలు పండించాడు. బావి పక్కన అరటిగెల గూడా పండించి 'అయ్యా! నా కొక పండివ్వవూ' అని అడిగింది

1. వాన కురిస్తే.— కేతు విశ్వనాథ రెడ్డి.
2. జప్తు — కేతు విశ్వనాథ రెడ్డి

ఆయిదేళ్ళకూతురు. కానీ ఆ పసిదానికి ఒక అరటిపండయినా దక్కలేదు. ధర్మకర్త గడసరితనానికి పొలంలో పండిన పంటదినుసులే కాకుండా కౌలుదారు రాంసామి పచ్చని బ్రతుకు బుగ్గి అయిపోతుంది.[3]

బీదరైతు జీవితమంతా అతడు బాహ్య పరిస్థితులతో జరిపే పోరాటమే నని చెప్పవచ్చు. భూమితో పోరాటం, ప్రకృతితో పోరాటం, అప్పుల వాళ్ళతో పోరాటం, బిడ్డలతో పోరాటం, చివరకు భార్యతో గూడా పోరాటమే। ఆ కుటుంబంలో లేమి వుంది. అది ఇంటి యజమాని సృష్టించిందిగాదు. కానీ భార్య అలా భావించదు. ఏ వస్తువు కొరత పడినా ఏ కోరిక తీరకపోయినా ఎడాపెడా వాగుతుంది. భర్త ఆమెను పిడిగుద్దులతో సత్కరిస్తాడు. కొడుకులు తమ అవసరాలకోసం చిన్న చిన్న దొంగతనాలు చేసి పట్టుబడి పోతారు. కూతుళ్ళు సకాలంలో పెళ్ళిగాక పొరుగూరి కుర్రాళ్లతో లేచిపోతారు. దారిద్ర్యంతో వాళ్లు పట్టే కుస్తీ లోకుల పాలిటికి ఒక వినోదప్రదర్శనంలాగే కానవస్తుంది. రేపో మాపో ముసలి రైతు కళ్లు మూయవచ్చు. కానీ అతని కొడుకులున్నారు కోడళ్లున్నారు. వాళ్ళకూ బిడ్డలున్నారు. ఇంకా పుడతారు. తాత కట్టిన పూరి కొంపల్లోనే వాళ్లు గోడలు పెట్టుకుంటారు. నేలను ముక్కచెక్కలు చేసి పంచు కుంటారు. కానీ ఆ మాత్రం స్థితిగతులైనా ఎంతకాలం నిలుపుకుంటారు? బ్రతుకు వాళ్ళచేత రకరకాల వేషాలు వేయిస్తుంది. ప్రేక్షకమహాశయులు తనివి తీరేటట్టుగా ఈ ప్రదర్శనాలు తిలకించవచ్చు. ఆలస్యం చేసినా ఆశాభంగమన్న మాట లేదు. ఎంతసేపు చూచినా టికెట్టు లేదు.[4]

'ఇతిహాసపు చీకటికోణం అట్టడుగునపడి కాన్పించని కథలన్నీ కావా లిప్పుడు' అన్నది కవివాక్కు. ఆమాటను నిజంచేసినవాడు కథకుడే. చెప్పులు కుట్టేవాడు, కలాలు బాగుచేసేవాడు, బిచ్చగాడు, పాకీవాడు, కోతులాడించేవాడు, రిక్షావాడు, బీదబడిపంతులు, తపాలా బంట్రోతు, టీ బంకునాయరు, ఒట్కాబండి సాయెబు-యిలా ఎందరని చెప్పగలం? తెనుగునేలపైన కథానిక అడుగుపెట్టని

3. మర్రిచెట్టు, మల్లితీగ.—వార్ల చిరంజీవి.
4. వినోదప్రదర్శనం.— మధురాంతకం రాజారాం.

చోటులేదు. పలకరించని వ్యక్తిలేదు. అయితే ఒకటి. చీకటి కోణాలపైన మెరపులా ప్రసరించి మాయమైన కథలే ఎక్కువ. అలాకాకుండా స్పాట్‌లైటులా స్థిరంగా నిలిచి, చీకటి కోణాలలోని తీరనిబాధల్నీ, ఆరని వ్యధల్నీ స్పష్టంగా చూపెట్టి పాఠకుడి గుండెపైన స్థిరముద్రలేసిన కథలు చాలా తక్కువ. ఇలాంటి కొద్దిపాటి కథల్లో గణనీయమైనవి కొలకలూరి ఇనాక్‌గారి కథలు. పిండీకృతశాటి, పశ్చాద్భూమి, తలలేనోడు, కొత్తయిల్లు, ఊరబావి మొదలైనవి

ఇనాక్‌గారి కథల్లో కథాంశం తక్కువ. ఈయనకు కథకన్నా వ్యక్తి ముఖ్యం. కల్పనను పూర్తిగా త్రోసిరాజనే వాస్తవికత, అసలైన తెనుగుదనమూ ఈ కథల ప్రత్యేక లక్షణాలు. మడివేలు గూగణ్ణి తీసుకున్నా, పాకీవాడు రాంకోటిని తీసుకున్నా, మంగలి నాగలింగాన్ని తీసుకున్నా వ్యక్తిగా అతడి ఆకారం, ఫ్లాష్‌బాక్ పద్ధతిలో అతని జీవితచరిత్ర, వర్తమానంలో అతణ్ణి చుట్టుముట్టివున్న పరిసరాలూ పరిస్థితులూ, చిన్న చిన్న వివరాలతో సహా చిత్రింపబడడంలో ఈ రచయిత కథ ఒకచిన్న జీవితేతిహాసంలా సాహిత్యంలో చోటు చేసుకుంటుంది.

మచ్చుకొక్క మడివేలు గూగణ్ణే తీసుకోవచ్చు. వ్యక్తిగా అత డెలాంటివాడు? అనుదినమూ అతడు పనిచేసే కర్మక్షేత్రం ఏలాంటిది? అతణ్ణి పరివేష్టించివున్న సామాజికవ్యవస్థ ఎట్టిది? ఈ ప్రశ్నలకు కథద్వారా లభించే సమాధానాలను కలబోసి చూచుకుంటే గూగడి జీవితమంటే ఏమిటో తెలిసిపోతుంది.[5]

పొట్టికాళ్ళపొట్టిమనిషి గూగడు. వీపుమీద బరువుతో పుట్టినవాడు గూగడు బట్టలమూట బరువుకు వీపూమూపూతలా ఒంగిపోవడంవల్ల పెరిగిందో, మూట నిలవడం కోసం ఎదురు మోటుకుంటూ పెరిగిందోగాని గూని మూరెడెత్తున్న గూగడు. ఊరు అనే ఇంటికి మురికికుప్పలాంటివాడు గూగడు. ఊరు

---

5. పిండీకృతశాటి. —కొలకలూరి ఇనాక్.

అనే ఆఫీసుకు డస్ట్‌బిన్‌లాంటివాడు గూగడు. ఏడవడానికిగూడా స్వేచ్ఛలేని బానిస గూగడు .గూగ డెలా వుంటాడో తెలిసిపోయింది గదా! మరింక అతడు పనిచేసే కర్మక్షేత్రం ఎలావుంటుంది? "ఊరి వెలుపల చెరువుగట్టున, ఊళ్ళమ్మగుడి పక్క, మోటబావి చప్టాచుట్టూ, రాతిబండలమీద బట్టలుతుకుతున్న మనుషుల్ని కర్మ జీవుల్ని చూడటానికో, కర్మయోగం నేర్చడానికో వాళ్ల లయబద్ధంగా అరిచే 'సుయ్యోం. ఆహా ..సయ్యోం' వినడానికో, అక్కడ జరుగుతున్న కర్మకాండను కళ్లారా తిలకించడానికో కురుక్షేత్రం మధ్యలో ఉబికివచ్చినగీతలాగా కర్మసాక్షి ఉదయించాడు సూర్యుడు నిద్రలేచి ఆకాశంలో ఆవులిస్తూ, కళ్లనులుము కుంటూ కరాల మగతగా చాపుతూ చెరువుగట్టుమీదికి వచ్చేసరికి ఆరేబట్టలు నానేబట్టలు, ఉతికేబట్టలు, తడి సేమనుషులు, ఆరేమనుషులు నానేమనుషులు. సబ్బు పెట్టేవాళ్లు ఆరేసేవాళ్ల సీళ్లతోడేవాళ్లు ఆవులిస్తూ తిరిగేవాళ్లు, పసివాళ్లు, పెద్దవాళ్లు, స్త్రీలు పురుషులూ ఎవరిపనిమీదవాళ్లు ఎవరిత్రోవనవాళ్లు. ఏంచేసేవాళ్ళదిచేస్తూ వింతగా పెద్దసంతగా వుందా ప్రదేశం." ఈ చాకిరేవులో పని తెమిలించుకుని ఊళ్లోకి వెళ్తే అక్కడ ఏదో ఒక వంక పెట్టి గూగడికి అన్నం వేయకుండా ఎగ్గొట్టే బూసిమ్మ వుంది. ఫ్యూనుగా వుండి రిటయిరై వచ్చి దర్జాగా బతుకుతున్న నాగలింగ మున్నాడు. ముసలివాడుగదా అని దయదలచి అప్పుడప్పుడు ఉచితంగా బీడీలిచ్చే సుబ్బారా వున్నాడు. పొలమూపుత్రా యిల్లూవాకిలీ తనపేర వ్రాయించు కుని గూగడికి జీవితంలో తనశరీరం మినహాగా మరేమీ మిగలకుండా చేసిన పులిమిసాల రత్తయ్యగూడా వున్నాడు...

పీడితవర్గాలలోనుంచీ ఒక పాత్రను స్వీకరించి, వైచిత్రికి తావలంగా ఒక్కింత కథా వస్తువును మనసులో ఉంచుకుని, సూక్ష్మపరిశీలనద్వారా గ్రహించిన అలతి అలతి వివరాలుసైతం జారిపోకుండా ఈరచయిత కొనసాగించే రచన దరిద్రుణ్ణి గురించి ఒకథ వ్రాసిపారేసినట్టు-డదు. ఎంతో భక్తిశ్రద్ధలతో దరిద్ర నారాయుణ్ణి ఉపాసించినట్టే వుంటుంది. ఉదాహరణకు పాకీమనిషి రాంకోటిని గురించిన వర్ణన గమనించండి: 'కాలం ఎంత ముందుకు పోయినా పోకపోయినా పట్టణాని కొక రాంకోటి పనిలంగా వుంటాడు జబ్బు చేసిన నగరానికి చీడపట్టిన

పీఘలకు పరిచర్య చేసేందుకు, బస్తీలలో పట్టణాల్లో నగరాల్లో అమ్మలాగో, అక్కలాగో, కోడలులాగో, భార్యలాగో, నర్సులాగో అందరి ఏకరూపంలాగో స్త్రీకాని రాంకోటి స్త్రీలాగే మారివుంటాడు. రాజులు మారిపోయి, రాజ్యాలు మారిపోయి, ప్రజలే రాజులై, ప్రభుత్వాలే ప్రజలయినా కావచ్చు. కాని మానవజాతి మనగడవున్నంతవరకూ రాంకోటి మారడు. ఒక రాంకోటిగాక పోతే మరో రాంకోటి ఇంకో రాంకోటి వేరే రాంకోటి. రాంకోటి శాశ్వతం. రాంకోటి నిరంతరం. రాంకోటి కలకాలం. రాంకోటి చిరంజీవి'. 6

గూగడిలాగే, రాంకోటిలాగే ఊరికంతా ఉపకరించేవాడు కంసాలి గన్నెయ్య. తనది ఊరుమ్మడి బతుకని అతడికి తెలుసు. కానీ తన భార్యను గూడా ఊరుమ్మడిసొత్తుగా వాడుకోజూచేసరికి అతడిలో ఆగ్రహం బుసలు కొట్టింది. అయితే మఠా నాయకుల్ని హతమార్చడానికి గన్నెయ్యకు లభించిన అవకాశంలాంటిది అందరికీ లభిస్తుందా అన్నదే సందేహం 7

దవాఖానాల్లో దగాకు గురయ్యే అమాయక జానపదులను గురించి, జబ్బులొస్తే మందులకు బదులుగా మంత్రాలు వల్లించి డబ్బు గుంజుకోజూచే పంతుళ్ళను గురించి, ఆ మంత్రాల కట్టెల్ని విరిచి తగలబెట్టే తెగింపుగల మనుషుల్ని గురించీ, మనిషికీ మనిషికీ మధ్య 'కోళ్ళ పందెం' ఏర్పాటు చేసి దూరంగా నిల్చుని తమాషా చూసే గ్రామపెద్దల్ని గురించి దేవరాజు కథల్లో కనిపిస్తుంది అయితే కథనమంతా తెలంగాణా మాండలికంలో వుండటంవల్ల పదం పదం విడగొట్టి అర్థం చేసుకోవలసిన యిబ్బంది ఎదురవుతుంది సంభాషణలు మాత్రం మాండలికంలో వ్రాసి మిగిలిన కథ మామూలు శిష్టవ్యావహారికంలోనే వ్రాస్తే సాఫీగా చదువుకపోవడానికి వీలవుతుంది.

పల్లెటూళ్ళలో సన్నరైతులు, కౌలుదార్లు, వృత్తి పనివారు మాత్రమే గాక యింకా దిక్కూదరీ లేని నిస్సహాయులు గూడా ఎందరో వుంటారు.

---

6. పశ్చాద్భూమి.—కొలకలూరి ఇనాక్
7. ఊరుమ్మడిబ్రతుకులు—సి. యస్. రావు

అలాంటి వాళ్ళని గురించిన దయనీయమైన ఉదంతం ఒకటి ఒక కథలో కాన వస్తుంది. రాజమ్మ వయసుడిగిన ముసలిది. ఏకాకి. వృద్ధాప్యపు పింఛనుఒకటే ఆధారం. ఆరు నెలల కొకసారి ఆఫీసరుచేత తాను బ్రతికి వున్నట్టు లైఫ్‌సర్టిఫి కేటు మీద వ్రాయించుకుంటే ఆమెకు పింఛను డబ్బులు చేతికొస్తాయి. ఒక పర్యాయం జబ్బు చేసి ఆమె ఒక సంవత్సరం దాకా ఖజానాకు వెళ్ళలేక పోతుంది. పేమాస్టర్‌సాబ్ ఆరు నెలలకు మాత్రమే డబ్బిస్తానంటాడు. 'నవ్వుం జూలై నించీ డిసెంబరుపరకూ మాత్రమే బ్రతికినట్టు సర్టిఫికెట్టుంది. అంతకు మునపు ఆరునెలలు నువ్వు బతికేవున్నావో, చావనే చచ్చావో నాకేం తెలుసు' అంటాడాయన.[8]

దీనజనుల ఉనికికి, మనగడకు లోకం యిస్తున్న ప్రాముఖ్యం ఏపాటిదో ఈ దృష్టాంతంవల్ల తెలిసిపోతుంది!

* * *

గడచిన ఏబదేళ్ళలోను తెలుగు వారి కుటుంబ వ్యవస్థలో మహిళకున్న స్థానం రకరకాల పరిణామాలకు లోనౌతూ వచ్చింది. 'ఎక్కడ నారీమణులు పూజింపబడుదురో అక్కడ దేవతలు సంతోషింతు' రనేది ప్రాచీన సుభాషితం. 'గౌరవాల మాట దేవుడెరుగు, అవమానాలు జరగకపోతే అదే పదివేలు' అని ఒకప్పుడు మహిళాలోకం అనుకుంటూ వుండేది. ఇప్పు డా ధోరణి మారింది. ఇది గౌరవం యిచ్చి పుచ్చుకోమనే సమాన హక్కుల కాలం. అబల సబలగా మారుతూ వచ్చిన ఈ పరిణామక్రమంలోని ప్రత్యంశాన్నీ కథానిక సాహిత్య నిబద్ధం చేస్తూ వచ్చింది. ఒకనాటి స్త్రీ సంఘం చేతిలో కీలుబొమ్మ. చిత్ర మేమి టంటే అప్పట్లో స్త్రీకి స్త్రీయే బద్ధశత్రువు అత్తగారిపోరు, ఆడపడుచుల ఆరడి ఇరుగు పొరుగు అమ్మలక్కల అసహిష్ణత – వీటి విశ్వరూపం బహుశా ఈ తరంవాళ్ళకు గుర్తుండకపోవచ్చు. ఎందుకంటే వీళ్ళు 'సకూ–బాయి' సినీమా అయినా చూచి వుండరు గనుక!

---

8. సర్టిఫికెటు నవ్వింది.—తాడిగిరి పోతరాజు.

తమ సమస్యల్ని గురించి తామే చెప్పుకోడానికి యిప్పుడున్నంతగా యింత మంది రచయిత్రులు లేని రోజుల్లో బలివాడ, కొమ్మూరి, పురాణం సూర్యప్రకాశరావుగార్ల వంటి రచయితలు కుటుంబ జీవితంలో మహిళల కెదు రౌతున్న పాట్లను తమ కథల్లో అద్దంపట్టి చూపించారు. ఏ సమస్యకైనా కీలెరిగి వాత పెట్టాలి. స్త్రీ స్వాతంత్ర్యం మంత్రాలతో రాలే మామిడిపండు గాదు. దీనికి షాక్ ట్రీట్‌మెంటు లాంటి దేదైనా అవసరం, నిద్రాళువు, చరణదాసులు మొదలైన కథల ద్వారా తెలిసింది యిదే.[9]

నారాయణి వీరభద్రం భార్య. భర్త కనుసన్నల్లో మెలిగే యిల్లాలు. ఆయనేం చేసినా సమర్థించడమే ఈమె పని. తన ఉద్యోగ మేమిటో, పేకాట ఏమిటో - ఆయన యింటి అతీగతీ పట్టించుకోడు. ఈడొచ్చిన అమ్మాయి అనూ రాధను చూడ్డానికి పెళ్ళివా రెవరో వస్తున్నారని తెలిపినా ఇంటిపట్టున ఉండలేడు. అసలే లేమిసంసారం. పులి మీద పుట్రగా ఇంటి యజమాని జబ్బుపడి గుటుక్కు మంటాడు, అనూరాధ గతేం కావాలి? చదువుకుని, తన కాళ్ళపైన తను నిలబడి, నిరుద్యోగిగా వున్న భర్తకు గూడా పాతికో, పరకో పంపగల్గు తున్న మనోరమ ఆదుకోబట్టి ఆమెకో ఆలంబనం దొరికింది. నిద్రాళువు నారా యణి తానింకొకరిపైన ఆధారపడి బ్రతకడం యిష్టం లేక ఎక్కడికో వెళ్ళి పోతుంది. 'వెళ్ళిపోయే మనిషి ఓ వుత్తరం వ్రాసి పెట్టి వెళ్ళిపోగూడదా?' అని నొచ్చుకుంటాడు అనూరాధ భర్త. 'మా అమ్మకు ఆపాటి భాష రాదు. చదవడం రాదు. వ్రాయడం అంతకంటే రాదు. మీకీ విషయం తెలియదా?' అంటుంది అనూరాధ.

స్త్రీజాతిని పట్టిపీటిపీడిస్తున్న సమస్యలకన్నింటికీ చదువుకోక పోవడమే కారణమన్నది యిందులోనిధ్వని.

ఉదయం లేవగానే భర్తపాదాలను తాకి కాళ్ళ కద్దుకోడం అదొక సత్సాం ప్రదాయంగా భావింపబడుతూ వుండేది. పరంధామయ్య భార్య కామాక్షమ్మ తన

9. నిద్రాళువు. చరణదాసులు.—పురాణం సూర్యప్రకాశరావు కథలు.

ముప్పై అయిదేళ్ళ గార్హస్థ్య జీవితంలో క్రమంతప్పకుండా ఆపనిచేసింది ఇప్పుడామె కోడలు అనూరాధగూడా అత్తగారి అడుగుజాడల్లోనే నడుస్తోంది. ఎటోచ్చీ కామాక్షమ్మకూతురు విశాలకు మాత్రం ఆమహదవకాశం లేకపోయింది. ఆమె భర్త విషయలోలుపత్వంతో ఒళ్లు హూనంచేసుకుని,సంసారసుఖానికి లాయకీ గాక దేశాలపాలై పోతాడు. ఆ ముదనష్టపు పాదాలు దొరక్కపోతే పోయాయి గానీ, అందువల్ల విశాలాక్షికి జ్ఞానోదయం కలిగింది. పదిమంది కుర్రాళ్ళకు ప్రయివేట్లుచెప్పి పొట్టపోసుకుంటూ ఆమెతన వదినకు వ్రాసిన జాబులో చరణ దాసిత్వం పట్ల స్త్రీ జాతి ప్రకటించిన విముఖత్వం ప్రస్ఫుటంగా అభివ్యక్త మవుతుంది. "నువ్వంటే నాకు అభిమానం లేదు. నీముఖం చూడనని వదిలేశారు నాభర్త నన్ను. ఇదోరకం స్త్రీ జీవితం. వేళ కింత తిండి పడేసి, కట్టుకుందుకు గుడ్డముక్కలు నాలుగిచ్చి, అవసరం తీర్చుకుందుకు రాత్రిహృదయంలో కాస్త చోటుయిచ్చి, తను యివ్వలేని గౌరవం తనకు యివ్వాలనే నమ్మకంతో నీ శరీరం లోని జీవశక్తినంతా పీల్చిపిప్పిచేసే నీభర్తకోసం దాసీదానివై బ్రదుకుతున్నావు. అనేక సంసారాలు చూచాను. నే తెలుసుకున్న సత్యం ఒకటే! ఈ ఆడవాళ్ళంతా చరణదాసులు: నాకంటే నువ్వు ఏవిధంగా మెరుగని నన్ను జాలితలుస్తావు వదినా! ఇంతకంటే నవ్వు పుట్టించేవిషయం మరొకటేదైనా వుందా? ఎన్నాళ్లు అమాయి కంగా ఈజాతి యిలా మోసపోతుంది?'

సంఘంచేతిలో కీలుబొమ్మగా వుండిన నిస్సహాయ స్థితిలోనుంచీ బయట పడి తనకాళ్ళపైన తాను నిలబడి తనను చెనకటానికి వచ్చే ప్రతిదుష్టశక్తిని నడి వీధిలో నిలబెట్టి నిలదీసి ప్రశ్నించేటంత వరకూ మహిళల వ్యక్తిత్వంలో మార్పు వచ్చింది. ఆడదాన్ని బానిసగా భావించే మగవాడి అధికృత ఈనాటికథావస్తువు గాదు, ఇంకా మాట్లాడితే కట్నాల వేలంపాటలో యింకొకరికన్నా, యింకొక నెయ్యి రూపాయలు ఎక్కువగా పెట్టినందువల్ల దొరికిన ఈ మగవాడి కొక ఆత్మాభి మానం గూడానా-అంటూ మహిళలు ఈసడించుకునే పరిస్థితి దాపురించింది. ఈ సందర్భంలో జ్ఞప్తికి వచ్చేది కౌసకళ్ళ వేంకటరత్నంగారి కథ 'సాంప్రదాయం'. లక్షాధికారి నారాయణబాబుగారి కూతురు కమల. వడ్డీ వ్యాపారి

చంద్రశేఖరంగారి అబ్బాయి భాస్కరరావు. పెళ్ళి సంబంధం నిర్ణయమైపోయి, ఆహ్వాన పత్రికలు పోస్టు చేయవలసి వున్న సమయంలో సాంప్రదాయంలో ఏదో వెలితిని ఆరాతీసి వెనుకంజ వేసిన వరుడితో అమ్మాయి "నడు, నడు. నీ చదువు, నీ సాంప్రదాయమూ, నీ నాగరికత యివన్నీ పదివే లిచ్చి రేపీ పాటికి మార్కెట్లో కొనగలను నేను" అంటుంది.

ఇక్కడొక విషయం గుర్తించడం అవసరం. 'సాంప్రదాయం' యిరవై యేళ్ళ నాడు వెలువడిన కథ. అప్పటికీ యిప్పటికీ 'రేటు' బాగా పెరిగి పోయింది ఇప్పటి పరిస్థితులలోనైతే లక్షాధికారి నారాయణబాబుగారి అంతస్తుకుగానీ, భాస్కరరావు లాంటి వరుడి అర్హతకుగానీ ముష్టి పదివేల రూపాయలు ఒక లెక్కలోని విషయమే గాదు ఆ మొత్తాన్ని ఏ నాలుగుతోనో, అయిదుతోనో గుణించవలసి వుంటుంది ఆ రేటులో గూడా కులానికీ కులానికీ, ప్రాంతానికీ ప్రాంతానికీ తేడాలున్నాయి అమ్మాయిని చలామణీ చేయాలన్నా, అబ్బాయికి తగిన మూల్యం రాబట్టుకోవాలన్నా, అందుకోసమస్ చేసే వాదాల్లోనూ, వేసే పాచికల్లోనూ కొంతంత లౌక్యం తొంగి చూస్తుంది. రాయలసీమ సంపన్నురాలు సుందరమ్మత్త మధ్యవర్తికి చెబుతున్న మాటలు అవధరించండి.

'పెద్దల్లుళ్ళ దేముంది? వాళ్ళెవ్వుడో పాతబడి పోయారు. మా ముద్దులూ, ముచ్చటలూ అన్నీ యిక చిన్నల్లుడివే గదా! మాకూ ఒక లక్ష, లక్షన్నర రూపాయల ఆస్తిపాస్తులున్నాయి. ఇప్పటి కిప్పుడు రాసి రిజిష్టరు చేయక పోయినా ఆస్తిలో మూడోవంతు నీదే గదా! కాదు, కూడదు కిట్నం కావాలంటావా? సరే నీ యిష్టం. మేము పెద్దల్లుడికి పదివే లిచ్చాం. రెండో అల్లుడికి పన్నెండు వేలిచ్చాం. నువ్వు కావలిస్తే పదిహేను వేలు పుచ్చుకో! ఇదిగో అబ్బాయ్! నీకింకా పెద్ద ఆశలే వుండొచ్చు. మన వైపున పదివేల రూపాయలు పలుకుతున్న పెళ్ళికొడుకు, ఉత్తరాదికి వెళ్తే లక్ష రూపాయల దాకా పలుకుతున్నమాట నేను కాదనను. కానీ ఆ ఉత్తరాది ఆసామికి ముగ్గురు కూతుళ్ళున్నారనుకో! కూతురి కొక లక్ష చొప్పున పంచిపెడితే చివరి కతడికేం మిగులుతుంది? బొచ్చె చేతికొస్తుంది. నీకొక అత్తగారిల్లుందని చెప్పుకోడానికైనా వీలుండదు.

బాబ్బాబూ ! ఎందుకొచ్చిన ఎవ్వారాలని ! నువ్వు మాకు నచ్చావు చిన్నప్పు డెప్పుడో చూచావుగనుక— ఎందుకైనా మంచిది, నువ్వొ ఒకసారి వచ్చి అమ్మాయిని చూచివెళ్ళు. పందిరిలో పదిమంది ఎదుట పుచ్చుకోవడం నీకిష్టం లేకపోవచ్చు. పెళ్ళికిముందుగానే పదిహేనువేలకు నువ్వు చెక్కు పుచ్చుకో. పిల్ల ఒంటిపైన అయిదువేల రూపాయల బంగారం చూచుకో! నీదుస్తులకు, రిస్టువాచీకి ఓ వెయి ప్రత్యేకం చూడబ్బాయ్, నీ మనసులో నీ కొకసందేహం వుండొచ్చు. 'ఓయబ్బో, సుందరమ్మగారి సంబంధమా, వాళ్ళతో మనం తూగగలమా అని; నేను చెబుతున్నానుగా, నీకా సందేహం అక్కర్లేదు పల్లెలో నీకు ఆస్తివుంది.లేదు· ఆసంగతి మా కనవసరం! ఒకసారిగా పదిమంది వస్తే వాళ్లుండడానికి తగినపాటి యిల్లు నీ కక్కడ లేకపోవచ్చు. మరేం పరవాలేదు. ఆమాట కొస్తే అయినదబ్బంతా పోసి పల్లెలో యిల్లుకట్టడం నాకిష్టంలేదు. ఆదబ్బుంటే హాయిగా టౌన్లోనే యిల్లు కొనుక్కోవచ్చు...'

చెవులపిల్లిని వలలోకి 'వడకదోలడ' మంటే యిదే![10] ఇదేక్రూరవాడితల్లి అయితే ఆమెమాట్లాడే తరహా జంతువుల్ని 'పరవదోలి' నట్టుంటుంది:[11]

'అన్నగారూ, మీకు తెలుసునో తెలియదోగానీ ఈరేట్లలో గూడా చాలా బేబందులున్నాయి. దూరాభార మనుకోకుండా కాలుదీసి, పెన్నదాటి అటువైపుకు వెళ్తే మాకు చాలా లాభసాటి బేరమే తగలొచ్చు. అక్కడైతే ఇంజనీరు లక్షా, లక్షన్నరా, డాక్టరైతే రెండులక్షలదాకా యిస్తున్నారట! మామేనత్తగారి అడ పడుచు కొడుకు—నరహరి అనివున్నాడు లెండి, జూనియర్‌లెక్చరరే—వాడికి గుడ్ల వల్లేరు సంబంధం కుదిరింది. నెట్‌క్యాషు దెబ్బయి అయిదువే లిచ్చి, యాభైసవర్ల బంగారం పెట్టారు. చాలనిదానికి డ్రస్సుకని, ఫర్నీచరుకని, పాత్రసామాన్లకని, రేడియోకని పదివేలదాకా అయివుంటుంది. పైపెచ్చు మనతిరుచానూరు సత్రంలోనే ఘనంగా పెళ్లిగూడా జరిపించారు. మొన్నీమధ్య మేము నెల్లూరు దాటి సింగరాయ

10. తిరస్కృతి 11. భాగ్యవిధాతలు
మధురాంతకం రాజారాంకథలు.

కొండ పెళ్ళికి వెళ్లొచ్చాము. మావారు లేమా, వీరిపెదన్నాగారి మనవడికే పెళ్లి అబ్బాయికి ఏర్‌పోర్ట్సులో ఉద్యోగం. వాళ్ళయితే అదేమిటిదేమిటని కట్నానికి ఐదులు ఏకంగా పదిహేనెకరాల పొలమే రాసిచ్చేశారు. దాన్నిప్పు డమ్ముకున్నా అయిదులక్షలు చేతి కొస్తుందంటున్నారు. అదృష్టమంటే అలావుంటుంది మరి! అయితే ఒకటి దూరపుకొండలు నును పనుకోకుండా మేము చంద్రయ్యగారి సంబంధంవైపు మొగ్గు చూపిస్తున్నామంటే అందుకు కారణం వుంది. ఉన్నమాట చెప్పుకోవాలిగదా! మావాడికి వాళ్ళమ్మాయి నచ్చింది. సరేనయ్యా, ఒప్పు కుంటాము. మీ అమ్మాయి చక్కనిచుక్క. దిదిమి దీపం పెట్టుకోవచ్చు. కానీ మావా డేమీ పనికిరానివాడుకాడే! మేమున్నా అయిన డబ్బంతా పోసి వాణ్ణి చదివించాముగదా! ఇక్కడ దగ్గర్లో సీటు రాకపోతే బెంగుళూరులో అదేదో ప్రయివేటు కాలేజీలో అయిదువేలు డొనేషన్ యిచ్చి చేర్పించామాయె! మాకెంత ఖర్చయి వుంటుందో చెప్పండి! ఈవిషయాలన్నీ మీరు మనసులో పెట్టుకోవాలి...'

ఈ కథలో వరుడితల్లి ఎవరినైతే 'అన్నగారూ!' అని సంబోధించిందో ఆమధ్యవర్తి, ఆమెఉపన్యాసం పూర్తయ్యాక దిమ్మెక్కిన తలతో, కల్లోలితమై పోయిన మనసుతో బయటికొస్తాడు. అల్లంతదూరం నడిచేసరికి ఇంటికి గంట కొట్టిన ఓ అమ్మాయిల పాఠశాలలోనుంచీ వందలకొలది మంది విద్యార్థినులు బయటికొస్తారు.

పూలతీగల్లా సుకుమారమైనవాళ్ళు, క్రొక్కారు మెరుపుల్లా అందమైనవాళ్ల, నిండుగా బొద్దుగా, సన్నగా పొడుగ్గా వివిధరకాల ఆకారాలవాళ్ళు- భావి భాగ్యోదయ సౌధంలో మణిదీపికల్లా వెలగవలసిన ఆ చిన్నారి తోబుట్టువుల్ని చూస్తూ అతడు దిగాలుపడిపోయి రోడ్డుపైన నిలబడిపోతాడు. భయోద్వేగంవల్ల అతడి గుండె కొద్దిక్షణాలదాకా కొట్టుకోడం మానేస్తుంది,

ప్లాట్‌ఫారాల్లోనూ, బస్‌స్టాండులోనూ, దుమ్ములో పొర్లుతూ, బీడీలు కాలుస్తూ, బూతులు తిట్టుకుంటూ జవాబుదారీ లేకుండా చిరునామాలేని ఉత్తరాల్లా తిరిగే ఆకతాయి కుర్రవాళ్ల కనిపించినప్పుడు 'ఈదేశం ఏమయ్యేటట్టు?' అన్న

ఊహతో చూపరులు భయ భ్రాంతులు కావడంలో అర్థముంది. పొద్దుపొడుపువేళ పొదరింటినిండా పూచిన పువ్వుల్లా బిలబిలమంటూ బడిలోనుంచీ బయటికొచ్చిన అమ్మాయిల్ని చూచినప్పుడు గూడా గుండెలు జలదరిస్తున్నాయంటే—మన సమాజం ఎలాంటి దౌర్భాగ్యస్థితిలో వుందో తెల్పడానికింతకు మించిన దృష్టాంతం ఏముంటుంది?

కట్నాలవేలంపాటలో నిర్దాక్షిణ్యంగా నలిగిపోతున్నవారు ఆడపిల్లల తల్లి తండ్రులు. బిడ్డ లెందరన్న ప్రశ్నకు 'ప్లస్ మైనస్'ల పరిభాషలో జవాబు చెప్పు కోడం పరిపాటి అయిపోయింది. ఆడపిల్లకు 'మైనస్'ను సంకేతంగా భావించడానికి వెనుక ధ్వనించేదంతా ఈ దుర్భరమైన వరకట్నాల ఉదంతమే! 'అర్గురు కూతుళ్ళు గల మాబంధు వొకరు దారుణమైన అనారోగ్యంతో బాధపడేవారు. పెళ్లి కెదిగిన కూతుళ్లు, నిరుద్యోగం, అనారోగ్యం— ఇంత చీకటిలోనూ తాను నవ్వుతూ, ఇతరులను నవ్విస్తూ బ్రతికిన ఆమనిషి హఠాత్తుగా యాభై యేళ్లు నిండకముందేం మర ణించారు. ఆకుటుంబం అనాథగా నిల్చింది. అప్పటిదాక బడితప్పా-వీధిముఖమెరు గనియువతి ఆయన కూతుళ్ళలో ఒక యువతి-పెళ్లికని చదువు మానేసి రెండేళ్ళ యినయువతిపరిస్థితుల కనుగుణ్యంగా మారిపోయి, ధైర్యం చిక్కబట్టుకుని, ఉద్యో గంలో ప్రవేశించి కుటుంబానికి ఆశాకిరణంగా రూపొందింది. ఆ లేతవయసున, ఆ చిన్న మనసున లోపల దాగివుండి, అవసరం వచ్చినప్పుడు బయట బడిన ధీరగుణా నికి జోహారు ఈ కథ' అన్న ఉపోద్ఘాతంతో వాకాటి పాండురంగరావు గారు 'అపరాజిత' అన్న కథ వ్రాశారు. కుటుంబాన్ని ఆదుకోడం కోసం సరస్వతి అనే అమ్మాయి వలచి వెంటబడిన ఓ విద్యార్థికుడి ప్రేమకు గూడా ఉద్వాసన చెప్పి అవివాహితురాలిగా వుండి పోయిన ఈ కథకు మొదట 'హీన పుణ్యులు' అని పేరు పెట్టినట్టు రచయిత సూచించారు. పాపపుణ్యాలమాట ఏమిటో గాని పూచిన తరువులా కోభిల్లవలసిన అమ్మాయి బ్రతుకు యిలా మోడువారిపోవడానికి హీనమైన ఆర్థిక పరిస్థితులే కారణంగా వున్నాయి. 'అపరాజిత'లో సరస్వతికి, శీలావీర్రాజుగారి కథలోని కస్తూరికి అట్టే తేడా లేదు. నలుగురక్క-చెల్లెళ్ళలో మూడో అమ్మాయి కస్తూరి. తండ్రి రిటయిరై చిన్నఫర్మ్‌లో పనిచేస్తున్నాడు.

పెద్దక్కకు అనారోగ్యం, చిన్నక్క పెళ్ళికి ఏడెనిమిది వేలయినా కావాలి. చెల్లెలు, తమ్ముడు చదువుకుంటున్నారు. ఇన్ని ఖర్చుల్లో తనపెళ్ళికేం మిగిలించుకోగలుగుతుంది కస్తూరి? అయితే ఈ త్యాగానికి పరిగణన లేకపోవడం అటుంచి, అపవాదులు కువిమర్శలు రాద్ధాంతాలు తనను చుట్టుముట్టడంతో, మమకారాలన్ని సడలించుకుని 'గుర్తించని త్యాగానికి గుడ్‌బై' అంటూ ఒక సహోద్యోగిని పెళ్లాడేస్తుంది. రెండు కథలలోను సమస్య ఒక్కటే. కథకు ముగింపేమిటన్నది యిక్కడ ప్రధానంగాదు. ఈనాడు పెక్కు కుటుంబాలను ఈ సమస్య భీషణంగా ఎదుర్కొంటూ వుందన్నదే ప్రస్తుతాంశం.

కోరినంత కట్నాలివ్వలేకపోవడం ఒకటి. ఉద్యోగం చేస్తున్న విద్యావంతులు పెళ్ళంటే ఆదాక పనికిమాలిన పనైనట్టు దాంపత్య జీవితానికి దొరకబోయిన ప్రతిరైలునూ తప్పిస్తూ రావడం యింకొకటి. ఈ రెండు కారణాలవల్ల నవసమాజంలో అవివాహితల సంఖ్య పెరిగిపోతూ వుంది. కట్నా లివ్వలేకపోవడానికి కారణం ఆర్థికం. రెండోదాన్ని గురించి ఏం చెప్పాలి? వీళ్ళకు జీవితంలో మిగిలిపోయే తీరని అసంతృప్తిని గురించి, ఆరని ఆవేదనను గురించి 'రంగుటద్దాలు'[12], 'క్రోటను మొక్కలు'[13] మొదలైన కథలు వెలువడ్డాయి.

నూలుదారానికి కట్టిన బిస్కెట్టును పుల్లీమీదుగా జారవిడిచేవారు అప్పల్రాజు. ఎన్నిసార్లు ఎగిరినా కామేశంనోటికి అది అందేది కాదు.

చిటారుకొమ్మలో వున్న పనసకాయను కోసుకో మనేవాడు మురళీధరం. కామేశం చెట్టెక్కలేడని అతనికి నికరంగా తెలుసు.

పైడిరాజుగారి బంగళాలోని అద్దాలబీరువాల నిండుకూ పుస్తకాలే; కామేశాని కందని దొకచే-తాళంచెవి.

అలాంటి కామేశం ఒకసారి పట్టణానికి వెళ్లి శ్రీమంతులయిన బంధువుల యింట దిగి, అంతటితో ఊరుకోక రెండోఆటసినిమాకు వెళ్లాడు. తిరిగివచ్చేసరికి

---

12. రంగుటద్దాలు. — 'వాచస్పతి'
13. క్రోటన్ మొక్కలు. — పరిమళా సోమేశ్వర్.

వరండా కడ్డంగా ఇనుపకమ్ముల తలుపులు బంధింపబడి వున్నాయి. లోపలి తట్టున తాళంగూడా బిగించారు వసారాలో తనకోసం పరిచిన తెల్లటిపరుపేమో కన్నులవిందుగా కనిపిస్తూవుంది. ఎన్నిసార్లు తట్టినా మేడ దిగివచ్చే నాథుడే లేనిడ: పైడిరాజుగారి అద్దాలబీరువాలో పుస్తకంలా, మురళీధరం వాళ్ళతోటలో చిటారుకొమ్మకు కాసిన పనసకాయలా, అప్పలాజు బాల్యక్రీడలో నోటికందని బిస్కెట్టులా ఆపరుపుగూడా చూపులకు మాత్రమే అందుతూవుంది. దానివైపు చూస్తూ రాత్రంతా మెట్లపైన్నే వేగించాడు కామేశం...[14]

ఎలాగో డబ్బు మిగిలించి మూడుతులాల బంగారంతో భార్యకొక గొలుసు చేసిపెట్టాడు ప్రభాకరం. మెడ బోసిగా లేదుగనుక యిప్పుడిక కాపురాన్ని పూలంగితేరు వీధిలోకి మార్చవచ్చునని పట్టుబట్టింది నీరజ. పెద్ద పెద్దమేడల నడుమ చిన్న అవుట్‌హవుసు అద్దెకు దొరికింది. అయితే అక్కడి మహిళా మణులకు నీరజమెడలో వున్నది నిజంబంగారే నన్నునమ్మకం కలగలేదు. 'గొలుసు రోల్డుగోల్డుదా? కవరింగుదా?' అని ప్రశ్నించారు. నీరజకు తలకొట్టేసినట్టయింది. కాపురాన్ని మళ్లీ అశోకపురం పెంకుటింటికి మార్చక తప్పలేదు ప్రభాకరానికి...[15]

రోడ్డుపైన నడుస్తూ కారుక్రింద పడబోయిన సుబ్బారావును కారుఓనర్ కుమార్తె సుందరి తమ బంగళాకు తీసుకెళ్లి ఉపచరిస్తుంది. తండ్రిని ఒప్పించి తన తమ్ముడికి సుబ్బారావు ట్యూషన్‌చెప్పే ఏర్పాటుచేస్తుంది. సుబ్బారావు చేత పాడించి, ఆపాటను మెచ్చుకుంటుంది. ఇంట్లో బియ్యం లేకపోయినా, చెల్లెలికి పరికిణీ లేకపోయినా, సుబ్బారావు ఒళ్లూ, మనసూ గాలిలో తేలిపోతున్నాయి. 'కొంతకాలం ఓపిక పట్టండి; సుందరి నన్ను పెళ్లాడేస్తుంది. ఆ తరువాత మన కింక కొరత వుండదు' అని సర్ది చెబుతున్నాడు. ప్రేమతపస్సు చేస్తూ, తన అందమైన స్వప్నం ఏక్షణాన్నయినా నిజం కావచ్చునన్న నమ్మకంతో జీవితపు

---

14. త్రిశంకుడి స్వర్గం—మధురాంతకం రాజారాం.

15. స్వస్థానం — మధురాంతకం-రాజారాం.

మెయిన్‌రోడ్డుపైన నిల్చున్న సుబ్బారావుకు ఓరోజు హఠాత్తుగా పిలుపొస్తుంది. గదిలోంచి శుభలేఖలకట్ట తీసుకొచ్చి అతడిచేతిలో పెడుతూ 'సుబ్బారావుగారూ! దయచేసి ఈ ఇన్విటేషన్స్ ఊళ్లో మనవాళ్ళ కందరికీ యిచ్చేస్తారుగదూ!' అంటుంది సుందరి. మతిపోయిన వాడిలా యింటికి వెళ్లి నులకమంచంలో పడుకుని వెక్కి-వెక్కి ఏడుస్తాడు సుబ్బారావు...[16]

అమ్మాయిలకైతే ఉద్యోగాలు సులభంగా దొరుకుతాయని తల్లిదండ్రులు సుబ్రహ్మణ్యాన్ని డిస్కంటిన్యూ చేయించి కామేశ్వరిని ఎం. ఏ., దాక చదివి స్తారు. ఉద్యోగాన్వేషణ ప్రారంభమైందిగానీ ఆశాకిరణం మట్టుకు కనిపించదు. నిరుద్యోగిగా వున్న ఎం. ఏ., అమ్మాయిని పెళ్ళాడడానికి ఎవరు ముందుకు వస్తారు? వచ్చినా కట్నాలు చెల్లించుకునే స్తోమత ఎక్కడుంది! ఎక్కువ చదువుకోడంవల్ల కామేశ్వరి, తక్కువ చదువుకోడంవల్ల సుబ్రహ్మణ్యమూ పెళ్ళి సంబంధాలవాళ్ళ లెక్కకు రావడం లేదు. కొత్తగా పెట్టిన స్థానిక కళాశాలలో కామేశ్వరికి ఉద్యోగం దొరుకుతుందేమో ననుకుంటే, దాన్ని కాస్తా ఇంజనీరుగారి భార్య రజనీశర్మ కొట్టుకపోతుంది...[17]

కవి ఆరుద్రగారి సృష్టి క్లార్కు సూర్యారావు. సూర్యారావుకు పార్కులో ప్రశాంతి దొరకదు. మార్కెట్టులో సుఖం కానలేదు. ఇంటికొచ్చి సొమ్మసిల్లి నిద్రపోతాడు. నిద్రలో కలగంటాడు. కలలో అతని భార్య పస్తుపడుకోదు. వడిన వడ్లు లేవనదు. కలలో అతడి పిల్లలే అతణ్ణి దయ్య మనుకోరు. కలలో మాత్రమే అతడు మహాబలవంతుడు. ఆగర్భ శ్రీమంతుడు కూడా! కల చెదిరి పోయి కళ్లు తెరిచే సరికి కనిపించేది రొప్పుకుంటూ ఎదుట నిల్చున్న రోగిష్టి భార్య ఆరుద్రగారి లాగే బాలగంగాధర తిలక్ సైతం ఒక కవితలో 'గుమాస్తాలు, టీచర్లు, చిన్న చిన్న సంసారులు, కోటీశ్వరరావులు, వీరేశ్వరరావులు గొంగళీ పురుగులు లక్షలు, లక్షలు' అంటాడు. ఈ లక్షోపలక్షలమందికి కథా సాహిత్యంలో పతినిధి ఆర్ చ కారావు. అతడు చెప్పులు కొనుక్కోవాలన్న

16. సుందరి – సుబ్బారావు – బాలగంగాధర తిలక్
17. కదలని బాట – ఐ వి. యస్. అచ్యుతవల్లి

ఆలోచనలో వుండగానే ఎండాకాలం వెళ్ళిపోతుంది. గొడుగు కొనవలసిందేనన్న నిర్ణయానికి వచ్చేసరికి వానాకాలం గడచిపోతుంది. దోమ తెరలు అత్యవసర మనుకునే సరికి దోమల బెడద తగ్గిపోతుంది. మళ్ళీ సంవత్సరానికి అతడు అవసరాలనన్నింటినీ వాయిదా వేసుకుంటాడు. ఋతువులు మారిపోతాయి. ఋతువుల కనుగుణ్యంగా అతడు మారడు, మారలేడు. జీవిత మనే గానుగకు కట్టిపెట్టిన గొడ్డులా, ఋతువలయం వెంట ప్రదక్షిణలు సల్పుతుంటాడు గనుక అతడి పూర్తిపేరు ఋతుచక్రారావు.[18]

కమ్మీల తలుపులో నుంచీ పరుపువైపు చూస్తూ రాత్రంతా వీధి మెట్లపైన వేగించిన కామేశం, పూలంగితేరువీధిలో యిమడలేకపోయిన ప్రభాకరం, సుందరిని ప్రేమించి ప్రేమోపహతుడైన సుబ్బారావు, అటు ఉద్యోగమూ దొరకక, యిటూ పెళ్ళిగాక రెండందాల నష్టానికి గురైన కామేశ్వరి, ఆర్. చక్రారావు – వీళ్ళందరూ మన మధ్యతరగతి జీవితానికి ప్రతినిధులు. పన్నెండు రూపాయల కట్టువిడుపు చీరకోస మని బజారుకు వెళ్ళి, మీటరు నూటయిదు రూపాయలు చేసే 'బ్రొకేడ్' దగ్గరి నుంచీ బేరం ప్రారంభించి చివరకు పని వాళ్ళ కివ్వడానికి పనికొచ్చే చీర లున్నాయేమో చూపమని తనకు కావలసిన చీరను కొనుక్కొచ్చే ఇల్లాలు; తా నొక లక్షాధికారి ఇంట జరిగిన వివాహానికి హాజరైన విషయాన్ని జ్ఞప్తి చెయ్యడంకోసం ప్రసక్తి కల్పించుకుని ఆ పెళ్ళిలో జరిగిన అవకతవకల్ని ఏకరువు పెట్టే గృహస్థుడు; పెళ్ళిళ్ళ మార్కెట్టులో తన కింకొక అయిదువేలో పదివేలో కలిపితేగాని పెళ్ళికొడుకుతో సమంగా తూగ లేని దుస్థితిలో జీవితాన్ని గురించి పగటికలలు కంటూ కాలాన్ని వేగించే ఆడ కూతురు; కాలేజీలో అడుగుపెట్టి నప్పటినుంచీ చదువు తుదిమేరలదాకా చది వించి, పెద్దకట్నంతో భారీ ఎత్తున పెళ్ళిచేసి, వీలయితే ఫారిన్‌కు కూడా పంప గల భావికాలపు మామగారికోసం అన్వేషించే కులదీపకుడు; వెరశీ యిదే మన మధ్యతరగతి కుటుంబ మనబడే త్రిశంకుస్వర్గం!

18. ఆర్. చక్రారావు – వాకాటి పాండురంగారావు.

తెలుగు కథకుల్లోనే కాదు, తెలుగుపాఠకుల్లో గూడా మధ్యతరగతివాళ్లే హెచ్చు. అందువల్ల మనకథల్లో ఎక్కువభాగం మధ్యతరగతి కుటుంబాల పరిధికి లోనై వర్తించడం సహజమే! తెలుగు కథాసాహిత్యంలో మధ్యతరగతి పాత్రలకు మల్లే అంతగా 'ఎగ్జాస్ట్' అయిన పాత్రలింకేవీ లేవనే చెప్పవచ్చు. ఇంతమించుగా ప్రతి తెలుగు కథకుడూ యిందుకు బాధ్యత వహించినా, యిందులో అగ్రస్థానం మట్టుకు కొడవటిగంటివారికే దక్కుతుంది. ఆయనకు కథ ప్రధానం గాదు. పాత్ర ప్రధానం. పాత్రకు ప్రాణప్రతిష్ఠ చేసి వదిలేస్తే అది చక్కా తనకంటూ ఏర్పరిచిన రాజమార్గం వెంట రివ్వున వెళ్లిపోతుంది. కథ చదివి ముగించే సరికి 'అరరే. యిలాంటి వ్యక్తి నెక్కడో చూచామే! ఎవరై వుంటుందబ్బా!' అని పాఠకుడు ఆలోచనకు పూనుకోవలసిన పని! కొంపదీసి అందులో తన ఛాయలే కనబడితే భుజాలు తడుముకోవలసిన పని! "సరిగ్గా కాఫీవేళకు కనకయ్య వచ్చాడు దాదాపుగా ప్రతిసాయంకాలమూ మా యింట్లో కాఫీ తాగేవేళకు కనకయ్య హాజరు. ఏరోజునన్నా అతడు రాకపోతే నేను మా ఆవిడతో 'కనకయ్య ఊళ్ళో లేడల్లే వుంది. లేకపోతే జబ్బుచేసి మంచాన పడ్డాడో!' అంటాను" అంటూ కథ ప్రారంభమయ్యేసరికి ఈ కనకయ్య అనేవాడు ఎలాంటి బాపతో మన కర్థమైపోతుంది. కథ పూర్తయ్యే సరికి మహానుభావుడు కనకయ్య మన కళ్ళ ముందర నడయాడుతున్నట్టే వుంటుంది.

గడుసు మొగుళ్లూ, దాదస్తపు పెళ్లాలూ, నక్కజిత్తుల కనకయ్యలు, నిరుద్యోగులు, బాలవితంతువులు, కోతిపట్టు పార్వతీశాలు, బ్రతుకుభయం సీతప్పలు, తిక్కశంకరయ్యలు, డిటెక్టివు కేయాసులు యిలా కుటుంబరావుగారి పాత్రలన్నింటినీ ఒకచోట చేరిస్తే మన మధ్యతరగతి జీవులందరూ పెద్ద ఊరణాలకు తరలి వచ్చినట్టే వుంటుంది.

గడచిన యాభై యేళ్ళకాలంలో జాతిజీవనంలోకి సాంఘికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా ఎన్నెన్నో పరిణామాలు చొచ్చుకునివచ్చేశాయి.

ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధం తరువాత ధరలూ, జనాభా గూడా డైరక్ట్ ప్రపోర్షన్‌లో పెరగసాగాయి. దేశానికి రాజకీయంగా స్వాతంత్ర్యం లభించింది. మధ్యతరగతి కుటుంబాల్లో అశక్తతాస్యత హెచ్చింది. వీళ్ళకున్నదానికీ, వీళ్ల కోరుకునేదానికీ మధ్య తేడా పెరిగింది. ఆ కోరుకునేవి గూడా పెద్ద గొంతెమ్మ కోరికలైనంత మేరకు అలాంటి పాత్రలద్వారా రచయితకు హాస్యాన్ని సృష్టించడమూ చేతనైంది. పాఠకులకు నవ్వుకునే అవకాశమున్నూ కలిగింది. కానీ, సామాన్యమైన మామూలు కోరికలు గూడా గగనకుసుమాలై పోయిన విషాద గాథలు వినవలసి వచ్చేసరికి గుండె చెరువైంది ఈ సందర్భంలో గుర్తుకువచ్చే అమ్మాయి కమలబాల. తాము అద్దెకున్న అవుట్‌హవుస్ ముంగిట కమలబాల తమ్ముళ్ళ ప్రోత్సాహముతోనూ, చెల్లెళ్ళ సహాయంతోనూ ఒక పూలతోటను పెంచుకుంటుంది. సెలవుల్లో వచ్చిన ఇంటికామందుపిల్ల లందులో జొరబడి పచ్చిమొక్కల్ని తొక్కి, పువ్వుల్ని తెంచి తోటనంతా కుక్కలు చింపిన విస్తరిలా చేసిపారేస్తారు. పాడైపోయిన తోటను చూస్తూ కన్నీళ్లు పెట్టుకుంటుంది కమల బాల. ఇక్కడ కలవారి పిల్లల పాదాలక్రింద నలిగిపోయినవి బంతిపువ్వులు మాత్రమే గావు, అవుట్‌హవుస్ పిల్లల చిన్నిమనసులు గూడా ![19] సామాన్యుల ఆశలు ఎంతగా అడియాసలై పోవడానికి వీలుంటుందో సూచించే మరొక కథ 'సన్నాటా'. పావురాళ్ళ గూళ్ళలాంటి గదులున్న కట్టడం ఒకటి. అందులో ఎన్నో వాటా లున్నాయి తమ్ముడు తనకోసం డాక్టరును తీసుకొస్తాడేమో నని రోగిష్టి ఆడమనిషి సూరమ్మ ఆకాంక్ష, అరవైయేళ్ళ ముసలివాడి మూడో పెళ్ళాం మాలిని. హఠాత్తుగా తన కెప్పుడో సినిమాఛాన్సు వూడిపడుతుందని ఆమెఆశ. పాతికేళ్ళ సుబ్బలక్ష్మికి వివాహం ఒక తీరని కోరిక. ఓరోజు ఉదయం ఆయింటిముందరి కొక కారొచ్చి ఆగింది. డాక్టరు వచ్చి వుంటాడని సూరమ్మ, వచ్చింది సినిమావాళ్ళేనని మాలిని, కారులో పెళ్ళివారు దిగుతుంటా రని సుబ్బలు అనుకుంటారు. తీరా చూడబోతే వచ్చినవాడు ఆయింటిని కొనుక్కున్న ఆసామి. కట్టడం రిపేరుచేసి లాడ్జిగానో, ఆఫీసుగానో మార్చాలని అతడి ప్లాను. అందుకు

19. పువ్వులు – భాచకొండ విశ్వనాధశాస్త్రి

పీలుగా యిల్లు ఖాళీ చేయమని పర్మానా యివ్వడంకోసం వచ్చాడన్నమాట మధ్య తరగతి జీవితాలు ఎలాంటి భ్రమా ప్రమాదానికి లోనై వున్నాయో చెప్పడానికి వేరే వాఖ్యానం అక్కర్లేదు [20]

ఎదురయ్యే కష్టనష్టాలతోను, ఆశాభంగాలతోను, అవమానాలతోను రాజీ పడి జీవితంతో సర్దుకపోయే నిర్లిప్తత ఈనాటి మధ్యతరగతి మానవుడికి లేదు. తనబాధల కన్నింటికీ మూలకారణం తన చుట్టూరా వున్న సమాజంలో వుండి వుండాలన్న అనుమానాని కతడిలో అంకురార్పణ జరిగి చాలా కాలమైంది. ఈ క్రొత్త ఆలోచన ప్రారంభం కావడం తోటే శరీరం బుద్బుదం, ప్రపంచం మిధ్య, సుఖాలు మిసాలపైన తేనెలు—అన్న అభిప్రాయాలకు కాలదోషం పట్టింది. సీతాకోక చిలుక జీవితంలో కోశస్థదశలా యిది మధ్యతరగతి మానవుడి జీవితంలో ఆలోచించే కాలమైపోయింది. ఇదిగో, ఒక సన్నకారు ఉద్యోగి ఆత్మావలోకనం చిత్తగించండి:

—"నాదేశ విస్తీర్ణతనుగూర్చి నే నొకప్పుడు గర్వించాను. నేను భారతీయుణ్ణి! నా దనుకుంటున్న ఈ దేశంలో నాకొక్క సెంటు భూమి గూడా లేదు. పరులనేలమీద నడుస్తున్నాను. పరులనీడలో తలదాచుకుంటున్నాను. నేను భారతీయుణ్ణయితే ఎవరికి కావాలి? డబ్బిచ్చి కొనగలిగేవాడిదే గ్లోబు!

దేవుడనేవాడు నాకిచ్చిన వరాలు మూడు. ఈ భూమిమీద శ్వాసించడానికి ఒకప్రాణం, చచ్చేదాకా ఆప్రాణాన్ని నిలుపుకోడాని కొకఉద్యోగం, పవిత్ర భారతదేశంలో పుట్టిగిట్టే ఒకవరం.

జీతండబ్బుల్ని కనీసావసరాలు మూడింటికి మాత్రమే వినియోగిస్తారు. తిండి కొంటాను. గుడ్డ కొంటాను. నిలువనీడకు అద్దె చెల్లిస్తాను. నీపదాంబుజమ్ముల మదిన్నమ్మియున్నానురా అంటూ నాకాళ్ళదగ్గర పడివున్న నా ప్రియబాంధవి, కన్నవాళ్ళకు జాలిగొలిపే నాముద్దు బిడ్డలు ముగ్గురు, పగల్లా దేవుణ్ణి ఆడిపోసు

20. సన్నాటా. — జ వి. యస్. అచ్యుతవల్లి.

కుంటూ రాత్రిపూట ముక్కోటిదేవుళ్లనూ పేరుపేరునా స్మరిస్తూ నిదురలో తీయని కలలు గంటూ నేనూ-బదుగురం బ్రతకాలి! కలలు ఫలించే రోజుకోసం బ్రతకాలి! బ్రతకడానికి డబ్బు చెల్లి చాలి!

నల చక్రవర్తి చేలాన్ని ఎగరేసుకపోయిన పావురాలకుమల్లే — నాజీతం డబ్బుల్ని చిటికెలో మటుమాయంచేసే వింత పావురాలు- అవిగో అల్లవిగో- ఆకాశపు లోతుల్లో మసకమచ్చల్లా కనబడుతున్నాయి చూడండి. వాటిపేరు ధరలు!

పొదుపుఉద్యమశాఖవారు నన్ను పొదుపు చెయ్యమంటుంటే నేనేంచేశాను? అప్పులు చేశాను ఆడంబరంకోసం చేసిన అప్పులు కావు నా అవసర నిమిత్తమై నాకుటుంబఖర్చులకుగాను అప్పుచేశాను. ఇందుకుగాను నూటికి నెల ఒకటింటికి కొంతవడ్డీ చొప్పున ప్రతినెలా చెల్లిస్తూ పరిస్థితులు అనుకూలించిన వెంటనే ఋణ విముక్తుడను కాగలను.

పరిస్థితులు అనుకూలించే దెప్పుడు?

గుండెకుండలో మగ్గబెట్టిన నా ఆశ పండే దెప్పుడు ?

నీ జీతమంతా ఏం చేస్తావు ?— అని అడిగేవాళ్లు కొందరున్నారు. వాళ్లు కేవలం దేవుడనబడే భావాన్ని వివిధరూపాల్లో ప్రతిష్ఠించి పూజించేవాళ్ళు. వారికి దేవుడిపట్ల వున్న విశ్వాసం- భౌతికజీవనంలోని కరుణామయమైన దివ్యమైన సంఘర్షణపట్ల వుండదు. వడ్డికాసులవాణ్ణి నమ్ముకుని బ్రతుకుతున్న మహాను భావులారా ! మనిషి గుండె గోడల మాటున దివ్యజ్యోతిలా వెలిగే ఆర్ద్రతను, సానభూతిని ఆ వేంకటేశ్వరుడైనా ఆరాధిస్తాడని మీకు తెలియదా ?"[21]

మధ్యతరగతి మానవుడు ఆలోచిస్తాడు. తన బ్రతుకు బాటలోని వ్యధల్ని గురించి తలచుకుంటూ ఖిన్నుడౌతాడు. క్రుంగి పోతాడు. ఎక్కువ జీతాలకోసం సమ్మెలు చేస్తాడు ఆయిదో పదో పెంచినాచాలు, పరమానందంతో పొంగిపోతాడు. ఆ కొద్దిపాటి పెంపుదలవల్ల తన యిబ్బందులు తీరవని అతడికి తెలియదా ? తెలుసుకానీ ఎక్కడికక్కడ సర్దుకు పోవడం అతడి జీవలక్షణం.

21. ఇస్ ఝుంఝేకి నీఛే—కలువకొలను సదానంద

*       *       *

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి ఇన్నేళ్లు గడచిపోయిన తర్వాత ఇప్పుడీనాడు ఏ పట్టణంలో అడుగుపెట్టినా, ఏ పల్లెకు వెళ్ళినా మనసు కానందం కలిగించే దృశ్యాలు ఎన్నయినా కానవస్తాయి. ఆనకట్టలు, కాలువలు, సాంద్రవ్యవసాయం, రహదారులు, విద్యాలయాలు, కర్మాగారాలు మొదలైనవి దేశాభివృద్ధికి కొండగుర్తుగా నెలకొన్నాయి కానీ బాహ్యదృష్టికి కనిపించే ఈ వికాసాన్ని బట్టి సమాజానికి సంబంధించిన సర్వవిషయాలూ బాగానే వున్నాయనుకోడం విజ్ఞత అనిపించుకోదు. ఈరోజున కలకలలాడుతూ బాగానే వున్న చెట్టు, యింకొక నెలరోజుల్లో వట్టి మ్రోడుగా మిగిలిపోయే అవకాశాలు లేకపోలేదు. వేర్లను కొరికేసేవి కొన్ని, బోదెను తొలిచేసేవి కొన్ని. చీడగా వ్యాపించి ఆకంతా మటుమాయం చేసేవి కొన్ని - యిలా ఎన్ని రకాల పురుగులైనా వున్నాయి. దేశ మనియెడి దొడ్డ వృక్షంపైకి ఈనాడు మోహరించి వున్న ప్రమాదాలు అంతకు తక్కువైనవేమీ గాదు. ఈ సామాజిక రుగ్మతలను చిత్రించే కథలు ఏ పత్రికను త్రిప్పినా, ఏ కథా సంపుటాన్ని చూచినా తారసిల్లుతూనే వున్నాయి. నాగరిక సమాజంలో కార్చిచ్చులా అల్లుకుంటున్న పడుపు వృత్తిని గురించిన ప్రసక్తి వచ్చినప్పుడు తొడిమిలేని పువ్వు నేరం, గంజాయి గొట్టాలు మొదలైన కథలు జ్ఞప్తికి వస్తాయి. చేసే పొరబాటు ఒకటే అయినా మరకతం వెంకట్రామన్ మహారాణిలా 'డియస్పీ' గారి ఆదరణకు పాత్రురాలైంది జబర్దస్తీగా వ్యాపారం నడుపుతున్న ముత్యాలు హెడ్‌కానిస్టేబుల్‌ను చెవులు పట్టుకుని ఆడించగలుగుతుంది ఎటొచ్చీ అధికారదండం అద్దె చీరతో, అరువు లోలక్కులతో కడుపు కక్కుర్తికోసం భంగపడే కాలవ్వార మనిషిని మాత్రమే జడిపింపగలుగుతుంది.[22] అవినీతిని మ్రింగి హరాయించుకో గలిగిన వాళ్ళు హాయిగా అందలాల్లో ఊరేగుతూనే వున్నారు ఆ సత్తా లేనివాళ్ళు ఆ రంగంలో గూడా దోపిడీకి గురవుతూనే వున్నారు. కోడి పందెంలో నశ్శీ పైపందెంలాగా అమాయికరాండ్రను వృత్తిలోకి దింపి వచ్చే డబ్బంతా దోచుకుంటూ వాళ్ళను పస్తు

22 తొడిమిలేని పువ్వు — బీనాదేవి.

లతో మాడ్చే కిరాతకులు కొందరు ! [23] చెమ్మతో పాదాలు జిల్లుమనే ఈ మురికి గుడిసెల్లో ప్రతికే ఒక్కొక్క వ్యక్తిదీ ఒక దయనీయమైన గాథ. కొడి గట్టిన కిరసనాయిలు దీపం నుంచీ వ్యాపించిన వెలుగు నీడల మధ్య, పాత బట్టలు పరిచిన ఈక్కిమంచంలో తడిసిపోయిన సుద్దముక్కలా పడుకుని వున్న అనాధ - ఆమె పేరు సుగుణ! వెదుక్కుంటూ వెళ్ళిన రసికుడు ఆమె నా మంచంలోనుంచీ నేరుగా ఆసుపత్రికే తరలించవలసివస్తుంది. ఆపాటి సాయం చేసిన వ్యక్తికి వీడ్కోలిస్తూ ఆసుపత్రిలో సుగుణ చెప్పినమాట- మనిషిలోని పాశవిక ప్రవృత్తి పైకి సంధించిన ఒక నిశితవాఖ్యానంగా ధ్వనిస్తుంది.[24]

ఉష్ట్రపక్షిలా గట్టిగా కళ్ళు మూసుకుంటే చెప్పలేముగానీ, ఏమాత్రం కళ్లు తెరిచి చూచినా నేటి సమాజంలో లంచగొండితనం చేస్తున్న వీరవిహార మెలాంటిదో తెలిసిపోతుంది. వట్టి జీతంరాళ్ళపైన మాత్రమే ఆధారపడి బ్రతుకుతున్నవాళ్ళు అప్రయోజకులుగా లెక్కగట్టబడి, వెలవెలపోతున్నారు. జీతంకంటే గీతం ఎక్కువయిన వాళ్ళు దర్జాగా అంతస్తులు పెంచేస్తున్నారు. ఇందును గురించి వచ్చిన శతాధిక కథానికల సారాంశాన్ని తేటతెల్లం చేయడానికి, ఇదిగో ఈ క్రింది టుమ్రీ కథే చాలు !

'ఆఫీసులో —
బంట్రోతు,
లంచం అడుగుతాడు.
చిన్న గుమాస్తా
లంచం లాగుతాడు
పెద్ద గుమాస్తా
లంచం గుంజుతాడు.
హెడ్ గుమాస్తా

23. నేరం — బి. టి. రామానుజం
24. గంజాయిగొట్టాలు — సి యస్. రావు

లంచాలు దంచుతాడు.
చిన్న ఆఫీసరు
లంచాలు పీల్చేస్తాడు.
పెద్ద ఆఫీసరు మాత్రం ధర్మరాజు
అతడు లంచాలు పుచ్చుకోడు—
కిందివారినుంచీ వాటాలేతప్ప! [25]

ఆర్థిక స్థితిగతులనుబట్టి సమాజాన్ని మూడు తరగతుల క్రింద వర్గీకరించి చూస్తున్నాము. అయితే ఆతరగతుల తేడా పాటించకుండా అందరినీ సమానంగా తన కబంధ హస్తాలలోకి చేరదీసుకుంటున్న వ్యసనం మాదేమిటి? అదే మద్య పానం. మధుసేవనం ఒకవ్యక్తిగతవిషయ మని, అందును గురించి ఇతరులు అభ్యంతరం చెప్పవలసిన అవసరం లేదనీ కొందరంటారు. ఈ వాదం కూడా ఒప్పుకోవలసిందే! కాని మానవుడు సంఘజీవి అనే అంశందృష్ట్యా, ఒకవ్యక్తి తాగుబోతు అయినప్పుడు, అతని చుట్టూరా ఉన్నవాళ్లకు యిబ్బంది కలిగిన పక్షంలో ఈవ్యసనంపట్ల ఆక్షేపణ వుండి తీరుతుంది. త్రాగుడువల్ల ఎరుపెక్కేది త్రాగుబోతుకళ్ళు మాత్రమేగాదు, అతణ్ణి కట్టుకున్న పాపానికి ఏడుపే కూడుగా బ్రతికే అయింటి ఇల్లాలి కళ్ళు గూడా![26] ఒక వ్యక్తి త్రాగివచ్చి తన భార్యా బిడ్డలపైన నెరపదలుచుకున్న అఘాయిత్యానికి ఒకానొక దొంగసైతం సైరించలేక పోయిన కథఒకటి బాలగంగాధర తిలక్ రచించారు. ఒక భర్త పూటుగా తాగి వచ్చి అర్ధరాత్రప్పుడు భార్యను బంగారుగొలుసు తీసియివ్వమని వేధిస్తాడు. ఆమె యివ్వడానికి నిరాకరిస్తే కన్నబిడ్డను గొంతునులిమి చంపేయడానికి కూడా ఉద్యుక్తుడౌతాడు. సరిగ్గా ఆ సమయాని కక్కడ వచ్చి పొంచివున్న ఒకదొంగ తటాలున రంగంపైకి దూకి ఆభర్తను చితకగొట్టి 'భద్రం భద్రం ఖపడ్దార్! ఆడమనిషి జోలికి పోయావో తన్నులు తప్పవు జాగ్రత్త!' అని హెచ్చరించి, ఆ విధంగా కొంత ధర్మసంస్థానం చేసినతర్వాత తనపాటుకు తాను వెళ్ళిపోతాడు.

---

25. రావిశాస్త్రి పొట్టి పిట్టకథ,
26. ఎర్రటి కళ్లు – ఆచంట శారదాదేవి

ఇలాంటిదే యింకొక కథ వుంది. అందులో భార్య భర్త త్రాగుబోతుతనంతో రాజీపడలేక చంటిబిడ్డను తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఆ సమయానికి బడికి వెళ్ళి ఉండడంవల్ల ఏడేనిమిదేళ్ళ అబ్బాయిమట్టుకు తండ్రిదగ్గరే మిగిలి పోతాడు. ఒకనాటిరాత్రి ఆతండ్రిగారు ఒక స్నేహితుడితో కలిసి స్వగృహంలోనే పార్టీ ఏర్పాటుచేసుకుంటాడు. నవ్వులతో, పరిహాసాలతో ప్రారంభమైనపార్టీ అర్ధ రాత్రి దాటేసరికి హద్దుమీరి పోతుంది. మాటపైనమాట పెరిగి తిట్లతో ప్రారంభ మైన జగడం కొట్టుకోడందాకా వస్తుంది. కుర్చీలు తిరగబడతాయి గ్లాసులు పగిలి పోతాయి. ఒక డింకొకడి పీకపట్టుకుంటాడు. వాడు ప్రాణభయంతో గావుకేక పెడ తాడు. ఈమధ్య ఎప్పుడో నిద్ర లేచి గుండె లరచేత పెట్టుకుని ఈ గలాటాఅంతా చూస్తున్న కుర్రవాడు, ఈడ్చికొట్టిన రబ్బరు బంతిలా బయటికి దూకి భూతాలేవో తరుముతున్నట్టుగా వీధులవెంట పరుగు లంకించుకుంటాడు. ఆవేళప్పుడు పాల సేకరణకోసం సైకిల్లో వెళ్తున్న మిల్క్‌డిపో వెంకయ్య ఆకుర్రాణ్ణి చేజిక్కించుకుని, తీసుకెళ్లి పోలీసుస్టేషన్లో అప్పగిస్తాడు. పోలీసుజవాను ఎంతగా బుజ్జగించి అడిగినా ఆకుర్రవాడు తనయింటి చిరునామా చెప్పడు, 'నా కిక్కడే బాగుంది. ఇక్కడే వుంటాను అదిగో ఆగదిలో పడుకుంటా' నన్నాడు. అది నేరస్తులకోసం కట్టిన సెల్లు అబ్బాయి అందులోనే పడుకుని హాయిగా, నిర్భయంగా నిద్రపోగలుగు తాడు. మీసాలూ గడ్డాలూ వచ్చి వయసులోనూ, విజ్ఞతలోనూ పెద్దలైన వాళ్లు సవ్యంగా వ్యవహరించకపోతే, బుద్ధిగా మసలుకోకపోతే భావితరాల పౌరులకు ప్రపంచంకన్నా చెరసాలలే నయమని పించవచ్చునన్నది ఈ కథలో వినదించే సత్యం.[27]

సమాజాన్ని పట్టిపీడిస్తున్న యింకొకజబ్బు జూదగొండి మన స్తత్వం. పేకాట, లాటరీ, గుర్రప్పందాలు, మట్కా మొదలైనవన్నీ దీనిక్రిందికే వస్తాయి. వెన కొచ్చిన కొమ్ములలాగా ఈనాటి సమాజజీవనాన్ని అతలాకుతలం చేసి పారేస్తున్నది మట్కా జూదమేనని చెప్పవచ్చు. అట్టడుగువర్గాల శ్రమజీవులు

27. రేపటి ప్రపంచం—మధురాంతకం రాజారాం.

లక్షోపలక్షలమంది సిప్పుల గుండంలో పడుతున్న శలభాల్లా ఈ వ్యసనాని కగ్గమై పోతున్నారు కూలీలు, కార్మికులు రిక్షావాళ్లు, గుమాస్తాలు, రైతులు, ఆఖరుకు ముసలమ్మలు గూడా రోజుకు ఒకటో రెండో, అయిదో పదో ఈ ఆటకోసం తగలేస్తున్నారు. పగలంతా కట్టుకున్న గాలిమేడలు రాత్రి 'జీరోఅవర్' వచ్చే సరికల్లా కూలిపోతున్నాయి. అయినా మరునాడు తెల్లవారేసరికి మళ్లీ మట్కా చార్టుల్ని గాలించడమూ తప్పడంలేదు, మట్కా-స్వాములకోసం పరిగెత్తడమూ తప్పడంలేదు. భయంతోగూడిన బ్రతుకులలాగే అదృష్టంపైన ఆధారపడిన బ్రతుకులు గూడా జాతికి అనర్థహేతువులు. ఆ అదృష్టంగూడా నూటికి తొంభై తొమ్మిదిపాళ్లు మనిషిని ముంచేదేగానీ, తేల్చేది గాదు[28] భద్రతలేని జీవితం నిప్పులు చెరిగే ఎడారి, చెట్టుక్రిందలి జ్యోతిష్యాలు వారఫలాలు, లాటరీలు, మట్కాఆట మొదలైనవి ఆనైరాశ్యవాతావరణంలోని ఎండమావులు. ఈ ఎండమావుల వెంట మనుషుల్ని పరిగెత్తించేవ్యవస్థ సమాజానికి శ్రేయస్సు చేకూర్చేది గాదని కథకులు తమరచనలద్వారా వ్యక్తం చేస్తూనేవున్నారు.

* * *

రోడ్డుకు రెండు ప్రక్కలా ఇళ్ళున్నాయి. కుడి పల్లెలో మేడ లున్నాయి. రేడియో లున్నాయి. ఎడమ పల్లెలో గుడిసె లున్నాయి. గోడు లున్నాయి. కుడిపల్లె ఎడమకుగానీ, ఎడమపల్లె కుడికిగానీ పెరగకుండా వేదకాలం నాటి శాసనంలాగా, ఆధునిక కాలంలో వంచనలాగా సిమెంటు రోడ్డు చిద్విలాసంగా చిరంజీవిగా ప్రకాశిస్తూ వుంది. ఆ రోడ్డువార చింతచెట్టు క్రింద కూర్చున్న పదేళ్ళ పిల్ల చిన్నికి మూడు రోజులుగా బువ్వలేదు. ఎక్కడో పనికోసమని వెళ్ళిన నాన్న తిరిగి రాలేదు. తల్లి జబ్బుతో మంచంలో నుంచే లేవడం లేదు. మూడు రోజులుగా తిండి లేక, వానలో చలిలో బట్టల్లేక, లేవలేని అమ్మ కష్టం చూడలేక వున్న చిన్ని కడుపులో వొంట్లో కంట్లో కాళ్ళలో ప్రతిరక్తంబొట్టులో ప్రతి వెంట్రుకపాదులో ప్రతి స్వేదరంధ్రంలో ఆకలి వేయినాలుకల నాగులాగా కాటు వేస్తూవుంది.

---

28. విశ్వరూపం – కేతు విశ్వనాథరెడ్డి

ఏడాదిక్రితం ఒకసారి ప్రమాదవశాత్తుగా లారీక్రింద పడబోయినచిన్నికి ఏలాగో చావు తప్పిపోయింది. లారీఓనరు ఆరునెలలపాటు నెలకొకవంద రూపాయ లిస్తూ వచ్చాడు. పిల్ల తేరుకోడం కోసం ఆవారిన వచ్చినప్పుడల్లా రకరకాల తిను బండారాలు అందించేవాడు. బెడ్డు, బిస్కట్లు, ద్రాక్ష, బత్తాయి, కమలా, నారింజ...అలాంటివి.

ఆ మధురస్మృతుల్లో తేలిపోతూ మళ్లీ ఒకలారీకడ్డంగా పరుగెడుతుంది చిన్ని. చక్రం ఆపిల్లపైన్నుంచీ వెళ్ళిపోతుంది. చిన్ని బావురుకప్పలా నలిగి పోతుంది. అక్షణంనుంచీ ఆపిల్లకిక ఆకలిబాధగూడా శాశ్వతంగా తీరిపోతుంది.[29]

సందుల్లో గొందుల్లో హోటళ్ల వెనక, పెళ్లిమంటపాల దాపున చెత్త డబ్బాల సమీపంలో ఎంగిలాకుల్ని ఊడ్చుకతినే క్షుద్రజీవులు తరచుగా కనిపి స్తూనే వుంటారు. సముద్రం చెలియలికట్టను దాటనంతవరకే ప్రపంచానికి క్షేమ మని అందరికీ తెలుసు. ఆకటిచిచ్చు హద్దుమీరితే మానవజగత్తు కేమవుతుందో గుర్తించటంలో మట్టుకు ఆలస్యం జరుగుతూనే వుంది.

'ఆకలి కొండచిలువలాంటిది. అది మనిషినీ, మానవత్వాన్ని కబళిస్తుంది, శక్తి వున్నవాళ్ళు ఆ కొండచిలువను తిండితో చంపేస్తారు. శక్తిలేనివాళ్ళు దానికి బలైపోతారు. ఉన్నవాడికి మరింత తిండి, లేనివాడికి మరింతలేకపోవడం సమాజం మొత్తాన్ని చుట్టిన కొండచిలువ యిది. ఇది సమాజాన్ని కబళిస్తుంది' —అంటు న్నాడు కథకుడు.[30]

ఈ ఆకలి జీవుల్ని గురించి ఇటీవల దశాబ్దంలో వరద, జాలి, మనిషీ ఆడమనిషీ, డైనింగ్ టేబిల్, నర్తోడు, ఖాళీసీసాలు యింకా అలాంటి కథలెన్నో వెలువడ్డాయి [31]

---

29 ఆకలి. —కొలకలూరి ఇనాక్

30. కొండచిలువ— మంథా వెంకటరమణారావు

31. వరద— వి రాజరామమోహనరావు

జాలి— కె. వి. యస్. వర్మ

మనిషీ-ఆడమనిషీ— పురిపండా అప్పలస్వామి

డైనింగ్ టేబిల్— డి. వెంకట్రామయ్య

నర్తోడు— శ్రీపతి

ఖాళీసీసాలు- ఇస్మాయిల్

ఎక్కువ మంది పాఠకుల్ని ఆకట్టుకోవాలన్న ఉద్దేశంతో వెలువడుతున్న పత్రికలలోని ఎటర్నల్ ట్రయాంగిల్స్, ప్లెటానిక్ లవ్, కామన్ నాన్‌సెన్సు కథలకు భిన్నంగా ప్రజాజీవనాన్ని ఒడిదుడుకులు పాలుచేస్తున్న జీవన్మరణ సమస్యలను గురించి చిత్రించాలన్న పూనికతో యువరచయితలు హోరు, జనం, ఇప్పుడు వీస్తున్న గాలి, సుడి, ఐద్లా మొదలైన కథాసంపుటాలను ప్రచురించారు.

సమాజాన్ని అస్తవ్యస్తం గావిస్తున్న పరిస్థితులకన్నింటికీ ఆర్థిక వ్యత్యాసాలే మూలకారణమని వీరు విశ్వసిస్తున్నారు. అందువల్ల రచయిత ఎండల్ని గురించి వ్రాసినా, వానల్ని గురించి వ్రాసినా; పంటల్ని గురించి వ్రాసినా, ఫ్యాక్టరీలను గురించి వ్రాసినా; సెక్స్‌ను గురించి వ్రాసినా, ఆర్ట్‌ను గురించి వ్రాసినా ఈ ఆర్థిక సమస్య మనిషి జీవితాన్ని ఎన్ని మలుపుల్లోకి, ఎన్ని రంగుల్లోకి, ఎన్ని మురికి కాలువల్లోకి త్రిప్పుతున్నదో కథ ద్వారా వ్యక్తంచేయాలని అభిలషిస్తున్నారు.[32]

ఈ ఆలోచనకు [illegible] 'పంచాయితీ' [illegible]

డెబ్బయి రెండు రూపాయల నెల జీతంతో సంసారం గడవక, బోలెడు అప్పులుచేసి, వాటిని తీర్చేవెరవు లేక, బొత్తిగా తనను అర్థంచేసుకోని భార్య విశ్వాసరాహిత్య తీర్మానం ప్రకటించి పుట్టింటికి వెళ్లిపోగా దేశాలపాలైన రాజశేఖరం తన మిత్రుడికి వ్రాసిన చివరి జాబులోనివి ఈ మాటలు : 'ఈ పృథివి పైన సమస్త సంపదలూ ఉన్నవి. ఈ సంపదలపై భూమిని పుట్టిన జీవరాసుల కన్నింటికీ హక్కున్నది. బలవత్తరమైన జీవులు కొన్ని బలహీనమైన వాటిని తమ స్వార్థం, దురాశ హేతువులుగా వంచించి అన్యాయం చేస్తున్నవి. తక్కిన జీవరాసులలో కన్నా యిది మానవునిలో ఎక్కువ స్పష్టంగా చూడగలుగుతున్నాము. నేటి సమాజంలో అటు కండలు కరగించి సంపద ఉత్పత్తిచేసేవారు, ఇటు మేధాశక్తి ఉపయోగించి మానవ సమాజపు ప్రజనశక్తులను అభివృద్ధి చేసే

32. 'ఎందరో' కు పీఠికలో' చంద్ర.

హార్యా, వీరందరి ఆరోగ్యం, ఆనందం, సంస్కారం పరిరక్షిస్తూ ఉత్తమగతు లేర్పరిచేవారు, అర్ధాకలితో, అణచుకున్న కోర్కెలతో ఆ సంపదలో తక్కువలో తక్కువ పొందుతూ బతుకుతున్నారు. వారి శ్రమజన్యమైన సంపదలో అత్యధిక భాగం మరికొందరు అనుభవిస్తున్నారు ఈ ఇంద్రజాలాని కంతటికీ కారణం ఇప్పుడు మానవు డనుసరిస్తున్న ఆర్థిక విధానం. ఈ జూదగొండి ఆర్థికవిధానం హస్తాలలో ఇరుక్కుని వున్నంతకాలం మన జీవితాలను మనం ఆనందమయం చేసుకోలేము.'

మరైతే ఏం చేయాలి ?

ఈ ప్రశ్నకు జవాబు మళ్లీ ఆదే కాళీపట్నం రామారావుగారు ఎనిమిదేళ్ల క్రితం వ్రాసిన 'చావు' కథలో కనిపిస్తుంది. అందులో ఒక పండుచలికాలపు రాత్రివేళ, ప్రేత సంస్కారానికి కట్టెపుల్లలు పుట్టించుకోవడం గూడెంలోని జనానికి బ్రహ్మప్రళయమైపోతుంది. అఖరుకు తెగబడి ఒక మోతుబరికి చెందిన వామిలోనుంచీ కట్టెలు దొంగిలించవలసి వస్తుంది. ఆపని చేయడం వెనుక వున్న మంచి చెడ్డల్ని గురించిన వాదంలో ఓ కోరమీసాల పడుచువాడు చెబుతున్నాడు. 'ఓరయ్యా, వాదన్లొద్దు. పన్లు సెయ్యడం యిష్టంలేనప్పుడే వాదన్లొస్తాయి. మనకది మంచిపనని తోసింది. చేసేసినాం. కానిది సెడ్డ, అది చేసినందుకు మీపని పడతాం అంటూ అళ్లొస్తారూ, రానీ, అళ్ళ పని మనవూ పడతాం. ఇయ్యేళనుంచీ యిదే లెక్క! ఒకపని చేస్తే నాయుడేమంటాడో, కరణమేమంటాడో, బారికేమంటాడో కాదు. మంచిపనా, సెడ్డపనా ? మంచిదైతే సేసెయ్! దేవుడుకాదు. దేవుణ్ణి పుట్టించిన జేజమ్మయినా దెబ్బలాడు. అదీ మన పద్ధతి...'

ఈ వరుసలో వచ్చిన మరొక గొప్పకథ 'యజ్ఞం'. ఇది గూడ ఒకవూరి కథే! గడచిన పది పదిహేనేళ్ళలో ఆ వూరికి రోడ్డొచ్చింది. హైస్కూలొచ్చింది, కరెంటొచ్చింది. రైస్‌మిల్లు ఏర్పడింది. పంపుసెట్లు బావుల్లో నుంచీ నీళ్లుతోడు తున్నాయి. మూడు కో ఆపరేటివ్ సంస్థ లున్నాయి. వాటికి గోడౌ న్లున్నాయి.

పోస్టాఫీసు, ఆసుపత్రి, మెటర్నిటీ సెంటరు, గ్రంథాలయం అన్నీ వున్నాయి. నాలుగువందల ఇళ్ళున్న ఒక గ్రామానికి సంబంధించినంత వరకూ యింతకన్నా సాధించవలసిన అభివృద్ధి ఏముంటుందనిపిస్తుంది. కానీ ఈ పరిణామాలవల్ల ఆ వూరి హరిజన వాడకు ఒరిగేదేమీలేదు. వాళ్ళు తమ శ్రమదానంతో వేసిన రోడ్ల మీద ఇప్పుడు బస్సులొస్తున్నాయి. ఆ కారణంవల్ల బండ్లు తోలుకుని బ్రతికే వాళ్ళకు బ్రతుకులేకపోయింది. పంపుమెషీన్లు పెట్టడంవల్ల ఏతంతోడే పని కరువైంది. రైస్‌మిల్ రావడంతో వడ్ల దంపకం వల్ల వచ్చే కూలీలు బందైనాయి. ఇట్టి పరిస్థితిలో పంచాయితీలో హరిజన మెంబరు అప్పలాయుడు అప్పు చెల్లించవలసి వస్తుంది. ఎనాడో చేసిన అప్పు, వడ్డీపైన వడ్డీ పెరుగుతూ వచ్చి చాలాపెద్ద మొత్తమైపోయింది. కొడుకుతో కోడళ్ళతో వాళ్ళ బిడ్డలతో దాదాపు ముప్ఫై మంది దాకా వున్న కుటుంబం. మిగిలివున్న పొలం మూడెకరాల ముప్ఫైసెంట్లు మాత్రం. 'పొలాన్ని గనుక అమ్మావో నిన్ను నరికి, నేను గూడా నరుక్కుని చస్తా' నంటాడు కొడుకు సీతారాముడు. కానీ అప్పలాయుడికి పొలమమ్మకోక తప్పలేదు. పత్రం మీద వేలిముద్ర వేయవలసి వచ్చేసరికి కొడుకు సీతారాముడు చూడకుండా పల్లెవైపు పరుగుతీశాడు. అతడు తలపెట్టిన పనేమిటో తెలియదు. తెలిసివచ్చేటప్పటికి ఊరు ఊరంతా భయంతో, నివ్వెరపాటుతో బ్రమాన్పడిపోతుంది. తన ఒక్కగానొక్క కొడుకును నిలువునా పొలిబెట్టి, ఆ కళేబర ఖండాలను ఓ గోనె సంచిలో వేసి తీసుకొస్తాడు సీతారాముడు. 'నా కొడుకు బానిస బతుకు బతకడు. నా కొడుకు కంబారిగా వుండడు' అంటూ ఆక్రోశిస్తాడు.

సీతారాముడి లాంటి వ్యక్తి నూటికి కోటికి ఎక్కడైనా వుండవచ్చు. ఆ మనిషిలోని 'తండ్రి'తో మనకు పెద్దగా ప్రసక్తిలేదు. ఒకసన్నకారు రైతు తన సంతానం బానిసలుగా బ్రతకరాదన్న నిర్ణయానికి వచ్చేశాడన్నది ముఖ్యం.

జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలవల్ల ఎవరోకొందరు మాత్రమే ప్రయోజనాన్ని పొందగలిగినంత మేరకు, అది సమాజానికి ఆరోగ్యప్రదం కాదన్నది ఈ కథద్వారా వినవచ్చే సందేశం. జబ్బుమనిషికి ఎవేవో బాహ్యాలంకారాలు

కై సేయడంవల్ల లాభమేముంది? శరీరమంతా ఆరోగ్యంగా వుండడంముఖ్యం. అందువల్ల వ్యవస్థ సమూలంగా మారవలసిన అవసరాన్ని సూచిస్తుంది ఈ కథ.

*    *

ఏదివ్రాయాలి, ఎలా వ్రాయలి అనేవాటిలో మొదటిప్రశ్న వస్తువుకు, రెండో ప్రశ్న శిల్పానికి సంబంధించినవి. అందులో వాస్తవికత, తెనుగుదనము అనేవి వస్తువుకు సంబంధించిన విషయాలు, 'కథ'అనేది ఆకాశంలోనుంచి వూడిపడదు. ఇతివృత్తాన్ని జీవితంలోనుంచీ, పాత్రలను తనచుట్టూరా వున్న సంఘంలోనుంచీ, సంభాషణలను వాళ్ల ప్రసంగాలనుంచీ రచయిత స్వీకరిస్తాడు. కథకు ముడిసరు కంతా మానవజీవితమే. అందువల్లనే కథకుడు ఎంతో భక్తిశ్రద్ధలతో మానవ జీవితాన్ని గమనించడం, పరిశీలించడం, అర్థంచేసుకోవడం చాలా అవసరం. అంతేగాదు. తోడిమానవులపట్ల సానుభూతిగూడా చాలా అవసరమే! నీతిని గురించి, న్యాయాన్నిగురించి, ఆచారవ్యవహారాలను గురించి ఏదో పాతకాలం నాటి కొలబద్దలను చేతబట్టుకుని వాటితో ఈనాటి మానవుడి ప్రవర్తనను కొలవడంలో అర్థంలేదు. మార్పు సమాజ ధర్మమని గుర్తించాలి. ఆమార్పు సమాజాభ్యుదయా నికి దోహదకారి అయినంతవరకు దాన్ని సమర్థించాలి. అలాకాదని తెలిసినప్పుడు దాన్ని ఖండించడానికి వెనుదీయరాదు. కథకుడికి నిర్భయమైన చిత్తవృత్తి గూడా ఎంతైనా అవసరం.

ఈమధ్య పత్రికలసంఖ్య, దానితోబాటుగా కథఆవశ్యకతగూడా చెప్పుకో దగినంతగా పెరిగింది. కేవలం కథకోసమే కథ అన్నట్టుగా సినిమాలకు నకళ్లుగా, ఇతరభాషలలోని కథలకు అనుసరణలుగా, వట్టి ఉబలాటంనుంచి మాత్రమే పుట్టే అపరిపక్వరచనలకు పత్రికల్లో ప్రచురణావకాశం లభించింది. పాఠకుల మనసుపైన స్థిరముద్ర వేయలేని కథల్నిగురించి ఇక్కడ చెప్పవల సిందేమీ లేదు. వాస్తవికతను, దేశీయతను ప్రతిబింబించడంతో బాటు సమాజా భ్యుదయానికి దోహదప్రాయమైన ఒక బలమైన సందేశాన్ని అందివ్వగల కథలు మాత్రమే సాహిత్యంలో చోటుచేసుకుంటాయి.

గడచిన పాతికేళ్లకాలంలో వెలువడిన వాటిలోనుంచీ వంద మంచికథలను ఎన్నికచేసి సంపుటంగా ప్రచురించినట్లయితే, అది సంఘజీవితంలో వచ్చిన వివిధ పరిణామాలను వ్యక్తీకరిస్తూ తెలుగువారి సామాజిక చరిత్రకు ఒక ప్రత్యామ్నాయంగా రూపొందగలదని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఒకసాహిత్య ప్రక్రియగా తెలుగుకథానిక తనకర్తవ్యాన్ని నెరవేరుస్తూ కృతకృత్యత పొందుతూ వుండడానికి సందేహించ నక్కరలేదు.

 

# నాటకరచన-క్రొత్తప్రయోగాలు

శ్రీ పి. వి. రమణ

తెలుగు సాహిత్యంలోని నాటకేతర ప్రక్రియలు ఆయాధోరణుల్లో వికాసం చెందినట్టే నాటకరచనకూడా ఆధునీకరించబడి పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో పరిఢవిల్లిందనే చెప్పాలి. తెలుగులో వచ్చిన కొత్తనాటకాలను పరిశీలించి వాటిలోని కొత్తప్రయోగాలను ఉటంకించడమంటే ఒకవిధంగా తెలుగునాట ఆధునిక నాటక రంగాన్ని పర్యాలోకించడమే అవుతుంది. సాంఘికసాంస్కృతిక రంగాలలో వస్తున్న, వచ్చినమార్పులు, అవసరాలు కళలపైకూడా ప్రసరిస్తాయి. రచయిత ఆలోచన సాంఘిక, సాంస్కృతిక అవసరాలకు భిన్నంగా ఉండనంతకాలం సమకాలీన నాటక కళారంగం సాంఘిక సమస్యలచుట్టూ పరిభ్రమించక మానదు. ఆ అవసరాలను ఆసరాగా చేసుకొని వచ్చేవే సాంఘికనాటకాలు. ఈ మేరకు తెలుగునాటక రచయితలు సమకాలీన అవసరాల కనుగుణంగా రచనలు చేశారనే చెప్పాలి. ఏమైనా, పాశ్చాత్యనాటకరంగంలో నాటకరచనకు, ప్రదర్శనా సంబంధమైన ప్రయోగానికి అవినాభావ సంబంధం ఉండి ఉండటంవల్ల ఆ మేరకు ప్రేక్షకుల అభిరుచులను కూడా రచయిత స్వీకరించాడు. తెలుగునాట మాత్రం, నాటకరచన అభివృద్ధి చెందినంతగా రంగస్థలం అభివృద్ధి చెందనందు వల్ల ఒకవ్యవస్థీకృతపద్ధతిలో నవీన తెలుగునాటకం నడువలేదు. ఐతే సాహిత్యంలోని ఇతరప్రక్రియల ప్రభావం మొత్తంగా సాహిత్య ప్రభావం, సమాజ ప్రభావం నాటకరచయితలమీద పడటం అనివార్యం కనుక, నూతనవిషయాలను వస్తువులుగా స్వీకరించి, తెలుగునాటకరచనను సాంఘిక అవసరాలకు అనుగుణంగా తీర్చి దిద్దడంలో ఆధునిక రచయితలు పెక్కుమంది కృషిచేశారు. ఆ కృషి నిజానికి గురజాడ కన్యాశుల్కంతోనే ప్రారంభమైంది. అది మొదలు కొత్త ప్రయోగాలతోకూడిన వందలాది నాటకాలు ఆవిర్భవించాయి. అవి స్రవంతుల్లా సంఘంతోపాటు ముందుకు నడుస్తూనే ఉన్నాయి.

"...For atleast two generations now the serious minded European theatre has existed in an era of experimentation The diverse experiments have not as yet produced any unequivocal, clearly discernible results, but the era is by no means at an end... It is my opinion that the experiments followed two seperate courses... These two courses of development are distin ruished from one another by means of their individual functions entertainment and instruction, that is to say the Theatre orgainsed experiments which were to increase its powers of entertaining and experiments which were to increas its powers of instruction ...Sill it can not be denied that the Theatre's insights into social situation have not been particluarly profound ... The Theatre has been content to deal with society in only the most superficial ways. Because of the Theatre's failure to express man's intrinsic social contexsts, all attempts at creating a social drama have resulted in the complete destruction af both the plot and the characters. The Theatre by placing itself in the service of social reform, suffered as art.

(Theatre in the Twentieth Century" by Bertolt Breeht.)

గత రెండు తరాలుగా యురోపియన్ థియేటర్ నూతన రచనా రూపానికి ఎంతగా అంకితమైపోయిందో పై 'బ్రెక్ట్' వాక్యాలు నిరూపిస్తున్నై. అయితే ఈ నూతన రచనా ప్రక్రియ అనుకున్నంతగా, ఆశించినంతగా

విజయాన్ని సాధించలేదని, ప్రేక్షకుల్ని గంద్రగోళ పరచటమే గాక, కళాత్మకంగా గూడా విఫలమయ్యాయని బ్రెఫ్ట్ ఆరోపిస్తాడు.

ప్రసిద్ధ అలంకారికుడు ప్లెకినోవ్ (Plekhnov) ప్రతిపాదించిన'Flow of water Theory' ప్రకారం చరిత్రలో ఆయాదేశకాలానుగుణ పరిస్థితులను, బట్టి ఏదో ఒక దేశంలో పునరుజ్జీవన ఉద్యమం ఆరంభమవుతుంది. (Social revolution) నీరు పల్లానికి ప్రవహించినట్లుగానే ఈ ఉద్యమం గూడా ముందు తను పుట్టిన దేశంనుండి, అనేకస్థితిగతులలో కొట్టుకులాడుతున్న ఇతర దేశాలకు ప్రభావితం చేస్తుంది. ఈ ఉద్యమ భావం సజీవమూ, సందర్భోచితమూ అయితే అన్ని దేశాలలోనూ ఆచరణాత్మక మవుతుంది, విచ్ఛిన్నమైతే విఫలమవుతుంది.

"...Times of great upheaval, Political Social andi Spiritual are usually reflected in the arts, and it is especially with the art of the Theatre."

(Elizabethan and early Stuart Drama- by John E. Cunningham P. 9)

ఆయా కాలాల రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక గతి గమనాలు నాటక రచనలో ప్రతిఫలించి తీరుతాయన్న దానికి పై వాక్యాలు చక్కని ఉదాహరణలు. ముందువెనుకలుగా అన్ని దేశాల సాహిత్యం మీద ఈ ముద్ర పడి తీరుతుంది.

"...In most periods the dramas of many nations have shared common qualities which stem from contemporary religious, philosphical and psychological beliefs and from current dramatic and theatrical conventions.

(The Theatre an introduction P. 44)

సమాజస్వరూప స్వభావాల్ని క్వాచిత్కంగా కాక, సంపూర్ణంగా దృష్టిలో పెట్టుకొన్న రచయిత రచన సామాజికచింతనా చైతన్యాన్ని పుణికి పుచ్చుకొంటుంది. నాటక మప్పుడు కాగితపూవు అందంధోరణిలోగాక, సమకాలీక జన సంఘర్షణలకు, సమస్యలకు, వైరుధ్యాలకు, దైన్యాలను, నైచ్యాలకు జీవన భాష్యంగా నిలుస్తుంది. వాస్తవికతకు, సమాజంలోని అన్ని అంగాల సమన్వయానికీ ఫోకస్‌చేసే మార్గనిర్దేశంగా వుండిపోతుంది. సామాజికస్పృహ, మానవతాభావం రెంటికి రచయిత మనసు ఆశ్రయభూమి కాగలిగినప్పుడు సత్యావిష్కరణకు దారులేర్పడతై.

లోకస్వభావ సరళి మారేకొలదీ జనబాహుళ్యపు దృష్టిలోనూ, ఆలోచనా వస్థల్లోనూ క్రమానుగుణమైన మార్పు అనివార్యం; ఈ మార్పునే నేటి తెలుగు సాంఘిక నాటక రచనల్లోనూ చూడగల్గుతున్నాం. చెప్పేవస్తువులో, ప్రదర్శించే ప్రక్రియలోనూ ఇది ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది. పైతరగతివ్యక్తుల మనోభావ చిత్రణ నుండి మధ్యతరగతి ప్రజలమందభాగ్యాలనుండి, మానసిగ క్లేశాలనుండి, బడుగుజనావళి జీవన దైనందిన హైన్యాన్ని చిత్రీకరిచేంతవరకు ఆధునిక తెలుగునాటకం తరలివచ్చింది. సంఘ సమగ్ర స్వరూప పరిశీలనాదృష్టి రచయితలలో మరింత విశాలమైంది.

''డ్రామా అనేది సంఘాన్ని చూస్తుంది. కొలుస్తుంది. అన్వేషిస్తుంది; మన ముందు పెడుతుంది'' అని ప్రసిద్ధ ఆలంకారికుడు 'నిషి' ప్రవచిస్తాడు. మానవ ప్రకృతికి నాటకం దర్పణం వంటిదని షేక్స్పియర్ వివరిస్తాడు (To hold as it were the mirror up to Nature'' Hamlet A3 S2) తన రచనాప్రభావంమానవదౌర్బల్యాలను నివారిస్తుందని షేక్స్పియర్ సమకాలికుడు బెన్‌జాన్సన్ వెల్లడిస్తాడు.

"...Politician is a dirty word in Elizabethean English"...
(Elizabethean & Early Stuart Drama P 121)

ఆనాటి రాజకీయ పాశవికతను దృష్టిలో పెట్టుకోవటమే గాక, దానిని ప్రజల ముందుకు తేవటమే షేక్స్పియర్ ధ్యేయం. ఈనాటి తెనుగు నాటకాలలో వస్తువే దైనప్పటికీ అవకాశవాద రాజకీయాలపై చెణుకులు, విసుర్లు లేని నాటకాలు బహుకొద్ది.

"ఎవ్విరి మాన్ ఇన్ హిజ్ హ్యూమర్" (1599) అన్న నాటకంలో భార్యా భర్త లిరువురూ తమ శారీరక వాంఛల్ని తృప్తి పర్చుకునే దానికై ఒకరికి తెలియకుండా మరొకరు ఒకే ఇంటికి రావటాన్ని జాన్సన్ అద్భుతంగా, హాస్యప్రయుక్తంగా చిత్రించాడు: ఆరుద్ర "రహదారి బంగళా" అన్న నాటకంలో గూడా భార్యా భర్త లిద్దరూ రహదారి బంగళాకే వస్తారు. భర్త పరస్త్రీసాంగత్యానికీ, భార్య పాత ప్రియుడినుండి తన ప్రేమలేఖల్ని వెనక్కు తీసికోవటానికి ఈ నాటకరంగస్థలం రహదారి బంగళా; రకరకాల మనుషుల తత్వాలను ఈ నాటకంలో బహిర్గతం చేశారు ఆరుద్ర. వస్తువురీత్యా ప్రయోగరీత్యా ఇది ఒక ప్రయోగమే. దుర్నీతిపాత్రలను వ్యంగ్యభరితంగా చిత్రీకరించి సామాజికుల్లో ఆత్మసంస్కారాన్ని అందజేయా లన్నదే ఈనాటక ముఖ్యోద్దేశం.

ధనవ్యామోహం మనిషిని ఏస్థితికి దిగజారుస్తుందో, ఎంత నీచత్వానికి పురిగొల్పుతుందో "వాల్ పోన్" నాటకంలో జాన్సన్ వివరిస్తాడు : ఆత్రేయ "కప్పలు" నాటకం గూడా ధనవ్యామోహంతో కూడుకొన్నట్టిదే; అయితే, వాల్ పోన్ లోని అంతిమ పరిష్కారం శిక్షలు "కప్పలు"లో కన్పించవు.

జాతిలో పాతుకుపోయి వేళ్ళూనుకున్న ప్రవృత్తులు, చిరసంచిత చింతనలు కాలానుగుణంగా వాటికవే నిష్క్రమిస్తాయి. సామాజిక, ఆర్థిక సిద్ధాంత పరివర్తనలో నూత్న మీమాంసల గుబాళింపులకు ఆవిష్కరణ జరుగుతుంది ఏ జీవన తత్వమైనా, దర్శనమైనా, ప్రబోధమైనా, పరిణామమైనా సమాజ ప్రయోజన పర మానవధిదృష్టి నిర్వచనంగానే సాగిపోవడం యుగధర్మం; ఈధర్మం యొక్క భిన్నముఖాలనే సమాజం తనకు సరిపడునట్టుగా, సరితూగేట్లుగా ఆనాటి స్థితిగతుల కొలతలను సమతూకం వేసుకుంటూ సాగిపోతుంది. ఆయాధర్మాలు సమతావా

దాన్ని విస్తరింప జేసేవీ, వికసింప జేసేవీ అయితే నాలుగు చెరగులా ల్యాపించి పదికాలాలు నిలుస్తై. వీటి నీడనే జాతి విశ్రమిస్తూవుంటుంది. రచయితా యీ విరామ సంకేతం నుండే ప్రాణస్పందన చెంది, ఈసమతాతత్వాన్ని, సంస్కరణ వాదాన్ని తన రచనకు ఆదర్శంగా తీసికొని రచనలు చేస్తాడు. గురజాడ మహాకవి కన్యాశుల్కంలో చేసిం దిదే; రామప్ప పంతులు ఇంటివద్ద తలుపీవతల మధురవాణిని, అవతల మీనాక్షిని అభిముఖంగా నిలబెట్టించటంలో బహిరంగంగా పదుగురి విలాసాలకు బలైన పాత్రనూ, శిష్టాచారం మరుగున, వృద్ధ వివాహ పర్యవసానంగాకనుబాటుగా కన్నీరుకార్చే పాత్రనూ మనముందుంచటమే. అందుకే శ్రీశ్రీ అన్నట్లు "కన్యాశుల్కం" జీవితమంత గొప్పది.

"అప్పారావుగారి సాహిత్య రథానికి కూడా రెండే చక్రాలు. ఒకటి సోషల్ రిఫార్మ్; రెండోది స్పోకెన్ తెలుగు..."

("మొట్టమొదటి కన్యాశుల్కం"... మధురవాణి పాత్ర...ఆరుద్ర)

కాలం చెల్లిపోతున్న ఆచారాలను. కాటువేసే మనస్తత్వాలను, ఈ విషవలయంలో చిక్కుకొని చివికి చివికిపోయే నాటిసంఘాన్ని ఉద్ధరించాలన్న దృక్పథంలోనే గురజాడ ఆ మహా నాటకాన్ని వ్రాసింది; "కన్యాశుల్కం" అన్ని విధాల ఆ నాటి తెలుగు నాటక రచనలో అపూర్వ ప్రయోగమే.

"Correction of Social obsurdities must at all times be the matter of true Comedy" అన్న మోలియర్ ప్రవచనానికి ప్రాణం పోశాడు గురజాడ. సంప్రదాయ సరిహద్దులకు చెరిపివేసి, నూతన ప్రక్రియా గమ్యం వైపుకు ఆతర్వాత నాటక రచయితల దృష్టి మళ్ళించాడు. ఆతర్వాత వచ్చిన వరవిక్రయం, చింతామణి, రంగూన్‌రౌడి మొ॥ నాటకాలు గూడా వినోద ప్రధానంగాాక, ఈ సంస్కరణాభిలాషతో రచింపబడ్డవే; ప్రదర్శనలో ఇవి నూతన ప్రయోగాలు కాకపోయినా, వస్తువులో పాత్రచిత్రణలో ఆ తత్వాన్ని కలబోసుకున్నై. ప్రధానంగా గృహస్థ విషాదాంత నాటకాలైనా గుప్తంగా ఇవి ఆనాటి మూఢవిశ్వాసాలను, నైతికపతనాన్ని, దురాచారాలను

ఖండిస్తునేవచ్చాయి. మానవతాభావ పరిరక్షణ భావానికి ఇవి రూపకల్పన చేసినై. క్రూరమైన మానవ ప్రవృత్తులు, సాంప్రదాయాలు కాలానుగుణంగానే పాతప్రాంగణాన్ని విడిచి కొత్తప్రాంగణాన్ని వెదుక్కొంటై. ఇది సహజం; ఈమార్పు పగ్గాలువేసి బంధించినా ఆగేదికాదు. అయితే నాటక రచయిత ఆ కాలపు అవాంఛనీయ సంస్కారాలకునమస్కారంపెట్టి నూత్నసంఘాభ్యుదయ భావాలకు శ్రీకారం చుట్టడంలోనే అతని నేతృత్వం వెల్లడవుతుంది. "కాల సంవాదినా నాటకేన సజ్జా భవతు" అని భాసుడు కాలానికి తగిన నాటకం వెయ్యటానికి సిద్ధంగా వుండమని ప్రతీహారిచేత చెప్పిస్తాడు: నాటకం ఒక కమనీయ కల్పనగానేగాక, చైతన్య పూరిత జీవిత ప్రతిబింబంగా గూడా వుండాలన్నదే భాసుని భావం.

ఈ నాటి తెలుగు సాంఘిక నాటకాలలో ఇది మనం గమనిస్తున్నదే.

"The Drama like the symphony does not teach or prove anything. Analysts with their problems and teachers with their systems are soon-as old-fashioned as the Pharma Copocia of Galen...We should not go to the theatre as we go to a Chemist's or a dram shop, but as we go to a dinner where the food we needed is taken with pleasure and excitement...."

(Preface to "The Tinker's Wedding by Synge)

చర్చనీయాంశమైన సమస్యలను బట్టి ఆ నాటకం ప్రేక్షకుల మనస్సుపై కల్గించే ప్రభావాన్ని బట్టి నాటకలక్ష్యం, ఉన్నతి ఆధారపడివుంటాయనీ మందులషాపుకు వెళ్ళినట్లుగా గాక, సంతోషంలో పాల్గొనే విందు కొరకు వెళ్ళినట్లుగా రంగస్థలానికి వెళ్ళాలన్న సింజీ అభిప్రాయం విలువైనది; అంటే నాటకం ప్రేక్షక మనోరంజకంగా వుండాలని, వివిధ చర్చల వివరణతో, సమస్యల బరువుభారంతో ప్రేక్షకులను చికాకు చెందించ కూడదన్న సింజీ మనో అభిప్రాయం గమనించదగింది; కేవలం అధిక్షేపణలతో, విమర్శంతోనే సాంఘిక జీవితాన్ని బహిర్గతం చేయటం కన్నా, ఎన్నుకొనే ఇతివృత్తంలో, ప్రదర్శించే వైఖరిలో నూతనత్వం, వికాస

శీలం విధిగావుండాలన్న అతని తాత్పర్యానికి అనుగుణంగానే నూతన ప్రక్రియతో అవసర మేర్పడింది; చూపే వస్తు వేమిటనిగాక, ఏవిధంగా చూపుతున్నా మన్నది నేటి పాశ్చాత్య నాటక రచయితలకు ముఖ్య చర్చనీయాంశమైంది; అదే నేటి తెనుగు సాంఘిక నాటక రచయితకూ అనివార్యమైంది. తన రచనలలో సామాన్య రైతుల, తీరప్రాంత జాలరుల మాండలిక భాషను వాడి ఆంగ్ల నాటక రంగాన్ని సింజీ ఎంతగానో వికాసవంతం చేశాడు; గణేష్ పాత్రో తీరప్రాంత మాండలిక భాషను తన సాంఘిక నాటకాలలో ప్రయోగించితే (అసుర సంధ్య, తరంగాలు మొ॥) కె. ఎల్. నర్సింహారావు మొ॥ వారు తెలంగాణా తెనుగు నుడి కారాలతో నిండిన జనజీవభాషను వాడి నాటక రచనకు ప్రత్యేకతను, పరిణతిని ఆపాదించి పెట్టారు.

పాత వ్యవస్థ అంతరించి పోతున్నప్పుడు, దాని అవశేషాలైన నీతులు, నియమాలు, ప్రజలకు రోతగొల్పుతుంటై; క్రొత్త వ్యవస్థ వచ్చిరానిస్థితిలో పాత వ్యవస్థ పునాదులు కదులాడుతున్న దశలో సంఘర్షణాత్మక మధ్యస్థ సమయంలో ప్రజలలో అయోమయం, భావరాహిత్యం ఏర్పడివుంటై

"...When the moral of a ruling class and its whole epoch fall to pieces; when new class comes to force; which has no established m rals but which initialfy abvanced in the form of a revolutionary vanguard, destroying the old system... They entered life at : movement when the morals of a Petty bourgeoisie, art of which they had arisen, had already been shattered...,"

(Literature and Art... P 78)

"...సాంఘిక సమస్యలను ఇతివృత్తములనుగా తీసికొని నాటక రచన చేయుట తెలుగునాట తొలుతనుండియు నున్నదే.; కాని, ఆ రచయితలందరును సంఘ దురాచారములను నిరసించుచు వానినుండి విముక్తి యెట్లు కలుగునో సూచించుటకు ప్రయత్నించియున్నారు: ఇక నవ్యయుగమందలి క్రొత్త నాటక కర్తల దృష్టి [illegible]

అసమానత్వముల పై ప్రసరించినది. సంఘమునందలి పీడిత ప్రజలకు "కనీస సదుపాయములు" సమకూరినగాని సాంఘిక సమస్యలు పరిష్కృతములు గావని ఈ రచయితల విశ్వాసము ...''

(Souvenir on Drama Seminar A. P. Sangeeta Nataka Akademi-(1960) By Dr. P. S. R. Apparao...P27)

లోకం పోకడ సహజ జీవన స్వరూపాన్ని, వాస్తవిక నాటకరంగ సింహాసనంపై అధిష్ఠింప జేయటానికి సామాన్య మానవుని ఉచ్ఛ్వాస నిశ్వాసాల రహస్యాలను ప్రతిబింబింపజేయటం అవశ్యకమని ఆత్రేయ మొ॥ నాటక రచయితలు గుర్తించారు. పట్టణవాస మధ్యతరగతి ప్రజల జీవన వివిధావస్థలను ఆత్రేయ చిత్రీకరించితే (N. G. O; భయంమొ॥) సుంకర, పినిశెట్టి, కొడాలి పల్లెపట్టుల రైతుల అణగారిన బ్రతుకుల్ని భూస్వాముల క్రౌర్యాన్ని తమనాటకాలలో చిత్రించారు. తెలుగునాట ఈ ప్రభావంతో పెక్కు నాటకాలు వెలువడినై. ధనిక వర్గాల క్రౌర్యానికి, స్వార్థానికి ఎరయైపోయే బడుగుజీవుల విషాదజీవితాలను (పాలేరు, రైతుబిడ్డ, కూలిరైతు, పల్లెపడుచు, మొ॥)వెల్లడిస్తే ఆతర్వాత నాటకాలు గోర్కీ "ఎనిమీస్"వలే ధనిక, భూస్వామ్య వర్గంపై తిరుగుబాటుతత్వాన్ని పగతీర్చుకునే వైఖరిని పీడితవర్గాలు అలవర్చుకొన్నై (మాభూమి, సమాజం మారాలి మొ॥) భూస్వామ్య వర్గ నిరంకుశ అమానుష నీతిరహిత వైఖరిపై పెల్లుబలా విరుచుకు పడే విప్లవధోరణి నాటకాలు వచ్చినై. (నాంది, గొరిల్లా మొ॥) ఇటువంటి నాటక రచనను తెనుగున రష్యా నాటకాలు ప్రేరణనిస్తే, గృహసంబంధ జీవితఘర్షణలను, నైతిక సమస్యల వైపరీత్యాలకు మూలమైన నాటకాలకు ఆంగ్ల ఫ్రెంచి, అమెరికన్ నాటకాలు తెనుగు నాటక రచనకు ప్రేరకాలైనై.

రచయితలలో ఇరుతెగ లున్నారని ఆర్థర్ మిల్లర్ ప్రస్తావిస్తాడు. ప్రపంచానికి దూరంగా వుండేవ్యక్తి (Ivory tower) ఇతడు ఉన్నత తరగతి జీవిత వైక్లబ్యాలనే రచనా వస్తువుగా స్వీకరిస్తాడు. రెండోవ్యక్తి సమాజం నట్టనడుమన తన గుడారాన్ని వేసికొని, సమాజ హృదయ స్పందనను ప్రతి

స్పందింప జేస్తాడు ; ఇతడు, మధ్య క్రింది తరగతి వ్యక్తుల మనోభావవైఖరిని, దుర్భర జీవితావస్థలను వెలికితెచ్చి రూపకల్పన చేస్తాడు ; వాస్తవికతతోపాటు బలహీనుల విషాద జీవితాన్ని, మానవతా విలువల్ని స్ఫూర్తిమంతంగా చిత్రిస్తాడు.

"...Real Drama is missing in this Psycho-analitic, Socialist, and Marxist Drama..."

(Theatre in the twentieth Century)

మార్క్సిస్టు దృష్టిలో తార్కికవాదాని కున్నంత ప్రయోజకత్వం ఇతర వాటి కుండదు ; ఈ పోరాటం నిర్జీవమైన సమాజం (devilized Society) లో ఎంతవరకు కృతకృత్య మవుతుందనేది కొందరి సందేహం.

"...When a play intended to be Judged from the view point of ordinary life, it is regularly classified as realistic. A play is realistic if it avoids anything which is noticeably unnatural.

(The script...by Henning Nelme P. 47)

ఈ సిద్ధాంతాన్ననుసరించి ఆంగ్ల, రష్యన్, జర్మన్, ఫ్రెంచి దేశాలలోనే గాక ఈ వాస్తవికవాద నాటక రచనను పలువురు రచయితలు రూపకల్పన చేశారు. ప్రస్తుతం ఈరెండు దశాబ్దాల తెలుగు నాటకరంగాన్ని విశ్లేషించి చూస్తే వెలువడినవన్నీ దాదాపుగా వాస్తవికవాదనాటకాలే. మానవజీవితాన్ని సహజంగా, గాఢంగా, కేంద్రీకృతంగా తెలియజేసేదే నాచురిలిజం. ఈ నాచురిలిజం గూడా రియలిజం కుదురులోనిదే ; ఈ స్వభావవాదాన్ని ప్రత్యేకంగా ప్రాచుర్యంలోకి తెచ్చింది ఎమిలో జోలా.

మారుతున్న కాలమాన పరిస్థితులను బట్టి ప్రజలలో ప్రబలమవుతున్న హేతువాద ధోరణులనుబట్టి వికాసమానమవుతున్న శాస్త్ర, సాంకేతిక ప్రాచుర్యాన్నిబట్టి నాటకరచయితలు, తాము చెప్పదలుకొన్న విషయాన్ని రంగస్థలంపై విస్తృతంగా విశదపర్చటానికే ఈ ప్రక్రియలు ఉద్భవించినై.

"...Naturalism sought as voilently as had the romantic movement to break with the formalized theatre which did not permit the representation of life as it really is abnormally in human conduct, the lives of the proletariet, crime and disease became subjects of drama.

(A History of the Theatre P 504)

మానవునిలోని అవ్యాకృత భావపరంపరలను నిసర్గసుందరంగా అభివ్యక్త పర్చటానికి రియలిజం ఉపాదేయమైంది ; చెప్పదల్చుకొన్న సంఘటనలను సమగ్రంగా అసందిగ్ధంగా అనవాలు లక్ష్యంగా క్రోడీకరించటానికి నాచురలిజం ఆలంబనమైంది ; ఆధునికాంధ్ర నాటక రచనలలో అధికభాగం నాచురలిజం ప్రభావంతో వెలువడినవే; రచనలోనే గాక, ప్రదర్శనలో గూడా సహజత్వాన్ని, సర్వ సమగ్రంగా ఇముడ్చుకోవటానికి రచయితలు ప్రయత్నించారు భమిడిపాటి "కీర్తిశేషులు", సంది "మరో మహెూంజోదార", బెల్లంకొండ "పునర్జన్మ" సంజీవి "సమాధానం కావాలి", ఎండమూరి "రఘుపతి రాఘవ రాజారాం", కొల్లపాటి "యథా ప్రజా తథా రాజా", ఆత్రేయ "N.G.O.", ఆదివిష్ణు "సిద్ధార్ధ", తారకరామారావు "కురుక్షేత్రం", కప్పగంతుల "యాచకులు", "మారని మనిషి", హరనాధ్ "జగన్నాధ రథచక్రాలు" మొ॥ నాటకాలన్నీ ఈ కోవలోనివే. రంగస్థలం గూడా యథార్థ జీవితంలోని మానవ నివాసంగానే వుండాలనీ, నటులు జీవితంలో సంచరించినట్లు రంగస్థలంపై సంచరించాలనీ ఈ ప్రక్రియ ప్రధాన నిర్ణేత జోలా స్పష్టీకరించాడు.

"...The naturalistic and realistic movements at the end of the Ninteenth Centurv had many far reaching effects".

Since ultimate truth cannot be logically understood, it can only be suggested through symbalic objects or. actions ..."

(The Theatre ...P 277-278)

కేవలం శబ్దాలద్వారానే గాక, చెప్పదల్చుకొన్న విషయాన్ని, కళాప్రదర్శనను అవసరమైన, అనుప్రాణితమైన ప్రతీకల ద్వారా వ్యక్తపరచాలని ఈ ప్రక్రియ కళాకారుల భావన. సిసలైన వాస్తవం తార్కికబద్ధ సంభాషణద్వారానే ప్రేక్షకానుభూతిదశకు రాదని, ఆ వాస్తవాన్ని సింబల్స్‌ద్వారా స్పష్టపర్చాలనీ వీరి భావన ఈ సింబాలిజం ప్రక్రియోద్యమ ప్రసిద్ధుడైన "మాటర్‌లింక్" ఈ ప్రక్రియనుగూర్చి వివరిస్తూ నాటకాలలో పైకి కన్పించని సంభాషణలో అంతర్భూతమై మరో సంభాషణగూడా వుంటుందని, అది పంచేంద్రియపరిధిని దాటి ఆత్మను తట్టి పిలుస్తుందనీ ప్రవచిస్తాడు.

"...Great drama if we observe it closely is made of three principal elements. First verbal beauty. Then the eontemplation and passionate potrayal of what actuallry exists about us and with[illegible] us, th[illegible] say [illegible]"

సంభాషణా చాతుర్యమే కాకుండా, మానవ జీవితమందలి అవేద్య రహస్య పరిశీలనను, చిత్తవృత్తుల రసనిరూపణా గ్రాహ్యతకు, ప్రతీక సంబంధ సూచక మేదైనా రంగస్థలంపై ప్రదర్శించవలె నన్నదే ఇతనిభావం. వాస్తవాన్ని నగ్నవాస్తవంగా గాకుండా సంకేతరూపంగా తెలియజేయాలన్నదే ఈ సిద్ధాంతకర్తల అభిప్రాయం.

మాటర్ లింక్ "పెల్లీస్ అండ్ మెలిశాండీ" నాటకంలో పైన ఒక డైలాగ్ నడుస్తున్నపుడే లోపల మరో డైలాగ్ విన్పిస్తుంది, ఇటువంటి వాతావరణసృష్టికి [illegible] తెలుగునాటకం రంగస్థల దృష్ట్యా ఎదగక పోయినా [illegible] వ్యక్తిగత [illegible] ప్రతీకకు [illegible] సంకేతాల[illegible] రంగస్థలం పై వాటి

జరుతూనే వున్నై. గణేష్ పాత్రో నాటకాలు ఈ సిద్ధాంతాని కుదాహరణగా తీసి కోవచ్చు.

## ఎక్స్ప్రెషనిజమ్ (Expressionism)

ఇది కూడా రియలిజం మీద తిరుగుబాటు వంటిదే; చూపదల్చుకొన్న సంఘటనకు విషయానికీ మామూలు కన్నా మించిన ప్రాధాన్యమివ్వటమే ఈ ప్రక్రియ ప్రత్యేకత. రచయితకు ఏది వాస్తవంగా కన్పిస్తుందో దానికి ఉదాత్తత నిస్తూ రంగస్థలంపై చిత్రీకరించ బడుతుంది. భౌతిక సంబంధ విషయాలతో గాక, అంతరంగిక మానవ జనిత భావాలకు సరిపోలిన విషయ వ్యక్తీ కరణ అంశంపై అధిక ప్రాధాన్యమీయటం జరుగుతుంది. మానవ ఆత్మ వాంఛించే దానిని ప్రత్యేకంగా వ్యక్తపరుస్తాడు ఈ రచయిత. బి. వి. రమణారావు "తమసోమా జ్యోతిర్గమయ" ఈ సిద్ధాంతానికి చక్కగా సరిపోలిన నాటకం. మానవ అభ్యున్నతి యాంత్రికయుగాన్నిబట్టిగాక, ఆత్మచైతన్యం ద్వారానే సంభవిస్తుందని వీళ్ళ విశ్వాసం.

"...పుస్తకం చదివితే అర్థంకానివి, రాతలద్వారా తెలిసికోలేనివీ నాటకం ద్వారా తెలిసికొంటాం; సర్వసామాన్య ప్రజల అవగాహనకు సులభతరంగావుండే టందుకై బొమ్మలద్వారా బోధించటానికి నాటకరచయిత ప్రయత్నిస్తాడు" అని స్ట్రిండ్‌బర్గ్ తెలియజేస్తాడు.

"...Dramatic art has long seemed to me a kindof Biblia Panperum—a Bible in Pictures for those who cannot see the Written or Printed World..." (Preface to"Miss Julie" by "Strind Berg")

"మరో మహోంజోదారో" నాటకంలో ప్రొఫెసర్ పాత్రధారి మ్యాక్స్ ద్వారా మానవవర్గ సరళిని, మన స్వత్వాన్ని ప్రేక్షకులకు సూటిగా రంగస్థలంమీదనుండే బోధపరచడం గమనించవలసిన అంశం.

"...The Basic assumption of the Absurdist school is that the world is entirely neutral. Facts and events do not have meanings; Therefore; rather man assigns meanings to them; Thus if much choose to regard an action as immoral it does not denote that the actuality is immoral, but only that men have chosen to see it as such... The Absurdist, thus finds ultimate truth in chaos, formless, the welter of contradictions, and the inanities which make up everyday existence; Ttruth becomes the lack of logic order and certainity" ( The Theatre P. 341 ).

తర్కబద్ధంగా, ఊహించిన విధంగా జీవితం వుండదని, గంద్రగోళంలో నుండి, రూపరహితంగా, అనేక అసందర్భాలతో కూడిన కుప్పగా, ఆ ప్రధాన అంశాల అనుభవాలతో జీవితం వుంటుందని ఈ "అబ్సర్డ్" వాదులు అంటారు. సత్యం క్రమరహితంగాను, ప్రయోజన రహితంగానూ మారిపోతుందని కూడా వాళ్ళవాదన; ఈ సిద్ధాంత ప్రతిపాదకుల్లో ముఖ్యుడు ఇవనెస్కో (Eugene Ionesco)

ఇతని ప్రసిద్ధ నాటకం "Chairs". రియలిజంను రూపుమాపాలన్న ఉద్దేశ్యంతోనే ఈ నాటకాన్ని వ్రాశానన్నాడు; నాటకాలు ఎందుకు వ్రాస్తున్నారంటే "థియేటర్‌ను ద్వేషిస్తున్నాను గాబట్టి" అన్నది ఇతని సమాధానం; తెనుగు ఆధునిక నాటకరంగంలో ఈ ప్రక్రియపైకూడా ఒకటి రెండు ప్రయోగాలు జరిగినై. యండమూరి "నిశ్శబ్దం నీకూ నాకు మధ్య" పి.వి. రమణ "ముందు తరాల మనిషి" మొ॥ ఉదాహరణాలుగా స్వీకరించవచ్చు.

"Eveything is permitted in the Theatre" అన్నది గూడా వాళ్ళ మతం.

ఈ సిద్ధాంత ప్రాదుర్భావానికి స్పందన నిచ్చిన ప్రముఖుడు పిరాండిలో.

“సిక్స్ కారెక్టర్స్ ఇన్ సర్చ్ ఆఫ్ యాన్ ఆథర్” ఇతని ప్రసిద్ధ నాటకాలలో ఒకటి; పాత్రల్ని ప్రవేశపెట్టి వాటికి ప్రేక్షకులతో అనుబంధాన్ని అంటగట్టి రంగస్థలపరిధినుండి రచయిత దూరంగా తప్పుకుంటాడు; ఈ ప్రయోగం విలక్షణమైంది. ఇది రంగస్థలాన్నేగాక ఆనాటి సమాజాన్నే పిరాండిలో వేదికగా వాడుకున్నాడు.

“వీళ్ళింకా ఫిడేళ్ళను శ్రుతి కల్పుకొనే దశలోనే వున్నారనీ, రాగాలాపన ఆరంభించలేదని” ‘ఈట్స్’ కామెంట్ చేస్తే, ట్రెడిషనల్ డ్రామా జీవిత చిత్రణలో పర్వదినం చూస్తున్నట్లుంటుంది, అబ్సర్డ్ డ్రామా ఏదో ఒక ఒట్టి దినాన్ని చూస్తున్నట్లుంటుందని “కోరిగన్” వ్యాఖ్యానిస్తున్నాడు.

## అస్తిత్వవాదం (Existentialism)

“అబ్సర్డిజం”ను ప్రాతిపదికగా, మార్గగామిగా ఈ అస్తిత్వవాదాన్ని కొందరు సూచిస్తారు. జీవితం తర్కరహితంగా, ఏ నియమాలకూ అందకుండా, శూన్యాన్ని చుట్టుకొని వుంటుందని వీళ్ళు వాదిస్తారు మనిషి తనను జడపదార్థంగా ఊహించుకోక జీవితంలోని అసమర్థతను ఆధారంగాచేసికొని, కార్య కారణ సంబంధాలను వెనక్కునెట్టి, తనకోసం, తన ఆశయాల పరిపూర్ణతకోసం సాగించే జీవనం ఈఅస్తిత్వవాదంగా పరిగణించబడుతోంది. “జీన్ పాల్‌సాత్రే” దీనికి ప్రధాన ప్రతినిధి. తెలుగులో “చలం” నాటకాలలో ఈ అస్తిత్వవాద ఛాయలు కన్పిస్తాయి. భార్యలకు భర్తలకు దాసోహం కాకుండా ఇష్టమొచ్చినట్లు నడుచుకొమ్మని స్త్రీ పాత్రలకు తన నాటకాల ద్వారా బోధిస్తాడు చలం. బుచ్చిబాబు “ఆత్మ వంచన” నాటకంలోని హీరోయిన్ పాత్ర పై గూడా ఈ ముద్ర కన్పిస్తుంది,

“Meyerhold” (1874-1940, మెయర్‌హోల్డ్ రష్యన్ నట

మితంచేయకుండా బహిరంగ స్థలాల్లో, లేదా పెద్ద పెద్ద గోడౌన్స్‌లను ఎంచుకొని ప్రదర్శన జరిపేవాడు, పలువురు నటీనటుల్ని ఒకేసారి రంగ స్థలంపై ప్రవేశ పెట్టేవాడు, తెనుగులో "మాలపల్లి" నాటకం ద్వారా ఎ. ఆర్. కృష్ణ ప్రస్తుతం చేస్తున్న ప్రయోగ మిదే.

"...అబ్సర్డిస్టు, సైకోఅనాలిస్టుకు భవిష్యత్తు లేదు. నేర, లైంగిక అసహజత్వాలు చూపేవాటికి ప్రాచుర్యం రాదు. యుగధర్మాన్ని ప్రతిబింబింప చేయటంలో ఇవి తోడ్పడటం లేదు..." అని ఆధునిక ప్రయోగాత్మక నాటకాల పై కారింగన్ తన అభిప్రాయాలను వెల్లడిస్తే

The Theatre in search (Theatre in the twentieth century... by Corringan.. P. 25)

"...ఈ ప్రయోగ కర్తలు కొన్ని అనుభవాలు గడించడానికి యథార్థ జీవిత అవగాహనలతో ఉదాహరణలతో చిత్రించడంలో విజయం పొందలేక పోయారు. అసంపూర్తిగా, వంచనాత్మకంగా చిత్రించగలిగారు."

(Ibid...94 to 104)

అంటే ప్రసిద్ధ జర్మన్ నాటక రచయిత "బ్రెహ్ట్" ఆధునిక రంగస్థల ప్రయోగాలపై తన అభిప్రాయాన్ని వెల్లడించాడు

"...Half a century's experiments conducted in nearly every civilised country had won the theatre brand-New fields of subject matter and types of problem, and made it a factor of marked social importance. At the same time they had brought the theatre to a point where any further development of the intellectual, social experience must wreck the artistic experience..."

( Brecht on Theatre. . P. 244 )

"...Since drama deals with social relationships we may also say that dramatic conflict is of a social nature.Then our prelimi-

nary definition can be as follows.The essential character of drama is conflict. Persons against other persons, or individuals against groups or groups against other groups or individuals or groups against social or natural forces... The essential character of drama is social conflict...

(American drama and its critics P. 82 )

సాంఘిక జీవితంలో సమన్వయం పొందటానికి విభిన్న శక్తులు పరస్పరం సాగించే పోరాటం సాంఘిక సమస్య. ఈ సమస్యకు ప్రాధాన్యం ఇచ్చినప్పుడే పరిపూర్ణమైన నాటక మవుతుంది. సంఘం సమన్వయం కోసం సంఘర్షణ పడుతుంది. అయితే సమన్వయం అనేది సాధ్యమా? అనికొందరు ప్రశ్నించి సంఘర్షణయే సాంఘిక జీవితానికి సహజలక్షణ మని సమర్థిస్తారు. ఈ రెండు ఛాయలు మన ఆధునిక తెలుగు నాటక రంగంపై మనం చూడగలం.

"...The English plays have to do with man as a society man, both in the narrower and the wider sense and the American Plays have to do with man as a family man... with us the main human interest is the home..."

( I bid P. 10 )

ఈ రెండు అనుబంధ సంబంధాలమధ్య నేటి మన తెలుగు నాటకం వుంది.

"I am not interested in the relations of man to man, but of man to God..."

( by D. Neill's American Play wrights and drama... P. 140 )

"...Homosexual activity in most countries in the Western world is almost always dangerous, usually exciting, enormously risky and generally secrect..."

( The Drama of social reality... P. 157)

హోమో సెక్సుయాలిటీ పాశ్చాత్యనగరాల్లో ఎంతగా వ్యాపించిపోయిందో పైవాక్యాలు వెల్లడిస్తున్నై. అయితే ఈ ఇతివృత్తం మీద అమెరికాలో ఎన్నో నాటకాలు వచ్చాయి. తెలుగులో గూడా ఆర్. విద్యాసాగర్‌రావు వ్రాసిన "గుడ్‌బై" హోమోసెక్సుయాలిటీ థీం ఆధారంగా రాయబడ్డ తొలి నాటకం.

ఒక్కొక్క కాలానికి ఒక్కొక్క ప్రయోగం, ప్రక్రియ ప్రతినిధులౌతాయి. ఆ ప్రయోగం అసంఖ్యాక జనానికి ఆమోదయోగ్యమైనప్పుడు పదికాలాల పాటు నిలువ గలుగుతుంది. ప్రక్రియలో పరిణతి, ఊహాబలం, చేవ గలిగిన శైలి నాటక రచయితకు ఆలంబనాలు. అప్పుడే ఆ రచన సమాజానికి జీవనాడిగా వుండగలుగుతుంది.

". .A Nataka is a vivid in set photograph of the millions of thought forms, which are caused by human emotions, struggles and aspirations .."

(South Indian stage by T. Raghavachari)

నాటక రచన సమాజానికి ఎంత సన్నిహితంగా వుండి సందేశాత్మకంగా వుండాలో పై బళ్ళారి రాఘవ వాక్యాలు విశదపరుస్తున్నై.

తెనుగు సాంఘిక నాటకంగూడా అటు విషయంలోనూ, ఇటు ప్రక్రియలోనూ ఎంతో పరిణతి పొందింది. సంప్రదాయ పథం నుండి మరో నూతన మార్గాన్ని అనుసరించింది. ఈ వస్తుస్వరూపాన్ని స్థాలీపులాకన్యాయంగా వివరిస్తాను.

". If I should live to write dramas you should rest assured that I shall not allow my self to be bound by the dieta of Mr. Viswanatha of the Sahitya Darpana .,"

అని ఒక ప్రముఖ బెంగాలీనాటకకర్త వ్యాఖ్యానిస్తాడు. కళ వర్తమానాన్ని తనలో ప్రతిబింబించుకొని వాస్తవికతను సమీక్షిస్తూ నవ్యతను ప్రవేశపెట్టటం ఎంత అవశ్యకమో పై వాక్యాలు వెల్లడిస్తున్నై.

వంగిన పల్లకీ బొంగు లాంటి వంకర జీవితంపై అధ్యాత్మిక సిద్ధాంతాల అదుపు తప్పి పోయింది. కాలదశనుబట్టి మానసికఅవస్థ లుంటై. ఉన్నవాడికీ లేనివాడికీ ఏర్పడ్డ ఘర్షణలో సంప్రదాయాల పాపభీతితో పరలోక చింతనతో నిస్సహాయుడై నిర్లిప్తుడై లేడు ఇప్పటి బలహీనుడు, ఈ సామాజిక సత్యాన్ని ఈ నాటక రచయితలు తమ నాటకాలలో సహజంగా, శక్తి మంతంగా చిత్రీకరించారు.

అన్నపూర్ణ - కె. వి రమణారెడ్డి - పి. వేణు

"రచయితలు ఈ నాటకంలో వర్గపోరాటాన్ని చక్కగా చిత్రించారు విప్లవాత్మకమైన నాటకాల సంప్రదాయాన్ని ఈ 'అన్నపూర్ణ'' నిలబెట్ట కలుగుతుందనే నా ఉద్దేశం." అని సుంకర సత్యనారాయణగారు తమ ''మనసులో మాట''లో వ్రాశారు.

''మరో మొహెంజొదారో''...ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క వర్గానికి ప్రతినిధిగా చిత్రించ బడ్డారు ఈ నాటకంలో; వస్తువులో, ప్రదర్శనలో కూడా ఇది ప్రయోగాత్మకమైనదే; ఇదీ భారతం, వెల్లువ, చలిచీమలు, నిజరూపాలు, నాంది, గెరిల్లా, మంచుబొమ్మలు, ఇది ఆత్మహత్య, రాదారి బంగళా, దొంగ వీరుడు, గాలివాన, కెరటాలు, సంధ్యారాగంలో శంఖారావం మొదలగు నాటకాలు ఇతివృత్తంలో వైవిధ్యం కలవి.

"నిజం,'' రఘుపతి రాఘవరాజారాం' తరంగాలు, అసుర సంధ్య మొ॥ కలవారి ఇనుప పంజాల మధ్య సామాన్యుని బ్రతుకెట్లా బలై పోతుందో వివరిస్తై. ''పంజరంలో పక్షులు'' ఇష్టంకాని వివాహాల మధ్య అల్లాడిపోయే యువజంటలను

మార్చిన ఘనత తండ్రి పాత్రకు దక్కింది; మనుషుల్లో రంగుభేదా లున్నా మానవులంతా ఒకటే: ప్రపంచమంతా ఒకటే అని ప్రబోధిస్తుంది.

''తిరస్కృతి'' మోసపోయిన అపడి తిరిగి తనని మోసగించినవ్యక్తిని వివాహ మాడటానికి తిరస్కరిస్తుంది.

''వలయం'' భర్తను, పూర్వ ప్రియుడు హత్య చేస్తుంటే అడ్డగింపలేని అభాగ్యురాలి వ్యధా పూరితగాథ.

''యాచకులు'' యాచకవృత్తిని ఆధారంగా చేసుకొని లక్షాధికారిగా మారిన వ్యక్తి చరిత్ర.

''తరంగాలు, అసురసంధ్య''— ఒకే ఇతివృత్తం ఆధారంగా మలచబడ్డ మూడుభాగాలు; చినచేపను పెదచేప మ్రింగినట్లు బలవంతుడు తన కంటే బలహీనుణ్ణి ఏవిధంగా నాశనం చేసేదీ వివరిస్తే.

''ఆత్మసాక్షి'' ఒకే యువతిని వివాహమాడిన అన్నదమ్ముల చరిత్ర.

శివరంజని :- "ఒక మనిషికి అన్యాయం జరిగితే అన్యాయంచేసిన వాణ్ణి శిక్షిస్తుందే తప్ప, ఎలా సాయంచేయాలా అని ఆలోచించదు'' అని రిటైర్డ్ న్యాయమూర్తిని ప్రశ్నవేసే ఇతివృత్తం: పనిమనిషికుమార్తెను వివాహమాడటానికి కొడుకును అంగీకరింపజేసిన న్యాయమూర్తి మానవతాదృష్టికి పరాకాష్ఠ. న్యాయదృష్టికి-మానవతాదృష్టికి మధ్య జరిగే ఘర్షణను అత్యంతశక్తిమంతంగా చిత్రించిన రచన.

''ప్రేమహర్మ్యం...'' తాను ప్రేమించిన యువకుని తండ్రి వద్దకే వెళ్ళి, మామగారి చేత 'ఔరా' అన్పించుకొన్న యువతి చరిత్ర.

"సంఘం చెక్కిన శిల్పం...'' ధనార్జనా దృష్టి మనిషి నెంతగా దిగజార్చి మానవత్వాన్ని మంట కలుపుతుందో చూపించే నాటకం. మేమిలా కావటానికి ఈ సంఘమే కారణమని విలపించే ఇల్లాలి కథ; తన భార్యనే పరపురుషుని పంచకు

పోయి ప్రేమించమని ప్రబోధించిన 'సంఘం చెక్కిన శిల్పం' 'ధర్మయ్య' విషాద చరిత్ర.

"బొమ్మా బొరుసూ..." దూరపు కొండలు నునుపని భ్రమించి భర్తను, మరిదిని, మామగారిని నిరాదరణకు గురిజేసి, తన భ్రమ లెంత సాలె గూడు వంటివో తెల్సికొని పశ్చాత్తాప పడ్డ యువతి కథ;

"రాగశోభిత" - భర్తను అనుమానించి, అసలు విషయం గ్రహించి సంసారాన్ని చక్కదిద్దుకొన్న మహిళ ఇతివృత్తం. భార్యా, భర్త బావమరదుల మధ్య నడిచే కోర్టు సీను. సరికొత్త ప్రయోగం.

"ఇది నాటకం కాదు" బ్రతుకు టూయల ఊపులలో నిమ్నోన్నతాలను, అనుకోని అవస్థలను, చీకటి వెలుగుల సందిట చిక్కుకొన్న సాధారణ వ్యక్తుల దైనందినానుభవాలనీ వివిధ కోణాలలో విశ్లేషించిన నాటకం. ఇందులో "పరబ్రహ్మం" పాత్ర వినూత్నమైంది. విశిష్టమైంది; తెల్లని బురఖాతో రంగం మీద ప్రత్యక్షమవుతుంది: డైరెక్టర్ బ్రహ్మం ప్రతిబింబమీ పాత్ర. నాటకంలో వంచింపబడ్డ వివిధ పాత్రల స్వరూపాలన్నీ పరబ్రహ్మంలోనే కన్పిస్తై. "...నేను ఆ శరీరాన్నీ, ఆత్మని" అని తెల్పుకొంటుం దీ పాత్ర; ఇతివృత్తంలో నవ్యత్వం, ప్రయోగాత్మక శిల్పం;

"సంధ్యారాగంలో శంఖారావం" - మిత్రునిచే అపార్థం చేసుకొని,వెడలగొట్టబడ్డ యువతిని చేరదీసి, ఊరువిడిచి బాహిరంగా భార్యాభర్తలుగా, ఆత్మగతంగా అన్నా చెల్లెళ్లగా మసలిన వ్యక్తుల గాథ; ఆమె కొడుకు దృష్టిలో గూడా 'నాన్న' గానే మసిలి చివరకు హత్యాకేసుపై గృహానికి దూరమైన ఉదార చరిత్రుని ఇతివృత్తం;

"తమసోమా జ్యోతిర్గమయ" భౌతికంగా సంపద లెన్ని వున్నా ఆధ్యాత్మిక చింతనతో జీవితాన్నే ఒక యాగంగా మలచుకొని, మృత్యువుకు క్షణ క్షణం

ఆహ్వానం పంపించే వ్యక్తి నాయకుడు. ఈ నాడు మనిషికి ధనదాహం పెరిగి, భోగానికీ భాగ్యానికీ దగ్గరయ్యాడు; నీతికీ ధర్మానికీ దూరమయ్యాడని భావించే పాత్ర రవిది. స్నేహితుడు మోసం జేసి, తన భార్యను వివాహ మాడినా ఔదార్యంతో క్షమించి, అనునయంతో దగ్గరకు తీసికోగలిగిన అతీతవ్యక్తిత్వం; సుఖంకన్నా, మనిషికి శాంతి, ఆధ్యాత్మిక చింతన ముఖ్యమని ఈ నాటక నాయకుడు భావిస్తాడు;

యాగ్నికం :- వేదసాంప్రదాయబద్ధుడైన "ఆహితాగ్ని" తండ్రికి ఆధునిక భావాలు గల కొడుకుకూ ఘర్షణ.

దేవుడూ నిద్రలే :- కట్టిన తాళి ఎగతాళిగా భావించి భార్యనే తార్చి బ్రతికే భర్త: ఆ భర్తనే అంత మొందించిన భార్య.

"వెంటాడే - నీడలు" పెంచుకొన్న ఆశలన్నీ కరిగిపోగా సగం సగం పిచ్చివాళ్ళుగా మారిన ఐదుగురు వ్యక్తులతో కూర్చబడ్డ ఇతివృత్తం; సెమీ కాన్షస్‌లో జీవించేపాత్రలు.

"దేవత లెత్తిన పడగ" తనభార్య తనకు చేసిన ద్రోహానికై, ఒకానొక ఉన్మాదావస్థలో పసిపిల్లల్ని హత్యచేసేవ్యక్తి ఇందులో నాయకుడు.

సమాధానం కావాలి :- వైద్యాని కొచ్చిన ముగ్గురు పిచ్చివాళ్ళకు (ఆశయవైఫల్యాలలో) ట్రీట్‌మెంట్ చేసి వాళ్ళచరిత్రను వాళ్ళచేతనే చెప్పించిన వైద్యుని ప్రయోగం; ఇతివృత్తంలో, రంగస్థల ప్రయోగంలో విలక్షణమైన నాటకం.

"యథా ప్రజా తథారాజా"...అమాయకుల్ని మోసగించడమేగాక, బలహీనుల్ని కాల్చిచంపే స్వార్థపరుడు. చివరకు కన్నకూతురు చేతనే హత్యచేయబడటం ఇతివృత్తం.

ఈ విధమైన నూతన విషయ చింతనములతో ప్రక్రియలతో ఈనాటి తెలుగు నాటక రంగం ముందుకు పోతున్నది; సామాజికస్పృహ సరోవరమే వీరికి ఊత కొలను అయింది. సంప్రదాయం, ఆధునికత్వం అనే రెండు వ్యవస్థలమధ్య, సంశయగ్రస్తరుజామన స్తత్వంనుండి నేటి సాంఘిక నాటకరచయిత బయటపడి ప్రగతి శీలపథంపై ఆధునికయుగ సంకేతాన్ని ఎగురవేస్తూ, సమస్త మానవాళి మధ్య సమైక్యతను ఆశించే ఉదార భావంతో రంగస్థలాన్ని శోభావంతంచేస్తుండడం హర్షదాయకం ఒంటిస్తంభం మేడనుండి దిగివచ్చాడు: సంక్షుభిత మానవాళి హృదయ స్పందనలే అతని కలానికి మేలుకొలుపు సందేశాలైనై.

"...The man or woman who sits down to write a play or who enters a theatre to watch one brings with him in each case a common life experience which is not suspended merely because he has turned writer or be one part of audience..."
("Modern drama" by Travis Bogard & William Oliver P. 229)

ఇవన్నీ నాటకరచనలోని క్రొత్తప్రయోగాలు. ఇంకా నేను ఉటంకించనివి కొన్ని ఉండవచ్చు. సమయాభావము, స్థలాభావముచేత స్థాలీపులాక న్యాయంగా మాత్రమే నాటకరచనలోని క్రొత్తప్రయోగాల గురించి ప్రస్తావించాను.

卐卐

# సాహిత్య అకాడమీ బహుమానాలు పొందిన గ్రంథాలు - ఒక సమీక్ష

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ లక్ష్యాలలో - ఉత్తమ రచనలు చేసిన రచయితలను గుర్తించటం, వారి రచనలకు బహుమతులను ప్రదానం చేయటం, తెలుగు భాషా సాహిత్యాలలో పరిశోధనను పెంపొందింపజేయటం అనేవి నిర్దేశింపబడి ఉన్నాయి. ఆ లక్ష్యాలను పురస్కరించుకొని అకాడమీ ప్రతిసంవత్సరం రెండంశాలను ప్రకటించి, వాటి మీద పోటీ రచనలను ఆహ్వానించి, వచ్చిన గ్రంథాల్లో ఉత్తమమైన వాటికి నగదు బహుమానాలను ప్రకటించేకార్యక్రమాన్ని 1957-58 సంవత్సరం నుండి ప్రారంభించింది. మొదట్లో బహుమానంగా ఇచ్చే మొత్తం ప్రతిఉత్తమ గ్రంథానికీ రెండువేల రూపాయలుగా ఉండేవి. ఆ తరువాత ధరల పెరుగుదలను దృష్టిలో ఉంచుకొని రూ 8,500-00 లకు పెంచారు.

ఈ విభాగం క్రింద సాహిత్య విమర్శకు, పరిశోధనకు, సాహిత్యచరిత్రకు సంబంధించిన కొన్ని విలువైన గ్రంథాలు వెలువడటానికి అవకాశం కలిగింది. వాటిని సమీక్షించే ముందు ఆయా సంవత్సరాలలో ప్రకటితమైన సాహిత్యాంశాలను బహుమతు లందుకొన్న రచయితలను పేర్కొంటాను

1957-58 (1) నన్నెచోడుని కవిత్వము — శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి

(2) కాకతీయ శిల్పము — బహుమతి రాలేదు

[illegible] (1) [illegible] శతాబ్ది [illegible]

(2) కాశీనాథుని నాగేశ్వరరావు
జీవితము — (బహుమతి రాలేదు)

1959-60 (1) తెలుగుభాషలోని
ఛందోరీతులు — డా॥ గిడుగు వెంకట సీతాపతి

(2) ఆంధ్ర సారస్వత మండలి
వీరరసము — డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

1960-61 (1) ఆంధ్ర కర్ణాటక భాషల
పరస్పర ప్రభావము — కళాప్రపూర్ణ శ్రీనిడదవోలు
వెంకటరావు

(2) సాంఘిక నాటకము — [ప్రమాణాలకు తగిన రచన
రాలేదు. కాని, మూడు నాటకా
లకు ఆర్థిక సహాయం అందజేయ
బడింది.]

1961-62 (1) తిరుపతి వేంకటకవుల
సాహిత్య సమీక్ష — శ్రీశిష్టా లక్ష్మీకాంతశాస్త్రి

(2) డా॥ సి. ఆర్. రెడ్డి జీవిత
చరిత్ర — శ్రీగొరెపాటి వెంకట సుబ్బయ్య

1962-63 (1) వీరరస ప్రధానమైన — దృశ్యకావ్యం-'కట్ట బొమ్మ'
దృశ్య/శ్రవ్య కావ్యం డా॥ గిడుగు వేంకట సీతాపతి
శ్రవ్య కావ్యం - 'విజయభద్ర'
శ్రీగాదేపల్లి కుక్కుటేశ్వరరావు.

(2) విజయనగరసంస్థానములు .I శ్రీబులుసు వెంకట రమణయ్య
సారస్వత పోషణము — 2. కళాప్రపూర్ణ శ్రీ నిడదవోలు
వెంకటరావు

1963-64 (1) తంజావూరు తెలుగు — 1. శ్రీయందమూరి
కవులు సత్యనారాయణ రావు
2. శ్రీమతి కొకొండ సత్యవతి

(2) ఆంధ్రేతరులు - తెలుగు
సాహిత్యానికి చేసిన సేవ (బహుమతి రాలేదు)

1964-65 (1) షేక్‌స్పియర్ సాహిత్య
సమీక్ష — శ్రీ బుచ్చిబాబు.

(2) ఋతు సంహిత —శ్రీ మేదవరం వేంకటనారాయణ శర్మ

1965-66 (1) ఆంధ్ర సంస్థానములు-
సాహిత్య పోషణ — డా॥ తూమాటి దొణప్ప

(2) తెలుగు సాహిత్యముపై
ఉరుదు ప్రభావము — డా॥ కె. గోపాలకృష్ణరావు

1966-67 (1) తెలుగులో తిట్టు
కవిత్వము — శ్రీ రావూరు దొరస్వామి శర్మ

(2) తెలుగు కావ్యాలలో
అవతారికలు — డా॥ జి. నాగయ్య

1967-68 (1) కాశీనాథుని నాగేశ్వరరావు
జీవిత చరిత్ర — శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

(2) గాంధీ సాహిత్యసమీక్ష — డా॥ అడపా రామకృష్ణరావు

1968-69 (1) వ్యావహారిక భాషా
వికాసము - చరిత్ర — డా॥ ఎ. రమాపతిరావు

(2) తెలుగు సాహిత్యములో
దేశికవితలు — శ్రీ ఆర్.వి.యస్. సుందరం

1969-70 (1) తెలుగు కవితలో
ప్రకృతివర్ణన — శ్రీ చేకూరి చెన్నకృష్ణయ్య

(2) తెలుగు సాహిత్యములో
రామకథ — శ్రీమతి యస్. శమంతకమణి
కృష్ణమోహన్

1970–71 (1) పాశ్చాత్యులు ఆంధ్ర
సాహిత్యానికి చేసినసేవ– (బహుమతి రాలేదు)

(2) స్వాతంత్ర్యానంతర
ఆంధ్ర సాహిత్యము – (బహుమతి రాలేదు)

1971–72 (1) సురవరం ప్రతాపరెడ్డి
జీవితము – రచనలు – 1. శ్రీముద్దసాని రామిరెడ్డి
2. శ్రీ ఇ. శివారెడ్డి

(2) తెలుగులో పద్యగేయ
నాటికలు – శ్రీమతి యం. ఆర్. ప్రమీలాదేవి

1972–73 (1) అరవిందుని కవిత – శ్రీసి వి.ఆర్. కృష్ణారావు

(2) క్షేత్రయ్య పద
సాహిత్యము – డా॥ యస్. గంగప్ప

1973–74 (1) 20వ శతాబ్దపుఆధునిక
కవితారీతులు – (బహుమతి రాలేదు)

(2) వార్తా పత్రికల భాష–
ఆధునికత – (బహుమతి రాలేదు)

1974–75 (1) తెలుగులో హరికథా
వాఙ్మయము – డా॥ తూమాటి దోణప్ప

(2) మల్లినాథసూరి జీవితము
రచనలు – శ్రీగుమ్మా శంకరరావు
శ్రీరామానుజాచార్యులు

1975–76 (1) స్వాతంత్ర్యానంతరము
వచన సాహిత్యవికాసము– (బహుమతి రాలేదు)

(2) వావిళ్ళ రామస్వామిశాస్త్రి
తెలుగు వాఙ్మయ సేవ. 1. శ్రీబులుసు వెంకటరమణయ్య
2. శ్రీమరుపూరు కోదండరామరెడ్డి

[illegible]

[illegible]శిష్టత – శ్రీ [illegible]

(2) తెలుగు కవితలో నూతన
ప్రయోగాలు - (బహుమతి రాలేదు)

1977-78 (1) తెలుగునవలా
సాహిత్యంలో మనో విశ్లేషణ-శ్రీకోడూరి శ్రీరామమూర్తి
(2) సంస్కృత భాషా రూపక - శ్రీ టి. రామకృష్ణమూర్తి &
ములు శ్రీ సూరం శ్రీనివాసులు.

ఇరవై యేళ్లగా సాహిత్య అకాడమీ ప్రతిసంవత్సరమూ రెండేసి అంశాల మీద రచనలను ఆహ్వానించి ఉత్తమ రచనలకు బహుమతులిచ్చే సంప్రదాయం సాగించటం సాహితీలోకం హర్షించదగిన విషయం. పైన పేర్కొన్న 40 అంశాలలో 10 అంశాల మీద బహుమతులు రాలేదు. వాటిలో చాలావరకు అసలు పోటీకి రచనలు రానివే కనపడుతున్నాయి. 1960-61లో సాంఘిక నాటకాలు రచయితలు వ్రాసి సమర్పించినా అవి ఉన్నత ప్రమాణాల స్థాయిని అందుకోలేకపోవటంచేత బహుమతులు పొందలేకపోయాయి. మిగిలిన అంశాలలో గమనింపదగిన విశేషాలు రెండున్నాయి. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి జీవితాన్ని గురించి 1958-59లో ఎవ్వరూ రచనలు పంపినట్లు లేదు. ఆదేఅంశం మరలా 1967-68లో ప్రకటింపబడటం, శ్రీ గోటైపాటి వెంకట సుబ్బయ్యగారు గ్రంథం వ్రాయటం దానికి బహుమతి రావటం ముదావహం. 'కాకతీయశిల్పం' ప్రాచీన వాస్తుశిల్ప సాంకేతిక పరిజ్ఞానానికి సంబంధించినది. దానిమీద గ్రంథం రాలేదు. ఇక మిగిలిన ఏడంశాలూ ఆధునిక యుగానికి సంబంధించినవే. వాటిని ఒకచోట గుదిగ్రుచ్చి చూపితే వాటి స్వభావం తేటతెల్లమౌతుంది.

1. ఆంధ్రేతరులు తెలుగు సాహిత్యానికి చేసిన సేవ
2. పాశ్చాత్యులు ఆంధ్రసాహిత్యానికి చేసిన సేవ
3. స్వాతంత్ర్యానంతర ఆంధ్రసాహిత్యము

(20)

4. 20వ శతాబ్దపు ఆధునిక కవితారీతులు

5. వార్తాపత్రికల భాష, ఆధునికత

6. స్వాతంత్ర్యానంతర వచన సాహిత్యవికాసము

7. తెలుగుకవితలో నూతన ప్రయోగాలు.

ఈ అంశాల ప్రకటన వెనుక ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు, 20వ శతాబ్దపు ఆంధ్ర వాఙ్మయ చరిత్ర నిర్మాణానికి అనువైన ఆకరగ్రంథాలను రచింపజేయాలన్న దృఢసంకల్పం వ్యక్తమౌతున్నది. దాదాపు ఏడున్నర దశాబ్దాల ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర విస్తృతితోను, ప్రయోగబాహుళ్యంతోనూ వ్యాపించి ఉండటం చేతనూ, పాశ్చాత్య భాషా సాహిత్యాల, ఉద్యమాల ప్రభావం ప్రబలంగా ఉండటం చేతనూ, భారతీయ భాషా సాహిత్య సంబంధాల ఉద్యమాల ప్రేరణం అనివార్యం కావటం చేతనూ, సమీక్షారంగం చాలవరకు సమకాలీనం కావటం చేతనూ, బహుశః, రచయితలు గ్రంథ రచనకు పూనుకోలేదేమో! అయితే, ఆయా అంశాలమీద గ్రంథాలు, సిద్ధాంతవ్యాసాలూ, సమీక్షా విమర్శలు వ్రాసిన రచయిత లున్నారు. కాని, అకాడమీ బహుమతులకు మాత్రం వ్రాసే ప్రయత్నం చేయలేదు. కారణా లేవైనా, ఎన్నైనా ఉండవచ్చు కాని, సత్యంమాత్రం ఇది.

ఇక ప్రాచీనాంధ్ర సాహిత్యానికి సంబంధించిన అంశాలను గమనిస్తే ఒక విశేషం స్పష్టమౌతుంది. విశ్వవిద్యాలయాల్లో జరుగుతున్న పరిశోధనలను దృష్టిలో పెట్టుకొని, వాటికి అనుకరణ రూపాలైన గ్రంథాలు వెలువరింపచేసే పునరుక్తి దోషాన్ని అకాడమీ సాధ్యమైనంతవరకు దూరంగా ఉంచింది, నన్నెచోడుని కవిత్వం, తెలుగుకావ్యాలలోని అవతారికలు, ఆంధ్రకర్ణాట భాషల పరస్పర ప్రభావం లాంటివి పరిశోధనకు పనికి వచ్చే అంశాలు. మిగిలిన వాటిల్లో 17, 18, 19 శతాబ్దాల సాహిత్య చరిత్రకు సంబంధించినవి ప్రత్యేకంగా పేర్కొన తగినవి. ఆయాయుగాల సాహిత్యం మీదపరిశోధనలు చాల

కాలంనుండి సాగుతున్నా వెలికి తీయవలసినవి, వెలుగులోకి తేవలసినవి-అయి న అంశాలు ఎన్నో మిగిలి ఉండటంచేత – తంజావూరుతెలుగుకవులు, 19 వ శతాబ్దపు తెలుగుసాహిత్యం, ఆంధ్రసంస్థానములు – సాహిత్యపోషణ , విజయ నగర సంస్థానములు – సారస్వతపోషణ – మొదలైన గ్రంథాలు ఆరంగంలో మరికొంత వివేచనం జరగటానికి ఎంతో తోడుపడినవని చెప్పాలి. ప్రక్రియా పరంగా సమీక్ష చేయించే అంశాల నెన్నుకోవటం కూడా సాహిత్యచరిత్ర నిర్మా ణానికే కాక ప్రక్రియావికాస విలోకనానికి తోడ్పడింది తెలుగు సాహిత్యంలో దేశికవితలు, క్షేత్రయ్య పదసాహిత్యం, తెలుగులో పద్యగేయ నాటికలు తెలుగులో తిట్టుకవిత, తెలుగులో హరికథావాఙ్మయం, తెలుగుసాహిత్యంలో రామకథ మొదలైనవి ఈ శాఖలో వచ్చిన గ్రంథాలు. తెలుగు సాహిత్యంపై ఉర్దూప్రభావం, వ్యావహారిక భాషావికాసం – చరిత్ర అనే అంశాలు భాషా విషయకమైన పరిశీలనకు చక్కని కరదీపికల్లా ఉన్నాయి. అందులోనూ వ్యావ హారికభాషావికాస చరిత్ర ఆధునికయుగ ప్రవృత్తికి ప్రాణంవంటిది.

తిరుపతి వేంకటకవుల సాహిత్యసమీక్ష, సి ఆర్. రెడ్డి, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, సురవరం ప్రతాపరెడ్డిగారల జీవితచరిత్రలు, వావిళ్ల వారి సాహిత్య సేవ – ప్రసిద్ధాధునికాంధ్ర కవి పండితుల జీవితసాహిత్య విశేషా లను వివరించేగ్రంథాలు. మల్లినాథసూరి జీవితం, రచనలను గురించి వెలు వడిన గ్రంథం ప్రసిద్ధాంధ్ర గీర్వాణవ్యాఖ్యాతృ సాహిత్యమూర్తిని పరిచయం చేసేది. బాణకాదంబరి, సంస్కృతభాణాలనుగూర్చివెలువడిన గ్రంథాలు సంస్కృతసాహిత్యరంగానికి సంబంధించినవి. అరవిందుని కవిత, షేక్స్పియర్ సాహిత్య సమీక్ష, గాంధీ సాహిత్యసమీక్ష తెలుగువారికి ఆయాఅంశాలను గురించి తెలుగులో తెలియచెప్పటానికి చేసినయత్నాలు. ఋతుసంహిత, తెలుగు కావ్యాలలో ప్రకృతి వర్ణనలు వంటివి సమీక్షాత్మక గ్రంథాలు.

తెలుగు సాహిత్యాన్ని శాస్త్రీయమైన విమర్శనాత్మక దృక్పథంతో వివే చించటానికి తోడ్పడే అంశాలమీద వచ్చినగ్రంథాలు ఈ వరుసలో మూడే కన

పడుతున్నాయి అవి: తెలుగుభాషాలోని ఛందోరీతులు, ఆంధ్రసారస్వతము నందలి వీరరసము, తెలుగు నవలా సాహిత్యములో మనోవిశ్లేషణ సాహిత్య తత్త్వ విమర్శదృష్టికంటె, చారిత్రకదృష్టి ప్రధానంగా ప్రచారంలో ఉన్న ఆధునికయుగంలో ఇటువంటి అంశాలకు మరింత ప్రాధాన్యం రాకపోవటంలో ఆశ్చర్యం లేదు. యుగధర్మం అకాడమీ ఎన్నుకొన్న అంశాలలో కూడా ప్రతి బింబిస్తున్న దనటంలో అనుమానం లేదు.

అకాడమీ బహుమతులు పొందిన గ్రంథాలను కాలానుక్రమణిక ననుస రించి కాకుండా, వాటి స్వభావాలనుబట్టి కొన్ని వర్గాలుగా విభజించుకొని సమీక్ష చేయటం సముచితమని భావిస్తాను.

## 1. నన్నెచోడుని కవిత్వము

ప్రాచీనాంధ్రకవుల్లో నన్నెచోడునికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉంది ఆమహా కవి కాలాన్నిగురించి, కవితాలక్షణాలను గురించి, కావ్యనిర్మాణవిధానాన్ని గురించి సాహితీ విమర్శకులకు వివిధమైన అభిప్రాయాలున్నాయి. వాటి నన్నిం టినీ చారిత్రకదృష్టితో సమన్వయిస్తేకాని ఆకవి కవిత్వస్వరూపస్వభావాలను నిర్ధారించటానికి వీల్లేదు. ఈగ్రంథ రచయిత శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు ప్రధానంగా చారిత్రక విమర్శకులు కావటం ఈ గ్రంథ రచనకు ఎంతో ఉపక రించింది. వారి నెదుర్కొన్న ప్రధానసమస్య కవికాల నిర్ణయం. శాసనాధారాలను పరిశీలించటంలోనే కాక, ఆంతర ప్రమాణాల నాధారంగా చేసికొని వారుచేసిన విమర్శ లోతుగా సాగింది. అంకితం చేసేపద్ధతి, షష్ఠ్యంతాలు, సప్తసంతానాలు, అష్టాదశవర్ణనలు, చిత్రబంధకవిత్వాలు, దేశిమార్గకవితలు, జానుతెనుగు, ప్రబంధపక్కి మొదలైన అంశాలనుగురించి చర్చిస్తూ, చారిత్రకంగా వాటి పరి ణామ వికాసాలను గుర్తించి, నన్నెచోడుడా వికాసదశల్లో ఎక్కడ నిలుస్తాడన్న అంశాన్ని నిరూపించిన వైఖరి తెలుగుకావ్య విమర్శలో పాటింపవలసిన చారి త్రకపద్ధతిని చక్కగా రూపుకట్టించింది. నన్నెచోడునికి "ఆంధ్ర వాఙ్మ

యమున మహోన్నతస్థానము కుదిరినది. కవిత్రయానంతరుడు కాఁడు గాని కవిద్వయానంతరుఁడై ఇతిహాస పురాణకవిత్వకాలమునను ప్రబంధకవిత్వ కాలమునకును సంధికాలమున నుండి ప్రబంధరచనకు దారితీసినాఁడు. రెండు మార్గములకును వంతెనవంటివాఁడు. ఇతనికి తరువాతివాఁడే యైనను భారతకవుల ధోరణిలో పడిపూర్వమార్గమున రచించి ఎఱ్ఱాప్రెగ్గడ ప్రమాణపదవి నందినాఁడు. తిక్కన ఎఱ్ఱన్నల నడిమివాఁడే యైనను నూతన పథానువర్తియై భిన్నకావ్యధోరణింద్రొక్కి ఈతఁడు ప్రబంధ మార్గమున తేజరిల్లినాడు" —అనునది ఈ గ్రంథ తాత్పర్యం, నన్నెచోడుని మీద కన్నడ సాహిత్యమర్యాదల ప్రభావ మున్నదని భావించే విమర్శకుల అభిప్రాయాలను కాదని పెక్కంశాలలో ఆంధ్రకవిత్వ పరిణామదశాప్రభావమే కలదని నిరూపించిన విధాన మీ గ్రంథానికి మౌలిక పరిశీలన గౌరవాన్ని కలిగిస్తున్నది. నన్నెచోడుని గురించే కాకుండా, ఆంధ్ర సాహిత్యచరిత్రకు సంబంధించిన అనేక అంశాల సమన్వయం ఈ గ్రంథం సమర్పిస్తోంది. సాహిత్య విమర్శకు చారిత్రకదృక్పథం ఎలా చుక్కాణిగా నిలువగలదో ఈ గ్రంథం చక్కగా నిరూపిస్తోంది.

## సాహిత్య చరిత్రలు

అకాడమీ బహుమానాలు పొందిన గ్రంథాలలో రెండు సాహిత్య చరిత్రలకు సంబంధించినవి. 1. తంజాపురాంధ్ర సాహిత్య చరిత్ర. 2. 19వ శతాబ్ది తెలుగు సాహిత్యచరిత్ర. అకాడమీ ఈ రెండంశాలను ప్రకటించటంలోని అభిప్రాయం ఏమిటో స్పష్టంగా తెలియటం లేదుకాని - సహృదయుడు ఇలా ఊహించటానికి వీలౌతున్నది. అనంతరప్రబంధయుగసాహిత్యచరిత్రను రచింపచేయాలనే ఉద్దేశం మొదటిది కావచ్చు. అయితే, మొదటి అంశం పాక్షికమే అవుతుంది కాని, సమగ్రం కాదు దక్షిణాంధ్రయుగచరిత్రప్రసిద్ధ సాహిత్య చరిత్ర కారుల పరిశోధనఫలితంగా ఒకరూపానికివచ్చింది. వేటూరివారు, నేలటూరివారు కుఱుగంటివారు, నిడదవోలువారు మొదలైనపరిశోధకు లారంగంలోకృషిచేసినారు.

యక్షగానాల మీద ఆచార్య జోగారావుగారు సిద్ధాంతవ్యాసం వ్రాశారు, వచన ప్రక్రియలమీద, వాగ్గేయకారుల రచనలమీదా గ్రంథాలువచ్చాయి. అయినప్పుడు, తంజాపురాంధ్ర కవుల సాహిత్యచరిత్ర చర్వితచర్వణం కాక తప్పదు. అయినా, నూత్నాంశ ప్రతిపాదనాన్ని కాని, కావ్యతత్త్వ సమాలోచనాన్ని కాని, తెలుగుతో కానికి అందింపచేయాలని అకాడమీ భావించి యుండవచ్చు. ఏదో ఒక క్రొత్త దనాన్ని కోరకపోతే మొదటి అంశం అంతసార్థకం కాదు రెండవ అంశంకూడా అంతే. ఈ దృష్టితో ఆ రచయితలు వ్రాసిన గ్రంథాలను సమీక్షించటం అని వార్యం.

## తంజాపురాంధ్ర సాహిత్య చరిత్ర

ఈ గ్రంథం అంతకు పూర్వం వచ్చిన సాహిత్యచరిత్రలకంటె విశిష్ట మైందని కాని, పరిశోధనాత్మకమైందని కాని చెప్పటానికి వీల్లేదు ఇది మరో సాహిత్యచరిత్ర సంగ్రహం. విద్యార్థుల కుపయోగించినంతగా పరిశోధకులకు పనికిరాదు. నూత్నాంశ సమన్వయదృక్పథం కంటె ప్రసిద్ధాభిప్రాయల సంపుటీ కరణం హెచ్చు. "ఈ కూర్పు సమగ్రముగా, గూలంకషముగా, తంజావూరు సాహిత్యచరిత్రకు ప్రాతినిధ్యము వహించుచున్నదా? అని మనము ప్రశ్నింతుము. ఈ రచనకు 'సాహిత్య అకాడమి' సముద్బోధకము. అది యేర్పఱిచిన పుటల పరిమితి, కాలపరిమితి అనుల్లంఘనీయమై యీకూర్పు ఇంతగా గుదింపఁబడె నని రచయిత్రి యనవచ్చును" అన్న శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి వాక్యాల్లో వినవచ్చే నిరాశ పరిశలందరికీ తప్పదనుకుంటాను." తంజావూరు తెలుగుకవులు—రఘునాధరాయలు, చేమకూర వేంకటకవి, ముద్దుపళని—వీరికి నధిక ప్రాముఖ్యము నిస్తూ, తంజావూరున వెలసిన సాహిత్యము యొక్క లక్షణము లను, నాటి సారస్వతముపై వైష్ణవమతముయొక్క ప్రభావమును స్పష్టీకరిస్తూ గ్రంథరచన సాగింపవలసినదని ఎకాడమీవారి ఆదేశమని రచయిత్రి పేర్కొ న్నారు 'నామాటలో.' అటువంటి ఆదేశమే అకాడమీ ఇచ్చిఉంటే అది ఈ అంశానికి చేసిన అపకారం. ఒకవేళ ఈదృష్టితో చూచినా చేమకూర వేంకట

కవి కవితాతత్త్వాన్ని రచయిత్రి ప్రతిభావంతంగా నిర్వహింపలేక పోయారు. రఘునాథరాయలనుగూర్చి చెప్పిన అంశాలకంటె ఆయన సాహిత్యమూర్తిని వ్యక్తీకరించే అంశాలు తక్కువ. వైష్ణవమత ప్రసక్తియున్న అంశాలను క్రోడీకరిస్తే ఆమత ప్రభావం రూపుకట్టదు. తంజాపురాంధ్ర సాహిత్యచరిత్రను సరళంగానూ, సంగ్రహంగానూ విద్యార్థుల కుపయోగపడేటట్లు సమీక్షాత్మకంగా రచించిన గ్రంథమిది. అకాడమీ బహుమతి పొందినందుకు అభినందింపదగిన రచన.

ఉషఃకిరణాలు

19వ శతాబ్ది తెలుగు సాహిత్యచరిత్ర ఇది. క్షీణయుగమని పిలువబడే ఈ యుగాన్ని సహృదయదృష్టితో యండమూరి సత్యనారాయణరావు గారు సమీక్షించి సంధియుగమని నిర్ధారించటం ఇందులో విశేషం. గ్రంథానికి పేరుకూడా నవ్యయుగోదయ రాగవీచిని వ్యంజింపచేస్తోంది. సాహిత్య చరిత్రను విశ్లేషణాత్మకంగా రచించేపద్ధతికి ఈగ్రంథం చక్కని ఉదాహరణం. ఈయుగంలోని అనేక సాంఘికాది విషయాలతో సాహిత్యచరిత్ర ముడిపడికుంది. సమకాలీన సాహిత్యాల ప్రభావంకూడా విపులంగా కనపడుతుంది. ప్రక్రియాబాహుళ్యంతో పాటు ప్రయోగ ప్రయోజన ప్రతిపత్తిని పరీక్షింప వలసిన అవసరముంది. ఈ సంశ్లిష్టస్వభావంగల యుగసాహిత్యచరిత్రకు కవుల చరిత్ర రచనాపద్ధతి ఉపాదేయంకాదు. పరిశీలనార్హాలైన అంశాల నెన్నుకొని విశ్లేషించి వివేచించటమే కాకుండా అవసరమైనచోట అన్వయించి ప్రక్రియాస్వభావాన్ని రూపుకట్టింపవలసి వస్తుంది. ఈ అంశాలను దృష్టిలో ఉంచుకొని గ్రంథకర్త ఉచితమైన ప్రణాళికను రూపొందించుకొన్నారు.పూర్వసిద్ధాంతాలను ఖండించి నూత్నాంశాలను సోపపత్తికంగా ప్రతిపాదించే ప్రతిభను సంతరించుకొన్నారు. చారిత్రక దృక్పథం, వర్గీకరణవిధానం, ఆకరాలనుండి ఉపపత్తులను సేకరించటం, స్పష్టతతో విషయాలను సంపుటీకరించటం—వీరి రచనలో కనపడే లక్షణాలు. యండమూరి సహజంగాచరిత్రరచయితగా కనపడతాడు. సాహిత్యతత్త్వ వివేచకుడు కాదు. అందువల్ల ఈగ్రంథంలో సాహిత్యచరిత్రను ఆధునికదృక్పథంతో రచించే పద్ధతిని విశ్లే

షంగా ప్రదర్శింప గలిగారు కాని వివరాల వెనుక వెలుగులా కనబడే సాహితీ తత్త్వాన్ని రూపుకట్టింపలేకపోయారు. విశ్లేషణపద్ధతిలో వివరణాన్ని, వివేచనాన్ని పొందినంతగా పాఠకుడు పరమార్థాన్ని దర్శింపలేడు. పద్ధతి పరిమితికి లోనుకావచ్చు. దాన్ని సమగ్రంగా వాడుకొన్నారు యందమూరివారు. ఆయుగ చరిత్రావగాహనకు వెలుగునిచ్చే కరదీపిక ఈగ్రంథం. ఆధునిక సాహిత్యచరిత్ర రచయితల మీద ఈరచన తన ప్రభావాన్ని బలంగా వేసింది.

## సంస్థానములు - సాహిత్యసేవ

జమీందారీ వ్యవస్థలో జరిగిన సాహిత్య పోషణాన్ని సమీక్షింపచేసి సమగ్రాంధ్ర సాహిత్యచరిత్ర నిర్మాణానికి ఆకరాలుగా తోడ్పడే పరిశోధన గ్రంథాలు వెలువడటానికి సాహిత్యఅకాడమీ ఎంపిక చేసిన రెండంశాలు అభినందనీయాలు. 1. విజయనగరసంస్థానము - ఆంధ్రవాఙ్మయపోషణము 2. ఆంధ్రసంస్థానములు - సాహిత్యపోషణము. ఈ రెండుగ్రంథాలూ రచించిన వారు ప్రసిద్ధాంధ్ర పరిశోధకులు. అందువల్ల అవి ప్రామాణికస్వరూపాలను సంతరించుకొన్నాయి.

సాహిత్య అకాడమీ మొదట విజయనగరసంస్థానం చేసిన ఆంధ్రవాఙ్మయ పోషణంమీద వచ్చిన గ్రంథాలకు బహుమతి నిచ్చింది. ఆగ్రంథం వచ్చిన తరువాత ఒకసంస్థానాన్ని గురించే ఇంతవిషయముంటే - అఖిలాంధ్ర సంస్థాలను గురించి తెలుసుకోవలసింది ఎంతోఉంటుందని అభిప్రాయపడి రెండో అంశాన్ని ప్రకటించినట్లయింది. ఒకందుకు మొదటి అంశం రెండో అంశానికి మార్గదర్శకమై అందులో లీనమైపోయిందని చెప్పాలి. విజయనగరసంస్థానం చేసిన ఆంధ్రవాఙ్మయపోషణాన్ని గురించి ఆచార్య నిడదవోలు వేంకటరావు గారు వ్రాశారు. వారి వ్యక్తిత్వం ఆ రచనలో కనపడుతుంది. ఆకరాలను సేకరించి, ఉదాహరణలతో దండగ్రుచ్చటంలా ఉంది వారి గ్రంథరచన. కవుల చరిత్ర రచనాసంప్రదాయానికీ, వివరణాత్మక గ్రంథసూచికలను తయారుచేసే పద్ధతికీ యీ గ్రంథరచనం చక్కని ఉదాహరణం. గ్రంథమంతా చక్కని కవిలె కట్టగా, చారిత్రక దృష్టితో వర్గీకరించిన కవికావ్యపరిచయసూచిగా ఘనకని

పించినా ముడిసరుకు చాలా ఉంది ఇందులో. ముడిసరుకును మూపులకె త్తికొని సాహిత్య సంభారాన్ని సమకూర్చిన పరిశోధకుల్లో నిడదవోలు వారు పరమేశ్వర ప్రతిమానులు. ఈ గ్రంథం అటువంటి పరిశ్రమకు ఉదాహరణం. ఈ అంశం మీదనే శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు "గజపతి రాజుల తెలుగుసాహిత్య పోషణము" అనే గ్రంథం వ్రాసి బహుమతిని పందుకొన్నారు. విజయనగర ప్రభువుల ప్రోత్సాహంతో ప్రచురింపబడిన గ్రంథాలను అకారాది క్రమంగా పేర్కొని సమీక్షించటం ఇందులోని విశేషం. పఠనాసక్తిని కలిగించే రచన.

ఆచార్య తుమాటి దోణప్పగారి 'ఆంధ్ర సంస్థానములు – సాహిత్య పోషణము' అనే గ్రంథం ఉత్తమ ప్రమాణాలతో నిర్మింపబడిన సాహిత్యచరిత్ర రచన. "ఈతరమువారి స్మృతిపథమునుండి అప్పుడే జారిపోవుచున్న విద్వత్సంస్థానాధిపతుల సాహిత్య సేవనుగూర్చిన ఎన్నో వివరములను ఈ గ్రంథము వెలుగులోనికి తెచ్చినది. సంస్థానముల సాహిత్యసేవకు సంబంధించిన అంశములనన్నిటిని ఒకచోట చేర్చి గ్రంథరూపమిచ్చిన మొట్టమొదటిరచన మిది"—అని డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారన్న మాటలు ప్రత్యక్షర సత్యాలు. ఈ గ్రంథముఖబంధం గ్రంథతాత్పర్య దిక్సూచి. ఇందులో వివరించిన ప్రతిసంస్థాన సాహిత్య పోషణచరిత్రలో – సంస్థానచరిత్ర, సాహిత్యపోషణం. – అనే అంతర్విభాగం విషయ వివేచనకు లోచనద్వయి. చరిత్ర రచనకు పఠనాసక్తిని జోడించటం వీరి ప్రాణాళిక విశేషం. ప్రమాణ సహితంగా వివరాలను ప్రతిపాదించటం, సాహిత్య చారిత్రకాంశాలకు సమన్వయం కుదుర్చటం, చెప్పేది సంగ్రహంగానైనా సారవంతంగా చెప్పటం వీరి రచనలో కానవచ్చే విశేషాలు. ప్రామాణిక పరిశోధన గ్రంథారచనలో పాటించే సర్వాంగ సమృద్ధి ఇందులో ప్రత్యక్షమౌతుంది. వస్తువు విస్తృతమైనా సామర్థ్యంతో సంపాదింపబడిన గ్రంథం ఇది. ఈ అంశంమీద మరొకరు చెప్పేదేమైనా ఉంటుందా అని అనిపించే కూలంకష పరిశీలనం.

## ప్రక్రియా పరిశీలనం

సాహిత్య అకాడమీ ప్రచురించిన అంశాలలో ప్రక్రియాపరిశీలనకు సంబం ధించినవి విశేషంగా ప్రశంసించ దగినవిగా ఉన్నాయి. తెలుగులో ప్రక్రియా రంగా సాహిత్యచరిత్ర వ్రాయబడాలని నేనొకసారి సర్వసభ్య సమావేశంలో సూచించాను. దానికి అంగీకారం కుదిరింది కాని, ఇంకా అదిఆకృతి తాల్చవలసిన అవసరం ఉంది తెలుగులో ఎన్నోప్రక్రియలకు తగినంత చరిత్రలేదు. అకాడమీ ప్రేరణవల్ల హరికథ, పద్యగేయనాటికలు, మొదలైనవాటిమీద చక్కనిగ్రంథాలు వచ్చాయి. ఈశాఖలో వచ్చినగ్రంథా లన్నింటిలోనూ సమగ్రమూ, ఆదర్శ ప్రాయమూ అయిన గ్రంథం తెలుగుహరికథా సర్వస్వం.

## తెలుగు హరికథా సర్వస్వం

ఒక ప్రక్రియను గురించి శాస్త్రీయమైన పద్ధతిలో చరిత్రను నిర్మించే విధానానికి ఈగ్రంథం ప్రమాణం. హరికథ తెలుగులో పరిణతరూపంతాల్చిన ప్రక్రియ. దృశ్యశ్రవ్యకావ్య ప్రక్రియలను మేళవించుకొని విశిష్టంగా రూపొందిన ఈ సాహిత్యశాఖను సమగ్రంగా తెలుగువారికి పరిచయం చేసే ఈగ్రంథాన్ని గురించి శ్రీ పురిపండా అప్పలస్వామిగారిలా అన్నారు – ''తెలుగులోనేకాదు, ఏ ప్రాంతీయభాషలోనూ హరికథనుగురించి ఇంత ప్రామాణికమైన రచన వెలు వడలేదు. దీనికని ప్రొఫెసర్ దొణప్పగారు పడిన పరిశ్రమా, జరిపినపరిశోధనా బేరీజు వేసి చూపటం తరంకానిపని. ఎన్నో అన్ని హరికథలు సంపాదించారు;. పరిశీలించారు. ఎన్నోఊళ్లు తిరిగారు; ఎన్నో విషయాలు సంగ్రహించారు. ఎంతో ఆంతమంది హరిదాసుల్ని సందర్శించారు; సంప్రదించారు. ఎందరెందరితోనో ఉత్తరప్రత్యుత్తరాలు నడిపారు; ఇరుగు పొరుగుసీమలు పర్యటించి వివరాలు సేకరించారు; వింగడించారు. మరుపు మడతలలో మురిగిపోయిన ఎన్నో అన్ని హరికథలు అచ్చువీ అచ్చుకానివీ వెదకితీశారు ఎందరినోహరిదాసుల్ని తనవుకి తెచ్చారు. ఒక ప్రభుత్వం, ఒక విశ్వవిద్యాలయం, ఒక అకాడమి చేయవలసి నంతపని వొక్కచేతి మీదుగాచేసి చూపించారు శ్రీదొణప్పగారు. " ఈ మాటలు ప్రత్యక్షరసత్యాలు. ఈగ్రంథం మూడుభాగాలతో త్రివిక్రమత్వం ప్రదర్శించింది

'తత్త్వసందర్శనం' ప్రక్రియా సమగ్రవిచారం హరికథా వాఙ్మయచరిత్ర కేంద్రంగా సజాతీయప్రక్రియలతులనాత్మకపరిశీలనం స్వరూపస్వభావ వివేచనం; ప్రయోగాంగవిచారం, భాషావిశేష నిరూపణంసాధికారికంగా సాగిసమగ్రత్వాన్ని సంతరించుకొన్నాయి. రెండవభాగం-హరిదాసుల జీవితరేఖా సుదర్శనం "who, is who''. మూడవభాగం-"నిదర్శనప్రదర్శనం" ఈ ప్రక్రియా పరిశోధనను ప్రాతిపదికయైన ఆకరాల సంపుటి ఈమూడూకలిసి హరికథా విజ్ఞానసర్వస్వంగా రూపొంది పేరును సార్థకం చేసుకొన్నదీ గ్రంథం. హరికథాప్రక్రియకు అపూర్వ పారితోషికాన్నిచ్చిన ఆచార్యద్రోణప్పగారి కిది శాశ్వతకీర్తిని సంపాదించిపెట్టే పరిశోధనం.

## తెలుగులో పద్యగేయ నాటికలు.

శ్రవ్యదృశ్యలక్షణాలను సంతరించుకొన్న ఆధునికాంధ్ర ప్రక్రియ పద్య గేయనాటిక. దీని పుట్టుపూర్వోత్తరాలను గూర్చి, ప్రయోగ వైవిధ్యాన్నిగురించి సమీక్షాత్మకమైన గ్రంథాన్ని మంగళగిరి ప్రమీలాదేవిగారు వ్రాశారు. ఈ ప్రక్రి యలో పద్యనాటిక, నిర్వచనగేయనాటిక, వచనగేయనాటిక, నేపథ్యగేయనాటిక, భావనాటిక (సంగీతనాటిక) వంటి భేదాలను రచయిత్రి విశ్లేషించి ఆయాప్రయో గాల్లో ప్రసిద్ధులైన రచయితలను ఎన్నుకొని,వారిరచనలను సంగీతసాహిత్యాంశాల దృష్ట్యా వివేచించారు; వాటి వాటి ప్రత్యేకతలను సోదాహరణంగా పేర్కొన్నారు ఈ ప్రక్రియ రమారమి నూరేళ్లక్రితం పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో తెలుగులో ఉద్భవించిందనీ. దానికి ఉత్తమ సాహిత్యస్థాయిని కల్పించింది శ్రీ శివశంకరస్వామిగారనీ. ఆ తరువాత వచ్చిన నాటికల్లో దృశ్యకావ్య గౌరవం కంటె శ్రవ్యకావ్యగుణాన్ని అధికంగా పోషించినవే అనేకం కనపడుతున్నాయనీ. దృశ్యకావ్యంగా ప్రయోగించే విధానాన్ని దేశంలో పెంపొందించాలనీ రచయిత్రి పేర్కొన్నారు ఈ ప్రక్రియలో కృషిచేసిన రచయితలను, వారి రచనలను పరి చయంచేసే ఈ గ్రంథం సాహిత్యచరిత్ర నిర్మాణానికి తోడ్పడుతుంది. ఇంకా పరిశోధన సాగించి ఎన్నో విషయాలు వెలువరించే అవకాశం ఉందనీ తెలియ వస్తుంది. "ఇందుగో ప్రస్తావించవలసిన కావ్యములలోని గుణములనే ప్రశంస

చేసినదికాని,ఇది లేదు, అదిలేదు అని లోపములు చూపుటకు పూనుకొనలేదని" రచయిత్రిని గూర్చి శ్రీనోరివారు చెప్పిన మాటలు నిజాలు. మంచిని పైకెత్తి చూపిన మంచిపుస్తకం ఇది.

## క్షేత్రయ్య పదసాహిత్యం

వాగ్గేయకారుల సాహిత్యంలో పదానికి ప్రత్యేక సాహిత్యగౌరవముంది శ్రీ రాళ్లపల్లి వారన్నట్లు – 'క్షేత్రయ్య పదాలపరిశీలన యిప్పటి కెంతో జరిగింది గాని, యింకా జరుగవలసి ది ఎంతో నిలబడింది ... క్షేత్రయ్యపదాల మూల స్వరూపాన్ని నిర్ణయించి పరిష్కరించేది సామాన్యకార్యం కాదు అవిటి రాగాల లాక్షణిక రూపాలు, ధాతుఖండాల అచ్చుకట్లు, భాషలోని జాతీయాలు, భావార్థాల యేర్పాట్లు తాళాలకు వాటితోడి పొందికలు, బహుప్రియావ్రతం గల అకాలపు శృంగారోపాసకుల సహవాసంలో స్త్రీలసుఖదుఃఖాలు, ఆపసోపాలు, విప్రలంభ – ప్రలంభాల విషయంగా – కవుల ఉపకారం కొరకు–ప్రాచీనలాక్షణికులు చేసి పెట్టిన సాంకేతిక సమయాలు – ఈ అన్నిటా క్షేత్రయ్య చూపినప్రతిభను, చేసినమార్పులనూ, చేసిన కూర్పులనూ గమనింపగలిగిన లక్ష్యవ్యుత్పత్తి ఆపని కావశ్యకం". డా॥ ఎస్ గంగప్పగారు పూర్వవిమర్శకులకంటె విలక్షణంగా ఈ అంశంమీద శాస్త్రీయమైన పరిశోధనచేసి, క్షేత్రయ్యజీవితానికి, ఆయనపదాలకూ సంబంధించిన విశేషాంశాలను వెలికి తీయటమే కాకుండా, పదకవితా విర్భావ వికాసాలను సమీక్షిస్తూ క్షేత్రయ్య పదాలకున్న ప్రత్యేకతను ఎత్తిచూపారు క్షేత్రయ్య తన పదకవిత్వంలో ప్రదర్శించిన మహాకావ్యశిల్పాన్నీ, మధురభక్తి భావ్యకారుడుగా వాగ్గేయకారులకు చూపిన మార్గాన్నీ, వివరించి ఆయనపద సాహిత్య చక్రవర్తిత్వాన్ని స్థాపించారు. ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యశాస్త్ర మర్యాదలను సమయోచితంగా సమన్వయించుకొని పదసాహిత్య ప్రమాణాల నేర్పరచుకొని హుందాగా సమ్యక్పరిశీలనం చేసిన సిద్ధాంతవ్యాస మీగ్రంథం.

## తెలుగుసాహిత్యములో దేశికవితలు

శ్రీ ఆర్‌వీయస్ సుందరంగారు రచించిన ఈగ్రంథం దేశికవితా పరిణా

మాన్ని ప్రక్రియాపరంగా వివరించి చెపుతున్నది మార్గ — దేశి కవితాభేదాలను, దేశికవితలోని ఛందోరీతులనూ, గేయ, ద్విపద, యక్షగాన, శతకోదాహరణ దండకాది వాఙ్మయప్రక్రియలు పరిణామవికాసాలనూ గ్రంథకర్త సమీక్షించారు శ్రీ సాళ్వకృష్ణమూర్తిగారన్నట్లు "సుందరం గ్రంథరచనలో స్వయంధీరత జూపినవాఁడు గాడు. పండితాంగీకారము నందిన యభిప్రాయములనే గ్రహించి, యనపేక్షితము - నసిధారా వ్రతముగా — వదలి, వ్రాసినాడు. విషయము సమ్యగ్దృష్టితో జూచి వింగడించు కొనుట, మితియెఱిగి సమగ్రతకు భంగములేకుండ మెత్తన జెప్పుట యను వానిచేత నీగ్రంథము శంఖక్షీరసదృశముగా నున్నది."

## కావ్య మర్యాదలు

తెలుగుకావ్యాల్లో పాటించిన కొన్ని మర్యాదలమీద సాహిత్యఅకాడమీ పోటీరచనలకు అవకాశమివ్వటం ముదావహం. ప్రక్రియలకులాగానే మర్యాదలకూ పుట్టుపూర్వోత్తరాల చరిత్ర సాహిత్య సమన్వయ దృక్పథానికి ఎంతో మేలు చేస్తుంది. ఈ పద్ధతిలో వచ్చిన గ్రంథాలు సాహిత్యావగాహనకు తోడ్పడుతున్నాయి.

## తెలుగు కావ్యావతారికలు

నాటకాల్లో నాందీప్రస్తావనల్లాగా కావ్యాల్లో అవతారికలు కావ్యస్వరూప స్వభావ వివేచనానికి ముంజేతి కంకణాల్లా ఉపకరిస్తాయి. డా॥ జి. నాగయ్యగారి ఈ గ్రంథం ఆమర్యాదలోని మర్మాలనూ, వికాస పరిణామాలనూ విశ్లేషణాత్మకంగా వివరించి చెపుతోంది. ప్రసిద్ధాంధ్ర కావ్యాలలో పాటింపబడిన అవతారికా నిర్మాణాన్ని దాదాపు 15 అంశాలక్రింద వింగడించి వాటి ప్రయోగాల్లో ఉన్న విశేషాలను రచయిత చారిత్రక దృక్పథంతో చిత్రించి చూపించారు. తెలుగు కావ్యావతారికలు ప్రక్రియావిశేషాలను, చారిత్రకాంశాలను, మతసంప్రదాయాలను, కవివిద్యావైదుష్యాలను, పద్యరచనాశిల్పాలను, సాహిత్యసిద్ధాంతాలను, ఆచార వ్యవహారాలను, సాంఘికస్థితిగతులను, సాహితీమర్యాదలను మొదలైనఅంశాలను

తెలుసుకోవడానికి ఎలా తోడ్పడతాయో ఈ గ్రంథం సరళసుందరంగా నిరూపించింది. ఒక కావ్యమర్యాదయొక్క మర్యాదను నిలబెట్టిన సాహిత్యవివేచనం ఈ గ్రంథం.

## తెలుగులో తిట్టుకవిత్వము

తిట్టుకవిత్వాన్ని ప్రక్రియగా కంటె మర్యాదగా గ్రహించటమే న్యాయమనుకొంటాను. "ఆశుకవిత్వము, చిత్రకవిత్వము, మధురకవిత్వము, విస్తరకవిత్వము, శాస్త్రకవిత్వము, తిట్టుకవిత్వము "మున్నగునవి కవితాప్రస్తావములలో నెన్నదగిన"వని శ్రీ రావూరి దొరసామిశర్మగారు తమవిజ్ఞప్తిలో పేర్కొన్నారు వారి గ్రంథప్రణాళికలో "తిట్టుకవుల పద్యములు చాలవఱకు, చాటువులుగనే యున్నవి" మరికొన్ని "రచనాప్రక్రియలలో సమయోచితముగ" జేరిన తిట్టు పద్యాలుగానున్నవి. అంటే తిట్టుకవిత ఆశుకవిత్వప్రక్రియలోగాని, శతకకావ్యాది ప్రక్రియల్లోగాని ఒక మర్యాదగా నిలిచిందనే స్పష్టం. అయితే, వారు అధిక్షేప వివాదకావ్యాల్లోనూ, నిందాహేళన కావ్యాల్లోనూ, కావ్య కథాసందర్భాల్లోనూ పద్యేతరకృతుల్లోను కానవచ్చే తిట్టుకవితనుగూడా సమీక్షించారు. కుకవిదూషణం తిట్టుకవిత అయినా అవతారికలో పాటించే మర్యాదే అవుతుంది. అందువల్లదీన్ని కావ్యమర్యాదగానే భావించి సమీక్షించటం సమంజసం.

తెలుగు సాహిత్యంలో తిట్టుకవితను చాటుపద్యాలుగా చెప్పిన కవులనూ, ఆయాసందర్భాలనూ రుచికరంగా వర్ణించి చెప్పిన మొదటిభాగం ఆసక్తిదాయకంగా ఉండటమే కాకుండా మంచి సంకలనంగా పనికివస్తుంది. తిట్టుకావ్యాలనే భాగంక్రింద ఆకవిత్వచ్ఛాయతో ఉపజీవించే కావ్యాలనూ, ప్రక్రియలనూ ప్రయోగాలనూ సమగ్రంగా సమీక్షించటం జరిగిదింది. స్వయంగానూ, కావ్యాంగంగానూ తెలుగులో కనిపించే తిట్టుకవిత గుట్టుమట్టుల నన్నింటినీ వివరించే చక్కని సమీక్షాగ్రంథం ఇది. ఏ అంశాన్నైనా విషయసమగ్రంగా, విశ్లేషణాత్మకంగా, సాధికారంగా వివరించి చెప్పగల సహజవిమర్శకులు శ్రీ శర్మగారు. వారి సామర్థ్యాన్ని పుక్కిటపట్టిన గ్రంథం ఇది.

## ఋతుసంహిత - ప్రకృతివర్ణనలు

అకాడమీ వారు తెలుగుకావ్యాలలోని ఋతువర్ణనలమీదా, ఆపైనప్రకృతి వర్ణనలమీదా రెండంశాలను ప్రకటించారు. ఋతువర్ణనా వైశిష్ట్యమే కాకుండా ఋతుతత్త్వ మీమాంసకూడా చేయాలన్నట్లు "ఋతుసంహిత" అని సమస్య నిచ్చారు. శ్రీ మేడవరం వేంకటనారాయణశర్మగారు ఆ అంశాన్ని సామర్థ్యంతో నిర్వహించారు. శ్రుతిస్మృతి శాస్త్రపురాణోపనిషత్తుల్లో ఋతుప్రశంస ఎలాఉందో ఉపోద్ఘాతంలో పేర్కొని ఆరుఋతువుల వర్ణనలను ఆరధ్యాయాల్లో వివరించారు. చక్కని విషయసంపుటిమే కాక, సహృదయామోదం పొందే సాహితీసమీక్ష.

ప్రకృతివర్ణనల మీద ప్రత్యేకగ్రంథం రచించినగౌరవం శ్రీ చేకూరి చెన్నకృష్ణయ్యగారికి దక్కింది. ప్రకృతికీ సాహిత్యానికీ ఉన్న సన్నిహితమైన సంబంధాన్ని వివరించి, ఆంధ్రవాఙ్మయంలో ప్రసిద్ధకావ్యాలలో ఉన్నప్రకృతి వర్ణనలను సమీక్షించటమే కాకుండా వాటిలోని కవితాతత్త్వవిశేషాలనుగూడా వివరించారు. కొన్ని వర్ణనసంప్రదాయాలకు మూలపురుషు లెవరోనిర్దేశించారు. కావ్యప్రబంధ భావకవిత్వయుగాల్లో కవులదృక్పథం ప్రకృతివర్ణనలపట్ల ఎలాపరిణామం చెందిందో ఉల్లేఖించారు. ఆచార్యనారాయణరెడ్డిగారన్నట్లు - "సాధ్యమైనంతవరకు ఆయాకవుల కవితల్లోని పంక్తులనే తమవ్యాఖ్యలుగా మార్చుకున్నారు. అందువల్ల మొత్తం గ్రంథం ఒకనవ్య ప్రబంధంలా పఠనీయంగా పరమ రమణీయంగా రూపొందింది. ఈ రచనలో ఎక్కడా 'కసుక్కు' మని పించే విషమోక్తులూ లేవు; పనికిమాలిన పొగడ్తలూ లేవు."

## తెలుగుసాహిత్యములో రామకథ

తెలుగు సాహిత్యంలో రామకథ వెలసిన విధానాన్ని సమీక్షించిన గ్రంథమిది. పండా శమంతకమణిగారు ఈ విస్తృతమైన అంశాన్ని ప్రక్రియాపరంగా విభజించుకొని సమీక్షించారు. రామకథకు వాల్మీకి రామాయణం మూలం; ఆతరువాత సంస్కృత ప్రాకృతభాషల్లోనూ, భారతీయ భాషల్లోనూ ఆకథ వివిధ

సాహిత్య ప్రక్రియల్ని ఆశ్రయించి విస్తరిల్లింది. ఆయా భాషల్లో వెలసిన రామ కథా సాహిత్యాన్ని మొదట సమీక్షించి తెలుగు సాహిత్యంలో వెలసిన రామకథా కావ్యాలపై ఆయా కావ్యకల్పనల ప్రభావం ఎలాపడిందో పేర్కొనటం, తెలుగు కవులు స్వయంగా చేసిన నూత్నకల్పనలనూ వాటి సార్థక్యాన్నీ వివరించటం ఈ గ్రంథ ప్రణాళిక రంగనాథ రామాయణంనుండి రామాయణకల్పవృక్షందాకా సాగిన రామాయణ కావ్యాల్లో అవాల్మీకాలైన కల్పనలను పేర్కొంటూ, వాటికి మూలమైన కల్పనలను పరిశీలిస్తూ, నూత్నాంశాలను ఔచిత్యదృష్టితో విచారిం చటమేకాకుండా శ్లేషకావ్యాల్లోనూ, ఖండకావ్యాల్లోనూ, యక్షగానాది ప్రక్రియ ల్లోనూ ఇటువంటి అనుశీలనాన్ని సాగించారు. ఉత్తరరామాయణకథను చెప్పిన కావ్యాలనుకూడా ప్రత్యేకంగా సమీక్షించారు. రామాయణ కల్పవృక్షాన్ని ప్రత్యే కధ్యాయంలో పరామర్శించారు. మొత్తంమీద శిష్ట జానపద సాహిత్యప్రక్రియ లన్నింటిలో ప్రతిబింబించిన రామకథా స్వరూపస్వభావాలను సరళసుందరంగా వివేచించి చెప్పిన విమర్శగ్రంథమిది. రచయిత్రి పాటించిన కథనాత్మకశైలి రామకథా వివేచనాన్ని కమనీయంగా పఠిత కందించంలో సార్థకమైంది.

## ఆంధ్రకర్ణాట సారస్వతములు — పరస్పరప్రభావము

ద్రావిడభాషా కుటుంబంలోఅక్కాచెల్లెళ్లలా కర్ణాటాంధ్రభాషాసాహిత్యాలు వర్ధిల్లాయి. ఒక కుదురులో పుట్టిన ఈరెండుభాషాలకూ అనువంశికమైన లక్షణాలు కొన్నీ, పరస్పరప్రభావముద్రితాలైన లక్షణాలుకొన్నీ తప్పక ఉంటాయి. ఇప్పటికీ ఎన్నో సాహిత్యమర్యాదలకూ, పారిభాషిక పదాలకూ తెలుగులో ఇదమి త్థంగా అర్థాలు నిశ్చయింపబడలేదు. దాక్షిణాత్యభాషల అధ్యయనంవల్ల వాటి స్వరూపస్వభావాలు తేటపడవచ్చునని విమర్శకులు భావిస్తున్నారు. ఈ లక్ష్యాన్ని సాధించటానికి ఆచార్యనిడదవోలు వెంకట్రావుగారు రచించిన ఇటువంటి గ్రంథాలు ఎంతో ఉపయోగపడతాయి. లిపి, భాష్య,వ్యాకరణం, ఛందస్సు, సాహిత్యసంప్ర దాయాలు మొదలైనవాటిలో పరస్పర సంబంధాన్ని నిడదవోలువారు మొదట వివరించి, అతరువాత ప్రాఙ్నన్నయ యుగంనుండి నవీనయుగం వరకూ గల

ఆయా కవుల రచనలపై గల పరస్పర ప్రభావాన్ని పరిశీలించారు. ఎన్నో క్రొత్త విషయాలీభాగంలో ఉన్నాయి. ఇంకా చెప్పవలసినవీ ఉన్నాయి ప్రతిప్రయత్నం లోనూ అటువంటివి తప్పవు సిడదవోలువారు చూపిన కొన్ని ఉదాహరణలకు కొంతదూరాన్వయం ఉన్నదని అనిపించినా ఏ కొద్దిగానైనా ప్రభావం ఉన్నట్లున్న అంశాన్నికూడా ఏకరువుపెట్టటానికి వారు తీసికొన్న శ్రద్ధ ప్రశంసనీయమైంది. కర్నాటాంధ్ర ధాతువులను, సామెతలను పట్టీలుగా నిచ్చిపరితల కెంతో ఉపకారం చేశారు. వారి రచనకు విశ్లేషణం వెన్నెముక; ఉదాహరణం ఊపిరి.

## తెలుగుపై ఉర్దూపారశీకముల ప్రభావము

ఈ అంశంమీద డా॥. కె. గోపాలకృష్ణరావుగారు ప్రామాణికంగా రచించిన గ్రంథమిది వారిమాటల్లోనే ఈ గ్రంథవైశిష్ట్యాన్ని, స్వరూపస్వభావాలనూ తెలుసుకోవచ్చును "తెలుగులో ప్రవేశించిన వేలకొలది పారశీక ఉరుదూ పదముల గూర్చియు, ఆభాషల ప్రభావమున పదములం దేర్పడిన మార్పుల గూర్చియు, సాహిత్యప్రభావమునుగూర్చియు, ప్రత్యేకముగ తెలంగాణపు తెలుగుపై ఆభాషలు ప్రసరింపజేసిన ప్రభావమును గూర్చియు బరిశోధనము చేయుటకు జరిగిన తొలి ప్రయత్నము ప్రస్తుతగ్రంథరచనము...ప్రాచీనార్వాచీన కావ్యములలోని ప్రయోగముల నన్నింటిని చూపుట అనవసరమని భావించి ఒక్కొక్క యుగమునందలి విశిష్టకావ్యములందును, ఆయాయుగములలోని రచనలందును, గన్పట్టు విశిష్ట ప్రయోగములను శైలీవైవిధ్యమునకు వన్నెగూర్చిన ప్రయోగములను గ్రంథ పరిమితిని దృష్టిలో నిడికొని పరిశీలింపనైనది. ఉర్దూభాష సంకరభాష. అందు సంస్కృతము, ప్రాకృతము, హిందీ, తుర్కీ, అరబీ, పారశీ మున్నగు భాషాపదములు చేరినవి. తెలుగువారికి ఉర్దూభాషద్వారా పరిచితములైన కొన్ని శబ్దములును నిందు చేరినవి. భిన్న విభిన్నములైన సాహిత్య ప్రక్రియలందును ఉర్దూపారశీక ప్రభావమును సూచించు పదజాలమును గూర్చియు వివరము లొసగబడినవి. ఆధునిక సాహిత్యమున ఉరుదూపారశీక పదముల ప్రయోగములు లెక్కకు మీరి యున్నవి. స్థాలీపులాకన్యాయమున ఈ ప్రయోగములను భాషాశాస్త్రదృష్టితో పరి

శీలించుటయు జరిగినది. రెండవభాగమున అనువాద సాహిత్యము విమర్శింపబడినది. సాహిత్య సంప్రదాయములను నవలలు, కథానికలు, వినోదకథలు, పద్యకావ్యములు, గీతికలు, శాస్త్రగ్రంథములు మున్నగు వానినిగూర్చియు, ననువాద రీతులను గూర్చియు నిశితముగ బరిశీలింపనైనది. పదప్రయోగప్రకరణమునందు పదములకు మాతృక సూచింపబడినది. అవసరమగుపట్ల అర్థవివరణముకూడ కలదు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలేకాక ఉర్దూపారశీకాది భాషల్లోకూడా పాండిత ఉన్న డా॥ గోపాలకృష్ణరావుగారి వంటి బహుభాషాకోవిదులు చేయవలసినపనియే ఇది. స్పష్టత, సారళ్యం వారి రచనకు రెండుకాళ్లు.

## వ్యావహారిక భాషావికాసం - చరిత్ర

గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలు సాహిత్యలోకంలో దూమారంరేపాయి ఈ అంశం భాషాధ్యయన రూపంగా కాక సిద్ధాంతపరంగా బహుళంగా సాగింది. రెండువాదాల్లోనూ అభిమానాలు పెరిగి శాస్త్రీయమైన అంశాలకు గౌణమైనప్రాధాన్యం ఏర్పడింది. తెలుగు వారికి ఆసమస్యయొక్క సక్రమమైన అవగాహన ఎంతైనా అవసరమైఉన్నదన్న విషయాన్ని గుర్తించి అకాడమీవారీఅంశాన్ని ప్రకటించారు. డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు ఈ అంశాన్ని నిష్పాక్షిక వైఖరితో శాస్త్రీయదృక్పథంతో సరితూకమైన నిర్ణయబుద్ధితో ఈ గ్రంథాన్ని రచించి ప్రతిపాద్యాంశానికి న్యాయం చేకూర్చారు. వ్యావహారికానికీ, గ్రామ్యానికీ ఉన్న భేదాన్ని మొదట నిరూపించి, గ్రాంథికానికీ వ్యావహారానికీ ఉన్న బాంధవ్యాన్ని ప్రతిపాదించి, వ్యావహారిక భాషాస్వరూపస్వభావాలను వివరించి, వికాస చరిత్రను సమీక్షించి, ప్రామాణికభాషా వివేచనం చేసి వక్తవ్యాంశాన్ని వ్యక్తపరచారు. చరిత్ర చెప్తున్నా, వాదస్వభావాలను నిరూపిస్తున్నా, వక్తవ్యాంశాన్ని వివరిస్తున్నా ప్రామాణికంగా, శాస్త్రీయంగా విషయప్రతిపాదనంచేస్తూ, గ్రంథానికి చక్కని కథనవైఖరితో పఠనీయతను రమాపతిరావుగారు సంతరించారు. అటు గ్రాంథికవాదుల్లోనూ, ఇటు వ్యావహారికవాదుల్లోనూ కనపడే అతివాదాలను ఎత్తి చూపుతూ శాస్త్రీయదృక్పథాన్నీ, వ్యావహారికభాషా స్వభావ పరిజ్ఞానాన్నీ

పరితకు కల్పించే చక్కని రచన ఈ గ్రంథం. ఈ గ్రంథ రచనలో ఉపయోగించిన ఆకరసామగ్రి రచయిత కృషిని చాటి చెప్పుతోంది. గ్రాంథికభాషకూ, వ్యావహారికభాషకూ భేదం ప్రధానంగా అభివ్యక్తీకరణంలోనే ఉంటుందనీ, మాతృభాషలో విద్యాబోధన జరగాలని ఆశించినప్పుడు వ్యావహారిక భాషే ఆశ్రయం కాక తప్పదనీ, వ్యావహారికభాషఅంటే శిష్టభాష అవుతుంది కాని గ్రామ్యం కాదనీ, శిష్ట వ్యావహారికం అపభ్రంశభాష కాదనీ, ఆధునికమైన శైలిలో కన్పించే స్ఫూర్తీ, జీవమూ ప్రాచీన కావ్యభాషశైలిని అంటిపెట్టుకొని ఉండే రచనలలో కనిపించదనీ 1910నుండి 1914 వరకూ వ్యావహారిక భాషోద్యమంలో తొలిదశయనీ, గిడుగు గురజాడలే భాషాఉద్యమాన్ని తెలుగుదేశంలో ప్రవర్తింపజేసిన మహాపురుషులనీ, 1910నుండి గిడుగుయుగ మని భావించవచ్చుననీ ఈ అరవైయేళ్ళలో వివిధ ప్రక్రియలు వ్యావహారిక భాష వాహికగా ఆవిర్భవించాయనీ, గ్రాంథికవాదులు సరళగ్రాంథికమతాన్ని అంగీకరించటం ఈ వాదప్రభావమే అనీ, శిష్టవ్యావహారిక భాష కాలక్రమేణా మార్పు చెందుతుందనీ, దానినిబట్టే గ్రంథస్థభాష రూపొందుతుందనీ పేర్కొంటూ 'తెలుగుదేశంలో నేటి వ్యావహారికభాషే ప్రామాణికభాష. అదే నేటి గ్రాంథికభాష' అని ముగించారు. భాషనూ, సాహిత్యాన్నీ అధ్యయనం చేసే ప్రతివిద్యార్థీ చదువవలసిన గ్రంథం ఇది.

## సాహిత్య సమీక్షలు:-

## తిరుపతి వేంకటకవుల సాహిత్య సమీక్ష

అవధానాశుకవిత్వంతోనూ, కావ్యనాటకరచనంతోనూ తెలుగు కవిత్వానికి నూతనోత్తేజాన్ని కలిగించి యుగకర్తలుగా రూపొందినజంటకవులు తిరుపతి వేంకటకవులు. జంటకవులనంగానే కనిష్ఠికాధిష్ఠితులయ్యేవారువారే. శతావధానులే కాక శతాధిక గ్రంథకర్తలు. వారి సాహిత్యసమీక్ష ఇచ్చిన సమస్య. గ్రంథకర్త శ్రీశిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారు జంటకవుల జీవితవిశేషాలను చరిత్రగా కూరుస్తూ వారి సాహిత్యాన్ని సమీక్షించారు. 'తి. వేం. కవుల జీవితము – సాహిత్యము-

ఒకసమీక్ష, అని అంశం ఇచ్చిఉండే ఈ గ్రంథం దానికి చాలా అనువుగాఉండేది జీవితమే సాహిత్యముగా సాగించిన అజంటకవుల జీవితమే ముఖ్యమై సాహిత్యం తదనుసారిగా వర్ణించినట్లు గ్రంథస్వభావం తేటపరుస్తున్నది. గ్రంథం ప్రసన్నమైన శైలిలో కథా కథనాత్మకంగా సాగి పరితల్పి అందింపచేస్తున్నది. గ్రంథకర్త అష్టావధాని కావటంతో వారి అవధాన కవితావిశేషాలను సమర్థవంతంగా సంతరించారు. కావ్యాలలోగాని, నాటకాలలోగాని తిరుపతి వేంకటకవులు సాధించిన నూత్న ప్రయోగాలను పూర్వలాక్షణిక సిద్ధాంతాలతో సమీక్షిస్తే కొరుకుడుపడవు. దానికి పాశ్చాత్యప్రాచ్య సిద్ధాంతాల అవగాహనతో కూడిన సృజనాత్మక విమర్శక దృక్పథం కావాలి. శిష్టావారిది ప్రాచీన సంప్రదాయ మార్గం. ఆ పరిమితివల్ల కొన్ని ప్రక్రియల సమీక్షలో న్యాయంజరగలేదు. అయినా, తిరుపతి వేంకటకవులు జీవితసాహిత్య విషయాలను చాలవరకు క్రోడీకరించి చెప్పిన విలువైన గ్రంథమిది. విద్వాంసులకంటె విద్యార్థులకు చాలా ఉపయోగపడుతుంది. తిరుపతి వేంకటకవుల సాహిత్యంమీద పరిశోధనాత్మకమైన రచనలింకా రావలసి ఉన్నదన్న సత్యం ఈ గ్రంథం చదివాక పండితుల కేర్పడుతుంది అకాడమీవారిచ్చిన అంశంలోని సాహిత్యసమీక్షకే రచయిత ప్రాధాన్యం కలిగించినట్లైతే గ్రంథం మరింత ప్రౌఢంగా తయారై ఉండేది. ఏమైనా సరసమైన రచన.

## షేక్స్పియర్ సాహితీ పరామర్శ

షేక్స్పియర్ ప్రపంచ విఖ్యాతిగాంచిన మహాకవి. ఆయన 400వ జన్మదినోత్సవం 1964లో జరిగింది. దాన్ని పురస్కరించుకొని అకాడమీవారు ఈ అంశాన్ని ప్రకటించినట్లున్నారు. మంచిపని చేశారు. "షేక్స్పియర్‌ని గురించి ఇంగ్లీషుభాషలో వందలాదిగా పుస్తకాలూ, వ్యాసాలూ వున్నాయి. తెలుగులో ఒక్కటైనా ఉందనుకోను" అని శ్రీ బుచ్చిబాబుగారన్నమాట నిజం. అందువల్ల వారే ఈ గ్రంథరచనకు పూనుకోవటంవల్ల కూడా మరోమంచిపని జరిగింది. ఆ మంచి యేమిటో వారి గ్రంథ రచనోద్దేశంవల్ల స్పష్టమౌతుంది–"ఆంగ్లభాషతో

గాఢమైన పరిచయం లేక, పెద్దపాండిత్యమూ లేక, షేక్స్పియర్ని గురించి తెలుసుకోవాలని కుతూహలపడే సామాన్యపాఠకు లెందరో వుంటారు. వారిని ఉద్దేశించే ఈపుస్తకం వ్రాశాను. సుళువుగా, సూటిగా ప్రధానభావం అర్థమయ్యే లాగున, వ్యావహారికభాషలో, పొడిమాటల్లో, విషయం సుబోధకం చెయ్యడమే తలపెట్టాను కాని, మక్కికి మక్కి, మూలంలో ఉన్న తికమకల్నీ, వైవిధ్యాన్నీ ఎఱుకపరిచే పెద్దపెద్దమాటల్లో అనువదించటం ఉద్దేశంకాదు." షేక్స్పియర్ సాహిత్యవిమర్శను పండితులు ఇంగ్లీషులోనే చదువుకోవచ్చు. సామాన్యపాఠకుణ్ణి ఉద్దేశించి రచించిన ఈ రచన ప్రసన్నంగా మధురంగా ఉంది. అంతటి ఆంగ్ల మహాకవిని గురించి వ్రాస్తూ బుచ్చిబాబుగారు ఒక్క ఇంగ్లీషుకొటేషన్ వాడకుండా తెలుగుభాషచ్ఛాయనే ఇస్తూ రచనచేయటం అద్భుతమనిపిస్తుంది. తెలుగులో సూటిగా షేక్స్పియర్ అర్థమౌతాడీ గ్రంథంలో. ఆమహాకవి జీవిత విశేషాలూ ఆనాటి సామాజికస్థితిగతులూ, సానెట్లూ, కావ్యాలూ, నాటకాలూ, అతని విమర్శకులూ - మొదలైన అంశాలనుగురించి ఎన్నో గాఢమైన విశేషాలను సరళంగా తెలుగులో వివరించారు బుచ్చిబాబుగారు. ఇది ఆ కవి సాహిత్యాన్ని ఈరచయిత చేస్తున్న పరిచయమేకాదు. ఎందరో విమర్శకుల దృక్పథాలను మేళవించుకొని రూపొందించిన సమీక్ష. విశ్వఖ్యాతిగాంచిన మహాకవి సాహిత్యవ్యక్తిత్వ విహంగ వీక్షణం !

## గాంధీ సాహిత్య సమీక్ష

డా॥ అడపా రామకృష్ణరావుగారీ గ్రంథాన్ని చక్కని లక్ష్యశుద్ధితో రచించారు. గాంధీజీ శతవార్షిక జన్మదినోత్సవ సందర్భంగా దీన్ని ఉపహారంగా సమర్పించారు "గాంధీజీరచనలు ఆయన వ్యక్తిత్వాన్ని స్పష్టంగాప్రదర్శించవు. ఆయనవ్రాతలకన్న ఆయనచాలా ఉన్నతుడు" అని పండిత జవహర్లాల్ నెహ్రూగా రన్నారు. డా॥ రావుగారు గాంధీజీ సాహిత్య సమీక్షను గాంధీజీ వ్యక్తిత్వాన్ని రూపుకట్టేటట్లు సాగించి కృతకృత్యులయ్యారు. 'భావసాగరమథ' నాథ్యా

యంలో రచయిత గాంధీజీ జీవితాన్ని సత్యశోధనంగా భావించి సాగించి సాధిం చిన విధాన్ని వివేచనాత్మకంగా వివరించారు. పత్రికారచనం గాంధీజీకి సంయ మనాన్ని నేర్పి, సేవాధర్మాన్ని పాటించటానికి అవకాశం కల్పించిందనీ, గాంధీజీ సాహిత్యాన్ని అధ్యయనం చేస్తే 'ఆయన ఇహపరాలను వేరుచేయక జీవితాన్ని సమగ్రదృష్టితో చూచాడనీ, ప్రాపంచికకర్మలను కూడా ఈశ్వరారాధనగా భావించి శ్రద్ధగా, నైతికంగా ఆచరించాలని బోధించాడనీ, కేవలంధర్మపన్నాలను వల్లించడం గాక ఆ విధంగా జీవించడానికి శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మి కంగా పాటించవలసిన సూత్రాలన్నిటినీ స్వయంగా నిత్యజీవితంలో పరీక్షించి, సుఖాంతులతో నిత్యాభ్యుదయ పథంలో జీవయాత్ర సాగించటానికి నిశ్చయంగా ఫలప్రదమైన ప్రణాళికను తనరచనలలో" నిరూపించినట్లు స్పష్టమౌతుందని గ్రంథకర్త పేర్కొన్నారు. సత్యదృష్టిగల సమగ్రసమీక్ష ఇది.

## శ్రీ అరవిందుని కవిత

ఆధునిక భారతాత్మకు శివప్రతినిధి గాంధీజీ, సౌందర్య ప్రతినిధి రవీంద్రులు; సత్యప్రతినిధిఅరవిందులు. అరవిందులు మహామేధావి తాత్త్వికుడు. మహాకవి, మహాయోగి. ఆయన కవిత వారి ఆధ్యాత్మికవ్యక్తిత్వానికి దివ్యదర్ప ణం. వారి దృష్టిలో "The aim of poetry, as of all time Art, is neither a Photographic or otherwise realistic imitation of Nature, nor a romantic furbishing and painting or idealistic improvement of her images but an interpretation by the images she herself affords us not on one, but on many planes of her creation, of what-which she conceals from us, but is ready, when rightly approached, to reveal." దాదాపొక లక్షపంక్తులలో రచింప బడిన అరవిందునికవితను శ్రీ జి. వి. ఆర్. కృష్ణారావుగారు ఎనిమిది అధ్యాయా

ంలో వివేచనాత్మకమైన సంగ్రహసమీక్ష చేశారు. "శ్రీ అరవింద కవితని అపూర్వ పాండిత్య, అపారవిజ్ఞాన సమేతము; అద్భుతకళాఖండము; ఉదాత్తభావ సహితము; ఆనందహిత దాయకము; ఆధ్యాత్మికతా సచ్చిదానంద స్వరూప-స్వభావ బోధకము స్థూలముగ భూతభవిష్యద్వర్తమానములలో విశ్వ, మానవ-జీవన – సృష్టి - పరిణామ క్రమపు విశదీకరణమే ఈ కవిత్వలక్ష్యము. ఇతివృత్తము: అసంఖ్యాకములు- ప్రాచ్య ప్రతీచీ పౌరాణిక గాధలు, ఇతిహాసములు, చరిత్ర, విశ్వ - మానవ - నాగరకత, భౌతిక, ఆధ్యాత్మిక దృక్పథములు, విలువలు; ఉత్తమ అనువాదములు - సమకాలిక పరిస్థితుల విమర్శ; మానవ మనస్తత్వము, ఆత్మపరమాత్మల అస్తిత్వము - సంబంధము ... ఇట్టివిషయాలెన్నో ఆకవిత్వమునందిమిడియున్నవి. శ్రీ అరవిందుల లేఖిని సజీవ-నిర్జీవ-భావనా ప్రపంచములలో స్వేచ్ఛావిహారము సర్పినది వారు రచించిన 'సావిత్రి' అత్యంతదీక్ష - శక్తిమంతమైన మంత్ర కవనము. అధ్యాత్మ సత్యముల సర్వస్వము. ఈ గ్రంథమునకు ప్రపంచసాహిత్యములోనే గొప్పస్థానమున్నది." అన్న తాత్పర్యమే ఈ గ్రంథరచనకు ప్రాతిపదిక. ఆయా అంశాలను దృష్టాంత సహితంగా రచయిత వివరించారు. అరవిందుల కవితను ప్రాచ్యపాశ్చాత్య మహాకవులకవితతో పోల్చిచేసిన తులనాత్మక పరిశీలనం కవితాప్రాశస్త్యపతాక. తత్త్వగంభీరమైన కవితాసముద్రాన్ని తమరచనా యానపాత్రంతో తరిస్తూ పఠితను విహారయాత్రకు తీసికొనివెళ్లగలిగారీ గ్రంథంచయిత.

### జీవితచరిత్రలు - రచనలు :-

### డాక్టర్ సి. ఆర్. రెడ్డి జీవితచరిత్ర
### కాశీనాధుని నాగేశ్వరరావుగారి జీవితము - సాహిత్యము.

జీవితచరిత్రల రచనలో సిద్ధహస్తులు శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారు. వారు వ్రాసిన ఈరెండుజీవితచరిత్రలూ ఆ ప్రక్రియకే ప్రమాణాలుగా నిలుస్తాయి. నార్లవారన్నట్లు "దేశచరిత్రల రచనకు వలె జీవితచరిత్రల రచనకు

సయితం ఎంతగానో పరిశోధన చేయాలి. దాని ఫలితాలను వున్నవి వున్నట్లుగా లోకంముందు పెట్టాలి. జీవితచరిత్రకారుడు ... వెలుగుతోపాటు నీడలను చూపించాలి. ఎత్తులతోపాటు పల్లాలను కనబరచాలి, విజయాలతోపాటు పరాజయాలను వివరించాలి." తన గ్రంథ కథానాయకుణ్ణి చిత్రించటంలో నిర్లిప్తమైన సత్యదృక్పథమే కాకుండా, అభిమానంతోకూడిన ఆదర్శభావంగూడా జీవిత చరిత్ర రచయితలకు ఉండటం సహజం. అయితే అభిమానాన్ని సంయమనం చేసికొని వాస్తవచిత్రణంచేసే ప్రవృత్తిని ప్రకటితంచేసిన రచయిత ప్రామాణికుడనిపించుకుంటాడు. శ్రీ వెంకటసుబ్బయ్యగారి కటువంటి ఆవేశమెంత ఉందో సంయమనంకూడా అంతఉంది డా॥ సి. ఆర్. రెడ్డిగారు బహుముఖప్రజ్ఞాశాలి, కవి, మహావిమర్శకుడు, మహావక్త, వాదచతురుడు, సంభాషణల్లో అసమానుడు, హాస్యకుశలుడు, పార్లమెంటేరియన్, విద్యావేత్త. అన్నిట్లోనూ అసమానుడనిపించుకొన్నాడు. ప్రతిరంగంలోనూ క్రొత్తపోకడలను ప్రవేశపెట్టాడు. ఆధునిక దృక్పథం ఆయన ఆలోచన విధానం. ఆయన జీవితవిశేషాలతోపాటు సమకాలీన సమాజ వాతావరణంలో ఆయన సాధించిన ప్రగతిని సమీక్షించటం ఈ జీవిత చరిత్రలో విశేషం. కావ్యప్రక్రియల్లోనూ, విమర్శ విధానంలోనూ, విశ్వవిద్యాలయ రూపకల్పనంలోనూ ఆయన సాధించిన అభ్యుదయ లక్ష్యాలను వివరించటంలోకూడా ఈ గ్రంథ రచయిత కృతకృత్యుడయ్యాడు. సి. ఆర్. రెడ్డిగారిలో సహజంగా ఉన్న వైరుధ్యలక్షణాలను వ్యక్తీకరించినట్లైతే బాగుండేదని నార్లవారు అన్నమాటలో సత్యం లేకపోలేదు.

దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు జీవితచరిత్ర నవలగా సాగిన నాణెమైన రచన. "నాగేశ్వరరావుగారి చరిత్ర అనగా నవ్యాంధ్రయుగచరిత్ర పంతులుగారి జీవితమంతా ప్రజాజీవితం. ఇంతపూర్తిగా ప్రజలలో ఐక్యమైన మహనీయమూర్తిఆరుదు యోగిజనసాధ్యమైన అంతటి సర్వసమభావం సాధనవల్ల సిద్ధించింది వారికి. ఆయన వదాన్యత ఆయన సాహిత్యసేవను విస్మరింపజేసినది. నాగేశ్వరరావుగారు ఆంధ్రులలో విద్యా

వికాసము కలిగించి, ఆంధ్రులు ఎక్కడవున్నా అందరూ ఒకటే అనే భావాన్ని కలిగించడానికి ఆంధ్రవారపత్రిక, దినపత్రిక, భారతి, ఆంధ్రగ్రంథమాల స్థాపించి ఆంధ్రులకు అర్పించారు. ఇవన్నీ ఆంధ్రులవేకాని, ఆయనవి కావు. ఆయన విశ్వదాతేకాదు; విజ్ఞానదాతకూడా'' అన్నది ఈ గ్రంథతాత్పర్యంగా రచయితపంతులుగారి సాహితీసేవను వివరించటంలో అత్యంతశ్రద్ధనుచూపారు. అయితే, వారి సాహితీవ్యక్తిత్వాన్ని చిత్రించటంలో మరికొంత ప్రజ్ఞచూపియుంటే బాగుండేది. దాన్ని భావి పరిశోధకులకు వదలిపెట్టారు జీవితచరిత్ర పరిధిలో దాన్ని చేర్చిందానికంటె ప్రత్యేకపరిశోధనాంశంగా దాన్ని చేపట్టితే బాగుంటుందని వారి భావం కావచ్చు ఇంకా ఆ అవకాశం ఉందని ఈ గ్రంథం సూచిస్తోంది. ఈ మహనీయవ్యక్తుల జీవిత విశేషాలను సేకరించి, సంపుటీకరించి, వర్గీకరించి వివేచించిన వెంకట సుబ్బయ్యగారి కృషి అభినందనీయం.

## మల్లినాథసూరి జీవితము - రచనలు

పదవాక్యప్రమాణపారావార పారీణుడూ, మహోపాధ్యాయుడూ, వ్యాఖ్యాతృచక్రవర్తీ అయిన మల్లినాథసూరి తెలుగువాడు కావటం మనఅదృష్టం, ఆయన జీవిత విశేషాలనూ, ప్రతిభాపాండిత్యాలనూ తెలిపే ఈ గ్రంథం తెలుగు వారికి ఆమహావ్యాఖ్యాతయొక్క సాహితీమూర్తిని ప్రత్యక్షీకరిస్తున్నది. మల్లినాథ నామధేయు లెందరో ఉండగా వారిలో - కోలచలవంశీయుడూ, కాకతిప్రతాప రుద్రునిచే కనకాభిషేక గౌరవంపొందినమల్లినాథశతావధానికి మనుమడూ, శ్రౌత కల్పానికి వ్యాఖ్యవ్రాసినవాడూ, వేదవేదాంగవేత్తా అయిన కపర్దిపండితునకు కుమారుడూ, ప్రతాపరుద్రీయానికి రత్నాపణవ్యాఖ్యవ్రాసిన కుమారస్వామి సోమపీథికి తండ్రీ, రఘువంశాది కావ్యాలకు వ్యాఖ్యలు రచించినవాడూ అయిన మల్లినాథసూరిని, నిర్ధారించి కాలనివాసాది విశేషాలను నిరూపించి, మల్లినాథుడని కొందరు భ్రమించిన పెద్దభట్టును అతని పెద్దకుమారుడే అని ధ్రువపరచి, బహు వ్యాఖ్యాతల వ్యాఖ్యలతోమల్లినాథుని వ్యాఖ్యలను తులనాత్మకంగా పరిశీలించి అతని వ్యాఖ్యాతృచక్రవర్తిత్వాన్ని స్థాపించి, అతనివ్యాఖ్యాన విశేషాలను వివరించి, అనేక

జీవిత సాహిత్యాంశాలను సంపుటీకరించిన విలువైన గ్రంథమిది. విషయం గహనమైన దైనా చక్కని విషయ విభాగంతో సరళమధురమైన శిష్టవ్యావహారికశైలిలో ఈ గ్రంథరచనాన్ని నిర్వహించిన కీ. శే. బృందావనం రామానుజాచార్యులూ, శ్రీ గుమ్మా శంకరరావుగారూ అభినందనీయులు. మల్లినాథుని బహుశాస్త్రవైదుష్యాన్ని వివరించినభాగం లోతైనవివేచనతో కూడి ఉన్నది. వ్యాఖ్యాతల జీవితాలను, కృషిని విలువకట్టే విధానంలో చక్కని మార్గంచూపే గ్రంథం ఇది

## బహుమతిని పంచుకొన్న గ్రంథాలు

సాహిత్య అకాడమీ మూడంశాలమీద రెండేసి గ్రంథాలకు బహుమతిని రెండుగా పంచి ఇద్దరి రచయితల కిచ్చింది. అంటే ఆ రెండు గ్రంథాలూ సమాన ప్రమాణాలతోనైనా కూడి ఉండాలి; రెంటినీ చదివితే తప్ప విషయం సమగ్రం. ఇందుట్లో ఉత్తమమైన మొదటిపద్ధతికే ఆయారచనలు చేరిఉండటం ముదావహం. ఈ వరుసలో మొదటిపేర్కొనదగిన ''విజయనగర సంస్థానములు'-సారస్వత పోషణ' అనే అంశంమీద వచ్చిన రెండు గ్రంథాల నిదివరకే సమీక్షించటం జరిగింది.

## సురవరం ప్రతాపరెడ్డి జీవితము — రచనలు

ఈ అంశం మీద శ్రీ ముద్దసాని రామిరెడ్డి, శ్రీ ఎల్లూరి శివారెడ్డిగారలు రెండు గ్రంథాలు రచించారు. రామిరెడ్డిగారి గ్రంథాని కదేపేరు ఉంచబడింది; శివారెడ్డిగారి పుస్తకాని[1] 'రచనలు' బదులు 'సాహిత్యము' అని మార్చబడింది. ఇద్దరూ నేనంటే నేనని గ్రంథాలు వ్రాశారు. అయితే, రామిరెడ్డిగారి రచనచేయి తిరిగిన పాత్రికేయుడు వ్రాసినట్లుంటుంది. శివారెడ్డిగారు పరిశోధకుని మార్గాన్ని అనుసరించి తీర్చినట్లుంటుంది. ప్రతాపరెడ్డిగారి జీవితవిశేషాలను తెలపటంలోనూ, విద్వాంసుడుగా, కవిగా, పత్రికాసంపాదకుడూ, బహుభాషావేత్తగా, పరిశోధకుడుగా, సాంఘికచరిత్ర నిర్మాతగా, నాటకకర్తగా, నవలాకర్తగా, వ్యాసరచయితగా, విద్యావేత్తగా రెడ్డిగారి వ్యక్తిత్వాలను వారిరచనల నాధారంగా చేసికొని సమీక్షించటంలోనూ ఇరువురూ దాదాపు ఒకేవిధమైన ఆకరాలను ఆధారంగా చేసికొని తమగ్రంథాలను నిర్మించారు. వింగడింపు వేరైనా విషయవిన్యాసం

ఒకటే. సమీక్షాత్మకాలైన చక్కని గ్రంథాలు రచించిన ఇరువురు రచయితలూ అభినందనీయులు.

## వావిళ్లవారి వాఙ్మయసేవ

అకాడమీవారు 'వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు చేసిన తెలుగువాఙ్మయసేవ' అనే అంశాన్ని ప్రకటించారు. గ్రంథకర్తలు వావిళ్ల వంశంవారి జీవితవిశేషాలూ, వారుచేసిన వాఙ్మయసేవనూ చిత్రించారు. రచయితల విశాలదృక్పథంవల్ల మంచి పుస్తకాలు వెలువడినవని చెప్పాలి బహుమానాన్ని పంచుకున్న గ్రంథకర్తలలో మొదటివారు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు తమగ్రంథానికి "వావిళ్లవారి వాఙ్మయసేవ'' అని పేరుపెట్టారు; రెండవ వారైన శ్రీమరుపూరు కోదండరామరెడ్డి గారు "ఆంధ్రవాఙ్మయము - వావిళ్ల" అన్నారు. వెంకటరమణయ్యగారి గ్రంథం వావిళ్ళవారి వాఙ్మయసేవను వివిధ సాహిత్యప్రక్రియా విభాగాన్ని అనుసరించి వివరింపబడింది. కోదండ రామరెడ్డిగారి రచన ముద్రణ, ప్రచురకళా వికాస సమీక్షలో వావిళ్ళవారి ప్రత్యేకతను పరిశీలించింది. ఒకటి సాహిత్యపరమైన రచనగా రాణిస్తే, మరొకటి సాంకేతికప్రక్రియాత్మకంగా సౌరు నింపుకొన్నది. ఈ రెండు గ్రంథాలూ చదివితే పరితకు వావిళ్ళవాఙ్మయసేవయేకాక, గ్రంథ ప్రచురణకళా వివేకంగూడా కలుగుతుంది. ఈ సమస్యకు గ్రంథాలు రెండు రెక్కలు.

## తెలుగులో ఛందోరీతులు

ఒకశాస్త్రీయమైన అంశంలో మౌలికంగా ఆలోచించి నూత్నదృక్పథాలను మార్గాలనూ ప్రవేశపెట్టగల సృజనాత్మక విమర్శకులు శతాబ్దాం కొకడుగా పుడు తుంటారు గిడుగు రామమూర్తి పంతులుగారు, గిడుగు సీతాపతిగారూ ఆ కోవకు చెందిన విమర్శకులు. వ్యావహారికభాషావాదంలోనూ, సవరభాషకు లిపి వ్యాకరణ నిఘంటు నిర్మాణంలోనూ ఆ తండ్రీ కొడుకులు చేసిన కృషి మహో న్నతం, భావిమార్గదర్శకం. డా॥ గిడుగు సీతాపతిగారు తెలుగు ఛందస్సులలోని, రహస్యాలను ఆవిష్కరించి క్రొత్తపుంతలను చూపించి ఆరంగంలోనూ సృజ నాత్మకవిమర్శకు లనిపించుకున్నారు. దాదాపు నూటయాభై సంవత్సరాల

తరువాత ఛందస్సుమీద ఇంతటి పరిశోధ నాత్మక గ్రంథం వచ్చినందుకూ పండితులు హర్షాన్ని వెలిబుచ్చారు. ఈ గ్రంథంలో ఉన్న మౌలిక పరిశోధనాంశాలను పేర్కొంటూ వాఙ్మయమహోధ్యక్షులు డా॥ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు ఈ గ్రంథాన్ని పరిచయం చేశారు. అందులోని అంశాల నుట్టంకిస్తే ఈ పరిశోధన పరిశ్రమ పాఠకులకు అవగత మౌతుందని భావిస్తాను.

"1. ఒకేవృత్తమును భిన్నమాత్రాకములైన పదములతో భిన్నగతులతో నడిపించవచ్చును. ఈవిషయమును శ్రీ సీతాపతిగారే కందపద్యముల పోకడలు చెప్పుచు నిరూపించిరి.

2. వినూత్నమతైన ఛందోరీతులను ఉపయోగములోనికి తెచ్చుకొనవలెనన్న చక్కని లయజ్ఞానము, లయానుగుణమైన పదబంధజ్ఞానము నుండి తీరవలెను. సంపూర్ణమైన లయజ్ఞానము, సంగీతశాస్త్ర పరిజ్ఞానము, ప్రత్యేకమైన లయలతో వివిధగతులతో బహుళపద్ధతులలో వృత్తగీతాది రచనలు చేయగల కవితాశక్తి సామర్థ్యము శ్రీ సీతాపతిగారిలో మూర్తీభవించి ఉన్నవి ... (అందువలననే) ఆంధ్ర ఛ్ఛందోరీతులను గురించి చక్కని సునిశితమైన విమర్శనా గ్రంథమును రచింపగలిగినారు.

3. ఉచ్చారణవిధి ననుసంరించి "అ ఆ ఐ ఔ లకు మతి ఇ ఈ లు ఋకార సహిత" మిత్యాదులలో హ్రస్వాచ్చు గురువగుటను శ్రీ సీతాపతిగారు ప్రతిభాపూర్వకముగా విమర్శించినారు.

4. వైదికచ్ఛందోరీతులనుగురించి అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లుగా శ్రీ సీతాపతిగారు వివరించిరి.

5. పద్యరచన పుట్టుపూర్వోత్తరముల వివరించుటలోను, జానపదగేయముల వివిధ గతులను తెలుపుటలోను అనేక నూతన విషయములను లోకమున కందించినారు.

6. తెలుగులో నున్న సూర్యచంద్రగణములను తదితర గణములను తమిళ కన్నడ గణస్వరూపములను తులనాత్మకముగా విమర్శించి వీని కున్న పరస్పర వ్యత్యాసమును, సంబంధములను వివరించిన తీరు మనకాశ్చర్యము కలిగించును,

7. సీసభేదములకు సంబంధించిన విషయములను మరింత విపులముగా నీ ఛంధోరీతులలో చేర్చుట ప్రత్యేకముగా గుర్తింపవలసిన విషయము.
8. ద్విపద రగడల నడకలను రీతులనుగుర్తించి అతిసూక్ష్మముగా వివరించి నారు.
9. 'వడి' శబ్దమునకు మూలము ప్రాచీన ద్రావిడ పదమైన 'వదు' శబ్దమని సీతాపతిగారనుట మామ్మాటికి సత్యము.
10. ప్రసిద్ధములైన అఖండవళులను గ్రాహ్యములైన వాని నంగీకరింపక తప్పదన్న శ్రీ సీతాపతిగారి భావము శిరోధార్యము.
11. దేశిచ్ఛందమును ఏ పద్ధతులలో రచింపవలెనో తెల్పుచు – ఆరవ ప్రకరణము వ్రాసినారు."

## వీరరసము. (ఆంధ్రసారస్వతము)

ఈ వ్యాసకర్త వ్రాసిన గ్రంథ మిది. నాగ్రంథాన్ని నేనే సమీక్షించటం న్యాయం కాదు. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారన్న మాటలను మాత్రం ఉదాహరించి ఊరుకుంటాను.

"1. విశ్వవిద్యాలయములలో పరిశోధన పట్టమును పొంద దలచినవారు సమర్పించు సిద్ధాంత వ్యాసముల కోవకు చెందిన దీరచన.
2. వీరి మతమున వీరమే సర్వమానసిక ప్రవృత్తులకును బీజభూతము. వీరమునకు స్థాయిభావము ఉత్సాహము. కామమే మానవుని యెల్ల యిచ్ఛాశక్తులకు పునాదియని యంగీకరించినవారు కూడ వీరము లేనిదే కామము శోభావిహీన మగునని యొప్పుకొందురు. కావున కామము కంటెను మూల ప్రవృత్తి యుత్సాహరూపమైన వీరమని అంగీకరింపక తీరదు. ఇట్లు వీరమే "రసానాంరసః" యన నొప్పియున్నది.
3 అచ్యుతరాయలు కనుగొన్న 21 వీరరసభేదములకును. బుద్ధిమంతులైన సుబ్రహ్మణ్యముగారు మఱి మూడింటిని చేర్పఁగలిగిరి. అవి: స్వాతంత్ర్య వీరము, యశోవీరము, మానవీరము.

సాధారణప్రమాణాలు తప్పక ఉండాలి. పోటీకివచ్చిన రచనల్లో ఉత్తమంగా ఉండాలి. అంతేకాని, ఆ విషయంమీద వెలువడిన ఆదర్శగ్రంథంగా ఉండ వలసిన అవసరంలేదు. ఒక వేళ ఉంటే హర్షింపదగిన అంశం. పోటీకి మొదట

4. ఆంధ్ర మహాభారత రామాయణములలోని ముఖ్యరసము వీరరసాంతర్భావితమని వీరు సయుక్తికముగ నిరూపించిరి. ఇచ్చట గ్రంథకర్తగారు ప్రశంసనీయమైన స్వతంత్రా లోచనమును, సాహసనిర్ణయములు చేయు శక్తియు ప్రదర్శించిరి. మహాభారతము శాంతరస ప్రధానమనియు, రామాయణము కరుణరసాత్మకమనియు ఆనందవర్ధనాదులగు ప్రాచీనాలంకారికులు నిర్దేశించిరి. సుబ్రహ్మణ్యముగారు సవినయముగనే వీరియుక్తులను ప్రత్యాఖ్యానము చేసి ఈ మహాగ్రంథము నందలి అంగిరసము ధర్మవీరమనియు, శాంతకరుణ రసములు దీని కంగములుగా భాసించుచున్నవనియు సాగించిన చర్చ సోపపత్తికము, గంభీరమునై యొప్పుచున్నది.

5. సంపూర్ణ కావ్యములందు వీరరస వివేచనము చేయుటతో బాటుగ శ్రీ సుబ్రహ్మణ్యముగారు ఆంధ్ర లఘుకావ్యములందు, ముక్తకములందు, నవలలు, నాటకములు మున్నగు బహుళసాహిత్య ప్రక్రియలందు వీరరస ఘట్టముల ననుసంధించుచు తమరసనౌకను విహరింపజేసినారు. ఈ గ్రంథము నామూలాగ్రముగ చదివిన తరువాత ఆంధ్రవాఙ్మయము శృంగారప్రధాన మనుభావము తొందరపాటుచే కల్గినదేకాని వాస్తవము గాదని నిరూపిత మగును."

## వీరరస కావ్యాలు :-

వీరరస ప్రాధాన్యాన్ని అకాడమీవారు గుర్తించినట్లుగా వీరరస ప్రధానాలైన దృశ్యశ్రవ్య కావ్యాలను పోటీకి అంశాలుగా వెల్లడించారు. డాక్టర్ బదుగు సీతాపతిగారు "కట్టబొమ్మ" అనే నాటకాన్ని, శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు గారు "విజయముద్ర'' అనే కావ్యాన్ని రచించి బహుమతులు పొందారు. మరో రెండు చక్కని వీరరసకావ్యాలకు దోహదం కలిగించిన అకాదమీవారిని అభినందింపక తీరదు. సృజనాత్మక రచనలకు బహుమతి రావటంకూడా ఈ రెండింటికే అన్నవిషయం గమనింపదగింది.

సంస్కృత కావ్యసమీక్షకు శ్రీ వేదం వెంకట్రామన్ గారి బాణుని కాదంబరి - దాని విశిష్టత, సంస్కృత ప్రక్రియా సమీక్షకు డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి, సూరం శ్రీనివాసులుగార్లు రచించిన "సంస్కృత భాణ సాహిత్యం" పేర్కొనవచ్చు. 'తెలుగునవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ' అనే గ్రంథానికి

క్రొత్తగా బహుమతి ప్రకటింపబడింది. శ్రీ కోడూరి శ్రీరామమూర్తిగారు దానికి కర్త. నేనీ గ్రంథాలను ఇంకా చదువలేదు ఏమైనా మనోవిశ్లేషణాత్మక మైన విమర్శనలకు రామమూర్తిగారి గ్రంథం ఒక చక్కని మార్గం వేస్తుందను కుంటాను. ఇలాగే వివిధ సాహిత్యవిమర్శ ప్రస్థానాల ప్రస్తారాన్ని చేయగల గ్రంథాలు రావలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఏ ప్రయత్నమైనా అవిచ్ఛిన్నంగా కొంతకాలం సాగితే దానికి చరిత్రలో ఒక చోటుదొరికే అవకాశం ఉంది. అలాగే అకాడమీవారి వార్షిక బహుమాన కార్యక్రమం ఇరవై యేళ్లనుండి సాగుతూ ఒక సంప్రదాయాన్ని సృష్టించింది. ఈ సంవత్సరం వచ్చే క్రొత్తపుస్తకాలేవో పేర్లుముందే తెలుస్తాయి. వాటి తీర్పుమాత్రం ప్రకటించిన తరువాత స్పష్టమౌతాయి. చేయితిరిగిన రచయితలూ, శ్రీకారం చుట్టిన రచయితలూ ఈ యజ్ఞంలో పాల్గొన్నారు. కొందరి కీపథకంవల్ల మొదటి సారి సాహిత్యలోకంలో గుర్తింపుగూడా వచ్చింది ఈవిధంగా క్రొత్తరచయితలను ప్రోత్సహించటానికి ఈ కార్యక్రమం దోహదంకావటం ముదావహం.

బహుమతి పొందిన గ్రంథాలను పరిశోధనాత్మకాలనీ విమర్శనాత్మకాలనీ, సమీక్షాత్మకాలనీ మూడువిధాలుగా విభజించవచ్చు. అందులో ఉత్తరోత్తరాలు అధికంగా వెలువడ్డాయని సమీక్ష స్పష్టంచేస్తుంది. పరిశోధనలోనూ, విమర్శన లోనూ ప్రధానంగా కావలిసింది సృజనాత్మకత. దాన్ని నూత్న దృక్పథం కల ప్రతిభావంతుడే సాధింపగలడు ఇచ్చిన ఏ అంశమైనా చేపట్టినవాని సామర్థ్యాన్ని బట్టి దాన్ని నిర్వహించే తీరు ఉంటుంది. అయితే విషయంకూడా సమస్యాత్మకంగా ఉంటే రచయిత ఒకదృక్పథాన్ని సారించటానికి వీలౌతుంది సమస్యాత్మకమైన అంశాన్ని ఎన్నుకొనటంలో మరికొంత శ్రద్ధవహిస్తే, అకాడమీ బహుమానాలు పొందే గ్రంథాలు సృజనాత్మక పరిశోధనకు, విమర్శకు మరింత దోహదం చేసే వీలుంటుంది.

బహుమతిపొందిన గ్రంథాల సమీక్ష ఈవ్యాసంలో చాలవరకు పరిచయాత్మకంగానే సాగింది. బహుమానం వచ్చిన గ్రంథం పండితులైన పరీక్షకుల మన్ననలను పొంది ఉండటం తథ్యంకదా! యూనివర్శిటీ పరిశోధనపట్టాలు పొందిన సిద్ధాంత వ్యాసాలూ, అకాడమీ బహుమతిపొందిన గ్రంథాలూ ఒకకోవకు చెందుతాయి. అయితే, అవి విమర్శకతీతాలని భావించటం పొరపాటు. ఇక్కడ మరో విశేషం. ఉత్తమ గ్రంథంగా బహుమానంపొందే రచనకు మౌలికమైన సమస్య

వ్రాతప్రతులు సమర్పింపబడతాయి. బహుమతి ప్రకటింపబడిన తరువాత ఒక్కొక్కసారి కొన్ని గ్రంథాలకు పరీక్షకులిచ్చిన సూచనలమేరకు రచనను సమగ్రం చేసి ప్రచురించాలని అకాదమీ సూచిస్తుంది. రచయిత ఆసూచనను పాటిస్తే హర్షిస్తుంది ఒకవేళ అలా పెంచి ప్రచురించిన గ్రంథాం మొదటిరూపం పరిశోధకులకు తెలియటం కష్టం. డా॥ గిడుగు సీతాపతిగారు లాంటి వారి అంశాన్ని అందువల్లనే మున్నుడిలో వివరించిచెప్పారు అందువల్ల ఒక వ్రాతప్రతిని అకాదమీలో ఉంచి, రెండవ ప్రతిని రచయితకు తిరిగియిస్తే బాగుంటుం దనుకుంటాను. ఒక్కొకసారి వ్రాత ప్రతికి త్రివిక్రమావతారంగా ముద్రితప్రతి వెలువడవచ్చు మరొకసారి సంగ్రహరూపంగా సాక్షాత్కరించవచ్చు. ఏమైనా మొదటిప్రతి తులనాత్మక పరిశీలనకు ఎంతో ఉపకరిస్తుంది. కొందరి మనసుల్లో ఉన్న కొన్ని అనుమానాలకు కూడా ఆస్కారం లేకుండా ఉంటుంది.

అకాదమీ బహుమతులు పొందిన గ్రంథాలతోపాటు పోటీలో పాల్గొన్న మరి కొన్ని గ్రంథాలుకూడా ఆ తరువాత ప్రచురింపబడటం, అందులో కొన్ని బహుమతిని పొందిన వాటికంటె బహుళంగా పఠన పఠనాదుల్లో ప్రచారం చెందటం కన పడుతోంది. ప్రచారం గ్రంథమహత్వానికి ప్రమాణంకాదన్న విషయాన్ని మనం గమనించినా, ప్రజలు వాళ్లకువచ్చిన పుస్తకాన్ని చదివి తాముమెచ్చిన గ్రంథానికి అగ్రతాంబూల మిస్తారు. పరీక్షకుల ప్రమాణాలూ, ప్రజల ప్రమాణాలూ, ఒకే రకంగా కుదిరినప్పుడు ఇబ్బందిలేదు. లేకపోతే 'లోకో భిన్నరుచిః' అని ఊరుకోవలసి వస్తుంది.

నడిచేబాటలో చిన్న చిన్న రాళ్లుండవచ్చు. కాని, నడిచేబాటను వేయటం హర్షింపదగిన అంశం. సాహిత్యఅకాదమీ ప్రతిసంవత్సరం రెండంశాలుప్రకటించి రెండు రచనలకు ప్రోత్సాహం కలిపించటం – ఒక మంచిసంప్రదాయం. రచయితల కొక ఉద్దీపనం! ఆయారచనల పీఠికలు చదివితే – కొందరు రచయితల హృదయాల్లో సంకల్పమాత్రంగా ఉన్న ప్రణాళికలనూ, కొంతప్రయత్నంచేసి ఏవోకారణాలవల్ల వదలిపెట్టిన రచనలనూ అకాదమీ బహుమానాలు ఆకర్షించి అక్షరాకృతిని కల్పింపచేశాయని నిస్పష్టమౌతుంది. ఈ వాఙ్మయాధ్వరం అవిచ్ఛిన్నంగా సాగాలని ఆశించడంలో ఆంధ్రులలో అభిప్రాయభేదం ఉండదనుకుంటాను ?

